# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

### ఏడవ సంపుటం

# సినీరమణీయం - 2



# ముళ్ళపూడి వెంకటరమణ
## సాహితీ సర్వస్వం
ఏడవ సంపుటం

# సినీరమణీయం-2

సంపాదకుడు: ఎమ్బీయస్ ప్రసాద్





**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001

**Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam–7**
**CINERAMANEEYAM-2** - ***Editor: M.B.S. Prasad***

ప్రచురణ నెం. : 2350/36

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 2004



ముఖపత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ. 150-00**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాద్.



మాకు అదృష్ట సౌభాగ్యంగా లభించిన
మానవ మిత్రుడికి
నీరాజనాలతో_
– ఇద్దరు మిత్రులు




అక్కినేని నాగేశ్వర్రావు
ఎక్కలేని ఎత్తుల్లెక్కు
సాగలేని దూరాల్లెళ్ళు
మోయలేని భారాల్లెళ్ళు
తన —
ఈనాడు తెలుగుసినిమా నావ
నతడు చేర్చదలచే రేవు
నేటికీ నేటికీ
నూరేళ్ళు అనిపించే
హైదరాబాదు!
జ్యోతి — 1963

— అంటూ మేము అద్వైత మూడులా
వెక్కిరించినా హాయిగా నవ్వేసి
ముందుకు సాగిన అక్కినేనీ!
తెలుగు సినిమా నావను
ఓడగా పెంచిన ధీరా!
హైదరాబాదులో హార్బరు
నిర్మించిన వీరా!
అనుకున్నది సాధించిన అసాధ్యుడా!
అఖండుడా!
ఓ మా అందరి హీరో!
నీకు మా జోహారు!
హ్యాపీ బర్త్‌డే — ము. రమణ
20.09.2003

# రమణ కురుక్షేత్రం సినిమారంగమే!

సినీరమణీయం-1 ముందుమాటలో రాసిన మాటలే ఇక్కడా వర్తిస్తాయి. ఆంధ్రవారపత్రికలో పనిచేసే రోజుల్లో కూడా రమణ సినిమాల గురించి రాసిన వార్తలు, విదేశీచిత్రాల కథలు, ప్రముఖులతో ఇంటర్వ్యూలు, వారిపై కథనాలు, వ్యాసాలు, సినిమా పోకడలపై వ్యంగ్య శీర్షికలు, దేశ, విదేశ చిత్రాల సమీక్షలు – వీటిల్లో కొన్నిటిని మాత్రమే ఈ సంకలనాలలో చేర్చడం జరుగుతోంది. తెలుగు, హిందీ, విదేశీ సినిమాలకు ప్రాతినిధ్యం వహించేట్లా, వీడియోల ద్వారా ఇప్పటికీ అందుబాటులో ఉన్న సినిమాల గురించి రాసిన సమీక్షలు మాత్రమే ఎంచుకోవడం జరిగింది.

ఐదారేళ్లు మాత్రమే ఆ వృత్తిలో ఉన్నా సినీపాత్రికేయులందరూ పెద్దబాలశిక్షలా గౌరవించవలసిన విధంగా సాగిన రమణ రచనల మచ్చు చూపించిన "సినీరమణీయం-1" పాఠకుల, పాత్రికేయుల ఆదరణ పొందింది. పుస్తక రూపంలో రాని మరికొన్ని రచనలతో ఈ సంపుటి మీ ముందుకు వస్తోంది.

ఈ సంకలనంలో ప్రధాన ఆకర్షణ ఎన్నో ఏళ్ళుగా పాఠకులకు లభ్యం కాని "కథానాయకుని కథ!" బాపు రేఖా చిత్రాలతో నాగేశ్వరరావు 100 సినిమాల స్టిల్స్‌తో 1963లో ఎం.శేషాచలం కంపెనీ ద్వారా మొదటి ఎడిషన్ వెలువడిన నెలలోనే 15,000 ప్రతులు అమ్ముడుపోయాయి. రెండో ఎడిషన్ కూడా అతి త్వరగా అయిపోయాయి. గత నలభైయేళ్లుగా ఈ పుస్తకం మార్కెట్లో దొరకటం లేదు. ఒరిజినల్ ప్రతి అతి తక్కువమంది వద్ద లభిస్తోంది.

కథానాయకుడు నాగేశ్వరరావుకు, రచయిత రమణకు అనుబంధం చాలా గట్టిది. సమీక్షకుడిగా ఉన్న రోజులనుండి రమణ అంటే నాగేశ్వరరావుకు అభిమానం. ఆంధ్రపత్రిక నుండి బయటకు వచ్చేశాక తన అన్నపూర్ణ పల్వరైజింగ్ మిల్స్‌లో వాటా ఉచితంగా ఇవ్వజూపారు. "నాకు కష్టాలు వస్తే ప్రాణం కూడా యివ్వగల స్నేహితుడున్నాడు అన్న ధైర్యం కావాలి; కాని ప్రాణం పోతున్నా పూచికపుల్ల కూడా అడగకుండా ఉండగల నిగ్రహం కావాలి. అంతే!" అంటూ సున్నితంగా తిరస్కరించారు రమణ. తన స్వంత ప్రతిభను నమ్ముకునే సినిమా రచయిత అయ్యారు. నిర్మాత అయ్యారు. కానీ ఆయనను కమ్మర్షియల్ నిర్మాత చేయడానికి సహకరించింది మాత్రం నాగేశ్వరరావే!

సినిమా రైటర్‌గా కాస్త నిలదొక్కుకున్న మూడేళ్ళలోనే చిత్ర నిర్మాణానికి సిద్ధమయ్యారు రమణ. పుట్టుకతో వచ్చిన సాహసం అది! జీవితంలో భద్రత కోసం ఎప్పుడూ ప్రాకులాడలేదాయన. జీవితాన్ని ఓ ఆటగానే చూశారు. కానీ ఈ చిత్ర నిర్మాణపు క్రీడలో మాత్రం స్నేహితుడు బాపును కూడా కలుపుకుని వచ్చారు. బాపుది రమణ వంటి ఒడిదుడుకుల జీవితం కాదు. తండ్రి కోరిక మేరకు లాయరీ చదివినా పబ్లిసిటీ ఆర్టిస్టుగా, పత్రికలకు ఇలస్ట్రేటర్‌గా రెగ్యులర్‌గా వచ్చే ఆదాయానికి అలవాటు

పద్దారు. రమారమి మూడేళ్ళపాటు "జ్యోతి" మాసపత్రికకు శక్తియుక్తులు వెచ్చించారు. కానీ భాగస్వామితో అభిప్రాయభేదం వచ్చి "జ్యోతి" నుండి బయటికి వచ్చేశారు.



సినీరంగంలో బాపు, రమణ

ఏం చేద్దామని ఆలోచిస్తూండగానే ఆయనను రమణ సినిమా నిర్మాణం వైపు మళ్లించారు. అప్పటివరకు బాపు సినిమా షూటింగ్ కూడా చూడలేదు. సినిమా పబ్లిసిటీకి మాత్రం పనిచేశారు. అప్పట్లో పబ్లిసిటీ డిజైన్‌లు టివిఎస్ శర్మ, నాగ్ ఎక్కువగా చేసేవారు. బాపు తొలిసారిగా 'అత్తా ఒకింటి కోడలే' సినిమాకు కామిక్ స్టోరీలా వేసి పబ్లిసిటీ చేశారు. రమణ పనిచేసిన "గుడిగంటలు", "రక్తసంబంధం", "మూగమనసులు" సినిమాలకు పోస్టర్‌లు డిజైన్ చేశారు. ఆంధ్రపత్రిక వీక్లీలో ప్రచురించబడ్డ




ప్రధాన పాత్రలను గుర్తుకు తెచ్చే బంతిపూవు, పడవ, పంగలకర్రలను లోగోలో ఇమిడ్చిన మూగమనసులు లోగో.

"బంగారం-సింగారం" వంటి కామిక్ సీరియల్స్ చూస్తే బాపుకు షాట్ డివిజన్ గురించి, కెమెరా లెన్స్ వ్యూ గురించి మంచి అవగాహన ఉందని తెలుస్తుంది. ఇద్దరూ కలిసి తొలి సినిమాగా "సాక్షి" తీద్దామనుకున్నారు.

"సాక్షి" కథను సినిమాకు మలచడంలోనే రమణ ప్రతిభ తెలుస్తుంది. "హైనూన్" ఓ వెస్టర్న్ సినిమానుండి స్ఫూర్తి పొంది దానిలో మలుపులు తిప్పి, సస్పెన్స్ పెట్టి



పల్లెటూరి నేపథ్యంలో తయారైన సాక్షి

ఆంధ్రపత్రిక వీక్లీకి కథ రాశారు. అచ్చులో పడ్డ కథకు, "సాక్షి" సినిమా కథకు ఎంతో తేడా వుంది. సామాన్య ప్రేక్షకుడికి అర్థమయ్యే రీతిలో సాఫీగా కథ చెప్పడంలోను, లోకుల స్వార్థాన్ని ఎత్తిచూపుతూనే ముగింపు పాజిటివ్‌గా చేయడంతోనూ కథ జనాలకు నచ్చింది. బడ్జెట్ వేసుకుని చూస్తే రెండున్నర లక్షలని తేలింది. బాపు రమణ ఇద్దరూ సరాసరి నవయుగ ఫిలింస్ కాట్రగడ్డ శ్రీనివాసరావు గారి వద్దకు వెళ్ళారు. "మావద్ద 50 వేలున్నాయి. మీరు రెండు లక్షలివ్వండి. సినిమా తీస్తాం." అని ప్రతిపాదించారు. శ్రీనివాసరావు ముచ్చట పడ్డారు. "నాకు నాగేశ్వరరావు మంచి మిత్రుడని మీకు తెలుసు. మీకూ నాగేశ్వరరావుకు ఉన్న చనువును బట్టి ఆయన ద్వారా అడిగితే కాదనననని తెలుసు. అయినా సిఫారసు లేకుండా నేరుగా వచ్చి అడిగారు. సంతోషం. సినిమా తీయండి" అని గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు.

పూర్తి అవుట్ డోర్‌లో "సాక్షి" ప్రారంభమయింది. ఖర్చులు తగ్గించుకోవాలని ఆడియో ఓ టేప్ రికార్డర్‌తో చేశారు. సినిమా సగమయ్యాక డిస్ట్రిబ్యూటర్స్ వచ్చి రషెస్ చూస్తామన్నారు. ఈ పూర్ క్వాలిటీ ఆడియోతో చూపడం కంటే ప్రస్తుతం సౌండ్ లేకుండా చూపించి, తర్వాత మంచి ఆడియో జతపరుద్దాం అనుకుని వారికి మూకీ సినిమాలా చూపారు రమణ. వచ్చినవారికి ఆ సినిమా అదోలా అనిపించింది. బాగా తీయలేదని శ్రీనివాసరావుగారికి చెప్పేరు. అప్పటికి ఒక లక్ష ఇచ్చిన శ్రీనివాసరావుగారు

ఇక పెట్టుబడి పెట్టననేశారు. వీళ్ళు వెళ్ళి బతిమాలారు. "మా ఖర్చులు తగ్గించుకుంటాం. డబ్బు సరఫరా ఆపకండి" అని అడిగారు. కష్టపడి పొదుపుచేసి లక్షా ఎనభైవేలలో సినిమా తీసేశారు.

కన్నడ ఏరియాలో డిస్ట్రిబ్యూషన్‌కై మేటి నిర్మాత, డిస్ట్రిబ్యూటర్ భక్తవత్సల వచ్చి సినిమా చూశారు. "సినిమా బాగుంది. పాతికవేలిస్తాను" అన్నారు. కానీ బాపు ఆయన్ని వారించారు. "సినిమా బాగా రాలేదు. రమణ స్క్రిప్టుకు నేను న్యాయం చేయలేకపోయాను. సినిమాలో ఎన్నో పొరబాట్లు ఉన్నాయి. నా కంటికే స్పష్టంగా కనబడుతున్నాయి. పంపిణీకి తీసుకుని నష్టపోతారేమో" అని హెచ్చరించారు. "చాల్లేవయ్యా, సినిమా నిక్షేపంలా ఉంటేను" అని ఆయన నవ్వేసి పాతికవేలకు పంపిణీ హక్కులు కొనుక్కున్నారు. "సాక్షి" నాలుగు వారాలాడింది. పెట్టుబడి తిరిగి వచ్చింది. పెట్టుబడి పెట్టిన వారందరికీ సంతృప్తి నిచ్చింది.



సాక్షి పోస్టర్ : తాష్కెంట్ ఫిలిం ఫెస్టివల్‌కు వెళ్లిన బాపురమణల తొలిప్రయత్నం

"సాక్షి" దర్శకత్వం విషయంలో బాపు అభిప్రాయంతో ఏకీభవించని వారిలో ప్రముఖ దర్శక నిర్మాత ఎల్.వి.ప్రసాద్ ఒకరు. "మూగమనసులు"ను "మిలన్"గా హిందీలో రీమేక్ చేసి కీర్తి, కనకం ఆర్జించిన ఆయన "సాక్షి" సినిమా తమిళ, హిందీ రైట్స్ కొనుక్కున్నారు. "బాపు తీసినట్లే తీస్తాను తప్ప మార్చను" అన్నారు. కానీ ఎందుకనో గాని తమిళ, హిందీ వెర్షన్లు తీయలేదు. పదేళ్ళ క్రితం మలయాళంలో తీద్దామని ఎవరో ముందుకు వచ్చారు కానీ ఆ ప్రయత్నమూ కార్యరూపం దాల్చలేదు.

"సాక్షి" సినిమాలో వాటాకై రమణకు 5 వేలు అప్పిచ్చిన నాగేశ్వరరావు "సాక్షి"

విజయం చూసి ఒకలా ఆనందించారు, మరొకలా బాధపడ్డారు. సారథి స్టూడియోలో ఓసారి బాపు, రమణలకు క్లాసు తీసుకున్నారు – "సాక్షి" నన్ను హీరోగా పెట్టి ఎందుకు తీయలేదు?" అని అడిగారు. "నాతో తీసివుంటే దానికి ఓ కమ్మర్షియల్ లుక్ వచ్చేది. ఓపెనింగ్స్‌లోనే ఒక లక్ష తేడా వచ్చేది. నాకూ ఓ మంచి సినిమా చేసిన తృప్తి ఉండేది. పారలల్ సినిమా రంధిలో పడకండి. నాకు తగిన కథ చెప్పండి. కాల్షీట్లు ఇస్తాను. మంచి సినిమా చేద్దాం" అన్నారు.



**బాపు, రమణలతో ఏ.ఎన్.ఆర్. కమ్మర్షియల్ సినిమాలు తీయమని ప్రోత్సహించిన నటసామ్రాట్**

ఏ" కథ. ఆస్తికతకు, నాస్తికతకు ప్రతీకలుగా నిలిచిన ఇద్దరు అన్నదమ్ములుగా నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం. ఆలోచనలు రేకెత్తించే కమ్మర్షియల్ చిత్రం. కథ రెడీ అయింది కానీ నాగేశ్వరరావు కాల్షీట్లు ఖాళీ లేవు. కాస్త ఆగమన్నారు. అప్పటిదాకా ఖాళీగా ఉండటమెందుకని "బంగారు పిచిక" సంకల్పించారు, ఉత్సాహంలో ఉన్న మన కొత్త నిర్మాతలు.

1967లో "త్రీ బైట్స్ ఆఫ్ ది యాపిల్" అనే డేవిడ్ మెక్‌కాలమ్ (జూ॥) నటించిన కామెడీ సినిమా వచ్చింది. బ్రిటన్‌కి చెందిన ఓ టూరిస్ట్‌గైడ్‌కి ఫ్రాన్సులో ఓ కాసినోలో జూదం డబ్బు తగులుతుంది. అఫీషియల్‌గా తీసుకెళితే పన్ను కట్టవలసి వస్తుందని చాటుగా పట్టుకెళ్ళి స్విస్ బ్యాంకులో వేద్దామని ప్రయత్నిస్తాడు. నీకు సహాయం చేస్తానంటూ ఓ అమ్మాయి వెంట వస్తుంది. కానీ ఆమె ఓ మోసగత్తె. తన మాజీ భర్తతో కలిసి ఇతని డబ్బు దోచేద్దామని ప్లాను వేస్తుంది. "హైనూన్" కథలాగే ఈ కథను కూడా చాలా మార్చారు రమణ. ఓ డబ్బున్న కుర్రవాడికి పరమగయ్యాళి తల్లి ఉంటుంది.

భార్య మాట జవదాటలేని అతని తండ్రి కొడుక్కి డబ్బిచ్చి "నువ్వెనా వెళ్లి నీకిష్టమైన అమ్మాయిని పెళ్ళి చేసుకోరా" అని పంపించివేస్తాడు. అతనికి దారిలో ఓ అమ్మాయి తగులుతుంది. ఇంట్లోంచి పారిపోయి వస్తున్నానంటుంది. ఇలా సరదాగా సాగుతుందీ సినిమా. అవుట్‌డోర్ హైదరాబాదు వద్ద వికారాబాదులో తీశారు.



తొందరపడి ముందే వచ్చిన ఫుల్ లెంగ్త్ కామెడీ
బంగారు పిచిక వర్కింగ్ స్టిల్

సరదాగా ఉన్నా, మరపురాని పాటలున్నా ఈ సినిమా ప్రజాదరణకు నోచుకోలేదు. ఫుల్‌లెంగ్త్ కామెడీకి ప్రేక్షకులు రెడీ కాలేదని జాలిపడ్డారు కొందరు. నవయుగవారు మాత్రం జాలిపడలేదు. "బాపురమణలు వాళ్ల యిష్టం వచ్చినట్టు సినిమా తీస్తారు, ఇలా అయితే మేం వాళ్ల సినిమాకు ఫైనాన్స్ చేయం" అనేశారు. "నేను కాల్షీట్లు ఇవ్వకపోవడం వల్లనే వాళ్లీ ప్రయోగం చేశారు. నాకు చాలా గిల్టీగా ఉంది. "బుద్ధిమంతుడు"కు తక్షణం కాల్షీట్లు ఇస్తున్నాను. మీరు నిర్భయంగా డిస్ట్రిబ్యూట్ చేయండి" అన్నారు నాగేశ్వరరావు. "వాళ్లు ఇప్పటికే 50 వేలు బాకీ పడ్డారు. మేం వాళ్ళను సపోర్టు చేయం" అన్నారు నవయుగవారు. 17 ఏళ్లుగా తన సినిమాలను డిస్ట్రిబ్యూట్ చేస్తున్న నవయుగవారు తన మాట కాదనడం నాగేశ్వరరావుకు బాధ కలిగించింది. అప్పుడే ఆవిర్భవిస్తున్న లక్ష్మీ ఫిలింస్ వారి ద్వారా "బుద్ధిమంతుడు" రిలీజ్ చేయిస్తానన్నారు. "మా కారణంగా నవయుగతో మీ స్నేహం చెడగొట్టుకోకండి" అని రమణ రిక్వెస్టు చేసినా నాగేశ్వరరావు వినలేదు.

'బుద్ధిమంతుడు' సినిమా విడుదలయి వందరోజు లాడింది. నెల తిరక్కుండా 60 వేల ఓవర్ ఫ్లో వచ్చింది. వెంటనే 50 వేల చెక్కు నవయుగకు పంపేశారు బాపు, రమణలు. వాళ్లు ఆశ్చర్యపోయారు. 17 ఏళ్ల చరిత్రలో ప్రొడ్యూసరు డబ్బు వాపసు ఇచ్చిన సందర్భం యిదేనంటూ పార్టీ చేసుకున్నారు. ఆ పద్ధతిని బాపు, రమణలు



గుడికీ, బడికీ పోటీపెట్టి నూటికి నూరు మార్కులు
తెచ్చుకున్న బుద్ధిమంతుడు

ఎల్లప్పుడూ పాటించారు. తమ టాలెంటుతో ఇతర సినిమాలలో సంపాదించిన డబ్బుపెట్టి తమ పాత సినిమాల తాలూకు బకాయిలుంటే తీర్చేశారు. 'బుద్ధిమంతుడు'లో డబ్బు రాగానే నవయుగవారి అప్పు తీర్చేశారు. 'కృష్ణావతారం'లో డబ్బొస్తే 'సీతాకల్యాణం', 'బుల్లెట్' సినిమాల తాలూకు పదిన్నరలక్షలు డిస్ట్రిబ్యూటర్స్ అయిన అన్నపూర్ణా వారికి తిరిగి ఇచ్చేశారు. ఆడియో వీడియో పాతాలలో డబ్బు వచ్చాక 'గోరంతదీపం' తాలూకు ఏడేళ్ళ క్రితం బాకీని వాణిశ్రీ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, శ్రీధర్‌లకు తీరుస్తూ ఆలస్యానికి క్షమాపణలు చెప్పారు. ఇది సినీరంగంలో అరుదు.

బాపు, రమణలు తీసిన సినిమాలలో కొన్ని విజయం పొందాయి. కొన్ని పరాజయం పొందాయి. మరికొన్ని ఓ మాదిరిగా ఆడాయి. బాపు కార్టూన్ సంకలనాలలో కనబడే 'నా మీదే నవ్రోయ్' ఓ మాదిరిగా ఆడినవాటి గురించి చెప్పలేదు. ఆకార్టూన్లు చూస్తే చాలాభాగం ఫెయిలయినట్టు తోస్తుంది. అదే నిజమయితే బాపుకు, రమణకు బయట నిర్మాతలనుండి అన్ని ఆఫర్లు వచ్చేవి కావు కదా! బాపు, రమణల పేరున కనబడే సినిమాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని కేవలం జీతానికి పనిచేసినవి. మరి కొన్నిటిలో కొన్ని జిల్లాల పంపిణీ తీసుకున్నవి. కొన్ని భాగస్వాములతో కలిసి తీసినవి. మరికొన్ని వారిద్దరు మాత్రమే భాగస్వాములుగా తీసినవి. జీతానికి పనిచేసినా పూర్తిగా ఇన్వాల్వ్ అయి పనిచేయడం వారి అలవాటు. ఆర్టిస్టులతో మాట్లాడడం, నిర్మాణ వ్యవహారాలలో సహాయం చేయడం రమణ పద్ధతి. రమణలో రచయిత ఒక పార్శ్వమయితే దక్షత గల నిర్మాత వేరే పార్శ్వం. నిర్మాణంలో మెలకువలు క్రమక్రమంగా నేర్చుకున్నారు రమణ.



రెండున్నర లక్షల బడ్జెట్‌తో "బంగారు పిచిక" తీసి చేతులు కాల్చుకున్నాక లెక్కలు వేసి చూసుకుంటే అందులో 50 వేల రూపాయలు సిగరెట్ల వంటి వృథా ఖర్చులకే తగలేసినట్లు తేలింది! బడ్జెట్‌పై అదుపుండాలంటే సిగరెట్, మద్యం సరఫరాలు ఆపాలని తెలిసివచ్చింది. అప్పణ్ణుంచీ వారి యూనిట్‌లో కావలసినంత భోజనం పెట్టేవారు కానీ ఇవి మాత్రం ఉండేవి కావు. భోజనాల వేళ లైట్‌బాయ్‌తో సహా చిన్నా, పెద్దా అందరూ కలిసి తినాలని, అందరికీ ఒకేరకమైన భోజనం వడ్డించాలని నిశ్చయించుకుని పాటించారు. అలాగే జయాపజయాలతో, ఆర్థికపరమైన ఇబ్బందులతో సంబంధం లేకుండా ఆర్టిస్టులకు, సాంకేతిక నిపుణులకు, పంపిణీదారులకు చెల్లింపుల విషయంలో చక్కటి విలువలు పాటించి ఆదర్శప్రాయంగా నిలిచారు.

సినిమాల గురించి ఏమాత్రం అవగాహన ఉన్నా అవుట్‌డోర్‌లో సినిమా తీయడమంటే ఎంత కష్టమో తెలుస్తుంది. సహజ వాతావరణంలో సినిమాలు తీయాలనే పట్టుదల కల బాపు రమణలు తమ సినిమాల్లో చాలా భాగం అవుట్‌డోర్‌లోనే....అదీ గోదావరి ప్రాంతంలోనే తీశారు. బాపు, రమణలు ఇరువురూ గోదావరి జిల్లాలవారే. వారి తొలిచిత్రం "సాక్షి" తూర్పుగోదావరి జిల్లాలో పులిదిండిలో తయారయింది. ఆ ఊరిలో షూటింగ్‌కై వీరికి సహకరించిన కనుమూరి వెంకట్రామరాజు గారితో వీరికి స్నేహం ఏర్పడి ఇంకా కొనసాగుతోంది. ఆయనకు ఆర్థికంగా ఒడిదుడుకులు వచ్చినపుడు వీరు ఆదుకున్న సందర్భాలు కూడా ఉన్నాయి. సాధారణంగా షూటింగు సమయాల్లోనూ, అయిపోయిన తర్వాత సినిమా వాళ్లకు, ఊళ్లో ప్రజలకు పేచీలు వస్తూ ఉంటాయి.



దబాయించి డబ్బు గుంజుదామని కొందరు చూస్తే, వీరాభిమానంతో షూటింగుకు అవరోధాలు కల్పించేవారు కొందరు. అందరితోటీ జాగ్రత్తగా, తగువిధంగా వ్యవహరించవలసి వస్తుంది.

పులిదిండి ప్రజలతో బాపురమణలకు సాన్నిహిత్యం పెరిగి వారు అనేక సినిమాలు అక్కడ తీయడం జరిగింది. 'బుద్ధిమంతుడు' క్లయిమాక్స్ దృశ్యం ర్యాలి (తూ.గో.జిల్లా)లో తీసినప్పుడు అక్కడ ముందులో అడ్డుపడ్డవారే తర్వాత వీరి యూనిట్ వ్యవహరించే విధానం చూసి ముచ్చటపడి ఎంతగానో సహకరించారు. నిజానికి 'బుద్ధిమంతుడు' షూటింగుకి వస్తూ నాగేశ్వరరావు సందేహించారు. 'చిన్న నిర్మాతలు కదా, వీరు సరిగా ఏర్పాట్లు చేయగలరా? అవస్థలు పడవలసి వస్తుందా?' అని. కానీ వచ్చిన రెండురోజులకే భోజనాలు, వసతి సౌకర్యాలు చూసి ముచ్చటపడి భార్యకు కబురు పెట్టారు- 'హాలీడే టూరుకి వచ్చినట్టనిపిస్తోంది. నువ్వూ రా.' అని! అందుకే నాలుగేళ్ల తర్వాత 'అందాలరాముడు' పూర్తిగా గోదావరి మీద తీద్దామని సంకల్పించినపుడు బాపురమణల నిర్వహణా సామర్థ్యంపై గురి కుదిరిన నాగేశ్వరరావు మారుమాట లేకుండా సై అన్నారు. ముందే భార్యను వెంటబెట్టుకు వచ్చేశారు.

'బుద్ధిమంతుడు' హిట్ అయినా నాగేశ్వరరావు కాల్‌షీట్లు వెంటవెంటనే దొరకవు కదా! ఈలోగా ఓ చిన్న చిత్రాన్ని సంకల్పించారు 'చిత్రకల్పన' బాపురమణలు. తమిళ దర్శకనిర్మాత ఎ.పి.నాగరాజన్ మాస్టర్ ప్రభాకర్‌తో తమిళంలో తీసిన 'వా రాజా వా'ను తెలుగులో మాస్టర్ ప్రభాకర్‌తోనే పునర్నిర్మించారు. తక్కిన పాత్రలలో నాగభూషణం,

సూర్యకాంతం, మిక్కిలినేని ఇతరులు కనబడతారు. చిన్న బడ్జెట్ అయినా, మహాబలిపురంలోనే షూట్ చేసినా, పాటలూ, పాటలతోబాటు సినిమా హిట్ అయ్యాయి. ఇక పెద్ద బడ్జెట్‌తో కలర్ సినిమాకి సిద్ధపడ్డారు మన నిర్మాతలు. ఇప్పటి వరకు తీసినవి బ్లాక్ అండ్ వైట్ సాంఘిక సినిమాలు. మరి ఈ సినిమా భారీ సెట్టింగులతో ఉండే పౌరాణిక సినిమా, అదీ 'సంపూర్ణ రామాయణం!' పంచవటి అదీ రంపచోడవరంలో తీయాలి. ట్రిక్ ఫోటోగ్రఫీ ఉంటుంది. యుద్ధాల సీన్లు. శోభన్‌బాబు, చంద్రకళ, ఎస్వీ రంగారావు వంటి భారీ తారాగణం. సాహసానికి దీనికి మించిన నిర్వచనం ఉండబోదు.

తెలుగులో పౌరాణికాలంటే ప్రధానపాత్రలో ఎన్టీ రామారావు, సమాస భూయిష్ఠమైన సముద్రాల డైలాగులు, కమలాకర కామేశ్వరరావు వంటి కాకలు తీరిన డైరక్టరు ఉండాలి అని ముద్ర పడిపోయింది. మరి ఈ సినిమాకు రచయితలు – కమ్యూనిస్టయిన ఆరుద్ర, హాస్యరచయితగా పేరుబడ్డ రమణ. డైరక్టరు చూడబోతే కార్టూనిస్టు బాపు! రమణ, బాపు ఇంతకుముందు ఏ పౌరాణికానికీ పనిచేసి ఎరుగరు. అన్నిటినీ మించి తెలుగు ప్రేక్షకులు రాముని వేషంలో రామారావును తప్ప వేరేవారిని ఆదరిస్తారో లేదో అన్నది లక్షలు విలువ చేసే ప్రశ్న! రాముడిగా శోభన్‌బాబును పెట్టుకున్నారు. రావణుడిగా రంగారావు సరేనన్నారు. "సరేనన్నా ఆయనతో జాగ్రత్త. కోపిష్ఠి. షూటింగుకి సరిగ్గా రారు. వచ్చినా స్పృహలో ఉండరు. సినిమా ఎప్పటికవుతుందో!" అని హితైషులు హెచ్చరించారు. ఎలాగరా భగవంతుడా అనుకుంటూండగా ఎన్టీ రామారావు నుండి కబురు. "నేను రామాయణం తీద్దామని స్క్రిప్టు రెడీగా పెట్టుకున్నాను. నాతో పోటీపడకండి. దెబ్బతింటారు పాపం." అన్నారు రామారావు. "మీరు రెడీగా పెట్టుకున్న అనేక స్క్రిప్టుల్లో ఇదొకటి. ఎప్పుడు తీస్తారో తెలియదు. మా పద్ధతిలో మమ్మల్ని వెళ్లనీయండి" అని చెప్పి వచ్చేశారు బాపురమణలు. అప్పటికి తెల్లబోయినా, సినిమా రిలీజయ్యాక చూసి చాలా ప్రశంసించి, మరింత ఆప్తులయ్యారు రామారావు.

అదృష్టం. రంగారావు ఆ సమయంలో దురలవాట్లకు దూరంగా ఉన్నారు. బాపు పనితనాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. అద్భుతమైన నటనతో సినిమాకు వన్నె తెచ్చారు. సినిమా విజయానికి దోహదం చేసిన అనేక అంశాలలో కె.వి.మహదేవన్ సంగీతం ఒకటి. నిజానికి బాపురమణల సినిమాలలో సంగీతసాహిత్యాల గురించి, ఫోటోగ్రఫీ వంటి సాంకేతికాంశాల గురించి ఎంతో రాయవచ్చు. కానీ నిర్మాతలుగా వారి దీక్షాదక్షతల గురించి ముచ్చటించడానికే ఈ రచన పరిమితమవుతోంది. 'సంపూర్ణ రామాయణం' అనే పదిహేడున్నర లక్షల సాహసం నిర్మాతలకు సిరులు కురిపించింది. బాపురమణల మార్కు పౌరాణికాలకు శ్రీకారం చుట్టింది. అంతులేని కీర్తి ప్రతిష్ఠలను సమకూర్చి పెట్టింది. తెలుగులోనే కాదు, ఆ సినిమా తమిళంలో, కన్నడంలో, హిందీలో డబ్బింగు చేయబడి అన్ని భాషల్లోనూ వందరోజులు ఆడింది.



సంపూర్ణ రామాయణం ఫంక్షన్‌లో శోభన్‌బాబు, దుక్కిపాటి మధుసూదనరావుతో



సంపూర్ణ రామాయణంలో ఎస్వీ రంగారావు

ఆపాటికి సాంఘిక సినిమాలు కూడా కలర్‌లో తీయడం ప్రారంభమయింది. అందువల్ల మధ్యతరగతి జీవితాలను ప్రతిబింబించే "అందాలరాముడు" కూడా రంగుల్లోనే తయారయింది. రమణ "జనతా ఎక్స్‌ప్రెస్" పాత్రలన్నీ దీనిలో దర్శనమిస్తాయి. రాజమండ్రి నుంచి భద్రాచలానికి పాపికొండలు దాటుకుంటూ రెండుపడవలమీద బోల్డు కుటుంబాలు కలిసి వెళ్ళడం గురించిన కథ. దార్లో ఎన్నో సుఖాలు, దుఃఖాలు, సంబరాలు, పేచీలు! నదిమీద షూటింగంటే మాటలా! నలభైమంది పట్టే పంటు (సామాన్లు తీసుకెళ్లే పెద్ద పడవ) దాని పక్కన రాజహంస (ఆధునికమైన లాంచీ) గోదావరిలో వెళుతూన్నట్టు షూట్ చేయడానికి వెనక్కాల పడవల్లో యూనిట్ వెళ్ళాలి. అందుకని 8 లాంచీలు, 8 పంట్లు, 1 విక్టోరియా స్టీమరు ఏర్పాటు చేశారు. రెండు జెనరేటర్లు ఎప్పుడూ అందుబాటులో ఉండేవి.

ఇది "సాక్షి"లా గోదావరి ఒడ్డున పల్లెటూళ్లో తీసినట్టు కాదు. భద్రాచలం దారిలో వచ్చే పాపికొండలు, అడవులు, పట్టిసీమ అన్నీ చూపిస్తూ చిత్రీకరణ సాగాలి. అందువల్ల ఈ సినిమా కోసం దేవీపట్నం అనే ఏజెన్సీ ప్రాంతంలో ఫారెస్టు కాంప్ వేశారు. గెస్ట్‌హౌస్‌లు, డార్మిటరీలు తాత్కాలికంగా నిర్మించారు. 8 టాయిలెట్స్‌తో సహా! స్నానానికి వేణ్ణీళ్లు, రాత్రిపూట జంతువులు వచ్చిపడకుండా కందకాలు తవ్వి నెగళ్లు వేయడం! 70 మంది ఆర్టిస్టులు, 250 మంది సిబ్బంది కోసం షామియానా వేసి డైనింగ్ హాలు ఏర్పాటు చేశారు. రెండుపూటలా సుష్టుగా భోజనాలు. అందర్నీ పొద్దున్నే లేపడానికి సైరన్. పంచాయితీ రేడియో లాటిది ఏర్పాటుచేసి పొద్దున్నే సుప్రభాతం, ఆ తర్వాత న్యూస్

వినిపించేవారు. చీకటిపడ్డాక వినోదం కోసం 16 ఎమ్.ఎమ్. ప్రొజెక్టర్లో సినిమాలు చూపించేవారు.



పిక్నిక్‌లా సాగిపోయిన ఈ సినిమా ఆర్టిస్టులకు కూడా ఒక ఫారెస్ట్ కాంప్ అయిపోయింది, "జై ఆంధ్ర" ఉద్యమం ధర్మమాని.

మామూలు రోజుల్లో ఇవన్నీ జరిగితే అంత గొప్పగా చెప్పుకోనక్కరలేదేమో! కాని అది 1972. 'జై ఆంధ్ర' వేర్పాటు ఉద్యమం ఉధృతంగా జరిగే రోజులు. 5 నెలల పాటు కోస్తా, రాయలసీమ జిల్లాలన్నీ ఉడుకెత్తిపోయాయి. ఎప్పుడు చూసినా బంద్ నిర్వహించేవారు. రైళ్లు, బస్సులు ఎప్పుడు నడుస్తాయో, ఎక్కడ ఆగిపోతాయో తెలియదు. ఉద్యోగులు నెలల తరబడి సమ్మెలో ఉన్నారు. ఆఫీసులు పనిచేయలేదు. బ్యాంకులు ఎప్పుడుంటాయో, ఎప్పుడు మూసేస్తారో తెలియదు. ఫైనాన్షియర్ల నుండి డబ్బు తెప్పించుకునే సాధనం లేదు. డ్రాఫ్టు చేతిలో ఉన్నా డబ్బు చేతికి వస్తుందన్న నమ్మకం లేదు. మనిషి చేత తెప్పిందామంటే అడంగు చేరేదాకా అనుమానమే! ఊరూరా కర్ఫ్యూలు. ఆందోళనలు. ప్రయాణాలు చేస్తున్నా బిక్కుబిక్కు మంటూ చేయాల్సిందే. అడుగడుక్కి అడ్డుపడేవారే. చందాలు అడిగేవారే! ఇలాటి పరిస్థితుల్లో అందరు ఆర్టిస్టులను షూటింగు స్పాట్‌కి చేర్చడమెలా? క్షేమంగా తిరిగి పంపడమెలా? షూటింగు జరుగుతూంటే అడ్డుపడే ఆందోళనకారులను సముదాయించడమెలా? ఇక్కడే రమణ చాకచక్యం బయటపడింది.



కురిసే వెన్నెలలో మెరిసే గోదారి అందాలను కామెరాలో బంధీ చేసిన
వి.యస్.ఆర్ స్వామి ఛాయాగ్రహణం

ఆయన నాగేశ్వరరావును హైదరాబాదు నుండి తన కారులోకాక ప్రైవేటు బ్లాక్ అండ్ వైట్ టాక్సీలో తీసుకువెళ్లారు. భయపడ్డట్టుగానే ఏలూరులో ఆయనను కొందరు గుర్తుపట్టారు. ఇక చుట్టుముట్టి కారును కదలకుండా చేస్తారేమో అనుకుంటూండగానే వారిలో కొందరికి అనుమానం వచ్చింది – 'నాగేశ్వరరావయితే హాయిగా పెద్దకారులో వస్తాడు కానీ ఇలా అద్దె టాక్సీలో తిరిగే ఖర్మేమిటి? ఇతనెవరో నాగేశ్వరరావు పోలికలో ఉన్నాడంతే!' అనుకుని వదిలేశారు. అలాగే షూటింగ్ అయిపోయిన తర్వాత మద్రాసు తారలను పంపడానికి ఓ టూరిస్టు బస్ బుక్ చేసి పైన తిరుపతి యాత్రా స్పెషల్ అని బ్యానర్ రాసి కట్టేశారు. ఉపాయం ఫలించింది. వారంతా క్షేమంగా చేరారు. సమ్మె మూలంగా కరెంటు సరఫరా లేక డెయిరీలో పాలు దొరికేవి కావు. రమణ 8 కార్లు ఏర్పాటు చేసి గ్రామాలకు తిప్పి పూటకు 80 లీటర్ల పాలు సేకరించేవారు. పెరుగు, మీగడలతో వడ్డించేవారు. అడివిలో వెలసిన ఈ 'మాయాబజార్' చూసి ఆర్టిస్టులంతా నిర్ఘాంతపోయారు. పిక్నిక్‌లా ఎంజాయ్ చేశారు. నటీమణి సూర్యకాంతమయితే బాపురమణలకు ఏకంగా అన్నదాతలని పేరు పెట్టేశారు. ఆ అభిమానం ఎంతదూరం వెళ్లిందంటే వాళ్లకు అవసరమైనప్పుడు ధనసహాయం చేసేవారు. పైగా తన తదనంతరం ఏర్పాటయ్యే ట్రస్టులో రమణ ట్రస్టీగా ఉండాలని వీలునామా రాసిందావిడ!

ఈ ఏర్పాట్ల విషయంలో ముఖ్యంగా ప్రస్తావించవలసినది బాపురమణలు 'సీతారాముడు' అని ముద్దుగా పిలిచే బి.వి.ఎస్.రామారావు గారిని. ధవిళేశ్వరంలో

ఇంజనీరుగా పని చేసిన ఆయన ఎంతో సహకారం అందించారు. నాగేశ్వరరావు హీరోగా కొత్తతార లత హీరోయిన్‌గా నటించిన ఈ సినిమా బడ్జెట్ ఈ ఖర్చుల కారణంగా 14 లక్షలకు చేరుకుంది. కమనీయమైన ఫోటోగ్రఫీతో హాయిగా, ఆనందంగా సాగిపోయే ఈ సినిమా తొలిసారి విడుదలయినప్పుడు ఆకట్టుకోలేకపోయింది. సినిమాలో డ్రెమటిక్ ఎలిమెంటు సరిపోలేదనిపించి "రెండు పడవల్లో చుట్టేశార్రా సినిమా అంతా" అనేశాడు సామాన్య ప్రేక్షకుడు. "అందాలరాముడు" ఫెయిలయిందని ఒప్పుకుంటూ వేసిన బాపు కార్టూన్ల పోస్టర్ల గురించి అందరికీ తెలుసు. అయితే చాలామందికి తెలియనిదేమిటంటే ఆ పోస్టర్ తర్వాత కలక్షన్స్ పికప్ అయ్యాయని! తర్వాతి రిలీజుల్లో 'అందాలరాముడు' బాగా ఆడి లాభాలు సంపాదించి పెట్టింది.




'ముత్యాలముగ్గు' సినిమాలోని భవంతి, అవుట్‌డోర్ సన్నివేశాల గురించి ప్రత్యేకంగా రాయనవసరం లేదు కానీ ఒక క్లిష్టపరిస్థితి లాభదాయకంగా ఎలా పరిణమిస్తుందో ఉదహరించడానికి ఒక ముచ్చట చెప్పుకోవచ్చు – "ఎంతటి రసికుడవో తెలిసెరా" హలం డాన్సును ఇన్‌డోర్‌లోనే తీద్దామని అనుకున్నారు. కానీ స్టూడియోకి వెళ్లాక 'మీ బుకింగ్ కాన్సిల్ చేసి వేరే పెద్ద నిర్మాతలకు ఆ ఫ్లోర్ ఇచ్చేశాం' అని చెప్పారు స్టూడియో నిర్వాహకులు. ఆర్టిస్టులందర్నీ వెంటబెట్టుకువచ్చిన తర్వాత ఇదీ పరిస్థితి. బాపురమణలు కాస్సేపు ఆలోచించారు. హోటల్ రాక్ కాజిల్ చుట్టూరా వున్న బండల

మధ్యన షూట్ చేస్తే ఏం? వెరయిటీగా ఉంటుందిగా అనుకున్నారు. అలాగే చేశారు. ఆ సన్నివేశం, ఆ లొకేల్ బ్రహ్మాండంగా పండాయి. నిజానికి ఆ పాటను ఇప్పుడు ఇన్‌డోర్‌లో ఊహించుకోలేం కూడా!

బాపురమణలకు ఆప్తుడైన ఎమ్వీయల్ ద్వారా పరిచితులైన నూజివీడు జమీందార్లు ముందులో ఆ సినిమాకు పెట్టుబడి పెట్టారు. 'ముత్యాలముగ్గు' అఖండ విజయాన్ని సాధించింది. తూర్పుగోదావరి జిల్లా పంపిణీ హక్కులు కొనుక్కున్న బాపురమణలకు పెట్టుబడికి పదిరెట్లు రాబడి వచ్చింది. అన్నపూర్ణా డిస్ట్రిబ్యూటర్స్‌కు, నిర్మాతగా వ్యవహరించిన ఎమ్వీయల్‌కు ఎంతో లాభం వచ్చిపడింది. అత్యంత ప్రతిభావంతుడైన నటుడు రావుగోపాలరావు "ముత్యాలముగ్గు"తో గొప్ప కామెడీ విలన్‌గా స్థిరపడ్డాడు. ఎవిఎమ్ వారు 'ముత్యాలముగ్గు'ను హిందీలో 'జీవన్‌జ్యోతి'గా పునర్నిర్మించినప్పుడు ఆ పాత్ర ధరించిన ఓం శివపురి, గోపాలరావు దరిదాపులకు కూడా రాలేకపోయారు.



రావు గోపాలరావు "ముత్యాలముగ్గు"
డైలాగులు రికార్డుగా వెలువడి
రికార్డులు సృష్టించాయి.

వెనువెంటనే నిర్మాత పింజల సుబ్బారావు నుండి "సీతాకల్యాణం" ఆఫర్ వచ్చింది. 'సంపూర్ణ రామాయణం'తో కొత్తరకం పౌరాణిక చిత్రాలకు రూపుదిద్దారు కదా, బ్యాలే టైపులో రామాయణ గాథలను చూపిస్తే బావుంటుంది అని ఆలోచన. "ఇప్పుడే కదండీ రామాయణం తీశారు, అంతలోనే మళ్లీ రామాయణమా?"అని అన్నారు అన్నపూర్ణ డిస్ట్రిబ్యూషన్స్ కృష్ణప్రసాద్. రాముడి కథ కంటే గంగావతరణం, త్రిపురాసుర వధ,

వామనావతారం వంటివి ప్రాధాన్యత సంతరించుకుంటాయి కాబట్టి ఫర్వాలేదని ముందుకొచ్చారు నిర్మాతలు. అదే ధైర్యంతో మూడు జిల్లా డిస్ట్రిబ్యూషన్ తీసుకున్నారు బాపురమణలు. అద్భుతమైన దృశ్యకావ్యం తయారయింది. విదేశాలలో ఎవార్డులు గెలుచుకుంది. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ లైబ్రరీలో స్థానం సంపాదించింది. దర్శకుడిగా బాపు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించారు. కానీ సినిమా కమ్మర్షియల్‌గా ఫెయిలయింది. పౌరాణిక సినిమాలో భారీ డైలాగులు కాదు కదా బొత్తిగా మాటలు లేకపోవడం జీర్ణించుకోలేక పోయారు ప్రేక్షకులు.

నటుడు కృష్ణంరాజు, మేకప్‌మన్ జయకృష్ణ కలిసి "కృష్ణవేణి" తీసి విజయం సాధించాక "భక్త కన్నప్ప" తీద్దామనుకుని బాపురమణలను అడిగారు. జీతానికే పని చేసినా షూటింగ్‌లో పూర్తి ఇన్‌వాల్వ్‌మెంట్ కనబరచిన బాపురమణలను షూటింగ్ సమయంలో గమనించిన ఆనాటి అగ్రశ్రేణి తార వాణిశ్రీకి గౌరవం పెరిగింది. 'గోరంతదీపం'లో మేకప్ లేకుండా డీ గ్లామరైజ్డ్ హీరోయిన్‌గా, శ్రీధర్ సరసన వేయడానికి సమ్మతించింది. "భక్త కన్నప్ప" సక్సెస్ తర్వాత ఆ నిర్మాతలు "మనవూరి పాండవులు" కూడా బాపురమణలచేత తీయించుకున్నారు. నేటి మెగాస్టార్ చిరంజీవికి ఆ సినిమా ద్వారా ఎంతో గుర్తింపు వచ్చింది. "మనవూరి పాండవులు" కూడా సక్సెస్ చేసి పారితోషికాలను గడించిన బాపురమణలు స్వయంగా 'గోరంతదీపం' చిత్రాన్ని నిర్మించడానికి సిద్ధపడ్డారు. అప్పటిదాకా స్వంతంగా తీసిన చిత్రాలలో భాగస్వాములతో వచ్చిన ఇక్కట్లను దృష్టిలో పెట్టుకుని ఇప్పటి నుండి తామిద్దరు మాత్రమే సగం, సగం భాగస్వామ్యంతో సినిమాలు తీయాలని నిశ్చయించుకున్నారు.



అంటే వీరిద్దరి మధ్యా అన్నిటా ఏకాభిప్రాయం ఉండేదని అర్థం కాదు. ముఖ్యంగా 'బంగారు పిచిక', 'కలియుగ రావణాసురుడు', 'రాధాకల్యాణం', 'బుల్లెట్' సినిమాల క్లైమాక్స్ విషయంలో వాదోపవాదాలు జరిగాయి. కానీ అవి రచయిత, దర్శకుడి మధ్య వచ్చిన అభిప్రాయభేదాలు. ఒకసారి స్క్రిప్టు బాపు చేతికిచ్చేశాక రమణ డైరక్షన్‌లో కలగజేసుకునేవారు కారు. సినిమాకు డైరక్టరే కాప్టెన్ అని రమణ ఉద్దేశ్యం. అలాగే కామర్స్, లా చదివినది తనయినా ఆర్థిక లావాదేవీల విషయాలు రమణ డిపార్టుమెంటు అనుకుని బాపు అస్సలు కలుగజేసుకునేవారు కారు! ఎస్సెల్సీ మాత్రమే చదివిన రమణకు సినీ నిర్మాణత్వం రాతకోతల నుండి కోర్టుమతలబుల దాకా, గూండాల నుండి పోలీసుల దాకా అందరితోనూ వ్యవహరించడం నేర్పింది. నిర్మాతలుగా వారి మధ్య పొరపొచ్చాలు ఎప్పుడూ తలయెత్తలేదు.



'గోరంతదీపం' నిర్మాతగా ముళ్లపూడి వెంకటరమణ పేరు కనబడుతుంది. ప్రసిద్ధ నవలా రచయిత ఘండికోట బ్రహ్మాజీరావు కుమార్తె కె.రామలక్ష్మి రాసిన నవలను సినిమాగా మలిచారు రమణ. ఒక మధ్యతరగతి మహిళ ఫ్యామిలీ ఫ్రెండ్ ముసుగేసుకున్న విలన్‌ను ఆత్మగౌరవంతో ఎలా ఎదిరించిందన్న కథాంశం మహిళా ప్రేక్షకులకైనా నచ్చాల్సింది గానీ ఎందుకనో పెద్దగా నచ్చలేదు. గ్లామర్‌లేని వాణిశ్రీని అంగీకరించ లేకపోయారేమో! 4 వారాలు మాత్రమే ఆడిన ఈ సినిమా నష్టాలు తెచ్చిపెట్టింది. మళ్లీ నాలుగేళ్లదాకా అంటే 'కృష్ణావతారం' దాకా స్వంత నిర్మాణం జోలికి పోలేదు. తమపై నమ్మకముంచి వచ్చిన నిర్మాతలకు జీతాలకై పనిచేశారు. 'గోరంతదీపం'తర్వాత బాపురమణల కాంబినేషన్‌లో వచ్చినది విజయచందర్ తీసిన 'రాజాధిరాజు', నటుడు

విజయచందర్ నిర్మాతగా మారి 'కరుణామయుడు' తీసి క్రైస్తవ సినిమాలకు పేరు తెచ్చుకున్నారు. 'రాజాధిరాజు'కై మనిషిని సైతాను లోబర్చుకునే ఓ వింత కథను రాశారు రమణ. రమణ డైలాగు సహాయంతో సైతాను పాత్రధారిగా నూతన్‌ప్రసాద్ చెలరేగి పోయారు. కానీ 'కరుణామయుడు' తర్వాత విజయచందర్‌ను రొమాంటిక్ హీరోగా ప్రేక్షకులు సమ్మతించలేకపోయారు లాగుంది. ఆ విషయాన్ని గ్రహించిన విజయచందర్ ఈ సినిమా ఫెయిల్యూర్ తర్వాత భక్తి పాత్రలను, చారిత్రక పాత్రలను ఎక్కువగా పోషించారు. 'కలియుగ రావణాసురుడు' కూడా 1980 నాటిదే. రామాయణాన్ని సోషలైజ్ చేసిన 'ముత్యాలముగ్గు'ను ప్రేక్షకులు ఆదరించారు కదాని అదే ధోరణిలో రావు గోపాలరావుకు ప్రాధాన్యత నిచ్చి స్త్రీలోలుడిగా చూపి ఓ ఫారెస్టు ఆఫీసరు భార్యను కిడ్నాప్ చేయడం గురించి కథ రాసుకున్నారు. కథ అలా ఉన్నా రావణాసురుడు అని పేరు పెట్టకుండా ఉంటే సరిపోయేదేమో! 'సీతారామకల్యాణం' వంటి సినిమాల ద్వారా ఎన్.టి. రామారావు రావణ పాత్రపై కూడా ప్రేక్షకులు గౌరవాన్ని పెంచుకునేట్లు చేశారు. రావణుడి పేరుతో రావుగోపాలరావు పాత్ర చౌకబారుగా ప్రవర్తించడం జీర్ణించుకోలేకపోయారు లాగుంది. ద్రాక్షారం, మారేడుమిల్లి వంటి మంచి లొకేల్స్‌లో తీసిన ఈ సినిమాను ఇప్పుడందరూ మర్చిపోయారు.

కన్నడ సినిమాలను అత్యంత ప్రతిభావంతంగా 'భక్త కన్నప్ప', 'మనవూరి పాండవులు'గా మలచిన బాపురమణలను జాతీయఅవార్డు పొందిన 'వంశవృక్ష'ను తెలుగులో పునర్నిర్మించమని కోరారు హరిశ్చంద్రారెడ్డి. 'శంకరాభరణం'తో జాతీయస్థాయి ఖ్యాతి గడించిన సోమయాజులు ప్రధానపాత్రగా 'వంశవృక్షం' తయారయింది.



వంశవృక్షం షూటింగ్‌లో

'మనవూరి పాండవులు'ను హిందీలో (హమ్‌పాంచ్) పునర్నిర్మిస్తున్న బోనీకపూర్ సోదరుడు అనిల్‌కపూర్‌ను తొలిసారిగా వెండితెరకు ఈ సినిమా ద్వారానే పరిచయం చేశారు బాపు. చిన్న బడ్జెట్‌తో తీసిన వంశవృక్షం బాగా ఆడింది. అదే సమయంలో త్యాగయ్య ఆఫర్ వచ్చింది.

నాగయ్య 'త్యాగయ్య'గా నటించి ఆ పాత్రను అజరామరం చేశారన్న సంగతి అందరికీ తెలుసు. అలనాటి నటీమణి, నిర్మాత కృష్ణవేణి 'త్యాగయ్య' సినిమాను నాగేశ్వరరావుతో తీద్దామనుకున్నారు. 'విప్రనారాయణ'లో పరమభాగవతోత్తముడిగా నటించిన నాగేశ్వరరావును మళ్లీ 'బుద్ధిమంతుడు'లో అన్నగారి పాత్రద్వారా గుర్తుకు తెచ్చిన బాపురమణలే దానికి తగిన వారనుకుని వారిని అడిగారు. నాగేశ్వరరావుకు కూడా ఆ పాత్ర అంటే ఇష్టమున్నా అప్పటికి సిద్ధపడలేదు. నాగయ్య నటించిన 'బీదల పాట్లు' నాగేశ్వరరావుతో పునర్నిర్మిస్తే అది ఫెయిలయింది. అలాగే గుమ్మడి నటించిన 'భక్త పోతన' కూడా. నాగేశ్వరరావు అప్పటికి అరవయ్యోవడిలో పడుతున్నా యువకథానాయికలతో పోటీపడి డాన్సు స్టెప్పులు వేస్తూ రొమాంటిక్ హీరోగా వెలుగొందుతున్నారు. ఆ దశలో ముసలిపాత్ర వేయడం ఆయనకు సమంజసం అనిపించలేదు. కొంతకాలం ఆగి, వేస్తే మంచిదనుకున్నారు.

ఆ స్థితిలో అభిరుచిగల నిర్మాతగా పేరుబడ్డ నవతా కృష్ణంరాజు 'త్యాగయ్య' నిర్మించడానికి ముందుకు వచ్చారు. నాగేశ్వరరావు అనుమతించని పక్షంలో కన్నడ రాజ్‌కుమార్‌తో వేయిద్దామని రమణ అనుకున్నారు. కానీ 'శంకరాభరణం' మోజుని దృష్టిలో పెట్టుకుని కృష్ణంరాజు ఓ ప్రెస్‌మీట్‌లో త్యాగయ్య పాత్ర సోమయాజులు ధరిస్తారని ఏకపక్షంగా ప్రకటించేశారు. త్యాగయ్య పాత్రపై ఎంతో ప్రేమ పెంచుకున్న నాగేశ్వరరావు ఇది విని బాధపడ్డారు. "వాయిదా వేయకుండా ఇప్పుడే నటించడానికి మీరు ఒప్పుకుంటే కృష్ణంరాజుగారికి నచ్చచెపుతాం" అన్నారు నాగేశ్వరరావుకు ఆప్తులైన బాపురమణలు. కానీ కెరియర్‌ను దెబ్బతీసే నిర్ణయం తీసుకోవడానికి నాగేశ్వరరావు వెనుకాడారు. సోమయాజులుతోనే 'త్యాగయ్య' తయారయింది.

నేటి తరానికి తగ్గట్టు 55 త్యాగరాజు కీర్తనలను కుదిస్తూ, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యంతో భావస్ఫోరకంగా, సాహిత్యం అర్థమయ్యే రీతిలో పాడించారు కె.వి.మహదేవన్. సినిమా రిలీజుకు ముందే ఆడియో పదివేల రికార్డులు అమ్మి నిర్మాతల ఆశలను పెంచింది; డిస్ట్రిబ్యూషన్ విషయంలో తప్పుడు నిర్ణయాలను తీసుకునేట్లు చేసింది. 'త్యాగయ్య' సినిమా సంగీతం ఎంత బాగున్నా ప్రేక్షకుల మనసులను గెలుచుకోలేకపోయింది. వారు సోమయాజులులో 'శంకరాభరణం' నాటి రౌద్రాన్నే చూశారు గానీ నాగయ్యలో కనబడిన సాత్త్వికతను చూడలేకపోయారు. పైగా పోల్చి చూసుకోవడానికి కాబోలు నాగయ్య 'త్యాగయ్య'ను అప్పుడు పనిగట్టుకుని రిలీజు చేశారు.

"అడవిరాముడు" వంటి బ్లాక్‌బస్టర్ సినిమా తీసిన సత్యచిత్ర వారు "ఇన్సాఫ్ కా తరాజూ" హిందీ సినిమా తెలుగు, తమిళ హక్కులు కొని "ఏది ధర్మం, ఏది న్యాయం?"

"నీతిదేవన్ మయింగిగిరాన్"గా తీశారు. రెండింటికీ బాపుయే డైరక్టరు. హిందీలో సూపర్‌హిట్ అయిన సినిమా తెలుగు తమిళాలలో ఓ మాదిరిగా ఆడింది.

తమిళంలో భాగ్యరాజా ఓ ప్రముఖ రచయిత, దర్శకుడు, నటుడు. ఆయన "అంద 7 నాట్‌కళ్" సినిమా హక్కులను సారథీ స్టూడియోస్ వారు కొని 'రాధాకల్యాణం'గా బాపురమణలచే పునర్నిర్మింపజేశారు. హాస్యం, తిరుగులేని తాళి సెంటిమెంటు రంగరించిన ఈ సినిమా సూపర్‌హిట్ అయింది. దీన్ని బోనీకపూర్ 'వో సాత్ దిన్'గా హిందీలో పునర్నిర్మిస్తూ బాపురమణల చేతనే తీయించుకున్నారు.



బాపు, అనిల్ కపూర్



పెళ్లీడు పిల్లలు

అన్నపూర్ణా ప్రొడక్షన్స్ దుక్కిపాటి మధుసూదనరావు ఎన్నో బెంగాలీ నవలలను 'మాంగల్యబలం', 'తోడికోడళ్లు', 'వెలుగునీడలు', 'ఇద్దరుమిత్రులు' వంటి విజయవంతమైన సినిమాలుగా మలచిన దిట్ట. ఆయన ఒక బెంగాలీ నవల ఆధారంగా 'పెళ్లీడు పిల్లలు' తీయించారు బాపురమణల చేత. స్వయంకృషితో స్త్రీలు ధైర్యంగా నిలబడడం చూపిన ఆ సినిమా మహిళలకు నచ్చవలసినదే! కానీ ఆ ఆడపిల్లల మేనమామ పాత్ర గందరగోళానికి గురయింది. విలన్‌గా ప్రారంభమయిన ఆ పాత్రను సోమయాజులు నటించారు. 'శంకరాభరణం' ఇమేజి కారణంగా సోమయాజులును దుష్టపాత్రలో చూడలేరనుకుని ఆ పాత్రను హఠాత్తుగా మంచివాడుగా చేసేశారు. మొత్తం మీద సినిమా యావరేజ్‌గా ఆడింది.

ఆ సినిమాల తర్వాత మళ్లీ తమ స్వంత సినిమా ప్రారంభించారు బాపురమణలు. 'రాజాంగం' అనే తమిళ సినిమా హక్కులు కొని 'కృష్ణావతారం' అనే సాంఘిక సినిమా తీశారు. కృష్ణ, శ్రీదేవి వంటి భారీతారాగణంతోబాటు అప్పుడే పైకి వస్తున్న విజయశాంతికి



కృష్ణావతారం షూటింగ్

ఓ ముఖ్యపాత్ర నిచ్చారు. సినిమా హిట్ అయింది. 10 వారాలు ఆడింది. సీతాకల్యాణం అప్పులు తీర్చేయగలిగారు మన నిర్మాతలు.

"మనవూరి పాండవులు" నాటికి చిన్నస్థాయి నటుడిగా ఉన్న చిరంజీవి 'మంత్రిగారి వియ్యంకుడు' నాటికి తారాపథం అందుకున్నారు. అయినా టైటిల్ రోల్ పోషించినది - బాపురమణల సినిమాల్లో ఎప్పుడూ ప్రధానపాత్ర కైవసం చేసుకునే అల్లు రామలింగయ్య! 'పాపం డబ్బు చేసి పైకి వెళ్లిపోయారు' అనే అమోఘమైన డైలాగు ఈ సినిమాలోదే! సరదాగా ఉంటూనే మంచి మెసేజ్ ఇచ్చిన ఈ సినిమా యావరేజ్‌గా ఆడింది.

తమిళంలో మహేంద్రన్ "ముల్లుమ్ మలరుమ్" అనే సినిమా తీసి అఖండమైన పేరు ప్రతిష్ఠలను మూటగట్టుకున్నారు. నెగటివ్ రోల్స్ ద్వారా సూపర్‌స్టార్ కావడానికి రజనీకాంత్‌కు ఈ సినిమా రాచబాట వేసింది. దానిని జయకృష్ణ 'సీతమ్మ పెళ్లి' గా తీయడానికి ముందుకొచ్చారు. ముఖ్యపాత్రలో మోహన్‌బాబు వేశారు. మంచి కథ, చెల్లెలు సెంటిమెంటు. కానీ ఎందుకనో ఆడలేదు. చిత్రమేమిటంటే ఇదే స్క్రిప్టు ఆధారంగా బాపు హిందీలో 'ప్యారీ బెహనా'గా తీస్తే అది హిట్ అయింది. తెలుగులో పోవడానికి కారణం రాంగ్ కాస్టింగ్ కారణమన్నారు.

1985 నాటికి బాపురమణల మార్కు సినిమాలన్న బ్రాండ్ స్థిరపడిపోయింది. వారి సినిమాలలో సహజత్వం ఉంటుంది. సున్నితమైన హాస్యం ఉంటుంది. అసభ్యత

ఉండదు. వ్యాపారప్రయోజనాలకై విలువలతో రాజీపడడం ఉండదు. ఇలా ఓ ఇమేజి చట్రం ప్రేక్షకులే బిగించి వేశారు. వారు ఫలానా టైపు సినిమాలే తీస్తారు. తీయాలి అని ప్రేక్షకులే నిర్ణయించి వేశారు. 'పెళ్లికొడుకు' సినిమా చూసి 'బాపుసినిమాలో బాబూమోహన్ ఏమిటి? బాపు హీరోయిన్ పైట జార్చడం ఏమిటి?' అనేశారు, 'బుల్లెట్' (1985) సినిమా నిర్మించినపుడు బాపురమణలను ఈ ఇమేజే దెబ్బకొట్టింది.



బుల్లెట్

బాపు హీరో తుపాకీ చేతపట్టడం రుచించలేదు జనాలకి. తిప్పికొట్టారు. దురదృష్టవశాత్తూ అదే ఏడాది 'జాకీ' సినిమా కూడా రిలీజయింది. బుల్లెట్ దెబ్బతిన్న ప్రేక్షకులు ఇది కూడా ఏ గుర్రాల స్వారీ సినిమానో అనుకుని దడిశారు. నిజానికి అది హీరో ముద్దుపేరు. జానకిరాముడుని షార్టుగా 'జాకీ' అని పెట్టారు. 'తంబిక్కి ఎంద ఊరు?' అనే హిట్ రజనీకాంత్ సినిమా ఆధారంగా బాపురమణలు నిర్మాత జయకృష్ణకై తీశారు. పేరు దెబ్బ కొట్టినా కథాబలం వల్ల ఎబౌ యావరేజిగా ఆడింది సినిమా.

ఈ సమయంలో అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి.రామారావు ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు ఆడియో వీడియో పాఠాలద్వారా విద్యాబోధన జరగాలని, ఆ మహత్కార్యం బాపురమణల చేతనే జరగాలని సంకల్పించారు. పిల్లలంటే అమిత ఇష్టం ఉన్న రమణ ఆ పాఠాల చిత్రీకరణకు అయ్యే ఖర్చు మాత్రం ప్రభుత్వం భరిస్తే చాలని, తమకు పారితోషికం వద్దని అన్నారు. అన్నట్టుగానే రెండవ తరగతి వరకు 14 గంటల పాఠాలు

తీసిపెట్టారు. ఆ పాఠాలు పిల్లలనే కాదు, మేధావులనూ ఆకట్టుకున్నాయి. బ్రహ్మానంద భరితుడయిన రామారావు బాపురమణలను రఘుపతి వెంకయ్య అవార్డుతో సత్కరించారు. తక్కిన మూడు తరగతుల పాఠాలూ పూర్తి చేయమని కోరారు.



ఎన్.టి.ఆర్.తో బాపు, రమణ

అయితే అంతకు ముందు ఓ చిన్న షరతు విధించారు. తనకు మాలిన ధర్మం వలదని, సినిమాలలో వచ్చే ఆదాయాన్ని వదలుకుని ఈ పాఠాలు తీసినప్పుడు ఆ మేరకు జరిగే నష్టాన్ని పూడ్చుకోవాలని ఒప్పించారు. ఫైనల్‌గా తయారయ్యే గంట పాఠాలకు ఇంత అని ఇస్తామని, నిరాకరించవద్దని చెప్పారు. ఆ విధంగా మూడవ తరగతికై 16 గంటల పాఠాలు తయారయ్యాయి. ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వం నుండి వారికి డబ్బు ముట్టింది. నిజానికి ఆ పాఠాలు తయారయ్యే సమయంలో రమణ రాసినది – వంశీ తీసిన 'లాయర్ సుహాసిని' (1987) నిర్మాత హరికృష్ణ బాపు దర్శకత్వంలో తీసిన 'కల్యాణ తాంబూలం' (1987) రెండూ బిలో యావరేజ్‌గా ఆడాయి. హిందీలో బాపు ప్రేమ్‌ప్రతిజ్ఞా (1989) డైరక్టు చేశారు. ఎన్.టి.ఆర్. చొరవవల్ల వీడియో పాఠాలపై సంపాదించే అవకాశం రావడంతో ఆర్థికపరిస్థితి బాగుపడింది. 'బుల్లెట్' తాలూకు అప్పులు తీర్చేశారు. మద్రాసులోని రామకృష్ణ మిషన్ స్కూల్లో 'ఎన్.టి.ఆర్. బ్లాక్' పేరుతో ఓ స్కూలు రూము కట్టించారు. తమాషా ఏమిటంటే గుడివాడ 'ఏయన్నార్ కాలేజీ'లో బాపురమణల పేర ఓ హాస్టలు గది ఎప్పటి నుండో ఉంది. దానికి విరాళం వారిచ్చింది కాదు. నాగేశ్వరరావే వారి పేర ఇచ్చారు.

1989లో రాష్ట్ర ప్రభుత్వం మారింది. కొత్త ప్రభుత్వం ఈ పాఠాలపై శ్రద్ధ చూపలేదు. ప్రభుత్వంతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం బాపురమణలు ఇంకా 16 గంటల పాఠాలు తీసి పారితోషికం డిమాండ్ చేయవచ్చు. ప్రభుత్వం కాదంటే కోర్టుకు వెళ్ళి ప్రాజెక్టు మళ్లీ తెచ్చుకునే వీలున్నా ఆ మార్గాన్ని ఎంచుకోలేదు బాపురమణలు. బీదపిల్లలను ఆసక్తికరమైన మార్గంలో విద్యావంతులను చేయాలన్న లక్ష్యం నెరవేరలేదని బాధపడ్డారే కానీ ఆదాయమార్గం మూసుకుపోయిందన్న దిగులులేదు వారికి. తమకు బాగా తెలిసిన విద్య ఎలాగూ ఉంది. చేతిలో కాస్త ఆడుతోంది. స్వంతంగా 'పెళ్లిపుస్తకం' మొదలుపెట్టారు.

'స్నేహం'లో బాపు పరిచయం చేసిన రాజేంద్రప్రసాద్ అప్పటికే కామెడీ హీరోగా ప్రసిద్ధులయి వున్నారు. ఆయన హీరోగా, రావికొండలరావు 'మిస్సమ్మ'ను తిరగేసి రాసిన కథ ఆధారంగా 'పెళ్లిపుస్తకం' తయారయింది. ప్రయోగాల జోలికి పోని, హాయైన బాపురమణ మార్కు సినిమాలకు ఢోకా లేదని నిరూపిస్తూ బ్రహ్మాండంగా హిట్టయ్యింది. వెంటనే బయటనుండి ఆఫర్ వచ్చింది. రమణ కథతోనే 'మిస్టర్ పెళ్లాం' తయారయింది. ఇదీ డిటో, డిటో. ధనమూ, కీర్తీ, అవార్డులూ....




నాగార్జున సిమెంట్స్ వారికై తీసిన "నవ్వితే నవ్వండి" లో రాజేంద్రప్రసాద్

ఎన్.టి.రామారావు సినిమా నిర్మాణంలోని ప్రతి అంశం క్షుణ్ణంగా తెలిసిన వ్యక్తి. నటుడే కాక స్వయంగా రచయిత, దర్శకుడు. రాజకీయాలలోకి ప్రవేశించేముందు

చాలాకాలంగా తన వద్దనున్న స్క్రిప్టులన్నిటినీ సినిమాలుగా మలచి ముచ్చట తీర్చుకుని సినిమాలనుండి విరమించారు. ముఖ్యమంత్రిగా ఉండగానే 'బ్రహ్మర్షి విశ్వామిత్ర', పదవి పోయాక 'సామ్రాట్ అశోక' తీసి నిరాశ చెందారు. శ్రీనాథ కవీంద్రుడి పాత్ర వేయాలన్న తన కోరిక తీరలేదని పదవిలో ఉంటూండగానే అంటూండేవారు. 'అశోక' దెబ్బ తిన్నాక తనకై "శ్రీనాథ" సినిమా తీసిపెట్టమని బాపురమణలను కోరారాయన. పూర్తి స్వేచ్ఛ నిచ్చారు. రమణ స్క్రిప్టును అక్షరం మార్చమని అడగలేదు. బాపు గీచిన గీత దాటలేదు. తయారయిన చిత్రం చూసి ఎంతో సంతృప్తి చెందారు. కానీ సినిమా ప్రేక్షకుల ఆదరణ



శ్రీనాథకవిసార్వభౌమునిగా ఎన్‌టిఆర్ తో

పొందలేదు. రామారావు వయసును దృష్టిలో పెట్టుకుని శ్రీనాథుని జీవితంలోని ఉత్తరభాగంతోనే కథ రాసుకున్నా రామారావును రసికావతంసునిగా ప్రేక్షకులు ఆమోదించలేకపోయారు. రామారావు చివరి హిట్, ఆయన యోగిగా నటించిన 'పోతులూరి వీరబ్రహ్మం' అని ఇక్కడ గుర్తుపెట్టుకోవాలి. 'రాజాధిరాజు'లో విజయచందర్‌కు వచ్చిన సమస్యే ఇక్కడ రామారావుకీ వచ్చింది. తెలుగు చలనచిత్ర సీమలో రారాజుగా వెలిగిన రామారావు చివరిచిత్రం బాపురమణలది కావడం ఓ విశేషం.

ఫుల్ లెంగ్త్ కామెడీల యుగం మళ్లీ వచ్చిందన్న నమ్మకంతో "బంగారు పిచిక"ను 27 యేళ్ల తర్వాత 'పెళ్లికొడుకు'గా పునర్నిర్మించారు బాపురమణ. ఆ చిత్రంలో కథానాయికగా నటించిన విజయనిర్మల కుమారుడు నరేషే ఈ చిత్రంలో హీరో. 'పెళ్లిపుస్తకం'తో పేరు తెచ్చుకున్న దివ్యవాణి హీరోయిన్. నేటితరం హాస్యనటులు కోట,

బ్రహ్మానందం, బాబూమోహన్‌లు కూడా నటించారు. సినిమా రెండువారాల దాకా బాగా ఆడి హఠాత్తుగా డ్రాప్ అయిపోయింది. పంపిణీదారులతో గొడవ వచ్చి తామే స్వయంగా డిస్ట్రిబ్యూట్ చేయడం వలన బాపురమణలు తీవ్రంగా నష్టపోయారు.

రాజేంద్రప్రసాద్ కోరికపై ఆయనకు 'రాంబంటు' తీసిపెట్టారు బాపురమణ. చక్కటి సెంటిమెంటల్ స్టోరీతో మంచి కుటుంబచిత్రంగా రూపొందినా రాజేంద్రప్రసాద్ ఇమేజికి బలయింది. హాయిగా, హుషారుగా కనబడవలసిన రాజేంద్రప్రసాద్ చిన్న లాగు తొడుక్కుని సెంటిమెంటల్ రోల్ వేయడం అదోలా అనిపించింది ప్రేక్షకులకు. సినిమా బాగా ఆడలేదు. అంతకు ముందే 'బుద్ధిమంతుడు'ను హిందీలో మిథున్ చక్రవర్తితో 'పరమాత్మా'గా బాపు డైరక్టుచేస్తే అదీ ఆడలేదు. వీటన్నిటికీ తోడు రమణ వ్యక్తిగతంగా



రాంబంటు స్టిల్

ఒక ప్రముఖ నటుడికి అప్పివ్వడానికి వేరేచోట నుండి అప్పు తెచ్చి పెద్ద పొరపాటు చేశారు. ఇచ్చిన డబ్బు వసూలు చేసుకోవడానికి కోర్టుల చుట్టూ తిరగడం వల్ల, దానధర్మాలు చేయడం వల్ల ఆయన ఆస్తులు తరిగాయి. ఇష్టపడి కట్టించుకున్న ఇల్లు అమ్ముకోవలసి వచ్చింది. 'మనం ఇద్దరం విడివిడిగా ఇల్లు కట్టుకోవడం ఇష్టం లేకనే భగవంతుడు ఇలా చేశాడు. మా డాబా మీదనే ఇల్లు కట్టుకో" అన్నారు బాపు. ప్రస్తుతం ఒకే ఇంట్లో పైన రమణ, కింద బాపు నివసిస్తున్నారు. రమణ కుమారుడు వరా ముళ్లపూడి కమ్మర్షియల్ పైలట్‌గా శిక్షణ పొందినా చిత్రరంగం ఆయన్ని తనవైపు లాక్కువచ్చింది. బాపుకు, రాఘవేంద్రరావుకు సహాయదర్శకుడిగా పనిచేసిన అనుభవంతో ఇప్పుడు

పూర్తిస్థాయి దర్శకుడిగా మారి సినిమాలు తీస్తున్నారు. బాపు సోదరుడు, చిత్రకారుడు శంకర్ కుమార్తెను వివాహమాడారు. రమణ కుమార్తె అనూరాధ ఉద్యోగస్తురాలు. భర్తతో విదేశాలలో స్థిరపడ్డారు.

సినిమాలు తగ్గిన సమయంలోనే టి.వి. వారికి అక్కరకు వచ్చింది. ఈటీవీ వారు తెలుగు, హిందీ భాషల్లో 'భాగవతం' 50 గంటల్లో తీద్దామన్న ప్రతిపాదనతో వచ్చారు. అనుకున్నదానికంటె ఎంతో ఆలస్యమయి 2003 దసరా నుండి ప్రారంభ మయింది. అత్యంత గహనమైన విషయాన్ని కూడా అతి తేలికైన పదాలతో చెప్పగల రమణ నేర్పు పదిలంగా అలాగే ఉందనీ, బాపు దర్శకత్వ నైపుణ్యం చెక్కుచెదరలేదని ప్రేక్షకులకు మరొక్కమారు అర్థమయింది. టి.వి. రమణలోని కవిని మరొక్కమారు బహిరంగపర్చింది. బుల్లితెర "భాగవతం"కై ఆయన రాసిన పాటలను, గేయాలను టీవీ రమణీయం ప్రకరణంలో చూడవచ్చు. టి.వి. ఎపిసోడ్స్‌గా మలచిన రమణ కథల గురించి గత సంపుటాలలో ప్రస్తావించడం జరిగింది. బాపురమణలను ప్రజలకు మళ్లీ పరిచయం చేయడానికి టెలివిజన్ చక్కగా ఉపయోగపడింది. "భాగవతం" సాధించిన విజయంతో సినిమారంగం మళ్లీ బాపురమణలను ఆహ్వానిస్తోంది. 'రాధాగోపాళం' అనే సినిమా తయారవుతోంది.



సినిమా జీవితంలో వెలుగు చీకట్లు ఎన్ని చూడవలసివచ్చినా ఓ కమ్మర్షియల్ నిర్మాతగా మారడం వల్లనే అన్ని విధాలా రమణస్థాయి పెరిగిందన్నది నిర్వివాదాంశం. అందుకే తనకు కమ్మర్షియల్ మ్యాప్‌లో స్థానం కల్పించిన మిత్రుడు, శ్రేయోభిలాషి

నాగేశ్వరరావుకు కృతజ్ఞతా పూర్వకంగా ఈ సంకలనాన్ని అంకితం ఇస్తున్నారు. ఈ సంకలనంలోనే "కథానాయకుని కథ" చోటు చేసుకోవడంలో ఔచిత్యం ఉంది. భారత దేశంలో సినిమా హీరోల జీవితచరిత్ర గ్రంథస్థం కావడం "కథానాయకుని కథ"తోనే ప్రారంభమయిందని అనవచ్చు. జీవితచరిత్ర అంటే బోరు అనిపించకుండా సరదాగా ఎలా రాయవచ్చో చూపించిందీ పుస్తకం. అలాగే వ్యక్తిని ఆకాశానికి ఎత్తేయకుండా, నిజాయితీగా రాస్తూనే పాఠకులకు ఆత్మీయుణ్ణి చేయడం ఎలాగో నేర్పుతుందీ పుస్తకం. ఎంత కష్టపడితే ఓ సామాన్యుడు అసామాన్యుడవుతాడో, ఎంతటి వజ్రానికైనా సానపట్టడం ఎంత అవసరమో తెలియ జెప్పి సినిమా ప్రేక్షకులు కానివారిని కూడా ఉత్తేజపరచగలదీ పుస్తకం.

చక్కటి నవలలా ప్రారంభమవుతుందీ జీవిత చరిత్ర. అంత జీవితమూ చెప్పి చివర్లో ఇది ఉపోద్ఘాతమే అయిందంటాడు కథకుడు. 'ఈ పుస్తకం, ఈ ప్రకరణం, ఈ వాక్యం కూడా అసంపూర్తిగా...' అంటూ లిటరల్‌గా అసంపూర్తిగా వదిలేస్తాడు. ఇదో గొప్ప ప్రయోగం. ప్రారంభం చూడబోతే 'కానుక' కథలో గోపన్న బాల్యమిత్రుడు శ్రీకృష్ణుడిని స్వయంగా కలిస్తే ఎలా వుంటుందో అలా ప్రారంభమవుతుంది. రాములు ద్వారా నాగేశ్వరరావు గతం గురించి కాస్త చెపుతూ నాగేశ్వరరావుకు మెయిన్ ఎస్సెట్ అయిన ఆయన ఫేస్ మీద పాఠకుల దృష్టిని ఫోకస్ చేయడం జరిగింది. తొలి ప్రకరణం పేరే ముఖ–స్తుతి!

ఇక కథనం సాగిన తీరు అత్యద్భుతం, అనితరసాధ్యం. రమణమార్కు చెణుకులతో, వర్ణనలతో, 'పన్'లతో కథ గబగబా నడుస్తుంది. మచ్చుకు కొన్ని – 'ధీమా కలాపం', 'తల్లి పున్నమ్మగారు నాగేశ్వరరావుతోబాటు కలను కూడా కన్నది.' 'చెరువులోకి దిగి దాహం వెయ్యకపోయినా, ఈత రానందువల్ల చాలా నీళ్ళు తాగేశాడుట', 'పరిస్థితిగతులు', 'ఛాన్సు రానందుకు విచారించలేదు, ఘంటసాలని కేకేసి నేపథ్యప్పాటలు పాడమనలేదు', 'అది విన్నాక ఓపిక వున్నా మానినా ఎగిరి గంతువేసేవారు', 'దేహం అతని అజ్మాయిషీలో ఉంటుంది, ఎప్పుడైనా జ్వరం వచ్చి లంకణం చేసినప్పుడు ఒక పౌను తగ్గడం, చేతిలో పౌనురాయి పట్టుకు బరువు తూచుకున్నప్పుడు ఒక పౌను పెరగడం తప్పించి ఇన్నేళ్లుగా అదే బరువు తూగుతున్నాడు', 'అదే చైత్రయాత్రారంభం, జైత్రయాత్రకు నాంది', 'ధైర్యంగా భయపడ్డాడు', 'ఇంతింతై 'న'టుడింతయై.'

నాగేశ్వరరావుపై ఎంత గౌరవం ఉన్నా జీవిత చరిత్రకారుడిగా రమణ తన వృత్తికి, రచనకు ద్రోహం చేయలేదు. నిక్కచ్చిగా రాశారు –

"ఈ జైత్రయాత్రలో అతను ఎదురుదెబ్బలు తిన్నాడు. పొరబాట్లు చేశాడు... అభిప్రాయాలు ఏర్పరుచుకున్నాడు. మార్చుకున్నాడు. కొన్నిటిని పరిమార్చుకున్నాడు... ఆత్మవంచన చేసుకున్నాడు. పరవంచన చెయ్యలేదు."

"లైలామజ్నూ నాటికి నాగేశ్వరరావుకు నటుడుగా పేరు ఏ మాత్రం రాలేదు. మాయలోకం, ముగ్గురు మరాఠీలు, కీలుగుర్రం వగైరాలలో దాదాపుగా కీలుబొమ్మలా తిరిగాడు. అవసరం కూడా అంతే."

"1951లో చిత్రాలు వరసగా దెబ్బతినడంతో 1952లో ఒక్క భరణీ సంస్థ తప్ప మరెవ్వరూ అతన్ని బుక్ చేయలేదు."

"తమిళ దేవదాసులో నాగేశ్వరరావు ఉచ్చారణలో స్వల్పలోపాలున్నా వాటిని ఎవరూ పట్టించుకోలేదు."

"పెళ్లిసందడి వంటి చిత్రాలలో, అతను కామెడీ చాలా చులకన అయినట్టూ, దాన్ని తను అవలీలగా పోషించి అవతల పారేస్తున్నట్టు తేలికగా తీసుకుని కొంత హద్దు మీరాడు. ఆత్మవిశ్వాసం హద్దు జరిగి అహంకారం అయినపుడు కలిగే ఫలితం అది... పేరు ప్రఖ్యాతులు చేయగల అపకారాలలో అది ఒకటి.."

"నాగేశ్వరరావు నటించిన చిత్రాలలో సమర్థంగా నడపనివి, పొరబాటు చేసినవి, మొండిగా 'బాగున్నాయి' అనేవి కొన్ని లేకపోలేదు."

ఇలాటి వృత్తిపరమైన వ్యాఖ్యలే కాదు, నాగేశ్వరరావు మద్యపానం గురించి కూడా ప్రస్తావించారు రమణ. "ఇంట్లో కలతలు ఒక ఘట్టంలో భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు తెచ్చేదాకా వెళ్లాయి" అని కూడా రాశారు. అన్నీ చదివాక కూడా నాగేశ్వరరావుపై గౌరవాభిమానాలు పెరుగుతాయంటే దానికి కారణం రమణ చేసిన కొన్ని పరిశీలనలు – "రౌతు కొద్దీ గుర్రం అంటారు గాని నాగేశ్వరరావు విషయంలో గుర్రం కొద్దీ రౌతు అని చెప్పుకోవడం సమంజసం. అతను ఎక్కబోయిన గుర్రం అతని కన్న ఎత్తు...అటువంటి జీవితంతో అర్భకుడు నాగేశ్వరరావు పోరాడాడు. అతని ఆయుధం ఒక్కటే – దాన్ని లొంగదీయాలన్న దృఢసంకల్పం!"

రమణ కవిత్వపు ధోరణి ఎన్నో చోట్ల ప్రస్ఫుటంగా కనబడుతుంది–

ఆ కళ్ళకి బాధ భాష తెలుసు. ప్రేమ భాష తెలుసు. పరుష వచనాలు తెలుసు. అవి బహుభాషావేత్తలు.

అతను భాషకందని ఆనందం కోసం, ఆశయం కోసం చేతికందిన సుఖాలను వదులు కునేందుకు వెనకాడలేదు.

అమ్మాయి అతని అర్ధాంగి కావటానికి మౌనం ద్వారా అర్ధాంగీకారం సూచించింది.

కలలన్నీ ఎప్పుడో అపుడు మెలకువలోకి కరిగిపోవలసినవే.

జీవితం అనుభవాల ఉలులతో పదిహేనేళ్లుగా శ్రమిస్తూ చెక్కి మలచుకున్న శిల్పం అది.

ఈ విధంగా నాగేశ్వరరావు జీవితాన్ని రమ్యంగా, ప్రతి ఒక్కరికీ స్ఫూర్తిదాయకమైన గాథగా మలిచారు రమణ. ఆయనతో ముడిపడివున్న రామబ్రహ్మం గారి, అన్నపూర్ణగారి, దుక్కిపాటి మధుసూదనరావు గారి వ్యక్తిత్వాలు కూడా ప్రస్ఫుటమవుతాయి రమణ కథనంతో! శ్రమతో విజయం వైపు నాగేశ్వరరావు చేసిన ప్రస్థానం గురించి వివరించి వదిలిపెట్టడంలోనే ఉంది ఈ పుస్తకం అందమంతా! చదివిన

వారిని ఉత్తేజపరిచి, పులకించిపోయేట్లా చేయగల నేర్పు ఉంది ఈ కథలో. తరువాతి కాలంలో నాగేశ్వరరావు గారిపై ఎన్ని పుస్తకాలు వచ్చినా దీని ప్రత్యేకత దీనిదే!

ఈ పుస్తకంలో చివర్లో నాగేశ్వరరావు మరో 15 ఏళ్లపాటు నటించగలరు అన్న ఊహ ఉంది. కానీ వాస్తవం ఊహను మించింది. 80వ సంవత్సరంలో అడుగుపెట్టినా నాగేశ్వరరావు నటుడిగా ఇంకా డిమాండులోనే ఉన్నారు.

'అలాగే కొత్త జీవితం కోసం, కొత్త విజయాల కోసం అతను రాజధానికి తరలి వెళ్తున్నాడు' అన్నారు. తను తరలి వెళ్లడమే కాదు, యావత్తు తెలుగు చలనచిత్ర సీమ భాగ్యనగరానికి తరలి వచ్చేట్లా చేశారాయన! 'వ్యక్తికాదు, సామూహిక శక్తి!' అన్న పడికట్టు పదం ఆయన పట్ల అతిశయోక్తి కాదు. అటువంటి అసాధారణ శక్తి ఎలా రూపుదిద్దుకుందో కమనీయంగా, రమణీయంగా చెప్పిన పుస్తకం "కథానాయకుని కథ". ఇన్నాళ్లూ పాఠకులకు అందుబాటులో లేకపోవడం ఎంత దురదృష్టకరమో ఒకసారి చదివినవారే తెలుసుకోగలరు.



నాగేశ్వరరావుగారి సహాయంతో కమ్మర్షియల్ నిర్మాతలుగా నిలదొక్కుకున్న తర్వాత బాపురమణలు కలిసికట్టుగా, విడివిడిగా ఎన్నో ఉన్నత శిఖరాలు అధిరోహించారు. తెలుగు సినిమాలను హిందీలో తీసేటప్పుడు సంభాషణలు వేరేవారు రాసినా రమణ స్క్రిప్టుయే భాషాంతరీకరణ జరిగేది. శ్రీరామాంజనేయయుద్ధం (1974), స్నేహం (1977) సినిమాలలో రమణ పేరు కనబడకపోయినా రచయితలకు ఆయన సహకరించారు.

రమణ ప్రమేయం లేకుండా బాపు డైరక్టు చేసిన సినిమాలు - శ్రీ రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్ (1976), తూర్పు వెళ్లే రైలు (1980), మొహబ్బత్ (హిందీ-1985), మేరాధర్మ్ (హిందీ- 1987), దిల్ జలా (హిందీ-1988).

సమీక్షకుడిగా, వ్యాసకర్తగా రమణ అంచనాలను బేరీజు వేయడానికి ఇచ్చిన బాక్స్ ఐటమ్స్ ఈ సంపాదకుడు చేర్చినవి. వాటి తప్పొప్పుల బాధ్యత అతడిదే! ఈ సంపుటిపై తమ అభిప్రాయాలను తెలుపదలిచేవారు రచయిత (అడ్రసుNo.9, Greenways Road Extn., Raja Annamalaipuaram, Chennai-600 028 Ph: 044-24937109) లేదా సంపాదకుడు (అడ్రసు -E-101, Satyanarayana Enclave, Madinaguda, Hyderabad-500 050. Ph: 55447636కు రాయగోర్తాను.

-ఎమ్బీయస్ ప్రసాద్

# అనుబంధం

## బాపు దర్శకత్వంలో రమణ కాంబినేషన్ సినిమాలు

సినిమా సం॥ నటీనటులు రమణ సమకూర్చినవి

1. సాక్షి/1967/కృష్ణ, విజయనిర్మల/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే●
2. బంగారుపిచిక/1967/చంద్రమోహన్, విజయనిర్మల/కథ, సంభాషణలు,స్క్రీన్‌ప్లే●
3. ఇంటిగౌరవం/1970/నాగభూషణం, చంద్రమోహన్, జానకి/ సంభాషణలు
4. బుద్ధిమంతుడు/1969 /నాగేశ్వరరావు, విజయనిర్మల /కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే●
5. బాలరాజుకథ/1970/ మాస్టర్ ప్రభాకర్/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
6. సంపూర్ణ రామాయణం/1972 /శోభన్‌బాబు, చంద్రకళ/ సంభాషణలు(ఆరుద్రతో కలిసి), స్క్రీన్‌ప్లే ●
7. అందాలరాముడు/1973/నాగేశ్వరరావు, లత/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
8. ముత్యాలముగ్గు/1975/శ్రీధర్, సంగీత, రావుగోపాలరావు/కథ, సంభాషణలు,స్క్రీన్‌ప్లే●
9. సీతాకల్యాణం/1976/జయప్రద, రవి/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
10. భక్త కన్నప్ప/1976/కృష్ణంరాజు, వాణిశ్రీ/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
11. మనవూరి పాండవులు/1978/కృష్ణంరాజు, రావుగోపాలరావు/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
12. గోరంతదీపం/1978/వాణిశ్రీ, శ్రీధర్/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
13. కలియుగ రావణాసురుడు/1980శ్రీధర్, శారద, రావుగోపాలరావు/కథ, సంభాషణలు,స్క్రీన్‌ప్లే
14. వంశవృక్షం/1980/సోమయాజులు, జ్యోతి/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
15. రాజాధిరాజు/1980/విజయచందర్, సుమలత/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే
16. త్యాగయ్య/1981/సోమయాజులు, కె.ఆర్.విజయ/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
17. ఏది ధర్మం, ఏది న్యాయం/1981/భానుచందర్, మాధవి/సంభాషణలు
18. రాధాకల్యాణం/1981/చంద్రమోహన్, రాధిక/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
19. పెళ్లీడు పిల్లలు/1982/నరేష్, విజయశాంతి/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
20. కృష్ణావతారం/1982/కృష్ణ, శ్రీదేవి/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
21. మంత్రిగారి వియ్యంకుడు/1983/చిరంజీవి, పూర్ణిమా జయరాం, అల్లు/ సంభాషణలు, స్క్రీన్‌ప్లే
22. సీతమ్మ పెళ్లి/1984/మోహన్‌బాబు, శోభ, శరత్‌బాబు /సంభాషణలు
23. బుల్లెట్/1985/కృష్ణంరాజు, సుహాసిని/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
24. జాకీ/1985/శోభన్‌బాబు, సుహాసిని/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
25. కల్యాణతాంబూలం/1987/శోభన్‌బాబు, విజయశాంతి/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే
26. పెళ్లిపుస్తకం/1991/రాజేంద్రప్రసాద్, దివ్యవాణి/సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
27. మిస్టర్‌పెళ్లాం/1993/రాజేంద్రప్రసాద్,ఆమని/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే
28. శ్రీనాథ కవిసార్వభౌముడు/1993/రామారావు, జయసుధ/సంభాషణలు, స్క్రీన్‌ప్లే
29. పెళ్లికొడుకు/1994/నరేష్, దివ్యవాణి/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే ●
30. రాంబంటు/1995/రాజేంద్రప్రసాద్, కావేరి/కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే

(● గుర్తు గల సినిమాలు బాపురమణల ఆర్థిక భాగస్వామ్యం ఉన్నవి)

# ఇందులో...

# ముళ్ళపూడి వెంకటరమణ సాహితీ సర్వస్వం

రూ.

**మొదటి సంపుటం: కథారమణీయం-I** 150

సీతాకల్యాణం, ఇద్దరమ్మాయిలూ–ముగ్గురబ్బాయిలూ,
జనతా ఎక్స్‌ప్రెస్, రాజకీయ బేతాళ పంచవింశతి – ఇతర కథలు.

**రెండవ సంపుటం: కథారమణీయం-II** 150

ఋణానందలహరి, కానుక, రాధాగోపాలం, సాక్షి,
ఆకలీ–ఆనందరావు, విమానం కథ – ఇతర కథలు.

**మూడవ సంపుటం: బాలరమణీయం – బుడుగు** 80

**నాల్గవ సంపుటం: కదంబరమణీయం-I** 150

నవ్వితే నవ్వండి, పీఠికలు, వ్యాసాలూ, ఇతర రచనలు.

**ఐదవ సంపుటం: కదంబరమణీయం-II** 150

గిరీశం లెక్చర్లు, కృష్ణలీలలు, వ్యాసాలు, ఇతర రచనలు.

**ఏడవ సంపుటం: సినీరమణీయం-II** 150

కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవితచరిత్ర),
చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు.

## త్వరలో...

**ఆరవ సంపుటం: సినీరమణీయం-I**

విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు, చలనచిత్ర ప్రముఖులపై
వ్యాసాలు, స్వదేశీ–విదేశీ చిత్రాలు సమీక్షలు.

**ఎనిమిదవ సంపుటం: అనువాదరమణీయం**

ఎనభై రోజుల్లో భూప్రదక్షిణం, పిటి 109.

## ప్రతులకు:

**విశాలాంధ్ర బుక్ హౌస్:**

హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్), విజయవాడ, అనంతపురం,
విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

# కథానాయకుడి కథ



నాగేశ్వరరావు జీవితచరిత్ర

ముళ్ళపూడి వెంకటరమణ

# ముఖస్తుతి



ప్రతిభాశాలి జీవితంలా కళకళలాడుతోంది బెజవాడ రైల్వే స్టేషన్. బాక్సాఫీస్ చిత్రం ఆడుతున్న హాలులా జనంతో కిటకిటలాడుతోంది. రైల్వే ఫ్లాట్ ఫారంలాగే గంద్రగోళంగా ఉంది. 'జనతా జనత' బుక్ చెయ్యని సీట్లకోసం పరుగులు పెడుతున్నారు.

ఆ జన సముద్రం మధ్య ఒక చిన్న జన ద్వీపం. దాని మధ్య దీపంలా వెలిగిపోతున్నాడొక చిన్నవాడు. అతని చుట్టూ నిలిచిన జనం మాత్రం రైలు హడావుడి తమకేం పట్టనట్టు నిల్చున్నారు. వింతగా సరదాగా అభిమానంగా

గౌరవంగా నిర్లక్ష్యంగా భక్తిగా దొంగతనంగా సంతోషంగా అతని వంక చూస్తూ అతను తన మిత్రులిద్దరితో మాట్లాడుతున్న మాటలన్నీ వింటున్నారు. అతను పరిశ్రమల గురించి, పన్నుల గురించి, సినిమాల గురించి ధాటీగా మాట్లాడుతున్నాడు. గట్టిగా చదువుకున్న వాళ్ళకన్న గట్టిగా ధారాళమైన ఇంగ్లీషులో తీవ్రంగా వాదిస్తున్నాడు. మధ్యమధ్య జీవితం గురించి ఛలోక్తులు విసురుతున్నాడు. అవన్నీ వింటున్న అభిమానులు ఆనందిస్తున్నారు. నవ్వుతున్నారు. కొందరు ఆశ్చర్యపోతున్నారు.

సకుటుంబరావుగారొకాయన హడావుడిగా సీటుకోసం పరుగెడుతూ ఆగి, "ఔనే, ఇలారా! నాగేసర్రావు, చూడు," అని గుంపు మధ్యకి చూసి, "నాన్నా, నేనో" అంటూన్న కొడుకుని పైకెత్తి చూపించి, మళ్ళా కంగారుగా సామాను అందుకుని కాళీ పెట్టె కోసం వెదుక బోయాడు.

ఎర్రటి ముతక ఖద్దరు బట్టలు కట్టిన ఓ చిన్నవాడు కాళ్ళు పైకెత్తి, మెడ రిక్కించి గుంపులోకి చూసి గబగబా జనాన్ని తోసుకుని దారి చేసుకొని లోపలికి జొరబడ్డాడు.

"నాగేసరావ్!" అన్నాడు-కాలవ కావలిగట్టు నున్నవాణ్ణి పిలిచినంత గట్టిగా.

మరీ దగ్గరగా నించొని అంత బిగ్గరగా పిలిచినందువల్ల నాగేశ్వరరావు మాట మధ్యలో ఆగి వెనక్కి తిరిగాడు.

పిలిచిన చినవాడు, పిలిచిన కారణం ఏమీ చెప్పలేదు. విశాలంగా హాయిగా ఆనందంగా ఆశగా గర్వంగా నవ్వాడు.

నాగేశ్వరరావు నవ్వాడు.

"నన్ను మర్చిపోయావు." అన్నా డా చిన్నవాడు. అప్పటికే జనం అంతా తనను చూడడం గమనించి కంగారు పడుతూ-

"నువ్వు...రాములివి కదూ?"

"వారి నీ...పేరుకూడా గుర్తుందే!" అన్నాడు రాములు నవ్వి.

నాగేశ్వరరావు మందహాసం చేశాడు. జనం నవ్వారు.

"మనిద్దరం మూడో క్లాసులో కలిసి చదువుకున్నాం. పక్క పక్కని కూర్చునే వాళ్ళం."

"అవును."

"ఏడెందేళ్ళ క్రితం గదూ గుడివాడలో కలుసుకున్నాం?"

నాగేశ్వరరావు నవ్వాడు.

రాములు సగర్వంగా అటూ యిటూ చూశాడు.

"ఇగో, ఓ సెకండిత్తావూ?" అన్నాడు, కొంచెం సందేహంగా చెయ్యిజాపి.

నాగేశ్వరరావు ఆప్యాయంగా చెయ్యి అందించాడు. మిత్రుడు ఉత్సాహంతో పొంగిపోయి రెండు చేతులతో ఆ చేతి నందుకుని దృఢంగా అదిమాడు. ఉసిరికొమ్మను దులిపినట్లు ఊపేశాడు.

జనం ఈ యిద్దరు మిత్రులకేసీ వింతగా చూశారు. ఇటు చలవ చేసిన పొందూరు ఖద్దరు మనిషి, అటు కావిరంగున ఉన్న ముతక ఖద్దరు మనిషి. దుస్తులలోనే కాదు మనుషులలో కూడా ఆ తేడా కనిపిస్తోంది. జీవితం ఒకరిని చలవచేసి నాగరిక రీతిలో సాపుదీర్చింది.

"సినిమాలోకి రాకుండా ఉంటే నాగేశ్వరరావు ఇలా వుండేవాడన్నమాట," అన్నాడొక ప్రేక్షకుడు.

"అతనికేం, లక్షణంగా ఉన్నాడు. అతని గొప్ప అతనిది..." అన్నాడు నాగేశ్వరరావు మిత్రుడి కేసి చూస్తూ.

"నాగేసరావ్...నీ బైస్కోపులన్నీ చూస్తావుంటాను. బెయిటింకా బాగున్నావయ్యా. బైస్కోపులో నీ మొఖం ఇంతకన్నా బాగా పెద్దదిగా ఉంటదనుకో...కాని...ఫేసు బాగుండది. గాసు లైటులాగుండది...ఓర్నీ...అసలు పిలవటానికి నాకే బయవేత్తే...." అన్నాడు రాములు. ఇప్పుడతను చుట్టూవున్న జనాన్ని పట్టించుకునే స్థితిలో లేడు.

జనం అప్రయత్నంగా ఆ ముఖం కేసి పరిశీలనగా చూశారు.

అందులో మంచి తేజస్సు ఉంది. శక్తి ఉంది. చైతన్యం ఉంది. పొగరుంది. విద్య ఉంది. వినయం ఉంది. వివేకం ఉంది. ధైర్యం ఉంది. దాని చాటున భయమూ ఉంది. విశాలంగా, విప్పారిన చక్రాలలాటి కళ్ళు, పూరించిన నాసాపుటాలూ, ఎక్కుపెట్టని విల్లులా ఉన్న పెదిమలూ ఆకర్షణీయంగా ఉన్నాయి. అందానికవి అర్థ నిర్వచనాలు కాకపోవచ్చు. కాని జీవకళ, సమ్మోహనమైన శక్తిదీపించే రూపురేఖలు–మనోహరంగా అమరిన ముఖం అది.

ఆంధ్రదేశంలో రోజూ పది లక్షల మందిని మంత్రముగ్ధుల్ని చేసే మాయా ఛాయా దర్పణం అది. ఆ అద్దంలో మనిషికో బింబం దాగి ఉంటుంది. తల్లిదండ్రులకు తమ ఆదర్శపుత్రుడి ప్రతిబింబం కనిపిస్తుంది. తమ కన్నబిడ్డలో వారు చూడగోరే సౌజన్యం, వినయం, ఆత్మవిశ్వాసం, బుద్ధిమంతనం కనిపిస్తాయి. ఆడపడుచులకు వారి వారి స్వప్నసుందరులు కనిపిస్తారు. వారు కలలు గనే అందం, చందం, చురుకుదనం, ధనం, ధీమాకలాపం కనిపిస్తాయి. యువకులకు వారు పగటి కలలు కనే ఊహించుకునే తమ స్ఫురద్రూపం కనిపిస్తుంది. ధైర్య సాహసాలు, బేఖాతరీతనం, చొరవ, ఋజువర్తనశక్తి కనిపిస్తాయి. చిన్నవాళ్ళకు అన్నయ్య కనిపిస్తాడు. నటులకు అక్షరాలా ఆదర్శనట వదనం కనిపిస్తుంది.

అది వయసెరుగని ముఖం. వన్నెతరుగని ముఖం. చిరంజీవ మనిపించే యౌవనానికి ముఖం. కాలంపై మనసు క్షణక్షణం సాధించే విజయాల జయ పతాకలు కొత్త కొత్త జీవకణాలై ఆ ముఖంలో మేలుకుని వెలుగుతాయి. పదుచుదనం పోసుకుని రెక్క విప్పిన చైతన్యం అది.

చాలా మంది నూరేళ్ళలో చూడని జీవితాన్ని ఆ ముఖం రెండు పదులలో చూసింది. ఎందరో చూడడానికి భయపడే సంగ్రామాలలో కావాలని జొరబడి

పోరాడింది. ఎన్నో ఎదురు దెబ్బలు తింది. పోరాటం వేసిన గాట్లను కూడా మనోహరరేఖలుగా మలుచుకుంది. అపజయాలను, అపనిందలను, అవమానాలను, దూషణలనూ అందుకుని అందాన్ని, హుందానూ ఇనుమడింపచేసే అలంకారాలుగా పరిమార్చింది. నూరుగురు కథానాయకుల జీవితాలను ధరించి, వారి కష్టసుఖాలను ప్రదర్శించిన ముఖం అది. ఆడపడుచు ముఖంగా హావభావాలను ప్రదర్శించడం అలవరచుకుని, పేరు తెచ్చుకుని, ఒక్కసారిగా మగసిరిగల కథానాయకుడి వదనంగా, ధైర్యసాహసాల నిలయంగా పరివర్తితం అయి, క్రమేపీ ప్రస్ఫుటమైన కొత్త రూపును తీర్చుకున్నదా ముఖం.

జీవితం, అనుభవాల ఉలులతో పదిహేనేళ్ళుగా శ్రమిస్తూ చెక్కి మలచుకున్న శిల్పం అది. పదిహేనేళ్ళ నాడు అసంపూర్ణ శిల్పంలా ఉన్న నాసికమీద మొండి పట్టుదల, పొగరుబోతుతనం, చెక్కి తీర్చిదిద్దడంలో ఎన్నో సవాళ్ళు, అపజయాలు, భయాలు అరిగిపోయాయి. ఎక్కుపెట్టని విల్లులాటి పెదిమలలో బింకం, బెట్టు అమర్చి, మాటల బాణాలను ధాటీగా ప్రయోగించగల శక్తిని సమకూర్చడంలో ఎదటివారి హితవాక్యాలూ, అ హిత వాక్యాలూ, నయవంచక వాక్యాలూ, నిందాస్తుతులూ కరిగిపోయాయి.

అతని కళ్ళల్లో అహంకారం ఉంది. వెటకారం ఉంది. ధిక్కారం ఉంది. కనికరం ఉంది. భయాన్ని, అనుమానాన్ని అణచి దాచిన ఆత్మవిశ్వాసం ఉంది. తెలివి ఉంది. అది లేదని చూపరులను అపోహపడనివ్వని అతితెలివి ఉంది. నాలుగువేపులా ఏకకాలంలో చూసుకు కాచుకునే కోడెతాచు మెలకువ ఉంది. వీటిని కూడా ఇంత ప్రస్ఫుటంగా అమర్చినది జీవితమే. ఆ కళ్ళకి బాధ భాష తెలుసు. ప్రేమ భాష తెలుసు. పరుషవచనాలు తెలుసు. సరసవచనాలు తెలుసు. అవి బహుభాషావేత్తలు. అందువల్లనే ఏకకాలంలో లక్షలాది ప్రేక్షకులతో లక్షలాది భాషలు మాట్లాడి వాళ్ళని రంజింప జేయగలుగుతున్నాయి. మోహనమైన చూపులను ప్రయోగించి ముగ్ధుల్ని చేస్తున్నాయి. ఇంద్రజాలవిద్య ప్రదర్శించి విభ్రాంతుల్ని చేస్తున్నాయి. అనురాగమను రాగాన్ని ప్రస్తరించి, యువహృదయాలను పులకరింప చేస్తున్నాయి.

నటించిన పాత్రలద్వారా ఎందరో వ్యక్తుల ఆశలను ఆనందాలను బాధలను ధరించి, భరించి, వారికై వారి తరపున కన్నీరు కార్చిన కళ్ళు అవి. ఇతరుల కష్ట సుఖాలను అర్థం చేసుకుని వారి బాధని లోకానికి చెప్పి వారికి సానుభూతిని సంపాదించి పెట్టాయి.

ఆ కళ్ళ నీళ్ళతో తడిసిన అతని ముఖం అద్భుతమైన హావభావాలు పండించే సారవంతమైన నట భూమి. రైతుబిడ్డ నాగేశ్వరరావు పొలం వదిలి ఫిలిం పొలానికి వచ్చి ఈ భూమి మీదనే నిర్విరామంగా నట వ్యవసాయం చేశాడు. చేస్తున్నాడు. నాటికీ నేటికీ కూడా అతను కృషీవలుడే.

ఈ కృషిలో అతను భాష కందని ఆనందంకోసం, ఆశయంకోసం చేతికందిన సుఖాలను వదులుకునేందుకు వెనకాడలేదు. తన స్వంత బాధ నటించుకునేందుకు మాత్రం చోటూ తీరుబాటూ లేనందున చింతించలేదు.

'కృషితో నాస్తి దుర్భిక్షం' అని ఋజువు చేశాడతను. ఫిలిం పొలంలో రూపాయల పంట పండించే వారిలో అతను అద్వితీయు దనిపించుకున్నాడు. అతని ఫేస్ వాల్యూ ఈనాడు-వ్యాపార పరిభాషలో-పది లక్షల రూపాయలు.



# బాలనటుడు



1924 సెప్టెంబరు 20వ తేదీన, తారాపథంలోగాని, చలనచిత్ర తారాపథంలోగాని (అప్పటికి రెండోది ఏర్పడిందని చెప్పలేము) పెద్ద సంచలనాలు కలిగినట్టు గాని, ఒకానొక కాబోయే గొప్ప నటుడి పుట్టుకను వ్యాఖ్యానిస్తూ 60 వాద్యాల ఆర్కెస్ట్రా నేపథ్య సంగీతం ఉద్ఘోషించినట్టుగాని ఎవరికీ గుర్తులేదు.

కాని ఆనాడు గుడివాడ తాలూకా వెంకటరాఘవపురంలో అక్కినేని వెంకటరత్నం గారింట నాగేశ్వరరావు అనే నటుడు పుట్టాడు. ఇంచుమించుగా పేరుతోనే పుట్టాడు. ఎందుకంటే, తల్లి పున్నమ్మగారు కనగానే అతనికి పేరు పెట్టడం జరిగింది. ఆమె ఆ రోజున నాగేశ్వరరావుతోబాటు ఒక అద్భుతమైన కలను కూడా కన్నది. కలలో ఒక నాగుబాము ఈ బిడ్డ చుట్టూ ముమ్మారు తిరిగిందట. స్వప్న ఫలాల శాస్త్రం ఆమెకు కంఠస్థం కాదు. ఆమె కెందుకో భయం కలిగింది. ఇంకోళ్ళని ప్రశ్న అడిగేందుకు వ్యవధి లేదు. కలగని మేల్కొన్న వెంటనే మొక్కుకుంది-బిడ్డకు నాగేశ్వరుడి పేరు పెట్టుకుంటానని. అంతేకాదు-ఇటుపై తమ కుటుంబంలో ఎవరికి సంతానం కలిగినా, ఏదో ఒక బిడ్డకు ఆ పేరు పెట్టిస్తానని కూడా నిశ్చయించుకుంది. ఆమె కన్న బిడ్డలందరూ ఆ నిర్ణయాన్ని మన్నన చేసి అమలు జరిపారు.

పున్నమ్మగారు ఇంత భయపడడానికి కారణం ఒకటుంది. ఆమెకు తొలిచూలు బిడ్డ పోయాడు. మలిచూలు తప్పించి మూడో బిడ్డ పోయాడు. అలాగే ఐదో బిడ్డ, ఏడవ బిడ్డ (ఆడపిల్ల) పోయారు. నాగేశ్వరరావు అమ్మ కన్న సంతానంలో తొమ్మిదో వాడు. ఉన్న ఆనవాయితీని బట్టి ఇతను భూమిమీద పడ్డపుడే అంతా పెదిమె

విరిచారు-బేసి సంఖ్య కాబట్టి వీడు దక్కేవాడు కాదని. భయపడ్డట్టే అతను పుట్టిన రోజున తల్లికి కలవచ్చింది. ఈ ఋణానుబంధం ఏ నాలుగేళ్ళో అని తలపోశారంతా. ఆ భయం, దాన్ని వెన్నంటి ఉన్న అనుమానం ఎంత గాఢమైనవీ అంటే, నాగేశ్వరరావుకు ఐదో ఏట మెడమీద ముచ్చిలిగుంట దగ్గర పెద్ద వ్రణం లేచినప్పుడు చుట్టపక్కాలు, ఇరుగుపొరుగువారు కూడా వీడికి టయమైఁపోయిం'దనే అనుకున్నారు. మనమీదాపాటి మమకారం లేకుండా నిర్దాక్షిణ్యంగా పోయేవాడిని ఆపబోయి లాభమేమిటన్న తాత్పర్యాని కొచ్చారు. కన్నతల్లి కంగారుపడి మందా మాకా అని అడగబోతే, "ఎందుకమ్మా, మందూ వద్దు, మాకూ వద్దు. ఖర్చు దండగ" అని కూడా ఒకరిద్దరనేశారు. "నాగేశ్వరస్వామి ఆనాడే 'వీడు నా వాడు' అని చుట్టూరా గిరిగీసుకున్నాడు" అన్నారు. డాక్టరు అనవసరమన్నారు. చివరికి మంగలి గోళ్ళుతీసే కత్తితో కంతికి గంటు పెట్టాడు.

కాని నాగేశ్వరరావు మొండిఘటం.

మొత్తానికి మందూ మాకూ ఉన్నా మానినా కురుపు మానింది. "నాగేశ్వరరావు మచ్చలేని మనిషి" అని అతని అభిమానులు, భక్తులు అన్నపుడు, "లేకేం, మెడమీద చూడు" అని గిట్టనివాళ్ళు అనడానికి వీలుగా ఆ రణం తాలూకు మచ్చ మెడమీద (వెనుక వైపు) ఇప్పటికీ నిలిచివుంది.

ఈ విధంగా పుట్టుకతోనే అక్షరాలా పేరు తెచ్చుకున్నవాడు నాగేశ్వరరావు అని ఒక అభిమాని చమత్కరించారు.

పేరే కాదు, చిన్నతనంలోనే బిరుదులు కూడా దక్కాయి. "పిట్ట కొంచెం, కూత ఘనం" అనీ, "పిసినిగొట్టు" అనీ, "పూలరంగడు" అనీను. "గట్టి పిండం" అన్న పేరు కూడా అప్పట్లోనే గడించాడు. బహుశా చివరిదే మొదట వచ్చివుండాలి.

వ్రణగండం గడచిన తరువాత ఒకసారి అగ్నిగండం సంభవించింది. భోగిపండగ నాడు చలిమంట కాచుకుంటూ వుంటే దుప్పటి అంటుకుంది. వళ్ళంతా కాలి బొబ్బలెక్కిపోయింది. 'చచ్చి బతికాడమ్మా బిడ్డడు' అన్నారు అమ్మలక్కలంతా- అతను బతుకుతాడని ఖాయపడ్డాక.

ఇది జరిగిన ఒక ఏడాదికి చెరువులో ఈతలాడుతుండగా-దాహం వెయ్యక పోయినా ఈత రానందువల్ల చాలానీళ్ళు తాగేశాడు. దారే పోయే దానయ్య ఎవరో అతన్ని చూసి పైకి తీసి కాపాడాడు.

ఏడెనిమిదేళ్ళ వయసు లోపల-రెండు మూడేళ్ళ తేడాలో ఇలా మూడు గండాలు గడిచి గట్టెక్కిన వాడికి పై బిరుదు లభించడం సహజమే. చివరికంతా కలిసి "వీడెవడో దేవాంతకు డవుతాడు." అని తీర్మానించారు ఆనందంగా, సగర్వంగా.

పోతే "పిట్ట కొంచెం..." అన్న దీవెనను అతను బిరుదులాగే తగిలించుకు తిరిగేవాడు. పదహారేళ్ళ లోపల ఈ విమర్శను ఒక వందసార్లు గడించుకున్నాడు.

మనసుకు తోచిన మాట ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు అనేసే గుణం ఇతనికి చిన్ననాటి నుంచీ ఉంది. ఇది దుర్గుణమా, సుగుణమా అనేది సాపేక్ష సిద్ధాంతాన్ని బట్టి నిర్ణయించాలి. ఈ గుణం ఉన్న వ్యక్తి ఎవరికీ లొంగనంత గట్టివాడు, చాలా డబ్బున్నవాడు అయితే ఇది గొప్ప గుణం. "వారు చాలా నిష్కర్షగా ఉన్న మాట చెబుతారు. వారి హృదయంలో కల్మషం లేదు" అంటారు. ధనబలం పుష్కలంగా లేని మనసుకు తోచిన మాటని అనేస్తే, సంస్కార విహీనుడు, మూర్ఖుడు, మొరటువాడు, అప్రయోజకుడు అంటారు.

నాగేశ్వరరావు ఈ బిరుదు తొలిసారి గడించుకున్న నాటికి మరీ చిన్నవాడు కాబట్టి ఈ సూత్రం అప్పటికి వర్తించలేదు. దరిమిలాను మాత్రం రెండందాలా పరిస్థితిగతులను బట్టి ప్లేటు ఫిరాయిస్తూ వచ్చింది.

అప్పట్లో వాళ్ళన్నలు ఊళ్ళో పెత్తందార్లు. పార్టీ వ్యవహారాలలో ఎవడి మీదన్నా చిరాకుపడి, ఏ తూముగట్టు మీదనో కూర్చొని మాటాడుతున్నప్పుడు "ఫలానావాణ్ణి పట్టుకుతన్నాలి, మరీ జోరుగా వుంది కత" అనుకుంటే, 'ఏవుఁంది, తంతేసరి' అనేసేవాడు చిన్న నాగేశ్వరరావు. అక్కడున్న పెద్ద కనుబొమలు పైకెత్తి కుర్రాణ్ణి చూసి 'ఫర్లేదు, పిట్ట కొంచెవేఁగాని కూత గనవేఁ' అనేవాడు. 'కూతే కాదు, చేత కూడా' అని నిరూపించడానికన్నట్టు నాగేశ్వరరావు ఒకటి రెండు సందర్భాలలో ఆ శత్రుపక్షపువాడిని తన్ని పోయాడు కూడా.

'పిసినిగొట్టు' బిరుదు వచ్చింది నిజంగా పీనాసితనానికి కాదు; అమ్మ నడిగి డబ్బు తీసుకోవలసిన రోజుల్లో పనిచేసి స్వయంగా సంపాదించినందుకు, సంపాదించవలసిన అగత్యం లేనందువల్ల ఇది మరీ ఎబ్బెట్టయింది.

ఊళ్ళో కుర్రాళ్ళు, ఇంటి జీతగాళ్ళ పిల్లలు పొలాల్లో పరిగె ఏరుకొంటూన్నప్పుడు పెత్తందారుగారి చిన్నతమ్ముడు సూపరువైజరుగా వెళ్ళేవాడు. అక్కడ ఏరండి, ఇక్కడేరండి అని పురమాయించేవాడు. వాళ్ళు ఏరిందంతా (తమ పొలాల్లోనే) పోగేశాక వాళ్ళని దబాయించి అందులో వాటా కోయించేవాడు. ఆ వడ్లు అమ్మగా వచ్చిన డబ్బులు పోగేసి ఓ సిలుకు చొక్కా కుట్టించుకునేవాడు.

వాళ్ళ లోగిలి కాలవ పక్కగా ఉండేది. వానా వరదా కలిసొచ్చినపుడల్లా లోగిలి ముందరి మట్టిని కరిగించి దించి తోసుకుపోయేది. వరద తియ్యగానే ఆ మట్టిని రాబట్టుకునే పని వాళ్ళ నాయనమ్మది. ఏ పాలేరునో, కూలీనో కేకేసి ఈ పని చేసి పెట్టమంటే రూపాయ డబ్బు లిమ్మంటాడు. మనవఁడైతే చురుగ్గా ఆడుతూ పాడుతూ ఇట్టే చేసేస్తాడు. ఓ పావలా డబ్బులిస్తే పొంగిపోతాడు. నాయనమ్మిచ్చిందని సంతోషిస్తాడు.

"ఏరా, చేస్తావురా" అందావిడ...పని వంక దొరికితే నీళ్ళలో ఆడుతూ పాడుతూ గడపవచ్చు. పైగా ఒక్కసారి పావలా వస్తుంది. మాంచి సిలుకు చొక్కా కొనుక్కోవచ్చు. నేనే కొనుక్కున్నానని చెప్పుకోవచ్చు...ఇంకోచోట పనిచేస్తే కోప్పడతారు గాని మనింటి పని మనంచేస్తే గొప్పే...నాయనమ్మ కూడా సంతోషిస్తుంది...

"హోల్ రైట్ నాయనమ్మా..." అన్నాడు నాగేశ్వరరావు.

నాటి నుండి రెండు మూడేళ్ళపాటు ఈ కాతా కింద నాగేశ్వరరావు సాలాదాయం నాలుగణాలు. తద్వారా ఓ సిలుకు చొక్కా...లేదా, కళ్ళజోడు...

అమెరికాలో ఈ రోజున నాగరికులు చేసేది అక్షరాలా ఇదే. అక్కడ నౌకర్లు దొరకరు. దొరికినా కిరాయి చాలా హెచ్చు. అందుకని లక్షాధికారులు తప్ప మిగతా వాళ్ళంతా స్వయం సేవకులే. ఇంట్లో పదేళ్ళ కొడుకుంటే, వాడికి కారు కడిగినందుకు 50 సెంట్లిస్తారు. చెల్లెల్ని ఆడిస్తే 50 సెంట్లిస్తారు. ప్లేట్లు కడిగితే పాతిక సెంట్లు...పిల్లలకి కష్టపడి గడించే డబ్బు విలువ తెలుస్తుంది. గడించి అనుభవించడంలో ఆనందం తెలుస్తుంది. ఆత్మగౌరవం అంటే, మన చేతి పెట్టె మోయడానికి కూలివాణ్ణి పెట్టుకోవడం కాదని బోధపడుతుంది...

తెలుగుదేశంలో మారుమూల పల్లెటూళ్ళో పుట్టిన నాగేశ్వరరావుకు ఏడెనిమిదేళ్ళ వయసు వచ్చేసరికి ఈ విషయాలు అనుభవాని కొచ్చాయి.

ఇందుకే అతనికి పిసినారి అన్న బిరుదు కూడా వచ్చింది.

వెంకటరత్నంగారు స్థితిపరులే. పాతిక ఎకరాల సుక్షేత్రం, కమతానికి తగ్గ పశువులు, పాలేళ్ళు, విశాలమైన లోగిలీని. నాగేశ్వరరావు ఐదవయేట ఆయన స్వర్గస్థులయారు. అప్పటికి అన్నదమ్ములైదుగురిలో ముగ్గురికి వివాహాలయ్యాయి.

ఐదుగు రన్నదమ్ములకీ ఐదేసి ఎకరాల క్షేత్రం వచ్చింది. నాలుగవ కుమారుడు నారాయణరావుకూ, కడసారి బిడ్డకూ పెళ్ళిళ్ళు కానందున వారి సంరక్షణ తల్లికి ఒప్పగించి వారికి లోగిలి ఇచ్చేశారు. పెద్దన్న రామబ్రహ్మంగారు వీరి మంచి చెడ్డలూ వ్యవహారాలూ అన్నీ చూస్తూ వుండేవారు. తల్లీ, అన్నలూ కూడా నాగేశ్వరరావును ముద్దుగా చూసుకునేవారు. నాగేశ్వరరావు మిగతావారి కన్నా ఓ చాయ తెలుపు. సుకుమారంగా ఉండేవాడు. పైగా మూడు గండాలు గడిచి నిలచిన బిడ్డ కాబట్టి తల్లి అపురూపంగా, ప్రాణసమానంగా చూసుకునేది. ఆమెకు, ఆడపిల్ల లేదన్న బాధ ఒకటి మనసులో మెదలుతూ ఉండేది. ఆ ముద్దు మురిపాలన్నీ నాగేశ్వరరావే తీర్చాడు. పరికిణీ, గౌను వేసుకోకపోయినా, ఆడపిల్లల్లే అమ్మ వెంటే వుంటూ అమ్మకి వంటపనుల్లో సాయపడేవాడు. "నా కూతురమ్మా" అని ఇరుగు పొరుగులికి చెప్పుకు మురిసిపోయే దావిడ.

పోను పోను ఆమె ఆరోగ్యం దెబ్బ తిన్నందువల్ల పనులుచేసే ఓపిక తగ్గడంతో సరదాగా చేపట్టిన పనులు తప్పనిసరి అయ్యాయి. అందుకు తగ్గట్టే, ఇద్దరు పిల్లలున్న ఇంటికి జీతగాళ్ళెందుకు-ఎటుదిరిగీ పొలం పనులన్నీ పెద్దాయన చూస్తున్నాడు గదా అని ఇంట్లో పనివాళ్ళని తీసేశారు.

అప్పటికి నాగేశ్వరరావు చదువుకోసం పొరుగూరికి వెళ్ళి వస్తూ వుండేవాడు. వాళ్ళ ఊళ్ళో ఐదవ తరగతి వరకే ఉంది. అందుకని కోసెడు దూరాన ఉన్న పెదవిరివాడలో ఒకటవ ఫారం విద్యార్థిగా చేరాడు. ఇంచుమించు ఆ ప్రాంతంలోనే రాజేంద్రప్రసాద్ గారి ఉద్బోధల ననుసరించి దేశంలో హిందీ ఉద్యమం

ఆరంభమైంది. చిన్నా పెద్దా అంతా హిందీ నేర్చుకోసాగారు. నాగేశ్వరరావు కూడా అందులో చేరాడు.

సినిమాలో చేరాక పది పదిహేను చిత్రాలలో పని చేసినపుడు కూడా నాగేశ్వరరావు ఆ చిన్ననాటి పని రద్దీ ఎరగడు. రోజుకి 20 గంటలు పని చెయ్యడం ఆనాడే అలవడింది.

తెల్లవారు ఝామున లేచి కోడిని లేపి, గొడ్లశాలకు వెళ్ళి పాడి తీసేవాడు. పాలు దాలిగుంట కెక్కించి, లోగిలి అంతా కసవూడ్చి శుభ్రం చేసేవాడు. తరవాత కావడేసుకొని కాలవనించి నీళ్ళు తెచ్చేవాడు. వంట ఆరంభించేవాడు. వాళ్ళమ్మగారు వంటింట్లోనే కూర్చుని ఏమేం చెయ్యాలో చెప్పి చేయించేవారు. అతని వల్ల కాని వంటలు వచ్చినపుడు మాత్రం ఆమె వండడం, అతను పక్కనే ఉండి సరుకులు అందీయడం జరిగేది.

వంట కాగానే, ఆ పూట బడిపాఠాలు చూసుకుని, చలిది తిని మధ్యాహ్నానికి భోజనం పట్టుకుని పెదవిరివాడ స్కూలుకు పరుగుపెట్టేవాడు. సాయంత్రం రాగానే ఓ గంటసేపు ఊళ్ళో తాలింఖానాకు వెళ్ళి సాము గరిడీలు చేసేవాడు. ఆరునుండి ఎనిమిది వరకూ హిందీ క్లాసులో కూర్చునేవాడు. అట్నించి రాగానే వంట-వార్పు. గిన్నెలు తోమడం, అమ్మకి సేవ చెయ్యడం. మళ్ళీ తెల్లవారుఝామునే లేచి ఈ కార్యక్రమం సాగించడం. ఈ రోజుల్లోనే అతని భవిష్యత్తుకు నాంది ప్రస్తావన యాదృచ్ఛికంగా జరిగింది.

పెదవిరివాడ స్కూలు వార్షికోత్సవంలో 'హరిశ్చంద్ర' నాటకం వేయించారు. అందులో నారదుడు వేషం కాళీ వచ్చింది. పొరుగూరబ్బాయి ఒకడు బాగానే పాడతాడని ఓ కుర్రాడు చెప్పగా మేస్టరుగారు అడిగారు. 'ఓ' అన్నాడు. నాగేశ్వరరావు.

'ఓహో' అనిపించుకున్నాడు. అంటే తాన్సేనును, త్యాగరాజును మించి పోయాడని కాదు. అతని వయసుకు, తాహతుకి చాలా బాగా పాడాడని పేరొచ్చింది.

పాట విని చిన్నన్న సూర్యనారాయణగారు సంతోషించారు. వేషం చూచి పెద్దన్న రామబ్రహ్మంగారు మురిసిపోయారు.

ఆ తరువాత వెంకటరాఘవపురంలో స్కూలు వార్షికోత్సవం వచ్చింది. నాగేశ్వరరావు హైస్కూలు వాడయినా, అతన్ని గెస్టార్టిస్టుగా పిలిచారు. వాళ్ళు వేసింది 'హరిశ్చంద్ర'. అందులో ఇతని కిచ్చిన వేషం చంద్రమతి. నాటకానికి వాళ్ళమ్మగారు కూడా చూడవచ్చారు.

చంద్రమతి వేసిన పిల్లాడు అచ్చుగా ఆడపిల్లలాగే ఉన్నాడని అంతా మెచ్చుకున్నారు. ఆ వినయవందనం, ఒద్దికా బాగా కుదిరాయి అన్నారు మేస్టరు గారు. పున్నమ్మగారి సంతోషానికి మేరలేదు. ఆడపిల్లని కన్నా దక్కించుకోలేక పోయానన్న బాధ, వెలితి ఆనాడు కడసారి బిడ్డని ఆ వేషంలో చూడగానే

తీరిపోయాయి. తరవాత కొన్నాళ్ళపాటు ఇంటిదగ్గర పనులు చేస్తున్నా, మధ్యలో "ఏది, రాజ్యం వదిలిపోయేటప్పుడు చంద్రమతి ఏవంంది? ఏవింటా పద్దెం" అని అడిగి అడిగి నటింపజేసుకు చూసే దావిడ. పద్యాలు, పాటలు మళ్ళీ మళ్ళీ పాడించుకు వినేది. కాలవొడ్డున, పొలాలదగ్గిర జీతగాళ్ళూ పాడించుకునేవారు.

"వీడికి చదువుకన్న ఇందుమీదే శర్ధున్నట్టుందే" అన్నారు పెద్దన్నగారొక రోనాడు.

పున్నమ్మగారు నవ్వారు.

❀ ❀ ❀ ❀

ఒకనాడు కుదరవల్లిలో నాటక సమాజం నించి ఒకాయన వచ్చి రామబ్రహ్మం గారితో మాట్లాడాడు. 'మీ వాడు, నాటకాల్లో వేషాలు కడతాడా' అన్నాడాయన టోకున.

కడితే పైకొస్తాడని, తమ జట్టుతోపాటు రోజూ సాధనచేస్తే ఆటా పాటా అబ్బుతాయనీ ఆయన అభిప్రాయపడ్డాడు.

ప్రస్తుతం వాళ్ళ క్కావలసింది 'కనకతార' నాటకంలో తార వేషానికి చక్కటి కుర్రాడు.

సరే అన్నారు రామబ్రహ్మంగారు.

రాత్రి భోజనాలయ్యాక తమ్ముడిని వెంటబెట్టుకుని కోసెడు దూరాన ఉన్న కుదరవల్లి వెళ్ళారు.

రాత్రి రెండు దాకా మాటలూ పాటలూ చదివించి వాటికి అభినయం నేర్పారు మాస్టరుగారు. అదేమీ డబ్బిచ్చే సమాజం కాదు. అంతా సరదాగా చేరి నాటకాలాడడమే. అందు క్కావలసిన కర్చులు తలకాస్త చందావేసి పంచుకోవడమే. రిహార్సలుకు పెట్రోమాక్సు లైటు, దానికి కిర్సనాయిలు–దానికి నెలకి రెండు మూడు రూపాయలు కావాలి. నాటకాలంటే సరదాపడే రామబ్రహ్మంగారు వెనుకాడలేదు. నాగేశ్వరరావు వంతు చందా నెలకి పావలా ఇవ్వడానికి అంగీకరించారు.

నాగేశ్వరరావు అక్షరాలా బిజీ ఆర్టిస్టు అయ్యాడు. తెల్లవారుఝామున నాలుగింటికి లేచి పాలు తియ్యడంతో ఆరంభమయే దైనందినీయంలో కస్త వూడ్చడం, వంటా–వార్పూ, పెదవిరివాడ చదువు, తాలింఖానా సాము, హిందీ పాఠం, కోలాటాలు చెక్క భజనలు, ఊళ్ళో పెద్దల కొట్లాటల్లో సెకండు ఫ్రంటు లీడరుషిప్పు, రాత్రివంట, అమ్మకి సేవ ఇవన్నీ ఉండేవి. ఇవన్నీ అయ్యాక అన్నగారితో కలిసి రెండు మైళ్ళు నడిచి కుదరవల్లిలో రిహార్సలు. రాత్రి ఒంటి గంట రెండింటికి రావడం. మళ్ళీ తెల్లవారు గట్ల లేవడం...అన్నీ వేళ తప్పక చేసేవాడు. హుషారుగా శ్రద్ధగా చేసేవాడు.

'కనకతార' నాటకం ఒక పండగనాడు ఆడారు. చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళంతా కూడా వచ్చారు. తార వేసిన పిల్ల చాలా బాగున్నాడని మెచ్చుకున్నారు. బుగ్గలు పుణికారు. నాగేశ్వరరావు సిగ్గు పడ్డాడు.

"ఓర్నీ...ఇక్కడ కూడా ఆడపిల్లల్లే సిగ్గుపడతావే" అన్నారు.

పున్నమ్మగారి ఆనందానికి అవధులు లేవు. ఆమె పొంగిపోయింది.

మర్నాడు ఉదయం పెద్ద కొడుకుకు కబురంపింది.

తమ్ముడి వేషం గురించి తాను విన్న మెప్పులన్నీ వల్లించాడు రామబ్రహ్మం గారు.

"చదువుకన్న ఇందులో పెడితేనే మెరుగేమో" అన్నారు.

"అదేరా నాయనా నేనూ అనొచ్చింది. పెద్ద చదువులంటే డబ్బుతో పని. ఉన్నదా, ఐదెకరా. ఇది కాస్తా తెగనమ్మి బడి చెప్పించినా, బతుకుదెరువు బాగుంటదని నమ్మక వేంవిటి గనక. పనుల్దొరకడవంంటే ఎంత కష్టం! ఏదో శాస్త్రరం చెప్పినట్టయితే–ఇంతకీ ఇందులో ఆడికి శర్దుంది. నలుగురూ బాగున్నదంటున్నారు. ఇందులో పైకి రాకపోతాడా" అంది పున్నమ్మగారు.

"అదేనమ్మా నా మాటాను. కుర్రాడు వృద్ధికొస్తాడని అంతా అంటున్నారు" అన్నారు రామబ్రహ్మంగారు ఉత్సాహంగా.

ఆ క్షణంలో అక్కినేని నాగేశ్వరరావు నటుడయ్యాడు. అతడు పుట్టిన రోజు అదే. దైవసమానురాలైన తల్లి, తండ్రి తరవాత తండ్రి అంతవాడైన అన్నగారు దీవించిన ముహూర్తం అదే...



పన్నెండవఏట హిందీ మధ్యమ పరీక్షలో
ఉత్తీర్ణుడైన నాగేశ్వరరావు, సహపాఠులూ.

# పిట్టకొంచెం...



రంగస్థల నటనలో పైకి రావాలన్న ఉద్దేశ్యంతో ఆశతో పెద్దలు పంపినందువల్ల వెళ్ళాడే తప్ప నాటికి నాగేశ్వరరావుకు ఆ ఉద్దేశమూ లేదు, ఆ ఆశా లేదు. పైగా చదువు మానిపించేస్తున్నారని నొచ్చుకున్నాడు. ఎన్ని ఆటలాడినా, ఏంచేసినా అతనికి చదువుమీద ఎంతో శ్రద్ధాసక్తులు వుండేవి. డబ్బు లేనందువల్ల చదువు ఆగిపోతుందన్న బాధ గాఢంగా గుచ్చుకుంది.

అయినా పెద్దన్నయ్య చెప్పింది అతనికి శిలాశాసనంలాంటిది. తలదాల్చాడు. ఆజ్ఞ వేసి తన పని తను చూసుకునేవాడు కాడు పెద్దన్న. నాగేశ్వరరావు తమ కుటుంబానికి దీపంవంటివాడని ఆయన నమ్మకం. అతని భవిష్యత్తు దివ్యంగా వెలగాలని ఆయన ఆశ. అది జరిగేటట్టు చూడడం ఆయన ఏకైక లక్ష్యం.

ఒక విధంగా ఆయన తాదాత్మ్యం పరాకాష్ఠను అందుకుంది. విజయం సాధించవలసింది నాగేశ్వరరావు కాదు, తమ్ముడు వృద్ధికి రావాలన్న తన సంకల్పం,

కోరిక. ఆ కోరికకే పరీక్షలు, సవాళ్ళు. ఆ కోరికే నాగేశ్వరరావు రూపంలో వెళ్ళి వేషం కట్టి నటిస్తోంది. ఆడుతోంది. పాడుతోంది. అన్నయ్యకంటూంది...

కుదరవల్లిలో నాటకాలు అడపాతడపా ఆడుతూ ఇంటి దగ్గర ఉండి (అప్పటికే స్కూలు మానేశాడు; హిందీ మాధ్యమిక పరీక్ష ప్యాసయ్యాడు) వ్యవసాయం చేస్తున్న నాగేశ్వరరావు వృద్ధికి రావాలంటే ముందర ఇల్లు, పొలం వదలాలని ఆయన నిశ్చయించారు. పెద్ద నాటకసంఘాలలో చేరి పెద్దనటుల మధ్య తిరిగితే ఓ కొత్త విద్య అంటుతుంది. నలుగురికి అతని గురించి తెలుస్తుంది.

రామబ్రహ్మంగారు తమ్ముడిని స్థానం, మాధవపెద్ది, సూరిబాబు వంటి ప్రముఖ నటుల దగ్గరకు తీసుకువెళ్ళి ఒప్పగించారు. వారందరి మధ్య తిరుగుతూ నాగేశ్వరరావు చిన్న చిన్న వేషాలు వేస్తూ వచ్చాడు. చురుకైనవాడని, పైకి రాగలడని స్థానం ప్రభృతులు అన్నారు. ఎంతో ఆదరంగా చూసి నటనలో అతనిని దిద్దుతూ వచ్చారు.

రామబ్రహ్మంగారు మరోవంక ఇంకో బ్రహ్మాండమైన ఉద్యమం సంకల్పించారు. సినిమారంగంలో అవకాశం కోసం ప్రయత్నించి సాధించాలని.

కాజ వెంకటరామయ్యగారు తమ కుటుంబమిత్రులు, శ్రేయోభిలాషులు. ఆయనకు సినిమా పరిశ్రమలో చాలామంది తెలుసు. ఆయనద్వారా సి. పుల్లయ్య గారికి సిఫారసు చేయించారు. పుల్లయ్యగారు అప్పుడు కొల్హాపూర్‌లో "ధర్మపత్ని" చిత్రం తీస్తున్నారు. చక్రపాణి గారు దానికి రచయిత. పుల్లయ్యగారు నాగేశ్వరరావును కొల్హాపూర్ తీసుకువెళ్ళారు. ఆ చిత్రంలో మరి నలుగురైదుగురు కుర్రాళ్ళతో కలిసి ఆడుకోవడమే నాగేశ్వరరావు చేసిన పని. విశేషం ఏమిటంటే, చూడముచ్చటైన ముఖంగదా అని అతనికి ఒకటో రెండో క్లోజప్‌లు తీయించారు. హీరో హీరోయిన్‌లకు, పేరున్న వాళ్ళకు తప్ప క్లోజప్ లభించడం అనేది ఆ కాలంలో బ్రహ్మప్రళయం.

పని అయిపోయిన తరువాత రెండు నెలల వరకూ కూడా పుల్లయ్యగారు నాగేశ్వరరావును ఇంటికి పంపలేదు. బహుశా ఆయన కీధ్యాసే ఉండి వుండదు. నాగేశ్వరరావు పని అల్లా స్టుడియోమెస్‌లో కందాకొట్టేసి బలాదూర్ తిరగడం, కుర్రాళ్ళతో ఆడుకోవడం!

"పనేం లేకుండా నిన్నుంచా రెందుకో!" అన్నా రెవరో ఒకనాడు.

నాగేశ్వరరావు ఒక నిమిషం ఆలోచించాడు.

"ఆ, యేం లేదు. నన్ను పంపించాలంటే, పని చేసినందుకు నాకు ఏదో కొంత డబ్బివ్వాలి గదా. అది ఉండి వుండదు. అందుకనే ఆపి వుంటారు." అన్నాడు గంభీరంగా...

మర్నాడు ఈమాట పెద్దలదాకా వెళ్ళింది. అంతా పకాలున నవ్వారు.

"పిట్ట కొంచెం, కూత ఘనం" అన్నారు చక్రపాణిగారు నవ్వి. నాగేశ్వరరావుకీ నానుడి కొత్త కాదు.

ఇంతకీ ఆ ఫిలిం కంపెనీ నాగేశ్వరరావుకు ఇస్తానని ఇవ్వలేకపోయిన మొత్తం పాతిక రూపాయలు. అది ఇచ్చాక అందులో కానీ కర్చు కాలేదు. ఆ మొత్తం అలాగే తెచ్చి అన్నగారి చేతిలో పెట్టాడు తమ్ముడు.

'ఘనత' గడించుకొని కొల్హాపూర్ నుంచి కుదరవల్లి చేరుకున్న నాగేశ్వరరావు తిరిగి 'కనకతార' నాటకం ఆడుతూ, పొలం పనులు చూస్తూ కొన్నాళ్ళు కాలక్షేపం చేశాడు.

మేస్టరుగారు శుశ్రూష కొంచెం పెంచారు. పూర్వం కూరగాయలు తేవడం వంటి పనులుమటుకే వుండేవి. ఇప్పుడు ఆయనకి కాళ్ళు పట్టడం, తల మర్దనాచెయ్యడం కూడా శిష్యులకు విధి అయింది. హీరో పాత్రధారి కొంచెం నెమ్మదస్థుడు. వినయంగా సేవ చేసేవాడు. హీరోయిన్ మాత్రం 'ఇదేం బాగాలే'దన్నాడు. పెట్రోమాక్సులైటు కని నెలకి పావలా ఎదురిస్తూ రోజుకు రెండు కోసులు నడిచివచ్చేది విద్య నేర్చుకుందుగ్గాని కాళ్ళు పట్టడానిక్కాదని అతని వాదం. వాదించే అవకాశాల్లేవు. కాస్త చీకటిపడింది; గురువుగారు నడ్డి వాలుస్తారు అన్న వేళకు చల్లగా బయటికి జారుకునేవాడు. ఆయన నిద్రపోయాడని తెల్సుకుని ఇంట్లోకి వచ్చేవాడు.

శిష్యుడికి దండన పడేలోగానే కొత్త గురువుగా రొచ్చారు. ఆయన పేరు వై. భద్రాచార్యులుగారు. రామచంద్రపురం తాలూకా. స్వతహా మంచి నటుడు. అంతకి పూర్వం ఒకటి రెండు చిత్రాలలో కూడా పాల్గొన్నాడు.

గుడివాడలో ఆయన నాటక సమాజం నడుపుతున్నారు. పెద్ద పెద్ద నటులంతా అక్కడ పని చేసేవారు. సమాజం వారు కృష్ణా, గోదావరి జిల్లాలలో పర్యటన చేస్తూ ప్రదర్శనా లిచ్చేవారు.

భద్రాచారిగారు నాగేశ్వరరావును ఆదరంగానే చూశారు. ఐదారు నాటకాల్లో నటించి సులువు బలువులు నేర్చుకున్నాడు. ఆ ఊళ్ళోనే మోటూరు వీరరాఘవయ్య, మునిస్వామిగారల దగ్గర పాటలూ, పద్యాలూ నేర్చుకునేవాడు.

భద్రాచార్లు గారింటి దగ్గర కూడా ఇతనికి శుశ్రూష తప్పలేదు. కొన్ని చేసినా, విద్యార్థులు చేయతగనివి అని అతను అనుకున్నవి చేయ నిరాకరించాడు.

"నాటకానికి సంబంధించిన పన్లు చెప్పండి, ఏదైనా సరే చేస్తాను" అన్నాడు ఖచ్చితంగా.

చేశాడు కూడా. రాత్రి తెల్లవార్లూ కూర్చొని, ఆడబోయే నాటకానికి పోస్టర్లు రాసేవాడు. ఆ రోజుల్లో పోస్టర్ల ముద్రణ లేదు. ఊళ్ళో వంద పోస్టర్లంటించాలంటే వందకాగితాలూ తెచ్చుకొని, వందా రంగులతోనూ, రంగుసిరాతోనూ చేత్తో రాయడమే!

తరవాత రాసిన పోస్టర్లు, జిగురుబాల్చీ పట్టుకొని, నిచ్చెన బుజాన వేసుకొని రాత్రిళ్ళు ఊరు నలుమూలలకీ వెళ్ళి గోడలమీద అతికించేవాడు.

ఇంటి చాకిరీ, మనుషులకీ చాకిరీ అంటే మాత్రం ఒప్పుకునేవాడు కాడు.

"శిష్యధర్మం అది కాదని పెద్దలనవచ్చు. అవునని నాకు తోచలేదు. నేను కూటికిలేక వెళ్ళలేదు. విద్య నేర్చుకుందికి వెళ్ళాను...అందువల్లే కావచ్చు నా ఆత్మగౌరవానికి ఈ చాకిరీ భంగం అనిపించింది" అంటాడు నాగేశ్వరరావు.

భద్రాచార్లు గారి సమాజంలో నాగేశ్వరరావు రెండేళ్ళుపైగా ఉన్నాడు 'భక్త కుచేల'లో మోహినీ, 'హరిశ్చంద్ర'లో లోహితుడు, మతంగకన్య, 'తులసీ జలంధర్', 'జరాసంధ'లలో సత్యభామ వేసేవాడు. 'తులసీ జలంధర్'లో నాగేశ్వరరావు సత్యభామ పక్కన సవితి రుక్మిణిగా ఒక పిల్ల నటించేది. అతి నెమ్మదస్థురాలు. ఆమె కూడా నాగేశ్వరరావుతోపాటే భద్రాచార్లు గారింట్లో ఉండి నటన, సంగీతం నేర్చుకొనేది. ఆ పిల్ల పేరు అంజనీకుమారి. దరిమిలాను అంజలీదేవిగా మారింది.

ఈ బృందం మూడు జిల్లాలలో నాటకాలు ప్రదర్శించింది. గుడివాడ, బెజవాడ, ఏలూరు, తణుకు, పాలకొల్లు, పెనుగొండ, రాజమండ్రి, మండపేట, రామచంద్రపురం, అమలాపురం మొదలైన పట్టణాలన్నిటా ఆడి మంచి పేరు తెచ్చుకున్నారు. ఈ యాత్రలో అతనికి ఆటకి ఐదారు రూపాయల చొప్పున కిరాయి ముట్టింది.

చక్కటి కుర్రా డొకడు చక్కటి స్త్రీ పాత్రలు వేస్తున్నాడని విని, రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ అధిపతి కడారు నాగభూషణం గారు తమ కొత్త చిత్రం 'తల్లిప్రేమ'లో ఒక కుర్రాడి వేషానికి నాగేశ్వరరావు పనికొస్తాడేమో చూద్దామని వచ్చారు. ఇంటర్వ్యూ బెజవాడలో ఏర్పాటయింది.

అనుకోకుండా కలిసి వచ్చిన ఈ అవకాశానికి రామబ్రహ్మం గారు బ్రహ్మానంద భరితులై, నాగేశ్వరరావును వెంటబెట్టుకు వచ్చారు.

సినిమా నటుడి ఎన్నిక శాస్త్రోక్తంగా జరిగింది. నాగేశ్వరరావు చేత చొక్కా విప్పించారు. చిన్న లాగు తొడుక్కుని అటూ ఇటూ నడవమన్నారు. అంగసౌష్ఠవం చూశారు. పలువరుసను పరిశీలించారు.

ఒక వారం తరువాత నాగేశ్వరరావు చెన్నపట్టణం వచ్చాడు. కొల్హాపూరు కార్యక్రమమే ఇక్కడా అమలు జరిగింది. కాపోతే, అక్కడ వేషం వేశాడు; ఇక్కడ అది లేదు. అక్కడ మొత్తం పాతిక రూపాయలంటే ఇవాళ-ధరల వారీగా చూస్తే రెండొందల రూపాయలు. ఐదు నెలల తరువాత, వయసుచాలదని భావించినందువల్ల నాగేశ్వరరావు ఇంటికి మరలాడు.

"కాని ఉన్నన్నాళ్ళూ నాగభూషణం గారు నన్నెంతో ఆదరంగా చూశారు. అక్కడ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ డి.ఎల్. నారాయణ గారు నన్ను ప్రేమతో చూశారు. సొంత తమ్ముడిలా తన వెంట తిప్పుకునేవారు. నేను చురుగ్గా ఉంటానని, సరదా కబుర్లు చెబుతానని ఆయన ఎంతో ముచ్చటపడేవారు," అంటాడు నాగేశ్వరరావు. ఆ రోజుల్లో అతనికి సైకిల్ సరదా చాలా వుండేది. ప్రొడక్షనుకు కావలసిన

సరుకులేవేనా కావాలంటే డి.ఎల్. ఇతనికే పురమాయించేవారు. సైకిలెక్కి వెళ్ళి ఇట్టే తెచ్చేవాడు. ఆ నాటి పాండీబజారు, మాంబలం వీధులలో చాలా జోరుగా, ఎక్కువగా తిరిగిన సైకిళ్ళలో నాగేశ్వరరావుది ఒకటి.

డి.ఎల్. గారు నాగేశ్వరరావును తరుచు వాళ్ళింటికి భోజనానికి తీసుకెళ్ళేవారు. ఆయనకి కులమతాల పట్టింపులు లేవు. కాని, ఇంట్లో అభ్యంతరాలు లేకుండా ఉండడానికని "మనవాళ్ళ కుర్రాడే" అని చెప్పేశారు.

పచ్చగా కలకలలాడుతూ, కళ్ళలో తెలివి కొట్టొచ్చేట్టు కనబడుతూ, చురుగ్గా, చక్కగా, స్వచ్ఛంగా మాట్లాడే నాగేశ్వరరావును ఆ రోజుల్లో...తెలియని వారంతా బ్రాహ్మలబ్బాయనే అనుకునేవారు.

డి.ఎల్.గారి భార్యకూడా ఈ పిల్లాడి వినయవందనం చూసి ముచ్చట పడి అమిత వాత్సల్యంతో ఆదరించేది. నాలుగునెల లయేసరికి, వాళ్ళ బంధువు లమ్మాయిని పెళ్ళి చేస్తే బాగుంటుందనే వరకూ వచ్చింది.

తన యింట్లో భోజనం వరకూ అబద్ధం చెప్పినా చెల్లింది కాని ఇది చాలామంది పెద్దలతో సంబంధించిన పెద్ద విషయం.

"అబ్బే! చిన్న కుర్రాడు. ఇంకా కష్టపడి వృద్ధికి రావలసినవాడు. ఇప్పుడప్పుడే పెళ్ళేమిటి..." అని నవ్వేశారు ఆయన.

నాగేశ్వరరావు కూడా ఆమెను నొప్పించకుండా, నేర్పుగా తప్పించుకున్నాడు. అంతలో నాగభూషణం గారు 'వేషం లే'దని చెప్పడంతో ఇంటికి బయల్దేరాడు.

ఛాన్సు రానందుకూ, ఇంటికెళ్ళి పోతున్నందుకూ నాగేశ్వరరావు విచారించలేదు. ఘంటసాలని కేకేసి నేపథ్యప్పాటలు పాడమన లేదు. అతనికి వచ్చేటప్పుడు ఆశ లేదు; అందువల్ల వెళ్ళేటప్పుడు నిరాశ లేదు. పెద్దవాళ్ళు వెళ్ళమన్నారు, వచ్చాడు. వీటి బదులు బడికెళ్ళి చదువుకోమంటే ఎంత బాగుండును! మెడ్రాసులో అందరూ చకచకా దొరల్లా ఇంగ్లీషు మాట్లాడేస్తారు. పేపరు చదివేస్తారు. మంచి నావల్సు చదివి ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకుంటారు. ఇంగ్లీషు సినిమాలు చూసి పకపక నవ్వేస్తారు...

తనూ అలామంచి పుస్తకాలు చదవాలి. గొప్ప విషయాలు తెలుసుకోవాలి. ఆలోచించడం నేర్చుకోవాలి. దొరలా ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడాలి.

తనని 'దొర బిడ్డలా ఉన్నావురా' అన్నాడు అన్నయ్య. 'ఫారిన్ రిటర్న్‌డ్' అన్నాడు చిన్నన్న. ఆ రోజు తనకి బాగా గుర్తు.

నాటకా లాటే లేక పనిలేక కాళీగా ఉన్న రోజుల్లో ఒకనాడు పెద్దన్న గారు ఒక పని ఒప్పగించారు. కాంగ్రెసులో పావలా సభ్యులను చేర్పించే ఉద్యమం ధాటీగా సాగుతోంది. ఆ సభ్యుల పేర్లు, చిరునామాలు ఒక పుస్తకంలోకి ఎక్కించాలి. వెయ్యి పేర్లు రాస్తే రూపాయి యిస్తారు.

నాగేశ్వరరావు రాత్రింబవళ్ళూ పనిచేసి 5 వేల పేర్లు రాసి 5 రూపాయలు సంపాదించాడు. సరాసరి గుడివాడ బజారు కెళ్ళిపోయాడు. ఒక సిల్కుచొక్కా

సిల్కులాగు, దొరటోపీ, బూట్లు, పావలా అర్ధణా పెట్టి స్వెటర్, మూణ్ణాలనర పెట్టి మఫ్లరు కొన్నాడు. ఇంకో పావలా అర్ధణ పెట్టి ఫస్టుక్లాసు నల్లకళ్ళజోడు కొన్నాడు. అన్నీ అక్కడే తొడిగేసుకు ముస్తాబై, పాతబట్టలు చేత పట్టుకుని ఇంటికొచ్చాడు.

ఇంటిల్లిపాదీ మురిసిపోయారు-గడించిన డబ్బును ఇంత చక్కగా వాడుకున్నందుకు.

'దొరబిడ్డలా ఉన్నా'డన్నారు వాళ్ళ పెద్దన్నగారు.

'ఫారిన్ రిటర్న్‌డ్' అన్నారు చిన్నన్నగారు.

"చదువులేదుగా!" అనుకున్నాడు నాగేశ్వరరావు...

❀ ❀ ❀ ❀

'తల్లిప్రేమ'లో అతను ఛాన్సు పోగొట్టుకుని ఇంటికి వచ్చినందుకు బాధపడ్డది రామబ్రహ్మంగారే. ఒక్కసారిగా నిరుత్సాహం ఆవరించిం దాయనను.

దరిమిలాను, రామబ్రహ్మంగారి 'రైతుబిడ్డ'లో అవకాశం ఇప్పించాలని కూడా ఆయన చాలా ప్రయత్నించారు. అదీ విఫలం అయింది.

ఆనాడు ఆయన ఖచ్చితంగా ఒక నిర్ణయం చేసుకున్నారు- తమ్ముడిని సినిమాలో చేర్పించి తీరాలి, సాధించి తీరాలి అని.

❀ ❀ ❀ ❀

నాగేశ్వరరావు పూర్తిగా వ్యవసాయ రంగంలోకి పడ్డాడు. ఒకళ్ళు 'ఇది చెయ్యి' అని చెప్పారని కాదు. ఎవరూ ఏమీ చెప్పలేదు. అతను పొలానికి వెళ్ళాడు. అక్కడంతా పొలం దున్నితే తనూ ఓ నాగలి పట్టుకునేవాడు. అంతా అకు పీకితే తనూ నడ్డివంచేవాడు. పందిరేస్తే తనూ పైకెక్కేవాడు. ఇలా అన్ని పనుల్లోనూ జొరబడి అన్నీ కాస్తో కూస్తో నేర్చుకునేవాడు.

ఇటు ఇంటి పనులూ చక్కబెట్టేవాడు. కావిడిబద్ద బుజానేసుకుని నాగేశ్వరరావు చెరువుకెళ్ళి నీళ్ళు తెస్తూ వుంటే వూళ్ళో కుర్రకారు వెంటబడేవారు. ఒకప్పుడు పెద్దకారూ నిలేసేవారు-అతని నోట పాటలూ పద్యాలూ వినడానికి, మద్రాసులో సినిమాకబుర్లు వినడానికి.

అంగలూరులో స్థానం నరసింహారావుగారు 'సారంగధర' ఆడుతున్నారని తెలిసింది. వెళ్ళి చూడాలనుకున్న నాగేశ్వరరావుకు కబురే వచ్చింది-చిత్రాంగి చెలికత్తె వేషానికి కావాలని.

రామబ్రహ్మంగారే ముందరగా ఎక్కువగా ఉత్సాహపడ్డారు. తన కోరిక పొలం దున్నడం, కావడెయ్యడం ఆయనకు సుతరామూ నచ్చలేదు.

నాటకం రోజున గ్రీన్ రూమ్‌లో అంతా వేషాలు వేసుకుంటున్నారు. నాగేశ్వరరావు కూడా వెళ్ళి నిలబడ్డాడు.

"రంగు పూసుకొని నించుంటావేం" అన్నాడు మేకప్‌మన్.

"రంగు నేను పూసుకుంటే మీరెందుకొచ్చినట్టు? అన్నాడు నాగేశ్వరరావు తడుముకోకుండా.

నిర్లక్ష్యంగా ఎటో తిరిగి ఏదో పనిచేస్తూ పైమాట అన్న మేకప్‌మన్ ఉలిక్కిపడి ఈ కుర్రాడి కేసి చూశాడు.

"పిట్ట కొంచెం, కూత ఘనం" అన్నమాట గుర్తుకొచ్చింది నాగేశ్వరరావుకు. మాట తూలానేమో అనుకున్నాడు.

అంతలోనే, మేకప్‌మన్ చిరునవ్వు నవ్వాడు. నాగేశ్వరరావుకు అందులో కోపం కనబడలేదు. హేళన కనబడలేదు.

ఆయన భుజం తట్టి ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని రంగు వెయ్యడం మొదలు పెట్టాడు.

ఆయన పేరు మంగయ్య. అప్పటికే నాటకరంగంమీదా, సినిమాల్లోనూ కూడా ఆయనకు గొప్ప మేకప్ ఆర్టిస్టుగా పేరుంది.

కుర్రాడు నిర్భయంగా, చురుగ్గా మనసుకు తోచిన మాట అన్నందుకు ఆయన నిజంగా సంతోషించాడు. ఇతనిలో ఏదో శక్తి ఉంది, పైకొస్తాడు అని పించిందాయనకు. ఆ మాటే అన్నాడు.

"ఈయన చాలా మంచివారు" అనుకున్నాడు నాగేశ్వరరావు.

తను అంతమాట అన్నందుకు కోపగించక, పైపెచ్చు ఆదరించి మెచ్చుకోవడమే అందుక్కారణం.

తరువాతి కాలంలో మంగయ్యగారు నాగేశ్వరరావు శ్రేయోభిలాషులలో ముఖ్యులయ్యారు. రెండు మూడు విషమఘట్టాలలో ఆయనే అతనికి కర్తవ్యం ఉపదేశించారు.

చిత్రాంగి చెలికత్తెగా, స్థానం వారి పక్కన నాగేశ్వరరావు చాలా మెలకువతో నటించి అందరిచేతా బాగుందనిపించుకున్నాడు. అంతకన్న ముఖ్యం–స్థానం వారే బాగుందన్నారు. అని వూరుకోలేదు. వారం పదిరోజుల తరువాత నాగేశ్వరరావుకు కబురు చేశారు.

"తనకు వయసు అయిపోతూంది. తన తరవాత మళ్ళీ ఈ పాత్రలను నిర్వహించేందుకు ఎవరినైనా తయారు చెయ్యాలని వుంది...నాగేశ్వరరావులో అందుకు తగ్గ సామర్థ్యం కనిపిస్తోంది. తన బృందంలో చేరి శిక్షణ పొందుతాడా?..."

ఇంకెవరైనా అయితే, ఓపిక ఉన్నా మానినా ఎగిరి గంతు వేసేవారు. నాగేశ్వరరావు కూడా ఆ పనే చేసేవాడు. కాని అతనికి గురువు అంటే ఎందుకో బెదురు పట్టుకుంది. ఇద్దరు ముగ్గురు గురువుల దగ్గిర తను విద్యపేరిట చేసిన చాకిరీ, చెయ్యనన్న చాకిరీ, దానివల్ల తనకు 'బిరుసుఘటం' 'పొగరుమోతు'అని నలుగురూ ఇచ్చిన బిరుదులూ గుర్తుకొచ్చాయి. నిజం చెప్పి నిష్ఠురాలుపడే పద్ధతి మీద తనకీ నాటకాలూ వద్దు, కీర్తీ వద్దు...

"వద్దు" అన్నాడు నాగేశ్వరరావు.

   

స్థానం వారి సమాజంలో హార్మోనిస్టుగా ఉంటూ వచ్చిన బుద్ధిరాజు శ్రీరామమూర్తిగారు కారణాంతరాలవల్ల విరమించుకున్నారు. ఆయన గుడివాడలో ఉంటూ ఒక నాటకం తయారుచేయ నిశ్చయించారు. నాగేశ్వరరావును బుజ్జగించి, నచ్చజెప్పి భయం పోగొట్టి తీసుకువెళ్ళారాయన. 'విప్రనారాయణ' నాటకంలో దేవదేవి పాత్రను అతని కిచ్చారు.

మూడు మాసాలపాటు సాగింది సాధన. శ్రీరామమూర్తి గారు ఎంతో ఆపేక్షతో, ఓపికగా అతనికి అన్నీ బోధించి సాధన చేయించేవారు. ఎంత శ్రమపడ్డా అంతా నాటకానికి సంబంధించినదే అయినందువల్ల నాగేశ్వరరావూ శ్రద్ధగా కృషి చేశాడు. ఆ బృందంలో అతను తప్ప మిగతా వారంతా బడిపిల్లలే. అతనూ పిల్లాడేకాని బడిపిల్లాడు కాదు...

నాటకం ప్రజల మెప్పు పొందింది. చాలా ప్రదర్శనా లిచ్చారు. దేవదేవి పాత్రధారిని విశేషించి మెచ్చుకున్నారు జనం.

ఒకనాటి ప్రదర్శనంలో నాగేశ్వరరావుకు ఒక రజతపాత్ర బహుమతీ వచ్చింది. ఇచ్చిన వారి పేరు దుక్కిపాటి మధుసూదనరావు. ముదినేపల్లిలోని ఎక్సెలిసయర్ డ్రామటిక్ అసోసియేషన్ కార్యదర్శి.

ఆయనా, ఆ సంఘం అధ్యక్షుడు కోడూరి అచ్చయ్యగారూ, సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు గారూ ఆనాడు నాటకం చూడడానికి వచ్చారు. వాళ్ళు ఆదదలచిన సాంఘిక నాటకంలో ఆడపిల్ల వేషానికి చక్కని కుర్రాడి కోసం వెతుకుతున్నారు వాళ్ళు. ఫలానా కుర్రాదు చాలా గట్టివాడు; స్థానం పక్కన నటించాడు; ఒడుపులు, మెలుకువలు బాగా తెలుసు అని పెండ్యాల చెప్పి, వారిని ఆ ప్రదర్శనానికి తీసుకువచ్చారు. (పెండ్యాల 'తల్లిప్రేమ' చిత్రానికి అసిస్టెంట్ మ్యూజిక్ డైరెక్టరుగా పనిచేసిన రోజుల్లో నాగేశ్వరరావును చూశారు.)

అప్పటికప్పుడే వాళ్ళు అతన్ని తమ సంఘంలో చేర్చుకోవాలని నిశ్చయించుకున్నారు.

"నీ ఖర్చులన్నీ పోను నాటకానికీ ఎనిమిది రూపాయ లిస్తాం." అన్నారు. నాగేశ్వరరావూ, అన్నగారూ కూడా ఒప్పుకున్నారు.

ఎనిమిది రూపాయలిస్తారని కాదు. పిలిచిన వారిద్దరూ బాధ్యతగల పెద్దలు. ఒకరు సినిమా నటులు కోడూరి అచ్చయ్యగారు. మరొకరు బి.య్యే చదువుకున్న వారు.

"ఆయన ఇంగ్లీషులో యూనివర్శిటీకి ఫస్టున వచ్చి బంగారు పతకం అందుకున్నారుట" అని ఎవరో చెప్పారు.

నాగేశ్వరరావు గౌరవంతో, భక్తిప్రపత్తులతో ఆయన వంక చూశాడు. ఈ సమాజంలో చేరితే ఈయన దగ్గర ఇంగ్లీషు, జాగర్ఫీ అన్నీ నేర్చుకోవచ్చునేమో.....

❀ ❀ ❀

# యూనివర్సిటీ విద్య



ముదినేపల్లి ఎక్సెల్సియర్ డ్రామటిక్ క్లబ్ ఆరంభంలో ఉత్తక్లబ్బు. అనేక తెలుగు, సాంస్కృతిక సంస్థలలోలాగే అక్కడా చీట్లాట ఎక్కువగా ఉండడంతో ఊళ్ళో పెద్దలు కుర్రవాళ్ళ మేలుకోరి నాటకాల వంటి కార్యక్రమాలు ఆరంభిస్తే మంచిదని నిశ్చయించారు. అప్పట్లో "జయంతి జయపాల" అనే నాటకం ఒకటి ఆడారు. కొద్దిరోజుల తరువాత ఎక్సెల్సియర్ క్లబ్‌కు కోడూరి అచ్చయ్యగారూ, దుక్కిపాటి మధుసూధనరావుగారూ అధ్యక్ష, కార్యదర్శులై సాంఘిక నాటకాలు ప్రదర్శించ సంకల్పించారు. 'తెలుగుతల్లి' అనే నాటకం వేశారు. తరవాత 'ఆశాజ్యోతి' అనే అభ్యుదయ నాటకం తీసుకున్నారు. అందులో నాయిక పాత్రకు చక్కని కుర్రాడు కావలసివచ్చాడు. 'విప్రనారాయణ'లో దేవదేవిని చూశాక 'ఆమె'ను ఎన్నుకున్నారు.

బుద్ధిరాజు శ్రీరామమూర్తిగారితో మాట్లాడి నాగేశ్వరరావును తీసుకు వెళ్ళడంకోసం ఒకనాడు అధ్యక్ష కార్యదర్శులూ, సంగీత దర్శకుడు పెండ్యాలా వెళ్ళారు.

లోపల రిహార్సలు జరుగుతోంది. నాగేశ్వరరావు అప్పుడే ఏదో డైలాగులు చెప్పి కూర్చోబోతున్నాడు.

అతన్ని చూడగానే మధుసూధనరావుగారికి ఆశ్చర్యం వేసింది. నవ్వువచ్చింది. అతను సిలుకు చొక్కాతోపాటు లాగుకూడా అదే సిల్కుతో కుట్టించేసుకున్నాడు. 'సిల్కు పిచ్చి' అనుకున్నా రాయన.

నాగేశ్వరరావు కూర్చోబోతున్నాడు. గురువుగారు కంగారుగా, గరంగా 'ఉండు నాయనా' అంటూ తువ్వాలు నేలమీద పరిచారు. శిష్యుడు దర్జాగా అందుమీద కూర్చున్నాడు.

'వన్స్‌మోర్' అనుకుని, వచ్చిన పెద్దలు ఆశ్చర్యపోయారు.

ఎక్సెల్సియర్ క్లబ్‌కు తీసుకు వెళ్ళాక మధుసూదనరావుగారూ, అచ్చయ్య గారూ కూడా ఈ కొత్త హీరోయిన్‌ని ఎంత మర్యాదగానో చూశారు. ఎంతగానో ముద్దు చేశారు. అతని సరదాలన్నీ తీర్చారు. ముద్దు ముచ్చట లెంత చక్కగా, గొప్పగా ఉండేవో శిక్షణ అంత కఠినంగా ఉండేది.

అప్పుడు 'ఆశాజ్యోతి' అనే సాంఘిక నాటకం తీసుకున్నారు. సాధన రోజుకు 18 గంటలు సాగేది.

రాత్రి పన్నెండు గంటలదాకా డైలాగులు కంఠస్థం చేసి, నటన రిహార్స్‌చేసి అలిసి పడుకున్న హీరోయిన్ నాగేశ్వరరావును తెల్లవారుగట్ల నాలుగు గంటలకల్లా లేపేవాడు హీరో ప్రభాకరరావు. కొంతసేపు డైలాగులూ, తరవాత పాటలూ సాధన చేసేవారు.

'ఇదెందుకొచ్చిన యాతన భగవంతుడా!' అని విసుక్కుని, 'పారిపోదాం' అని నిశ్చయించుకునేంతగా సాధన చేయించారు. నటన విషయంలో అచ్చయ్యగారు సారథ్యం వహించేవారు. ఆయన నటించి - చూపేవారు. మధుసూదనరావుగారు సమగ్రంగా విమర్శన చేసి సరియైన మార్గం బోధించేవారు. డైలాగుల విషయంలో అడపాతడపా దైతా గోపాలంగారు వచ్చి సలహాలు చెప్పేవారు.

ఆరు మాసాల సాధనతో నటబృందం అంతా ఆరితేరారు. ప్రాంప్టింగ్ (తెర వెనుక నుంచి అందివ్వడం) అనవసరమయిపోయింది. ప్రతి నటుడికి నాటకం అంతా కంఠతా వచ్చు. స్టేజీమీద ఎవరైనా ఒకవేళ డైలాగు మరిచిపోయినా పక్క నటుడు అందించగలిగే స్థితిలో ఉండేవాడు. ఆ నాటికా బృందంలో నాటకం అతి క్షుణ్ణంగా వచ్చింది నాగేశ్వరరావుకి.

సాధన ఫలితంగా తొలి ప్రదర్శనం అత్యంత ప్రశంసనీయంగా జరిగింది. నాటకం హిట్ అయింది. చుట్టుపక్కల ఊళ్ళలో ప్రదర్శనాలు ఇవ్వసాగారు. సమాజం

ఆఫీసును ముదినేపల్లి నుంచి గుడివాడకు తరలించారు. నాగేశ్వరరావు తల్లిగారిని గుడివాడకు తీసుకొచ్చాడు. "నే జెప్పలే! మనవాడు పైకి వస్తాడని." అన్నారు రామబ్రహ్మంగారు సగర్వంగా.

నాగేశ్వరరావుకు మంచి పేరు వచ్చింది. అతని వల్ల ఎక్సెల్సియర్ క్లబ్బుకు పేరు వచ్చింది. తరవాత మరి రెండు నాటకాలు–'సత్యాన్వేషణం' 'తెలుగుతల్లి' కూడా ప్రదర్శనాలు ఇచ్చారు. వ్యాపారరీత్యా లభిస్తున్న విజయాన్ని పురస్కరించుకొని ముదినేపల్లి క్లబ్బు ఈ విధంగా గుడివాడ వచ్చి తాలూకా తిరిగి, పొలిమేర దాటి జిల్లా అంతా తిరిగింది. కంట్రాక్టు నాటకాలు గంద్రగోళం అవుతూ వున్న రోజుల్లో ఇంత క్రమశిక్షణతో, ఇంత కట్టుదిట్టంగా వీరు ప్రదర్శనాలు ఇస్తున్నందువల్ల ఇతర జిల్లాల నుండి కూడ విరివిగా ఆహ్వానాలు వచ్చాయి. దాదాపు మూడు సంవత్సరాలపాటు ఉభయగోదావరీ, కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఈ బృందం పర్యటనలు చేసింది.

అన్నిటా నాగేశ్వరరావుకు 'ఏ' క్లాసు హీరోయిన్ అన్న పేరు వచ్చింది. సాంఘిక నాటకాలలో స్త్రీ పాత్రలను ఇంత అద్భుతంగా, మొగాడి గుండె ఝల్లుమనేలా నటించడం అతనికే చెల్లిందని అంతా ప్రశంసించారు.

తణుకులో ఒకసారి 'ఆశాజ్యోతి' ప్రదర్శనం కాగానే ఇద్దరు పెద్ద మనుషులు గ్రీన్ రూమ్ దగ్గరకు వచ్చారు.

"హీరోయిన్ ఎక్కడండీ?" అన్నారు ఆత్రుతగా.

"డ్రెస్ ఛేంజి చేసుకుంటోంది. ఏం?" అన్నారు మధుసూదనరావుగారు.

"ఏవఁన్నారు... కుంటోందా?... అంటే, ఆవిడ ఆడదేనా?" అన్నాడొకాయన కంగారుగా.

"ఆవిడ ఆడది కాపోతే 'ఆయన' అవుతాడా?" అన్నారు చమత్కారి మధుసూదనరావుగారు నవ్వి.

"అయ్యా, సరిగ్గా చెప్పండి. నాటకంలో హీరోయిన్ వేసినమ్మాయి–అదే...హీరోయిన్ వేసిన మనిషి మొగాడని నేనూ, కాదని నా మిత్రుడూ వాదించుకుని వందరూపాయలు పందెం కట్టాం. దయచేసి చెప్పండి..."

"మొగాడని మీ రెందుకనుకున్నారు?"

"అదా...అంత చక్కని ఆడపిల్ల నిజంగా అమ్మాయే అయితే, నాటకాలకి రాదుగదా అని..."

"ఏవండీ! బసకి వెళ్దామా..." అంటూ ఇవతలికి వచ్చాడు నాగేశ్వరరావు.

పందెం వేసుకున్న వారిలో ఒకాయన నాగేశ్వరరావును పరీక్షగా చూసి షేక్ హాండ్ ఇచ్చి, రెండో చేత్తో జేబులోంచి వందరూపాయల కాగితం తీసి తన మిత్రుడికి ఇచ్చుకున్నాడు.

దాదాపు మూడేళ్ళు హాయిగా, అద్భుతంగా, ఆనందమయంగా సాగిపోయాయి. 'పల్లెటూరి బైతు'కి పట్నవాసపు నాజూకుతనం అబ్బింది.

చదువు, సంస్కారం చాలక-కేవలం ప్రతిభతో, కష్టపడే ఇచ్ఛతో మాత్రం-బొగ్గులో వజ్రంలా, నివురుకింద నిప్పులా, మచ్చచాటు చంద్రుడిలా ఉన్న పల్లెటూరి ముతక ఖద్దరు కుర్రాణ్ణి చలవచేసి సాపు దీర్చిన చలవ ఎక్సెల్సియర్ సమాజానిది. అందులో ముఖ్యంగా మధుసూదనరావు గారిది.

"ఆయన నాకు మా అన్నయ్య తరవాత అన్నగారంతటి వారయ్యారు. ఆ సంస్థే నాకు మిడిల్ స్కూలు, హైస్కూలు, కాలేజి. నాకే కాదు, ఆనాటి మా బృందం అందరికీ అది విశ్వవిద్యాలయం అయింది." అంటాడు నాగేశ్వరరావు కృతజ్ఞతా పూర్వకంగా.

అక్కడే నాగేశ్వరరావు డైలాగులు చక్కగా చెప్పడం నేర్చుకున్నాడు. అక్కడే మితి తప్పని నటన నేర్చుకున్నాడు. అక్కడే విమర్శని, ఖండనని స్వీకరించి తప్పులు దిద్దుకోవడం అలవరచుకున్నాడు. తరువాతి కాలంలో అతని జీవితం అంతటినీ ప్రభావితం చేసిన క్రమశిక్షణ, ప్రపంచజ్ఞానం గడించాడు. సంస్కారం సంపాదించుకున్నాడు. ఉత్తముడు, ప్రతిభాశాలి, సుసంస్కృతుడు అయిన మిత్రుడిని, మరొక అన్నను, గురువును సంపాదించుకున్నాడు.

మధుసూదనరావుగారు అతన్ని తల్లిలా పెంచారు. అత్తగారిలా సాధించారు. తండ్రిలా దండించారు. యజమానిలా బెదరించారు. శత్రువులా హింసించారు. అతని ప్రతిభకు సేవకుడై మన్నన చేశారు. నాగేశ్వరరావు కూడా ఆయన మాటను శిరసావహించేవాడు. ఆయన మాటను ఎదిరించి వాదించడం కూడా ఆయన దగ్గరే నేర్చుకున్నాడు.

"నాగేశ్వర్రావూ! నూనె మంచిది కాదు. తిరగమోత పెట్టినవి ఎక్కువ తినకు...చూడు, సోడా వద్దు. కంఠం పాడవుతుంది...కిళ్ళీ కుర్రాళ్ళకు తగదు. నాలిక బండబారుతుంది...ఇడ్లీలోకి కొబ్బరిపచ్చడి వద్దోయ్. కంఠం పాడవుతుంది...హార్లిక్సు తాగు. సత్తువ."

నాగేశ్వరరావు నియమాలన్నీ పాటించాడు. ఇడ్లీలో చక్కెర వేసుకుని తినేవాడు.

ఎప్పుడైనా ఏ బజారులోనో, ఏ సినిమాహాలు దగ్గరో చక్కనిపిల్ల కనిపించి నాగేశ్వరరావు ఆమె వంక చూస్తున్నట్టు కనిపిస్తే, క్షణంలో అతనికి టెంకిజెల్ల తగిలేది!

"నాటకాల వాళ్ళకి నీతినియమాల్లేవనీ, వ్యసనపరులనీ పేరుంది. నీకూ అలాంటి చెడ్డ పేరు కావాలా?" అని గద్దించేది మధుసూదనరావుగారి కంఠం.

అంతటి క్రమశిక్షణ ఆయనది. బృందంలోని మిగతా నటుల విషయంలో కూడా ఇంత ఖచ్చితంగానూ ఉండేవా రాయన.

నాలుగు రోజులలో నాటకప్రదర్శనం ఉందీ అంటే, వివాహితులైన నటులందరినీ రాత్రిళ్ళు సంఘభవనంలోనే వచ్చిపడుకోమనేవా రాయన. నాటకంలో ముఖాలు చైతన్యవంతంగా, ఉత్సాహభరితంగా కనబడాలంటే, కంఠం నీరసించి

పోకుండా, అపశ్రుతులు రాకుండా పాట రావాలంటే సెక్సు జీవితంలో కొన్ని నియమాలు ఉండాలని ఆయన వాదం. బృందసభ్యులు ఆ వాక్యాల విలువ గుర్తెరిగి వాటిని గౌరవించేవారు.

"ఆ రోజులలో ఇటువంటి సూత్రాలూ చర్చలూ ఎన్నో విని ఆకళించుకున్నాను. వాటిని సినిమా జీవితంలో ఈనాటికీ అమలు జరుపుతున్నాను." అన్నాడు నాగేశ్వరరావు.

నేటికి పది సంవత్సరాలుగా అతను 140 పౌనుల బరువు-హెచ్చు తగ్గులు లేకుండా-నిలుపుకొస్తున్నాడు. దేహం అంతా అతని అజ్మాయిషీలో ఉంటుంది. ఎప్పుడైనా జ్వరం వచ్చి లంకణం చేసినప్పుడు ఒక పౌను తగ్గడం, చేతిలో పౌను రాయి పట్టుకు బరువు తూచుకున్నప్పుడు ఒక పౌను పెరగడం తప్పించి ఇన్నేళ్ళుగా అతను అదే బరువు తూగుతున్నాడు. అతని కీర్తి బాధ్యత బరువు పెరిగింది. పన్నుల బరువు పెరిగింది. అతన్ని సహేతుకంగా-నిర్హేతుకంగా, అక్రమంగా-సక్రమంగా, క్రూరంగా విమర్శించిన పత్రికల పుటల బరువు పెరిగింది. ప్రేమతో, దురభిమానంతో, పక్షపాతంతో, భయంతో, ఆశతో, నిష్పక్షపాత బుద్ధితో ప్రశంసించిన పుటల బరువు పెరిగింది. బహుమతుల బరువు పెరిగింది. సన్మాన పత్రాల బరువు పెరిగింది. అతని ఆత్మవిశ్వాసం బరువు పెరిగింది. పొగరు బరువు పెరిగింది. పరువు బరువు పెరిగింది. విగ్రహం బరువు మాత్రం పెరగలేదు. కారణం? అతని క్రమశిక్షణ, నియమ నిష్ఠలు!

"నేను కడుపు నిండేలా-ఆయాసం వచ్చేలా భోజనం చేసి పదేళ్ళయింది."అంటాడు మీ రతన్ని అడిగితే.

నటుడికి ఒళ్ళు స్వాధీనంలో ఉండాలంటే ఆహారం అదుపులో వుండాలని అందరికీ తెలుసు. కాని జిహ్వాచాపల్యాన్ని నిగ్రహించే కొద్దిమందిలో ఇతను ఒకడు. మాంసాహారం పరిమితంగా తింటాడు. ఆకుకూరలు, కాయగూరలు, పప్పు ప్రధానాహారం. అవకాశాలు ఆశ పెట్టి ఎంత ఆకర్షించినా ఏ వ్యసనం కేసీ కన్నెత్తి చూడలేదు. కన్నెత్తకుండా కూడా చూడలేదు.

ఈ నిగ్రహం అంతా ఎక్సెల్సియర్ సమాజంలో క్రమశిక్షణలోంచి వచ్చినదే!

❀ ❀ ❀ ❀

అవే నాగేశ్వరరావు పాలిటి విద్యార్థి జీవితపు రోజులు. అల్లరి చేస్తూ, ఆడుకుంటూ, చదువుకొంటూ, నాటకాలు ఆడుతూ, వేస్తూ, ప్రదర్శనానికి ఎనిమిది రూపాయలు గడించి దాస్తూ మూడేళ్ళు వృద్ధిచెందాడు నాగేశ్వరరావు.

"నా జీవితంలో మధురాతిమధురమైన కాలం అది. అదంతా ఒక కల" అంటాడు నాగేశ్వరరావు-ఎప్పుడైనా ఆ చర్చ వస్తే.

కలలన్నీ ఎప్పుడో అపుడు మెలకువలోకి కరిగిపోవలసినవే.

నాగేశ్వరరావు అదృష్టం ఏమిటంటే, అతను ఒక కలలోంచి మరొక మధురమైన కలలోకి మేలుకొన్నాడు...

ఎక్సెల్సియర్ బృందం ఒకనాడు తెనాలిలో నాటక ప్రదర్శనం ముగించుకొని గుడివాడకు వెళ్తున్నారు. బెజవాడ స్టేషనులో రైలుకోసం ఆగారు.

కుర్రాళ్ళంతా హుషారుగా కబుర్లు చెబుతూ పాటలు పాడుతూ కూర్చున్నారు. ప్లాటు ఫారంమీద తిరుగుతున్నారు.

తళతళలాడే గుండు గల ఒక పెద్ద మనిషీ, ఇంకో దళసరి కళ్ళద్దాలాయనా కూడా ఆ ప్లాట్ ఫారంమీదనే తిరుగుతున్నారు.

నాగేశ్వరరావు ఆ పెద్దమనిషి కేసి చూసి "ఈయన సినిమాలో వేషం వేస్తే బాగుంటుంది" అన్నాడు మిత్రులతో.

"నువ్విస్తావా?" అన్నా డొకడు.

"నిజమే, నేను ప్రొడ్యూసర్ని కాను, డైరెక్టర్ని కాను, ఆఖరికి సినిమా యాక్టర్ని కూడా కాను. అయినా ఎందుకో అలా అనిపించింది" అన్నాడు నాగేశ్వరరావు నవ్వి.

ఇంచుమించు అదే క్షణంలో, ఆ పెద్దమనిషి కూడా ఈ కుర్రాడి వంక చూసి ఆ మాటే అనుకున్నాడు–

"ఇతను సినిమాలో వేస్తే బాగుండును" అని.

ఇంకో మాట కూడ చేర్చి అనుకున్నా డాయన–

"ఇతను మన పిక్చరులో హీరో వేస్తే బాగానే ఉంటాడు" అని.

అలా అనుకుందికి ఆయనకి అధికారం ఉంది. అర్హతా ఉంది.

ఆయన సినిమా నిర్మాత. డైరెక్టరు. ప్రతిభా పిక్చర్స్ అధిపతి. పేరు ఘంటసాల బలరామయ్యగారు...



# కథానాయకుడి కథ

"బాబూ...ఇలా రా" అన్నారు బలరామయ్యగారు.

అల్లరి కుర్రాడు నాగేశ్వరరావు ఆయనకేసి వింతగా చూసి దగ్గరకు వచ్చాడు. "సినిమాలో వేషం ఇప్పిస్తావా అని ఆయన అడుగుతాడేమో...చూద్దాం అని చెబుదాం" అనుకున్నాడు.

"ఎవరు మీరంతా? స్టూడెంట్సా?" అన్నారు కామెరామన్ శ్రీధర్‌గారు.



"కాదండి, డ్రామా ట్రూప్" అన్నాడు నాగేశ్వరరావు గొప్పగా.

"ఓహో...నువ్వు వేషాలు వేస్తావా?"

"హీరోయిన్" అన్నాడు నాగేశ్వరరావు ఇంగ్లీషులో.

అతని కింగ్లీషు నేర్చుకోవాలనీ, ధారాళంగా మాట్లాడాలనీ వెర్రి ఉబలాటం ఉండేది. మధుసూదనరావు గారిని రోజూ పోరేవాడు. ఆయన పిల్లలందరినీ పోగేసి జాగ్రఫీ, రాజకీయాలు, సారస్వతం గురించి ఏవో చెబుతూ వుండేవాడు. "ఇపుడు నీకు ఏ బీ సీ డిలు ఆరంభిస్తే అయినట్టే" అని- ఆ ఒక్కటీ ఆయన ఉపేక్షించారు.

"మీ రానాడే శ్రద్ధపట్టి చెప్పి వుంటే, ఈనాడు నా కది ఎంతో ఉపయోగపడేది"

అంటాడు నాగేశ్వరరావు ఇప్పటికీ. ఈనా దతను చాలా మంది పట్టభద్రులకన్న ధారాళంగా, చక్కగా ఇంగ్లీషు మాట్లాడతాడు, చదువుతాడు. అయినా అతనికి ఆ బాధ పోలేదు...

"ఓహో...లైక్ టు యాక్ట్ ఇన్ ఫిలింస్?" అన్నారు బలరామయ్యగారు.

నాగేశ్వరరావు అదిరిపడ్డాడు.

ఆయన పరిహాసం ఆడటం లేదు.

"య్యస్" అన్నాడు ధైర్యంగా.

"ఎవరితో మాట్లాడాలి?" అన్నారు బలరామయ్యగారు వెంటనే.

"మా ట్రూపువాళ్ళున్నారు. మా అన్నగా రున్నారు...వాళ్ళు ఒప్పుకుంటే వస్తాను."

"సరే. రెండు మూడు రోజులలో వస్తాము" అన్నారు బలరామయ్యగారు.

ఆయన తమ కొత్త చిత్రం 'సీతారామ జననం'లో దశరథుడి పాత్రకు డి. వి. సుబ్బారావుగారిని ఆహ్వానించడం కోసం బందరు వెళ్తున్నారు.

నాగేశ్వరరావును రామలక్ష్మణులలో ఒక పాత్రకు ఎన్నుకోవాలని ఆయన ఉద్దేశ్యం.

ఆయన బందరునుండి వచ్చేలోగా గుడివాడలో, వెంకటరాఘవపురంలో తీవ్రంగా చర్చలు జరిగాయి.

రామబ్రహ్మంగారు బ్రహ్మానంద పడిపోయారు. చిరకాలంగా ఎదురుచూస్తూన్న అవకాశం వచ్చింది. కాబట్టి 'తక్షణం వెళ్ళా' లన్నారు.

మధుసూదనరావు గారికి 'తొందరపాటు తగ'దనిపించింది. అర్భకుడు. ఆడవేషాలు వేస్తున్నవాడు. తొందరపడి వెళ్ళి హీరోవేషానికి ఒప్పుకుంటే, ఈ మార్పుకి చాలా అవస్థ పడవలసి వస్తుంది. కొంచెం ఆగి, ఇంకో మంచి కంపెనీ-వీలైతే సాంఘిక చిత్రం-చూసుకుని అందులో ప్రయత్నించాలని ఆయన వాదం.

మరొక విషమ ప్రశ్న కూడా ఉంది. "నడుస్తున్న నాటక సమాజం ఏమయ్యేటట్టు? అది వృద్ధికి రావడానికి, నాటకాలు ప్రజాదరణ పొందడానికి ముఖ్య కారణాలలో నాగేశ్వరరావు నటన మొట్టమొదటిది. ఇప్పుడతను సినిమాకి వెళ్ళిపోతే ఈ బృందం. ఈ సంస్థ ఇవన్నీ ఏం కాను?" అన్నది.

కొందరు మిత్రులు 'అవు'నన్నారు. కొందరు 'కా'దన్నారు.

నాగేశ్వరరావుకు ఎటూ పాలుపోలేదు. మేకప్ ఆర్టిస్టు మంగయ్యగారిని సలహా అడిగాడు.

ఆయన పరిస్థితి పరిశీలించి భవిష్యత్తును సూచనగా వివరించారు.

నాగేశ్వరరావుకు ఇపుడు 19వ సంవత్సరం. లేత విగ్రహం కాబట్టి ఈనాడు స్త్రీ పాత్రలలో రాణిస్తున్నాడు. ఇంకో ఏడాది, మహా అయితే ఏణ్ణర్థం తిరిగేసరికి శరీరం, శారీరం కూడా మారుతాయి. విగ్రహం బిరుసైతే నాగేశ్వరరావు ఎంత

నటించినా మగరాయుడు ఆడంగి వేషం వేశాడనే ప్రమాదం వస్తుంది. కంఠస్వరం కూడా విరిగి, మంద్రం అవుతుంది. అది తప్పదు. అప్పుడు పాట బాగుండదు. పోతే రాను రాను ఆడపిల్లలు నాటకరంగానికి మరింతగా రాగల అవకాశా లున్నాయి. అందువల్ల క్రమేపీ మొగవాడు ఆడవేషం కట్టే అవసరం ఉండదు.

కాబట్టి ఈ నాటకరంగం నుండి తప్పుకోవడం ఇవాళ కాపోతే రేపైనా తప్పదు. మంచి అవకాశం వచ్చినపుడు సినిమాలో చేరిపోతే, మొదట అవస్థపడ్డా, ఎదురు దెబ్బలు తిన్నా భవిష్యత్తులో కొత్త దారి దొరుకుతుంది. ఎప్పుడో అప్పుడు అందులో పైకిరావచ్చు...

నాగేశ్వరరావు ఆలోచించుకున్నాడు.

"వెళ్తాను" అన్నాడు ఖచ్చితంగా.

మధుసూదనరావుగారు కూడ అప్పటికే ఆ అభిప్రాయానికి వచ్చారు. కాని నాగేశ్వరరావు సినిమాలో దెబ్బ తిన్నా అతనికి ఇబ్బందిరాకుండా ఒక కట్టుదిట్టం చేసి వుంచా రాయన.

మర్నాడు బలరామయ్యగారు రావడం, సంప్రతింపులు జరగడం, నెలకు 250 రూపాయల జీతం మీద నాగేశ్వరరావును బుక్ చెయ్యడం జరిగింది.

రాముడుగాని, లక్ష్మణుడుగాని వెయ్యవలసి వుంటుందన్నారు. "లక్ష్మణ పాత్రధారి కోసం కూడా వెతుకుతున్నాను. ఆ దొరకబోయే చిన్నవాడు చిన్న పాత్రవాడైతే ఇతను రాముడు, కాకపోతే లక్ష్మణుడు."

నాటక సంఘం పూర్తిగా దెబ్బతినకుండా ఒక ఏర్పాటుచేశారు మధుసూదనరావుగారు–నెలకి 20 రోజులు మద్రాసులో వుండి సినిమా పని చేయడం; పది రోజులు గుడివాడకు వచ్చి నాటకాలు వేయడం.

మధుసూదనరావుగారిని కొందరు మిత్రులు, క్లబ్ అభిమానులు, నటబృందంలో కొందరూ విమర్శించారు. "మీరు నాగేశ్వర్రావులిద్దర్నీ పంపేసి (పెండ్యాలకి అప్పుడే ఒక చిత్రానికి సంగీత దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది) సమాజానికి అన్యాయం చేశారు" అని.

"మనది వ్యాపార సంస్థ కాదు. మనందరి కాలక్షేపానికీ ఇది చేస్తున్నాం. మన కిది వృత్తికాదు. ఉపాధి వేరే ఉంది. అక్కినేని నాగేశ్వరరావుకీ, పెండ్యాల నాగేశ్వరరావుకీ ఇదే బ్రతుకుదెరువు కాబోతూంది. రేపు మనకి ఇబ్బందులొచ్చి సమాజం ఎత్తేస్తే వాళ్ళకి ఉపాధి ఎవరు చూపిస్తారు?" అన్నా రాయన.

నెలకి పదిరోజులు వచ్చి పని చేస్తాడు గదా అని సరిపెట్టుకున్నారంతా.

కాని మద్రాసు వెళ్ళాక నాగేశ్వరరావు తిరిగిరావడానికి వీలు కానూలేదు; అతను రానూలేదు.

కొద్ది రోజుల తరువాత ఎక్సెల్సియర్ డ్రామటిక్ క్లబ్ ఆగిపోయింది....

   

ఈ ఘట్టంలోనే నాగేశ్వరరావులో కథానాయకుడు తొలిసారిగా మేలుకున్నాడు. నాటివరకూ అతను పెద్దలు ఎటు వెళ్ళమంటే అటు వెళ్ళాడు. ఏం చెబితే అది చేస్తూ వచ్చాడు. తనకి చదువు మీద ఆసక్తి ఉన్నా, నాటకాల మీద కష్టపడి కృషి చేశాడు.

ఎక్సెల్సియర్ క్లబ్బు జీవితం అతనికి "నువ్వు నటుడివి కాబోతున్నావు. నీకు ఇదే దారి" అని ఖాయంగా చెప్పింది. ఇంక బడి చదువుకొందికి అవకాశం ఎలాగా లేదన్న సంగతి తెలుసుకొమ్మని హెచ్చరించింది.

తను నటుడే కాబోయే పక్షంలో – 'ఎక్కడ' అన్న ప్రశ్న ఇప్పుడు ఎదురైంది. పెద్దల చర్చలు నిర్ణయాలు ఒక వంక జరుగుతూండగా తొలిసారిగా తనూ ఆలోచించుకున్నాడు స్వతంత్రంగా. మంగయ్యగారి సలహా విని మళ్ళీ ఆలోచించుకున్నాడు. తను సినిమాలో విఫలుడైతే నాటకరంగం మీద ఆస్కారం తిరిగి దొరక్క పోవచ్చు. ఇపుడు స్టేజిని వదలక పోయినా రెండేళ్ళలో ఆ పరిస్థితి రావచ్చు అని తన మిత్రుడన్న మాట అతనికి నచ్చింది. మధుసూదనరావు గారు చెప్పింది రాగల ప్రమాదం గురించిన హెచ్చరిక; మంగయ్యగారు చెప్పింది భవిష్యత్తును గురించిన ఆశ.

"నే వెళ్తాను..." అని నిశ్చయించుకున్నాడు.

పైగా, వచ్చింది చిన్న వేషం కాదు. అవధులు, అవకాశాలు, శక్తి, సామర్థ్యం ఏ పాటి ఉన్నా ఆ వేషం పేరు 'హీరో' అంటారు.

మొదటి ఛాన్సు 'హీరో' దొరకడం అదృష్టమే.

తమ్ముడు సినిమా హీరో అవుతున్నందుకు రామబ్రహ్మంగారు ఎంత సంతోషించారో, మరొకందుకు అంత భయపడ్డారు. సినిమా అంటే డబ్బు తిరిగే చోటు, బుద్ధులు విచ్చలవిడిగా పరిగెత్తే ప్రమాదం ఉంది. తమ్ముడి మంచితనం పట్ల, ఋజు వర్తనం పట్ల ఆయనకి ఎంత గురి ఉన్నా, కీడెంచి మేలెంచక తప్పదు. పైగా సినిమాలో చేరాక 'సినిమా వాడికి పిల్ల నెవరిస్తారు' అనే రోజులు అవి.

అందువల్ల తక్షణం తమ్ముడికి వివాహంచేసి మరీపంపాలని నిశ్చయించారు. రామబ్రహ్మంగారు సంబంధాలు వెతికారు. తమ అంతస్తుకు ఇంకో మెట్టు పైనే ఉన్న సంబంధం ఒకటి చూశారు. "వెళ్ళి పిల్లని చూదా"మన్నారు.

మధుసూదనరావుగారు, "తొందరపడ వ"ద్దన్నారు. ముందు పెద్దలు వెళ్ళి చూచి, మంచి చెడ్డలు కనుక్కొని, ఆపైన పిల్ల ఫోటో వరుడికి చూపించాలనీ, అన్నీ నచ్చిన తరువాత వెళ్ళి పిల్లని చూసి ఖాయపరచుకోవడం మంచిదనీ ఆయన అన్నారు. ప్రతి విషయాన్నీ అందరివైపు నుండీ దూరదృష్టితో ఆలోచించడం ఆయన స్వభావం. ఎవరివల్లా, ఎవరికీ బాధ కలగకూడదు.

"రేపు నువ్వెళ్ళి పిల్లనిచూసి, నచ్చలేదని వచ్చేస్తే వాళ్ళు ఇబ్బందిపడతారు. 'పిల్ల నచ్చక పోవడానికి కారణాలేమిటి' అన్న చర్చ ఊళ్ళో అందరూ ఆరంభిస్తారు. పెళ్ళి కావలసిన ఆడపిల్ల కది శ్రేయస్కరం కాదు." అన్నా రాయన.

నాగేశ్వరరావు కామాట నచ్చింది. ఆ మాటే అన్నగారితో అన్నాడు.

"నీ కెవరు అన్న? నేనా ఆయనా?" అన్నా డాయన ఉద్రిక్తుడై.

నాగేశ్వరరావు తల వంచుకున్నాడు. పెద్దన్నగారు తనకి అన్నే కాదు; తండ్రిగా, గురువుగా, దైవంగా గౌరవిస్తాడు తను. ఆయన ఆపేక్ష హద్దు లెరగదు. తన ఇంటికి తమ్ముడు వస్తే తను కింద పడుకుని తమ్ముడికి మంచంమీద పక్కవేసి పడుకోబెట్టా డాయన.

ఆయనని తిరస్కరించడం తన ఉద్దేశ్యం కాదు.

నాగేశ్వరరావు తల వంచాడు. అన్నదమ్ములిద్దరూ గూడుబండి కట్టించుకుని పెళ్ళి చూపులకి వెళ్ళారు.

అమ్మాయి అందచందాలకు, కుటుంబం గౌరవప్రతిష్ఠలకు, సంప్రదాయానికీ ఏవిధమైన లోటూ పెట్టడానికి వీల్లేదు. అమ్మాయి మాత్రం ఎత్తరి. ఆమె ముందు నాగేశ్వరరావును చూస్తే 'వరహీనం' అనిపిస్తుంది. అతనికీ అన్నగారికీ కూడా అదే అనిపించింది.

కొంచెం ఏకాంతం దొరకగానే "ఒద్దన్నయ్యా" అన్నాడు నాగేశ్వరరావు.

"అవునురా. నాకూ నచ్చలేదు. చెప్పేస్తా" అన్నారు అన్నగారు.

"ఇక్కడొద్దన్నయ్యా, ఇంటికెళ్ళి రాద్దాంలే"

"ఛ ఛ! ఎందుకు? నచ్చనపుడు చెప్పేస్తే తప్పేముంది?" అన్నాడు రామబ్రహ్మంగారు. ఆయన అమాయకుడు. ముక్కుకు సూటిగా పోయే మనిషి. మనసులో మాట పైకి అనేసే మనిషి.

"కాదన్నయ్యా, ఇపుడు చెబితే లేనిపోని చర్చలు. మనమేం చెప్పినా వాళ్ళు తప్పుగా తీసుకోవచ్చు. లేనిపోని ఘర్షణ..." అన్నాడు తమ్ముడు.

అన్నగారు తమ్ముడివంక ఆశ్చర్యంగా చూశాడు.

"తమ్ముడు లౌక్యం చెబుతున్నాడు. ఫరవాలేదు" అనుకున్నా రాయన. ఆయనకి ధైర్యం కలిగింది.

❀ ❀ ❀ ❀

ఉత్తరం వెళ్ళిన తరువాత ఆడపిల్ల తరఫువారు నొచ్చుకోవడం జరిగింది. 'ఆపాటిదానికి చూడరావడం ఎందుకు' అనుకోవడం కూడా జరిగింది.

మధుసూదనరావుగారు చెప్పినది ఇదే.

"చూశావా అన్నయ్యా!" అన్నాడు తమ్ముడు తల వంచుకుని.

"అవునురా. పొరబాటై పోయింది." అన్నారు అన్నగారు-వీధిలోకి చూస్తూ.

❀ ❀ ❀ ❀

1944 మే 7వ తేదీన మధుసూదనరావుగారి వెంట బయలుదేరి 8వ తేదీ ఉదయం మద్రాసు చేరుకున్నాడు నాగేశ్వరరావు.

# మృత్యుంజయుడు



"కొత్త హీరో వచ్చాడు" అంటూ మేడ దిగి వచ్చాడు పేకేటి శివరాం.

ప్రతిభా ఆఫీసులో పనిచేస్తున్న వాళ్ళు నలుగురైదుగురు పోర్టికో దగ్గిరికి వచ్చారు చూడడానికి. ఆ వెనకే బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారూ, ఘంటసాల వెంకటేశ్వరరావుగారూ వచ్చారు.

మధుసూదనరావుగారు కవిగారికి నమస్కరించారు.

కొత్త హీరో సిగ్గుపడుతూ తల వంచుకు నిల్చున్నాడు. అతని గుండెలు దడ దడ లాడుతున్నాయి. అందరూ తన వంక పరీక్షగా చూస్తున్నారని తెలుసు. ఏమనుకుంటున్నారో!

"రా బ్రదర్" అన్నాడు శివరాం-నాగేశ్వరరావు గదికి దారితీస్తూ.

"ప్రతిభా సంస్థకి వచ్చావు. ప్రతిభాశాలివి కా నాయనా" అన్నారు కవిగారు.

బిరుసుగా బిగించుకుపోయిన నాగేశ్వరరావు కొంచెం సడిలాడు. ముందడుగు వేశాడు.

అదే నాగేశ్వరరావు చైత్ర యాత్రారంభం. అదే అతని జైత్రయాత్రకు నాంది.

బలరామయ్యగారు ఆదరంగా మాట్లాడారు. మధుసూదనరావుగారూ, ఆయన సంప్రదించుకుని, నాగేశ్వరరావు నెలకి 20 రోజులు సినిమాలో పని చేసేటట్టు, పది రోజులు దేశం వచ్చి నాటకాలు వేసేటట్టూ ఒప్పందం చేసుకున్నారు. మర్నాడు మధుసూదనరావుగారు గుడివాడ వెళ్ళిపోయారు.

ప్రతిభా లాడ్జిలో బలిజేపల్లి, శివరాం, ఘంటసాల, నాగేశ్వరరావు ఉండేవారు. ఘంటసాల అంతకు ముందే వచ్చాడు. కోరస్‌లో ఛాన్సు ఇస్తే పాడటానికి, వేషం ఇస్తే వెయ్యడానికి, భోజనం పెడితే తినడానికి వచ్చా డాయన.

ముందు రోజులలో ఈయన ముఖ్య పాత్రధారి, ఆయన ఈయన గాత్రధారి అవుతారని వాళ్ళకి తెలీదు. జోస్యు డెవరేనా చెప్పినా ఇద్దరూ నవ్వేవాళ్ళు. అప్పటికి ప్లేబాక్ రాలేదు.

"పైగా ఆయనకి పాట వచ్చుగా" అనేవాడు గాత్రధారి.

కొద్ది రోజుల తరువాత ప్రొద్దుటూరు రాజు అనే నటుడు వచ్చాడు. నాగేశ్వరరావు కన్న అర్భకంగా ఉన్నాడని అతనికి లక్ష్మణుడి పాత్ర ఇచ్చారు.

నాగేశ్వరరావు రాము డయ్యాడు.

అంటే, సినిమా పరిభాష ప్రకారం వేషం జానెడున్నా, బోలెడున్నా అది హీరో పాత్ర. టైటిల్ రోలు. టైటిల్ 'సీతారామ జననం' కాబట్టి-కనీసం సగం రోలు అన్నమాట.

"బ్రదర్, రావడం రావడం హీరోగా వచ్చావు. అదృష్టవంతుడివి. పెద్ద కథానాయకుడి వవుతావు పో" అన్నాడు పేకేటి.

నాగేశ్వరరావు నవ్వాడు.

"అది నువ్వు చెప్పే దేమిటి?" అందా నవ్వు.

"తప్పు, అలా మాట్లాడకూడదు" అని ఎవరన్నా అంటే,

"అబ్బే! అయినపుడు చూదాం లెండి అన్నాను" అని వుండేదా నవ్వు.

మొత్తం మీద నవ్వడం, తల వంచుకోవడమే తప్ప ఎక్కువ మాట్లాడేవాడుకాడు నాగేశ్వరరావు.

తన పనేమిటో, కథేమిటో, కమామిషేమిటో. మాట లెక్కువ వాడితే పొరబాట్లు, తప్పులు, పేచీలు, అపార్థాలూ పెరుగుతాయనీ, తక్కువ మాట్లాడితే వాటి సంఖ్య తగ్గుతుందనీ అతనికి తెలుసు.

కవిగారి దగ్గర పాత్రల వివరణ తెలుసుకుని, డైలాగులు తీసుకున్నాడు.

"మాటలు బాగా చూసుకో నాయనా" అన్నారు కవిగారు మర్నాడు.

"ప్రాంప్టింగు అక్కర లేదండీ. అన్నీ కంఠతా వచ్చేశాయి" అన్నాడు నాగేశ్వరరావు వినయంగా.

బలరామయ్యగారు మందహాసం. చేశారు.

షూటింగు నాడు రెండు వీశల బట్ట, అర మణుగు నగలు భరించి పెట్టుకువచ్చాడు నాగేశ్వరరావు.

ఇది కొత్త బరువు కాదు. కాని అలవాటు తప్పిన బరువు. అతను స్టేజి ఎక్కినపుడు పౌరాణిక పాత్రలే భరించాడు. పైగా స్త్రీ పాత్రలు కావడంతో ఏడు గజాల పట్టు చీర, నగలు, కిరీటం, దానికింద విగ్గూ గట్రా ధరించవలసి వచ్చేది.

ఎక్సెల్సియర్ క్లబ్‌కు వచ్చాక బరువైన పాత్రలు ధరించాడు.

స్త్రీ పాత్రలూ, సాంఘిక నాటకాలకు తగ్గ వైఖరి, భావప్రదర్శనం బాగా వంటబట్టాయి.

ఇప్పుడు ధరించేది పురుష పాత్ర. పురుషోత్తముడి పాత్ర. మహావీరుడి పాత్ర. పురాణ పురుషుడి పాత్ర.

రిహార్సల్సు వేళ తోటినటులు హెచ్చరిస్తూనే వచ్చారు. నిలుచునే భంగిమలో, నడకలో, చేతులు కదపటంలో, కళ్ళెత్తి చూడడంలో ఇంకా ఆడవాలకం పూర్తిగా పోవటం లేదని బలరామయ్యగారు మృదువుగా చెప్పి దిద్దారు. నాగేశ్వరరావు శాయశక్తులా దిద్దుకున్నాడు.

సెట్టుమీదికి వచ్చి కెమెరా ముందు నిలబడ్డాడు నాగేశ్వరరావు. అర నిమిషం తరవాత పేకేటి శివరాం వచ్చి "బ్రదర్, దుప్పటీ కప్పనా? చలేస్తున్నట్టుంది" అన్నాడు నవ్వుతూ.

అప్పటికిగాని తెలియలేదు తను వణుకుతున్నట్టు.

"చెమటలు పోస్తున్నాయిగా. చలి అయుండదు లే!" అన్నాడు నాగేశ్వరరావు- మెల్లిగానే.

బలరామయ్యగారు దగ్గరకువచ్చి భుజంతట్టి "భయపడకు. ఇదేం నాటకంకాదుగా! సరిగ్గా రాపోతే మళ్ళీ చేద్దుగాని." అన్నారు. ఆయన ఆప్యాయత అతన్ని సేదదీర్చింది.

"సరిగ్గానే వస్తుంది. వచ్చితీరాలి." అనుకున్నాడు నాగేశ్వరరావు గట్టిగా.

"స్టార్ట్" అన్నాడు డైరెక్టరు.

"క్లాప్" అన్నాడు కెమెరామన్.

"యాక్షన్" అన్నాడు డైరెక్టర్.

నాగేశ్వరరావు డైలాగు చెప్పాడు.

"కట్"

"...ఓఖే" అన్నారు బలరామయ్యగారు ఉత్సాహంగా. అని వెన్నుతట్టారు.

ఆ మాటతో, నెచ్చని ఆ స్పర్శతో నాగేశ్వరరావుకు వణుకు తగ్గింది. గుండె కుదట బడింది.

కృతజ్ఞతతో చూశాడు దర్శకుడి వంక.

"అది మధురాతి మధురమైన...కాదు, అనిర్వచనీయమైన అనుభూతి. మరువరాని అనుభూతి." అంటాడు నాగేశ్వరరావు– ఈ నాటికీ. ఆ సందర్భం ప్రస్తావనకు వస్తే, కన్ను లరమోడ్చి స్మృతిపథంలో ఇరవై యేళ్ళు షికారుకెళ్ళి వస్తాడు.

బాగా చేశావని సెట్ జనులంతా అన్నారు.

"కొంచెం ఒణుకు ఉన్నా–అది, బాల రాముడికి పెద్దల యెడ ఉండే వినయ విధేయతలకీ, భక్తి ప్రపత్తులకీ లక్షణంగా నప్పుతుంది." అన్నాడు ఒక మిత్రుడు.

"ఫస్టు ఛాన్సు హీరో–ఫస్టు షాట్ ఓకే. అదృష్టవంతుడివి" అని అభినందించా డొకాయన. నాగేశ్వరరావు వినయంగా తలవంచుకున్నాడు.

అదే తెలుగు తెర కొక కొత్తనటుడు పుట్టిన రోజు.

అతను దినదిన ప్రవర్ధమానుడై విజయపరంపర సాధించడానికి అడుగువేసిన రోజు. దాదాపు రెండు దశాబ్దాలు హుటాహుటిన ప్రయాణించి – చాలా మంది విరమించి విశ్రాంతి తీసుకోవలసివచ్చేవేళ – తనకు ఇంటర్ వెల్ అయేటంత కట్టుదిట్టంగా, సుదీర్ఘయాత్రకి కదలిన రోజు.

ఈ జైత్రయాత్రలో అతను ఎదురు దెబ్బలు తిన్నాడు. పోరబాట్లు చేశాడు. బాధపడ్డాడు. భయపడ్డాడు. అభిప్రాయాలు ఏర్పరచుకున్నాడు. మార్చుకున్నాడు. కొన్నిటిని పరిమార్చుకున్నాడు. అబద్ధాలు ఆడాడు. ఇచ్చకాలు పలికాడు. "కథా నాయకుడు మంచి కథానాయకుడే" అనిపించుకున్నాడు. ఆత్మవంచన చేసుకున్నాడు. పరవంచన చెయ్యలేదు. చెయ్యకపోవడానికి కారణం అది తప్పు అన్నదానికన్నా– వంచన చెయ్యకపోవడం గొప్ప అన్న దానికన్నా–అది ప్రయోజనకారి కాదు అన్నది– ఏనాటికైనా దెబ్బతీస్తుంది అన్నది–సుఖం, సంతోషం ఇవ్వలేదు. ఇచ్చినా అవి క్షణికాలే అవుతాయి అన్నది–ముఖ్య కారణాలు.

ఈమాట చెప్పగల ధైర్యం అతనికి ఉంది. అతనికే ఉంది.

"జీవితంలో, నిజం చెప్పడం వంటి మంచి లక్షణాలను–అవి మంచివన్న దృష్టితోనేకాక సుఖదాయకాలు, లాభసాటి లక్షణాలు అన్న దృష్టితో చూసి అర్థం చేసుకుంటే, వాటిని పాటించడం సులభమేమో అంటా డతను. వాటిమీద గురి

లేకుండా, వాటి స్వరూపం తెలియకుండా పెద్ద బాలశిక్షలో రాశారనీ, పెద్దలు చెప్పారనీ అనుసరించా లనుకోవడం కన్న విలువలు తెలుసుకుని నేర్చుకోవడం మంచిది అని అతని విశ్వాసం.

ఒకప్పుడు ముక్కుకు సూటిగా పోవడం మంచిదని నమ్మాడు.

కొన్నాళ్ళ తరువాత ముక్కుకు సూటిగా పోతే ఏ గోడో ఎదురు దెబ్బకొడుతుంది అని జీవితం అతనికి ఒక అనుభవం చూపి ఒక నీతిపాఠం నేర్పింది.

మనుషులు చెప్పే వాటికన్నా జీవితం నేర్పే పాఠం మంచిదని నాగేశ్వరరావు దాన్ని మన్నించబోయాడు.

కొంత కాలం తరువాత అనుభవం మీదనే అందులో తప్పు తెలుసుకున్నాడు. ముక్కుకు సూటిగా పోయేవాడు కళ్ళు తెరుచుకు నడవాలనీ, గోడలు ఎదురైతే ఎక్కే దిగే ఒడుపు తెలుసుకోవాలనీ తెలుసుకున్నాడు. అంతే తప్ప గోడ అడ్డుందని డొంక తిరుగుడు దారిలో నడిస్తే అడవుల పాలవుతామని గ్రహించాడు.

ఈ విధంగానే నాగేశ్వరరావు జీవితంలో మంచి చెడ్డల, కుడి ఎడమల విలువలు కట్టుకున్నాడు.

సుఖానికీ, ఆనందానికీ ఉన్న తేడా తెలుసుకున్నాడు. సుఖం లేకపోయినా ఆనందం అనుభవించ వచ్చుగాని, ఆనందం, ఆత్మతృప్తీ లేకపోతే ఉన్న సుఖాలు కూడా ఒంట బట్టవు అని తెలుసుకున్నాడు. తెలుసుకున్న దానికోసం ప్రయత్నించి సాధించాడు.

ఇలా లక్ష్యశుద్ధి ఉన్నందువల్లనే అతను తన చిత్ర యాత్రలో తప్పటడుగులు చాలా తక్కువ వేశాడు. వేసిన మంచి అడుగులు ధాటీగా వేశాడు. లభించిన పాత్రలను మనోహరంగా ధరించాడు. ఆంధ్రలో–కొంతకాలం పాటు తమిళ దేశంలోనూ–ఆబాలగోపాలానికీ అభిమానపాత్రుడు అయ్యాడు. యువ హృదయాలకు ఆరాధ్యదైవం అయ్యాడు. మహానటుడు, నటకాగ్రేసరుడు, నటసామ్రాట్ బిరుదు లందుకున్నాడు.

ఇంతటి స్థితికి రావడానికి అతను ఎన్నో కష్టాలు పడ్డాడు. అతని పుటకలో ఐదారేళ్ళలోపల మూడు నాలుగు ప్రాణగండాలు వచ్చాయి. 'సీతారామ జననం'లో నటుడిగా జననమందిన తరువాత కూడా అతనికి నట జీవనయాత్రలోనూ అంత పెద్ద గండాలూ వచ్చాయి. చిన్ననాడు గండాలు గడిచి బ్రతకడానికి అతను తెలిసి చేసిన కృషి ఏమీ లేదు. అతను నమ్మని దైవమో, ఒప్పుకోని అదృష్టమో అతన్ని కాపాడాయి. కాని నట జీవితపు బాల్యావస్థలో, యౌవనంలో వచ్చిన దాదాపు మరణగండాలు అనతగ్గవాటిని అతను స్వయంకృషితోనే ఎదిరించాడు; గెలిచాడు. ఇక్కడ దైవాన్ని, అదృష్టాన్ని ప్రస్తావించడం అతని ధైర్య స్థైర్యాలకూ, శ్రమకూ, సహనానికీ అన్యాయంచేయడమే అవుతుందని ఒప్పుకోవాలి.

అంది వచ్చిన అద్భుతమైన అవకాశాలు-అతను అనర్హుడని కొందరు గట్టిగా వాదించడంవల్ల-పోబోయాయి. వాటిని దక్కించుకున్నాడు.

వరసగా కొన్ని చిత్రాలు అపజయం పొందడంతో 'ఫ్లాప్ హీరో' అన్న ప్రచారం జరిగింది. దాన్ని నిభాయించుకొని, ఎన్నో సవాళ్ళను, విమర్శలను ఎదుర్కొని, తల ఎత్తి నిలబడ్డాడు. 'దేవదాసు' చిత్రంతో 'న భూతో న భవిష్యతి' అనిపించుకున్నాడు.

వ్యక్తిగతంగా, ఎన్నో ఘోరమైన అభాండాలూ, అతని జీవితాన్నీ, వృత్తినీ కూడా ధ్వంసం చెయ్యగలిగిన నిందలూ ప్రచారం అయ్యాయి. మరొకడికి అది ప్రాణగండం లాటిదే. నాగేశ్వరరావు దాన్ని తరించాడు.

ఈనాడు చాలామంది అన్నయ్య, తండ్రి వేషాలు వేసే వయసుకి వచ్చిననాడు-ఈ హీరో వయస్సు 20 ఏళ్ళు అనిపించేలా 'భార్యా భర్తలు', 'కుల గోత్రాలు' వంటి చిత్రాలలో కనిపించాడు. అతని మనసు వయసును జయించింది.

నటననీ, యౌవనాన్నీ కూడా జరామరణాలకి అతీతం అనిపించేటంతగా పోషించుకొస్తున్నాడు.

అందుకే అతని శక్తి చైతన్యాలను ఎరిగినవారు 'మృత్యుంజయుడు' అంటారు. ఈ బిరుదు చిన్ననాడే వచ్చినా, ఈనాడు దానికి అర్హత గడించుకున్నాడు నాగేశ్వరరావు.

అన్నిటికన్నా పెద్ద గండం-సినిమా నటులకు రారానిది-అతనికి కాశ్మీరులో ఉండగా వచ్చింది. 'అలాడీన్' చిత్రం షూటింగ్ సందర్భంగా శ్రీనగర్ వెళ్ళడం జరిగింది. అక్కడ ఆ పని అయిపోయింది. తరవాత అక్కడ కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు.

హఠాత్తుగా ఒకనాడు జ్వరం వచ్చింది. మర్నాడు ఉదయానికి మశూచి పోసింది. దగ్గర ఉన్నది భార్య అన్నపూర్ణ మాత్రమే.

నాగేశ్వరరావు ఆ పూట నిదానంగా ఆలోచించుకున్నాడు. "తన ముఖంపై మశూచి వేయగల ముద్రవల్ల పర్యవసానాలు తీవ్రంగా ఉంటాయి. తను నటిస్తున్న చిత్రాలలో సగం సగం అయినవి చాలా వున్నాయి. రేపు తను కెమెరా ఎదుట నిలబడడానికి యోగ్యత లేకపోతే కొన్ని లక్షల రూపాయల నష్టం. పరిశ్రమలో అల్లకల్లోలం చెలరేగుతుంది. చాలామంది నిర్మాతలు దెబ్బతింటారు. తను రేపు నటించకపోయినా తనకి ఫరవాలేదు. రోజులు సాఫీగా వెళ్ళడానికి లోటులేదు.

సాయంత్రం నగరంలోని ప్రముఖ వైద్యులు ముగ్గురిని పిలిపించాడు. పరిస్థితి వివరించాడు. "ఎంత డబ్బు ఖర్చయినా సరే, శారీరకంగా నేను ఎంతటి బాధ పడాల్సివచ్చినా సరే, ముఖం మీద మశూచి చెరగని ముద్ర వెయ్యకుండా చూడం"దని కోరాడు. "నావల్ల నా ప్రొద్యూసర్లకి నష్టం రాకూడదు" అని నొక్కి చెప్పాడు.

డాక్టర్లు సంప్రదించుకున్నారు.

"మిస్టర్ నాగేశ్వరరావ్! నిజంగా బాధాకరమైన మార్గం ఒకటుంది. పొక్కులలో రసి ముఖం మీద చర్మాన్ని కుళ్ళబెడితేనే గంట్లు ఏర్పడతాయి, ఆసిడ్ ద్వారా ఆ ప్రమాదాన్ని నివారించవచ్చు...కాని, బాధ..."

"ఫరవాలేదు, చెయ్యండి" అన్నాడు నాగేశ్వరరావు.

వారం రోజులు దుర్భరమైన బాధ పడ్డాడు. భార్య అంతకు మించిన క్షోభ పడింది. మద్రాసుకు కబురంపుతానంటే అతను ఒప్పుకోలేదు. ధైర్యం చెప్పేవారు కూడా లేకుండా ఆమె నిలదొక్కుకుని భర్తకు ఉపచర్య చేసింది.

ఈ దుస్సాహసానికి డాక్టర్లు కూడా ఆశ్చర్యపడ్డారు.

పొంగు దిగి స్నానం అయిన తరువాత నాగేశ్వరరావు 'నిష్కళంక' వదనంతో ఈ అగ్ని పరీక్ష నుండి కోలుకున్నాడు.

"ఇందులో మీ విజయానికి మందులకన్నా మీ ఆత్మ విశ్వాసం, ఆమె ఉపచర్య ముఖ్య కారణాలు." అని అభినందించారు.

ఈనాడు నాగేశ్వరరావు ముఖంలో రెండు మూడు చోట్ల మాత్రం లీలగా కనబడే చిన్న గంటూ, గడ్డం దగ్గర ఒక చిన్న నల్లమచ్చా ఉన్నాయి.

అవి కళంకాలు కావు; అతని స్థైర్యానికి, ఆత్మశక్తికీ జయపతాకాలు.

# మాయలోకం



సీతారామజననం చిత్రం బాగుందనిపించుకుంది

కొత్త హీరో నాగేశ్వరరావు బ్రహ్మాండంగా నటించాడని, రాముడు కళ్ళకట్టినట్టు కనిపించాడనీ, జనం విరగబడి చూస్తున్నారనీ జనం అన్నారో లేదో

నాగేశ్వరరావుకు తెలియదు కాని, ఆ పాత్రకి అతను ఎబ్బెట్టుగా ఉన్నాడని ఎవరూ అనలేదు. ఆడంగి పోకడలు పోయాడని కూడా అనలేదు.

ఇదే నాగేశ్వరరావుకి కొండంత బలమిచ్చింది. తను శ్రద్ధపట్టి కృషిచేసింది మూడు నాలుగేళ్ళ సాధన వల్ల బాగా అలవాటయిపోయిన ఆడపోకడలూ, ఆ రకం హావభావాలూ రాకుండా చూసుకోవడం. పాత్ర పోషణ ఆ తరవాతదే.

గగ్గయ్య, తీగెల, కమలా కోట్నీస్, ఋష్యేంద్రమణి మొదలయిన వారంతా అతనికి తోడ్పడుతూ వచ్చారు. అందరికన్నా మిన్న బలరామయ్యగారి వాత్సల్యమే అతనికి ధైర్యం ఇచ్చింది. కొద్దిరోజులలోనే ఆయన దగ్గర నాగేశ్వరరావుకు చనువు అయింది.

"సీతారామ జననం" కొంత అయేవరకే నాగేశ్వరరావుకు రెండవ ఛాన్సు కన్ను గిలిపింది.

శారదా ఫిలింస్ అధిపతి, ప్రముఖ దర్శకుడు గూడవల్లి రామబ్రహ్మంగారు అప్పుడే 'మాయలోకం' చిత్రం నిర్మించాలని సంకల్పించారు. అందులో శరాబంది రాజుకు సన్నటి, చక్కటి, మెరికెలాటి కుర్రాడు కావాలని అందుకోసం అన్వేషించ సాగారు. ఆ రోజులు కథల రోజులు. దర్శకుల, రచయితల రోజులు. నటులను బట్టి పాత్రలు రూపొందించడం, వారి రూపురేఖలను బట్టి వాటిని సింద్రెలా జోళ్ళ సైజుకు కత్తిరించడం జరగని రోజులు. ఒక పాత్ర రూపురేఖలు సమగ్రంగా దిద్ది, దానికి తగ్గ విగ్రహస్ఫూర్తి గల వ్యక్తికోసం వెతికే రోజులు.

బలరామయ్యగారు రాముడికి కొత్త నటుడిని తెచ్చారని అంతకు ముందే రామబ్రహ్మంగారికి తెలుసు. ఆ కుర్రాడికోసం, తన పేరు గల ఇంకో ఆసామి తన క్రితం చిత్రం 'రైతుబిడ్డ'లో వేషం సంపాదించడానికి ప్రయత్నించాడనీ, అప్పట్లో అది సందర్భపడలేదనీ కూడా తెలుసు. ఇపుడు చూదామని తోచింది.

"ఏమయ్యా, మీ కొత్త హీరో ఏమంటున్నాడు?" అన్నారు యాదాలాపంగా.

బలరామయ్య గారికి ఈ ప్రశ్న వెనక తాత్పర్యం తెలుసు.

తాము తెచ్చిన కుర్రాడిని పైకితెచ్చే అవకాశం వచ్చింది. ఆయన పొంగిపోయారు.

కొత్త హీరో గురించి అనర్గళంగా మాట్లాడారు. "చురుకైనవాడు. కొత్త అని నువ్వే అంటున్నావు కాబట్టి ఆ వారకి సర్దుబాట్లూ దిద్దుబాట్లూ ఉండచ్చుకాని, విషయం ఇట్టే చెప్తే అట్టే అందుకు పోతాడు. మంచి వూహవుంది...మీ వాడే" అన్నాడాయన.

"ఏవిటయ్యా పంతులూ, నేనేదో వేషం ఇచ్చేందుకు అడిగినట్టు చెబుతున్నావు. ఊరికే అడిగాను" అన్నారు రామబ్రహ్మంగారు నవ్వి.

"తెలుసు లేవయ్యా, నువ్వెందు కడిగావో...నే నావలిస్తే పేగు ల్లెక్కెడతాను" అన్నారు బలరామయ్యగారు.

"నే నావలించ లేదుగా!–"

"అఖ్కర్లేదు, ఆ అంటే చాలు–"

వాళ్ళిద్దరి సరసాలు, ఛలోక్తులు ఈ ధోరణిలో ఉండేవి.

బలరామయ్యగారు వెంటనే నాగేశ్వరరావును పిలిచి సంగతి బోధపరచారు. 'మాయలోకం'లో వేషం కూడా మంచిదనీ, అందుకు తగ్గ ప్రయత్నం చేస్తే తప్పక వస్తుందనీ చెప్పారు.

నాగేశ్వరరావు ఇంటికి ఉత్తరం రాశాడు.

"మన పిక్చర్‌లో బాలరాముడి వేషం కాబట్టి నువ్వు పీలగా ఉన్నా, కంఠం సన్నగా ఉన్నా ఫరవాలేదు. ఇది ఎడ్వెంచర్ హీరో. మంద్రస్వరం కావాలి. నిండుగా, హుందాగా రావాలి" అని చెప్పారు.

రాముడి పాత్ర ధరించే నాటికే నాగేశ్వరరావు ఈ విషయంలో గట్టిగా కృషి చేశాడు. ఎక్సెల్సియర్ క్లబ్‌లో ఉండగా తనకు సంభాషణలు చెప్పడంలో తరిఫీదు ఇచ్చిన దైతా గోపాలంగారు ఇపుడు ఇక్కడ పాటలు రాయడానికి వచ్చారు. అందువల్ల ఆయన శిక్షణ తోడ్పడింది. తెల్లవారు ఝామున లేచి పొద్దుటూరు (బడబాగ్ని నారాయణ) రాజూ, ఇతనూ సాధన చేసేవారు.

"సోదరా" అనే వాడు రాముడు.

"అన్నయ్యా" అనే వాడు తమ్ముడు.

సాధ్యమైనంతగా కంఠం బిగించి పట్టి పట్టి డైలాగులు అనేవారు. చలిలో చన్నీళ్ళ కుండను కౌగిలించుకు కూర్చుని పాటలు, పద్యాలు పాడేవారు.

నాగేశ్వరరావుకు అప్పటికి 19 వెళ్ళి 20 వచ్చింది.

ఎక్సెల్సియర్ క్లబ్‌లో నోరు కట్టుకుని అతి పదిలంగా కాపాడుకొంటూ వచ్చిన సన్నటి, బంగారు తీగెలాటి, కంఠం క్రమంగా విరిగి, పురుష కంఠం కాసాగింది.

'మాయలోకం'లో పాత్రను దృష్టిలో ఉంచుకుని మరింతగా కృషిచేశాడు–అది వచ్చే అవకాశం ఎలా వుంటుందో తెలియక పోయినా.

హఠాత్తుగా ఒక నాడు రామబ్రహ్మంగారు ప్రతిభా ఆఫీసుకు వచ్చారు.

"ఒరే అబ్బాయ్, ఈయన రామబ్రహ్మంగారు. నిన్ను చూడడానికి వచ్చారు" అన్నారు బలరామయ్యగారు ఆనందంతో.

నాగేశ్వరరావు రామబ్రహ్మంగారి కేసి చూసి, కింగాఫ్ కాంబోడియాలా కూర్చున్నాడు.

గాడ్ ఫాదర్ బలరామయ్యగారు కంగారు పడ్డారు.

రామబ్రహ్మంగారు కుర్రాడి కేసి సూటిగా చూశారు.

"ఊ...ఏదీ కళ్ళెత్తి చూడు..."

నాగేశ్వరరావు చూశాడు–యాంత్రికంగా కంగారుగా.

"పళ్ళు చూపించు...ఇంకా బాగా నవ్వాలి."

నాగేశ్వరరావు చేశాడు. తరవాత చొక్కా ఇప్పమంటారు. అటూయిటూ నడవమంటారు. ప్రొఫైలు అంటారు. 'ఊ' అంటారు, 'ఆ' అంటారు. ఇవన్నీ ఇదివరకయ్యాయి.

"ఊ...వెళ్ళు" అన్నారు రామబ్రహ్మంగారు.

నాగేశ్వరరావు మధుసూదనరావుగారికి ఉత్తరం రాశాడు. చల్లపల్లి రాజాగారి వద్ద నుండి సిఫార్సు తీసుకుని మధుసూదనరావుగారు మద్రాసు వచ్చి రామబ్రహ్మం గారిని చూశారు.

"గాడిద. వాడికి పెద్దాళ్ళకి దండం పెట్టాలని కూడా తెలీదు. విలేజ్ బ్రూట్" అన్నారు రామబ్రహ్మంగారు.

"నిజమేనండి...పల్లెటూరి కుర్రాడు కాబట్టే దండం పెట్టాలన్న సంగతి తెలీదు. ఈ దండా లింకా పల్లెటి దిక్కులకి పాకలేదు. పైగా అతను కుర్రాడు. మిమ్మల్ని చూసి భయపడి ఉండొచ్చు. అందువల్ల నమస్కారం పెట్టలేదేమో..." అంటూ సర్ది చెప్పుకొచ్చారు మధుసూదనరావుగారు.

రామబ్రహ్మంగారు ప్రసన్నుడు కాలేదు. కోపం మాట అలా వుంచి, అసలు పాత్రకి నాగేశ్వరరావు తగడని ఆయన అభిప్రాయ పడ్డారు. పరిస్థితులూ అలాగే ఉన్నాయి.

కథలో శరాబంది రాజుకు ముగ్గురు భార్యలు తయారవుతారు గ్రూపు ఫోటో వేళకి.

ఒకామె శాంతకుమారి; రెండవ ఆమె ఎం.వి. రాజమ్మ; మూడో అమ్మాయి ఎస్. వరలక్ష్మి.

ముగ్గురు భార్యల మొగుడు కావడానికి తగ్గ పౌరుషం లేదనీ, వరహీనం అవుతుందనీ, వాళ్ళ ముందు అర్భకుడిలా కనబడతాడనీ రామబ్రహ్మంగారు అన్నారు. ఆ మాట నిజమే. ఎం. వి. రాజమ్మ కన్నడ యువకు డొకడిని సిఫార్సు చేసింది ఆ వేషానికి. అతనూ ఇలాగే ఉన్నాడు.

నాగేశ్వరరావు ఈ పాత్రకి బాగుండడని రామబ్రహ్మంగారు అన్నా, మధుసూదనరావుగారు ప్రయత్నం మానలేదు. ఇది మంచి కంపెనీ అనీ, కథ మంచిదనీ, పాత్ర నాగేశ్వరరావును నిలబెట్టగలదనీ ఆయన భావించారు.

చల్లపల్లి రాజాగారికి పరిస్థితి చెప్పారు. ఆయన అంతకు ముందు నాగేశ్వరరావు నాటకాలు చూశారు. సదభిప్రాయం ఉంది. కుర్రాడు బుద్ధిమంతుడు. పైకి రావలసినవాడు. ఆయన సంగతి విని రామబ్రహ్మంగారికి ట్రంక్ టెలిఫోన్ చేసి, నాగేశ్వరరావుకి ఆ వేషం ఇవ్వడానికి సాధ్యమైనంతవరకూ ప్రయత్నించ వలసిందని సిఫార్సు చేశారు.

నెల్లాళ్ళయింది.

రామబ్రహ్మం గారు ఒక అభిప్రాయానికి వచ్చి, మధుసూదనరావుగారికి ఉత్తరం రాయించారు–ఓ సారి రావలసిందని.

ఆయన వెంటనే రాజాగారి దగ్గరకు వెళ్ళి ఉత్తరం చూపించి మద్రాసు బయల్దేరారు. రాజాగారు కూడా సంతోషించి, మళ్ళీ ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లాడారు.

"నేను వేషం ఇస్తానని చెప్పి ఉత్తరం రాసినా, మీరు ఇలా ఆయనచేత సిఫార్సులు గుప్పిస్తారా" అని రామబ్రహ్మంగారు కోపం తెచ్చుకున్నారు.

నాగేశ్వరరావును వెంట బెట్టుకొని తేనాంపేటలోని శారదా ఫిలింస్ ఆఫీసుకు వెళ్ళారు మధుసూదనరావుగారు. కార్డు పంపించారు లోపలికి. సహాయ దర్శకులు లంక సత్యం, ఇంటూరి వెంకటేశ్వరరావు హడావుడిగా తిరుగుతున్నారు. కొత్త హీరో కేసి ఒక్కొక్కసారి ఒక్కొక్కలా చూస్తున్నారు.

ఓ గంట కూర్చున్నారు మధుసూదనరావుగారు.

"ఆ గుడివాడాయన్ని రమ్మను" అని ఓ పొలికేక వినబడింది.

మధుసూదనరావుగారు ఉలికిపడి, నాగేశ్వరరావు కేసి చూశారు.

హీరో నాగేశ్వరరావు 'భీరో' అయి బిక్క మొహం పెట్టి తల అడ్డంగా తాటించాడు.

మధుసూదనరావుగారు లోపలి కెళ్ళారు. క్లయిమాక్సు సీనులో, హీరో విలన్‌ని దులిపేసే షో డౌన్ డైలాగులా, ధాటీగా, అనర్గళంగా ఒక లెక్చరు విజృంభించి భవంతి అంతటా నిండిపోయింది.

"మీ నాన్నగారు నాకు బాగా తెలుసు. ఆయన ఎంతో మంచివాడు. మర్యాదస్థుడు. పోనీ నువ్వు చెప్పావు గదా అని ఆలోచించి వేషం ఇస్తానని నీకు రాస్తే మళ్ళీ ఆయన చేత (రాజాగారు) ఫోను చేయిస్తావా...ఇలా సిఫార్సులతో వత్తిడి తెస్తావా? ఇంక నే నిచ్చే దేముంది? తీసుకో నువ్వే అధికారం. తీసుకుని వాణ్ణి బుక్ చెయ్యి...సత్యం, ఆ కంట్రాక్టు కాయితం ఇలా పట్రా...ఇంద. వెయ్యి, మీ వాడి కెంత జీతం యివ్వాలో కూడా నువ్వే వెయ్యి. సంతకం చెయ్యి" అన్నారు రామబ్రహ్మంగారు.

మధుసూదనరావుగారు ఒక అరగంట కూర్చుని జరిగిన కథ ఆయనకు వివరించి శాంతింప జేశారు. అగ్రిమెంటు మీద సంతకం చేసి ఇచ్చి 'జీతం మీరే వెయ్యం' దన్నారు.

"సరే, ఐదొంద లిస్తాను నెలకి" అన్నా రాయన.

మధుసూదనరావుగారు హాలులోకి వచ్చి నాగేశ్వరరావు కేసి చిరునవ్వుతో చూశారు.

కాని నాగేశ్వరరావు కూర్చున్న కుర్చీయే కనబడింది. అతను లేడు.

ఆఫీసు గదిలో గదమాయింపు కేకలకి బెదిరి ప్రతిభా ఆఫీసుకు పారిపోయాడు!

   

బలరామయ్యగారు వీపుతట్టి ధైర్యం చెప్పారు. "భయపడకు, అది ఉట్టి జడివాన, నీకు వేషం ఇచ్చేస్తాడు లే" అన్నారు నవ్వుతూ.

ఇంకో నిమిషం తరువాత మధుసూదనరావుగారు ఆ వార్తే చెప్పారు.

"ఇంతకీ మూలకారణం, మొదటిసారి ఆయన చూడవచ్చినపుడు నువ్వు దండం పెట్టక పోవడం...అవన్నీ నేర్చుకోపోతే ఎలా?" అన్నారు బలరామయ్యగారు.

ధనుర్విద్య నేర్చుకోవా లని నిశ్చయించుకున్నాడు నాగేశ్వరరావు. అతను వింట సంధించేవి నమస్కార బాణాలు; పువ్వులలాటి నవ్వులు. దీనికీ తెల్లవారు ఝామున లేచి సాధన చెయ్యాలి...

నాలుగో నాడు శారదా ఆఫీసునుంచి కబురు వచ్చింది.

కొత్త హీరోని రాజమ్మ పక్క నిలబెట్టి చూస్తారట.

ఇంకో పరీక్ష కాబోలు!

ఎత్తు మడమల జోళ్ళు వేసుకు పదమన్నారు మధుసూదనరావుగారు.

అప్పటికప్పుడు చైనాబజార్ కెళ్ళి ఒకటిన్నర అంగుళాల సోల్స్ ఉన్న జోళ్ళు కొని వేసుకు వెళ్ళాడు నాగేశ్వరరావు.

'రాజమ్మ పెద్ద హీరోయిను గదా' అని ఆమె పక్క వినయంగా నించుంటే, ఎత్తు మడమల జోళ్ళు వృథా. అవసరాన్ని బట్టి ధైర్యంగా రొమ్ము విరుచుకు నించున్నాడు హీరో.

"ఊఁ, సరే" అన్నారు డైరెక్టరు గారు.

నాగేశ్వరరావుకు శరాబందిరాజు వేషం లభించింది. మధుసూదనరావుగారు వెళ్ళిపోయారు.

రామబ్రహ్మంగారికి మాత్రం కోపం చల్లారలేదు. ఆ వేడి నెల్లాళ్ళు వుంది. రిహార్సలులో గాని, సెట్‌మీద గాని ఆయన అసలు నాగేశ్వరరావుతో మాట్లాడనే లేదు. లంక సత్యం, ఇంటూరి రాయబారులు.

పరిస్థితి గమనించిన వారం రోజులకే నాగేశ్వరరావు ఇంటికి ఉత్తరం రాసి దైతా గోపాలం గారిని రప్పించుకున్నాడు. డైలాగులు చెప్పడంలో ఆయన ఇతనికి ఇంటి దగ్గర తరిఫీదు ఇచ్చేవారు.

సెట్‌మీద సి.ఎస్.ఆర్., డా॥ గోవిందరాజుల సుబ్బారావు, కన్నాంబ వంటి పెద్ద నటీనటుల మధ్య, శాంతకుమారి, రాజమ్మ వంటి పెద్ద హీరోయినుల మధ్య, వరలక్ష్మి వంటి చక్కని పడుచు పక్కన నిల్చుని పని చేయడం నాగేశ్వరరావుకు కొత్తలో ఇబ్బందిగానే ఉండేది.

"–కాని, వారంతా ఎంతో ఆదరంతో నన్ను చేరదీసి దారి చూపేవారు" అంటాడు నాగేశ్వరరావు.

సి. ఎస్. ఆర్., సుబ్బారావుగారు, కన్నాంబ అతనికి డైలాగులు చెప్పే పద్ధతి చెబుతూ వుండేవారు. ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క పద్ధతిలో చెప్పేవారు. ఇంటి దగ్గర గోపాలం గారు ఇంకోటి చెప్పేవారు.

రామబ్రహ్మంగారు ఇంకోటి చెప్పేవారు.

ఇన్ని పద్ధతు లున్నాయా అనిపించేది నాగేశ్వరరావుకు.

చివరకు తనకు తోచినది, నచ్చినది ఇంకోటి కుదిరేది. ఇన్ని ఉండగా ఇది మాత్రం ఎందుకు కూడదు అనుకొని, టేక్‌లో ఆ పద్ధతిని చెప్పేవాడు.

రిహార్సలులో మాత్రం ఏ గురువు దగ్గర ఆ పద్ధతిలో వల్లించేవాడు.

అతనికి వ్యక్తిగత సమస్య ఒకటుండేది. ఈ హీరో డైలాగులు చెప్పినపుడు ఆడపిల్ల మాటల వయ్యారం, కులుకు, సన్నాయి నొక్కులు తొంగి చూసేవి. వాటిని పట్టుకుని నివారించుకోవడం ఒక సమస్య. మరొక వంక నడక, నటన కూడా ఆడ ధోరణిలో వస్తాయన్నది. ఇంకొక వంక హీరోయిన్‌లు ఇద్దరూ తన కన్న బాగా పెద్దవాళ్ళు కావడం.

"అయ్యో! నా బిడ్డలా వున్నాడు, ఎలాగమ్మా" అనేది శాంతకుమారి.

"నాయనా, అలా కాదు రా...ఇటు చూడు, ఇలా చూడాలి. ఇలా తల దర్జాగా పై కెత్తాలి..." అని ఆవిడ అతని భంగిమలు తీర్చిదిద్దేది.

రాజమ్మ అతన్ని చూసి నవ్వేది–జాలిగా. 'ఫరవాలేదు, భయపడకు' అని ధైర్యం చెప్పేది.

ఎస్. వరలక్ష్మి దగ్గర మాత్రం అతనికి భయం కలగలేదు. తన వయసు పిల్ల. తనకన్న చిన్నదేమో కూడ!

"మీ రాడవేషం వేస్తే మీ అంత బాగుండనేమో" అనేది నవ్వుతూ.

"మొత్తానికి ఆడపిల్ల బుద్ధి పోనిచ్చుకున్నావు గాదు" అన్నాడు నాగేశ్వరరావు.

వరలక్ష్మి నవ్వింది.

"పోన్లే, ఆడది మెచ్చిందే అందం అన్నారు పెద్దలు" అన్నాడు నాగేశ్వరరావు.

నిజానికి నాగేశ్వరరావు అప్పటి కింకా ఆడపిల్లల గొడవల గురించి మాట్లాడడం తగ్గలేదు.

నాటకాల రోజులలో డైలాగులు, నటన తప్పించి మూడో విషయం వస్తే అది అలంకారాల గురించే.

అతను అలంకార ప్రియుడు. నాటికీ నేటికీ కూడా అంతే. నాటకాల రోజుల్లో అతని గాజులు, చీరెలు, జాకెట్లు, విగ్గు వగైరాలన్నీ రోజుల తరబడి చర్చించి నిగ్గు తేల్చి సెలెక్టు చేసుకునే వాడు. ఈ నాటికీ మేకప్ సరిగ్గా కుదరకపోతే ఆ అసంతృప్తి ప్రభావం ఆ నాడు అతని ప్రవర్తన మీదా, నటనమీదా కనిపిస్తుంది. ఇంటి కెళ్లిపోయే పర్యంతం చేస్తాడు.

ఒకనాడు గాజుల మాట వచ్చింది. అతను స్వతహా మితభాషి. పైగా ఆ రోజుల్లో భయం. ఆ పైన రామబ్రహ్మంగారి కోపం. ఒకవేళ మాట్లాడాలన్నా సెట్‌మీద పెద్ద నటుల పక్కన ఏం మాట్లాడగలడు?

వరలక్ష్మి ఉంటే కొంచెం మాట్లాడేవాడు. ఆమె సన్నగా పాడేది. అతను అప్పుడప్పుడు శ్రుతి కలిపేవాడు. ఆమెది మధురాతి మధురమైన కంఠస్వరం. అతనికి అత్యంత ప్రీతి పాత్రమైన స్వరం. అతను గౌరవించే స్వరం.

గాజుల చర్చ వచ్చినపుడు, తనకి తెలియకుండానే నాగేశ్వరరావు ఉత్సాహంతో తన అభిప్రాయాల, అభిరుచుల పంచాంగం విప్పాడు. పలకల గాజులు, గోవర్ధన గొలుసులు, జూకాలు, సేలం చీరెలు, ఉప్పాడ చీరెలు, రెండు జడలు, పట్టీలు, పాంజీబులు వగైరాల గురించి జోరుగా మాట్లాడేస్తున్నాడు. అంతా విన్నాక వరలక్ష్మి కిల కిల నవ్వింది.

"నేను ఆడపిల్ల బుద్ధి పోనిచ్చుకున్నాను కాదన్నారు. మీరు మమ్మల్నందరినీ మించి మాట్లాడుతున్నారు. నగలమీద నాకే తెలీవు ఇన్ని సంగతులు." అంది.

పక్కనే ఎవరో నవ్వారు.

నాగేశ్వరరావు హఠాత్తుగా సిగ్గుపడిపోయాడు. ముఖం ఎర్రబడిపోయింది.

"అంత సిగ్గయితే ఎలా?" అంది వరలక్ష్మి.

"సిగ్గు కాదు-కోపం, శౌర్యం" అన్నారు ఎవరో.

షూటింగ్ జరుగుతోంది. నెల్లాళ్ళు అయింది. రామబ్రహ్మంగారు నెల్లాళ్ళూ మాటాడలేదు. చిరాకు పడేవారు. నెల చివర మాత్రం నాగేశ్వరరావుకు కాస్త ప్రసన్నవదనం కనిపించింది.

ఆ మూడోనాడు మధుసూదనరావుగారు రైలు దిగి వచ్చారు హఠాత్తుగా.

"ఉత్తరమేనా రాయలేదేమిటి?" అన్నాడు నాగేశ్వరరావు కంగారుగా.

"నేనూ అదే అడుగుతున్నాను. ఏం జరిగింది? నువ్వేం రాయలేదేం?" అన్నా రాయన ఇంకా కంగారుగా.

"ఏం జరిగింది?" అన్నాడు నాగేశ్వరరావు తెల్లబోయి.

"ఏమో! చూడు" అంటూ టెలిగ్రాం తీసి ఇచ్చారు మధుసూదనరావుగారు.

నాగేశ్వరరావు పకాలున నవ్వాడు.

"అదేవిఁటి? నవ్వేందుకు మధ్య?"

"నా కింగ్లీషు నేర్పమని బ్రతిమిలాడిన నాడు నేర్పలేదు. ఇవాళ టెలిగ్రాం మీద పడేసి-"

హఠాత్తుగా అతని నవ్వు మాయమైంది. ఎందుకో చిరాకులాటిది కలిగింది. తల వంచుకున్నాడు.

మధుసూదనరావుగారు అతని వీపు తట్టారు.

"ఫరవా లేదు. నువ్వూ నేర్చుకుందు గాని. అందరికన్న బాగా మాట్లాడుతావు ఒకనాడు...ముందు ఈ గొడవేమిటో చూద్దాం" అన్నారు.

ఆ టెలిగ్రాం రామబ్రహ్మంగారు ఇచ్చింది.

"స్టార్ట్ ఇమిడియెట్‌లీ" అని ఉంది అందుమీద.

❀ ❀ ❀ ❀

మధుసూదనరావు గారు అమితమైన ఆందోళనతో వెళ్ళారు. నాగేశ్వరరావు అతనికి నచ్చకపోయివుండాలి. లేదా, ఏదన్నా పొరబాటు జరిగివుండాలి. ఏ కారణం వల్లనన్నా అతన్ని తీసేస్తే కర్తవ్యం ఏమిటి అన్నది ఆయనకు పెద్ద సమస్య అయింది.

ఎక్సెల్సియర్ క్లబ్ మూలపడిపోయింది. సినిమాలో చేరినా నెలకి పదిరోజులు వచ్చి నాటకాలు ఆడడానికి ఎగ్రిమెంటు అయినా అననుకూల పరిస్థితుల వల్ల అది సాధ్యపడలేదు. చివరికి ప్రదర్శనలు కొన్ని రద్దుకావడం, దరిమిలాను సమాజమే మూసెయ్యడం జరిగింది. ఆరు మాసాలు తరిఫీదిచ్చి మెరికలాటి నటుడిని తయారు చేశారు. మళ్ళీ అలాటి కుర్రాడు దొరకాలి. మళ్ళీ ఆరు మాసాలు వాడిని సాగదియ్యాలి...ఎందుకో, నాగేశ్వరరావు వెళ్ళడంతో అందరికీ ఉత్సాహం చల్లారిపోయింది.

ఇప్పుడు నాగేశ్వరరావు కాళీ అయితే మళ్ళీ అది ప్రారంభించడం సాధ్యపడుతుందో పడదో! ఈ కుర్రాడి భవిష్యత్తు ఏంకాను?...

శారదా ఆఫీసు హాలులో కూర్చొని కార్డు లోపలికి పంపి, రాబోయే విమర్శల వర్షానికి జవాబుల గొడుగు తయారు చేయబోయారు మధుసూదనరావుగారు.

కార్డు వెళ్ళిన కొద్ది క్షణాలలో రామబ్రహ్మంగారే ఇవతలికి వచ్చారు. 'రావయ్యా, రా' అంటూ ఆప్యాయంగా పిలిచారు.

మధుసూదనరావుగారు ఆశ్చర్యచకితులై, మరబొమ్మలా గదిలోకి నడిచారు.

"బలే కుర్రాడయ్యా, మీవాడు! అయామ్ హాపీ...హి హాజ్ డన్ వెల్..." అన్నారు రామబ్రహ్మంగారు.

మధుసూదనరావుగారు బ్రహ్మానందపడిపోయారు.

రామబ్రహ్మంగారు ఆయన్ను అసలు మాట్లాడనివ్వలేదు. ఒక సెట్‌మీద షూటింగ్ అయిందిట. రష్ ప్రింట్లు ఆ క్రితం రోజునే చూశారాయన. నాగేశ్వరరావు బాగున్నాడు. చాలా బాగున్నాడు. ఆయనకి నచ్చాడు.

"నీకు చూపిద్దామని టెలిగ్రా మిచ్చాను. ఇవాళ రా...స్టూడియోకెళ్దాం..." అన్నారు. "చూడు, వాడిని కూడా తీసుకు రా, పాపం..." అన్నారు.

కాని, తను ఇలా మెచ్చుకున్న సంగతి మాత్రం నాగేశ్వరరావుకు చెప్పవద్దని పదిసార్లు హెచ్చరించారు. "చెబితే పొగరు బలుస్తుంది, కొమ్ములు తిరుగుతాయి" అన్నారు.

మధుసూదనరావుగారు బసకు వెళ్ళి నాగేశ్వరరావును తీసుకుని ఆఫీసుకు వచ్చారు. అతని కేమీ చెప్పలేదు. ముగ్గురూ న్యూటోన్ స్టుడియోకు బయల్దేరారు.

కొంత దూరం వెళ్ళేసరికి ఉండబట్టలేకపోయారు రామబ్రహ్మంగారు.

"ఒరే...కుర్రాడా! భేషుగా చేసేశావురా, పైకొస్తావు పో" అనేశారు.

మధుసూదనరావుగారు పకాలున నవ్వారు-

నాగేశ్వరరావు ఓడిపోలేదు. గెలిచాడు. ఇంక అతనికి ఫరవాలేదు. ఆయన అతని వంక చూశారు.

వినయంగా తలవంచుకున్నాడు. సన్నటి చిరునవ్వు మబ్బుచాటు చంద్రుడిలా తొంగి చూస్తోంది. బుగ్గ మీద అందమైన సొట్టలో ఆనందం తొణికిసలాడుతోంది.... ఆనందోద్వేగంతో ఉద్ధృతంగా కొట్టుకుంటున్న అతని గుండె దడ మోటారు మోతమీద సన్నంగా వినిపిస్తోంది.

సినిమా ఛాన్సు వచ్చిననాడు, అతను దెబ్బ తింటే మున్ముందు ఏమయిపోతాడో అని అంతా చర్చిస్తున్న వేళ 'నేను వెళ్తాను' అని దృఢంగా అన్న నాగేశ్వరరావులో మేల్కొన్న ధైర్యం గెలుపు సాధించింది – సహృదయులు, వాత్సల్యపూరితులు అయిన బలరామయ్యగారి చేత 'ఓకే' అనిపించుకున్నప్పుడు కాదు;

తిక్కతో, ఒక రకం కోపంతో, ఇంచుమించు అయిష్టంతో వేషం ఇచ్చి తనతో మాట్లాడకుండా నెల్లాళ్ళు డైరెక్టు చేసి తన పాలిట సింహస్వప్నం అయిన రామబ్రహ్మంగారిని ప్రసన్నుడిని చేసుకున్నప్పుడు......

నాగేశ్వరరావు వినయం, మితభాషణం ఆయనను మొదట ఆకర్షించాయి. ప్రతిభ కూడా ఉందన్న భావం రావడంతో ఆయన అతన్ని చేరదీసి ఆదరించారు. ఆ ఆదరానికి అవధులు లేవు.

"ఒరే, నువ్వు లాడ్జిలో ఏం తింటావుగాని మా ఇంటికి రారా, అక్కడే ఉందువుగాని" అన్నారు ఒకనాడు.

రామబ్రహ్మంగారికి పిల్లలు లేరు. ఆయన భార్య శారదాంబగారు చుట్టపక్కాల పిల్లల్ని తీసుకొచ్చి కొన్నాళ్ళుంచుకుని పంపిస్తూ వుండేది. నాగేశ్వరరావు రావడంతో ఆమె కన్న కొడుకులా సాకింది.

రామబ్రహ్మంగారూ అతన్ని కొడుకులాగే చూసుకునేవారు. తాళంచేతులు అతనికి కిచ్చేశారు.

"నా బిడ్డ, నేను వీణ్ణి పెంచుకుంటాను" అనేవారు నలుగురితో.

తమ బంధువుల ఇళ్ళలో మంచి పిల్లను చూసి పెళ్ళి చెయ్యాలని కూడా సంకల్పించారు.

'పల్నాటి యుద్ధం' ఆరంభించిననాడు బాలచంద్రుడిని చూసి ఎంతో మురిసిపోయారాయన.

"వీడి చేత వెంగళరాయుడు, అర్జునుడు వేయించాలి. నేను వేయిస్తాను." అనేవారు....

బాలచంద్రుడినే సొంతం చూడకుండా కన్నుమూశా రాయన....

# శతచిత్ర జైత్రయాత్ర

'మాయలోకం' అయేసరికి అటు బలరామయ్యగారు 'ముగ్గురు మరాటీలు' ఆరంభించి అందులో నాగేశ్వరరావుకు హీరో పాత్ర ఇచ్చారు.

తరవాత 'పల్నాటి యుద్ధం' వచ్చింది. అందులో కన్నాంబ, గోవిందరాజు సుబ్బారావు మున్నగు ప్రఖ్యాత నటీనటుల మధ్య బాలచంద్రుడుగా వెలిగాడు నాగేశ్వరరావు. అందరూ అతన్ని వాత్సల్యంతో చూసి, పాత్ర నిర్వహణలో సహాయపడేవారు.

రామబ్రహ్మంగారి మరణంతో నిర్మాణం కొంతకాలం ఆగింది. తరువాత ఎల్. వి. ప్రసాద్‌గారు ఆ చిత్రం పూర్తి చేశారు.

అప్పటికి నాగేశ్వరరావు సినిమా యాక్టరు అనిపించుకున్నాడు. 'ఫరవాలేదు' అనీ, 'పై కొస్తా'డనీ, 'బాగున్నా'డనీ, 'ముద్దొస్తా'డనీ అనిపించుకున్నాడు.

ఆడపిల్ల వాలకం, భంగిమలూ వదిలించుకున్నాడు. మొగాడిలా డైలాగు చెప్పడం నేర్చుకున్నాడు. బెదురు చూపులను, సిగ్గును వదిలి శౌర్యం, సాహసం, ధీరత ప్రదర్శించడం సాధించాడు. జరిగినకథ ఊపుతో హావభావాలు ప్రదర్శించే వసతిని మరచిపోయి, నిల్చున్న పళంగా అడిగిన మేరకు కోరిన భావం ప్రదర్శించడం నేర్చుకున్నాడు. సాంఘిక నాటకాల నుండి మళ్ళీ జానపదాలకు మళ్ళడం కూడా అవసరమైంది.

ఇవన్నీ బ్రహ్మవిద్యలు అని కాదు. నాటకరంగానికి, అందులోనూ ఆడపిల్ల వేషాలకి అలవాటుపడి అక్కడ పేరు తెచ్చుకొనేటంత ప్రతిభ గడించినవాడు హఠాత్తుగా ఈ చివరకి రావడం, పోటీ మధ్య నెగ్గుకురావడం, అష్టావధానం చేసి పెద్దలందరికీ వారి వారి పాఠాలు ఒప్పగించి మంచి చేసుకోవడం, కాస్త పొరబాటుంటే ఎదుటి వారు పూర్తిగా తీసిపారేసే పరిస్థితులను ఎదిరించి నిలబడడం సులభసాధ్యాలు కావు.

'పల్నాటి యుద్ధం' ప్రాంతంలోనే అతనికి మరొక శ్రేయోభిలాషి దొరికాడు. ఏడెనిమిదేళ్ళనాడు తను 'తల్లి ప్రేమ'కు వచ్చినపుడు, తమ్ముడిలా వెంట తిప్పుకుని అభిమానించిన డి. ఎల్. భరణీ సంస్థలో పనిచేస్తున్నారు. తెలుగు సినిమా పరిశ్రమలో చలనచిత్ర నిర్మాణం ఒక ప్రత్యేక విద్య అనీ, ఒక కళ అనీ గుర్తించగలిగిన వారంతా ప్రతిభావంతులైన ఇద్దరు ముగ్గురు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌లలో డి. ఎల్. ను ఒకరుగా ఎన్నిక చేసి గౌరవిస్తారు.

డి. ఎల్. కొత్త హీరోను భరణీ వారి 'రత్నమాల'లో బుక్ చేయించారు. నాటినుండి నాగేశ్వరరావు మాతృ సంస్థలలో అది ఒకటి అయింది. భరణి చిత్రాలు ఏడెనిమిదింటిలో నటించాడతను.

అప్పటికి అతనికి ఎస్. వరలక్ష్మి నాయకిగా నటించింది. పరిచయం వల్లా, ఆ పిల్ల కూడా రామబ్రహ్మంగారింట్లో "నాన్నా నాన్నా" అని తిరుగుతూ వచ్చినందువల్లా, నాగేశ్వరరావుకు ఆమెతో నటించడానికి బెదురు లేకపోయింది. 'రత్నమాల'లో భానుమతి నాయిక. అప్పటికే ఆమె పేరు గల తార, గాయని. ఆమెలో అప్పటికే ఒక రాజ్ఞీత్వం, ఒక దర్జా ఉండేవి. వచ్చిన రెండు మూడు రోజులలోనే ఆమె కలుపుగోలుతనం, సరసత, మాటకారితనం నాగేశ్వరరావుకు బెదురుపోగొట్టాయి. ఆమె పట్ల గౌరవం, స్నేహం ఏర్పడ్డాయి. భానుమతీ, నాగేశ్వరరావూ ఈనాడు కొన్ని విషయాల్లో చుక్కెదురు మనుషులైనా, వాదించుకున్నా, వారికి పరస్పరం నటులుగా గౌరవం, వ్యక్తులుగా స్నేహం ఎప్పుడూ ఉంటాయి.

## 'బాలరాజు నాగేసర్రావు'

నాగేశ్వరరావు విజయ పరంపరలో మొట్టమొదటి ఘనవిజయం – అతన్ని తారాపథాని కెత్తినది అతని ఏడవ చిత్రం 'బాలరాజు'. ఆడదంటే ఏమిటో, ప్రేమంటే ఏమిటో తెలియని గొల్ల పిల్లాడుగా – చూడ చక్కని చిన్నది ఒకటి స్తంభం మేడ దిగివచ్చి వెంటబడ్డా కన్నెత్తి చూడని చిన్నవాడుగా అతను ఆంధ్ర ప్రేక్షకుల హృదయాలను అపహరించాడు. అందరిలోనూ మధురమైన ప్రేమభావం చివురింపజేశాడు. ఆ చిత్రంతో అతను పాప్యులర్ హీరో అయ్యాడు. అతనికి గ్లేమరును మించిన కాంతి ఆవరించింది. ఆ పాత్రతో ప్రేక్షకుల అభిమానమే కాదు; ప్రేమనూ సంపాదించుకున్నాడు. 'బాలరాజు నాగేసర్రావు' అన్నది వ్యవహారనామం అయిపోయింది. బాలరాజు చిత్రం ఏడాది పైగా ఆడింది తొలి విడత. దాన్ని నూరుసార్లు చూసినవారు ఎందరో వున్నారు. పదిహేను ఇరవైసార్లు చూసినవాళ్ళు వందలకొద్దీ ఉన్నారు.

ఇంతటి ప్రేమాభిమానాలు గడించిపెట్టడానికి నాగేశ్వరరావు అందులో చేసిన అద్భుతమేమిటి అంటూ ఈనాడు విమర్శనచేసి కారణాలు ఆరాతియ్యడం అర్థరహితమైన పని. అందులో అతను బుద్ధిపూర్వకంగా అద్భుతమైన నటన ప్రదర్శించలేదు. అతని ముఖంలో, వాల్చిన కళ్ళలో, విప్పారిన కళ్ళలో, బుగ్గలలో, గిరజాలలో, వాలకంలో ఎక్కడోనో, అంతటానో మధురమైన ప్రేమ వెలిగింది. ఆనాటికి అతని జీవితం కూడా ఆ పాత్ర చుట్టూ ఉన్న కథకు దగ్గరగా ఉంది. వలచిన దాని వంక కన్నెత్తి చూడని 'ముగ్ధ బాలుడు' అతను.

దాదాపు పదేళ్ళ తరువాత 'సువర్ణసుందరి' చిత్రంలో మరొక అభిశప్త ప్రేమికుడి పాత్ర ధరించాడు. ఆకర్షణశక్తిలో దానికీ దీనికీ ఏదో సామ్యం ఉంది. ఆనాటి 'బాలరాజు' విజయానికి దీటైనది 'సువర్ణసుందరి' కూడా సాధించింది. ఇందులో కూడా నాగేశ్వరరావు మహానటుడి పనేమీ చెయ్యలేదు. కొన్ని సన్నివేశాలలో నటన బాగుందని అభిమానులు మెచ్చుకున్నా, అతను ఒప్పుకోడు.

ప్రధానంగా రెంటిలోనూ నాగేశ్వరరావు ముఖంలో, కళ్ళలో ఉన్న శక్తే ప్రేక్షకులను ఆకర్షించింది. ఆ కథల సూత్రాన్ని అన్యులు ప్రయోగించినా ఎక్కి రాలేదు.

'రత్నమాల' రోజులలోనే భరణీ వారికి - డి. ఎల్. గారికి లైలామజ్నూ ప్రేమగాథను తెరకెక్కించాలన్న సంకల్పం కలిగింది. 'రత్నమాల'లో 'కొత్తహీరో' బాగున్నాడు కాబట్టి అతన్ని తీసుకోవచ్చు. కాని, "మాడమ్" (భానుమతి) అంటే అతనికి భయభక్తులు ఎక్కువ. భానుమతి పక్కన మజ్నూ పాత్రను జంకు లేకుండా నటించగలడో లేడో చూడాలని 'రత్నమాల' ఔట్‌డోర్ దృశ్యాలు తీసినపుడు, లైలామజ్నూ కథకు దగ్గరగా వచ్చే ప్రేమసన్నివేశాలు కొన్ని "సరదాగా" అంటూ తీశారు.

ప్రింట్ చేసి చూసుకున్నారు. బాగానే ఉన్నాడు.

ఒకనాడు భానుమతి, రామకృష్ణ, నాగేశ్వరరావు, డి. ఎల్. సినిమాకు వెళ్ళినపుడు హఠాత్తుగా అడిగారు.

"ఏవఁయ్యా, లైలామజ్నూ తీద్దామా.... మజ్నూ వేస్తావా?" అన్నారు.

నాగేశ్వరరావు భానుమతి వంక చూశాడు.

"మేడమ్ సరే అంటే నేను సైఁయే" అన్నాడు.

"సరే" అంది భానుమతి.

నాగేశ్వరరావు బెరుకు అప్పటికే చాలవరకూ తగ్గింది. రామకృష్ణ దంపతుల ఆప్యాయతే అందుకు కారణం.

అప్పటికి నాగేశ్వరరావు కింకా బైతు వేషం వదలలేదు. కనీసం - అతను చక్కని వేషం అనుకున్నది జనం అనుకునేలా లేదు. ఎం. ఎస్. 55 లాంగ్ క్లాత్ పైజామా, చొక్కా వేసుకు తిరిగేవాడు.

"ఈ డ్రెస్సేమిటయ్యా హీరోకి" అంది భానుమతి ఒకనాడు.

డి. ఎల్. ఆ మర్నాడు నాగేశ్వరరావును చైనాబజార్ తీసుకెళ్ళి ఫాషనబుల్ దుస్తులు కుట్టించాడు.

నాగేశ్వరరావు అప్పట్లో తేనాంపేటలో ఉప్పు చేపల బజారు పక్కన ఉండేవాడు. ఒకనాడు భానుమతి అతన్ని స్టుడియోకు పిల్చుకు వెళ్ళడానికి స్వయంగా కారు తీసుకెళ్ళింది.

ఆఫీసు కెళ్ళగానే రామకృష్ణ ఆమెను చూసి నవ్వాడు.

"అదేమిటి, మొహం అలా పెట్టావు? ఏదో చేపల వాసన వస్తున్నట్టు!" అన్నాడు.

"మీ హీరోని ఇల్లు మార్పించకపోతే, రేపు 'లైలామజ్నూ'లో లవ్ సీన్సులో కూడా నా మొహం ఇలాగే పెట్టాల్సి వస్తుంది" అంది భానుమతి.

"మీ హీరోయినుగారు మా యింటి కొచ్చారు లెండి. అక్కడ చేపల బజారు మీద తన అభిప్రాయం నటిస్తోందావిడ" అన్నాడు నాగేశ్వరరావు నవ్వి.

ఆ మర్నాడే డి.ఎల్. గారు నాగేశ్వరావును తన యింటికి తీసుకు వెళ్ళిపోయారు. కొద్ది రోజుల తరువాత తను వేరే యింటికి మారారు.

నాగేశ్వరరావుకు అప్పటికి నటుడుగా పేరు ఏ మాత్రం రాలేదు. మాయలోకం, ముగ్గురు మరాటీలు, కీలుగుర్రం వగైరాలలో దాదాపు కీలుబొమ్మలా తిరిగాడు. అవసరం కూడా అంతే. కత్తి తిప్పడం, గుర్రం ఎక్కడం, డైరెక్టరుగారి సాయంతో విలన్‌ని చంపడం, ఇద్దరు ముగ్గురు హీరోయిన్‌లను పెళ్ళాడడం - ఇదే వరస. బాలరాజు, బాలచంద్రుడు ముద్దొచ్చిన వేషాలు.

అందువల్ల భరణీ వారి 'లైలామజ్నూ'లో నాగేశ్వరరావు హీరో అన్న వార్త బయటకు రాగానే పాండీబజారులో సంచలనం రేగింది.

"వాడు మజ్నూ యేమిటి? వాడి మొహం" అన్నా డొక వ్యక్తి.

"వాడి మొహమే దానికి తగినది" అన్నా డొక అభిమాని.

బాధ్యతగల పెద్దలు కూడా భానుమతి రామకృష్ణలకు హితవు చెప్పారు.

"అతను చిన్న కుర్రాడు. ప్రేమలో పడి ఎరగడు. ఇంక భగ్నప్రేమికుడేం చేస్తాడు?" అన్నా రొకరు.

"ఖూనీకోరు వేషం వెయ్యటానికి ఖూనీ చేసి వుండాలా" అన్నారు మరొకరు.

ఈ విమర్శలతో రామకృష్ణ దంపతులకు పట్టుదల మరింత పెరిగింది. నాగేశ్వరరావు అవసరాన్ని బట్టి అహంకారం కూడా తెచ్చి పెట్టుకున్నాడు.

"నే నా వేషం వెయ్యలేకపోతే ఇంకెవ్వడూ వెయ్యలేడు" అన్నాడు.

"అవును. నేను కూడా" అంది భానుమతి నవ్వి.

   

'లైలామజ్నూ' పెద్ద విజయం సాధించింది. చిత్రానికి పేరూ, డబ్బూ కూడా వచ్చాయి. నాగేశ్వరరావుకు నటుడుగా ప్రతిష్ఠ వచ్చింది. అంతవరకూ అతని విగ్రహంలో గట్టిగా కనబడని వ్యక్తిత్వం ఈ చిత్రంలో అతని పాత్రధారణలోనూ, తరవాత వ్యక్తిలోనూ కూడా ప్రస్ఫుటమైన రూపురేఖలు దిద్దుకుంది. మనిషి కొక నిండుతనం, హుందా వచ్చాయి. అవి అతనికి విమర్శలు ప్రసాదించిన కానుకలు.

ఆనాడే కాదు, సుదీర్ఘమైన నాగేశ్వరరావు చలనచిత్ర యాత్రలో అతనికి జవసత్వాలు ఇచ్చినవి - ముందుకు పోవాలన్న ఉత్సాహం, జయించాలన్న పట్టుదల, కర్తవ్యం ఆలోచించుకోగల బుద్ధి, మంచి నిర్ణయం చెయ్యగల వివేచన, ధైర్యం, స్థైర్యం, మొండితనం. వీటన్నిటినీ విమర్శల దుమారాలే ప్రసాదించాయి. ప్రశంసలు ఇచ్చే ఉత్సాహంకన్న ప్రతికూల విమర్శలు ఇచ్చే శక్తి చైతన్యాలే ఎక్కువనీ, వ్యక్తి

ముందుకుపోవడానికి అవే ముఖ్యమనీ నాగేశ్వరరావు లేత వయసులోనే గ్రహించాడు. అందుకే అతని మిత్రులలో చాలా మంది అతన్ని విమర్శించేవారే.

అయితే ఈ విమర్శలు అతన్ని బాధించలేదని కాదు. అవి వచ్చినపుడు మనిషిగా బాధపడ్డాడు. నొచ్చుకున్నాడు. నటుడుగా వాటినే ఉపయోగించుకుని ముందుకు సాగాడు.

'లైలామజ్నూ' తరవాత, 'సంసారం' చిత్రం వచ్చినప్పుడు ఇలాటిదే మరో దుమారం లేచింది. అప్పటికి అతనికి ఫోక్‌లోర్ హీరో (జానపద కథానాయకుడు) అన్న బిరుదు వచ్చి స్థిరపడిపోయింది. సాంఘిక చిత్రంలో వేషం అనగానే అంతా చప్పరించారు. చిత్రం బాగు కోరేవారేకాక, నాగేశ్వరరావు శ్రేయోభిలాషులు కూడా అతనికి వేణు పాత్ర తగదన్నారు.

"కష్టపడి గడించుకున్న పేరు పోతుంది. తరవాత కంట్రాక్టులు రావు. మొత్తం దెబ్బతినిపోతావు - ఇందులో నువ్వు ఫెయిలయితే. ఫెయిలు కావడం ఖాయం" అన్నారంతా.

ఎదటివాళ్ళు అన్నారు కాబట్టి మనం నిరూపించాలన్న మూర్ఖపు పట్టుదల లేదు అతనికి. అందువల్ల తనూ ఆలోచించుకున్నాడు. తను ఆ పాత్రను నిర్వహించగలను అని ధైర్యం ఉన్నందువల్లనే, మిత్రుల అభిప్రాయాలను ఎదిరించి ఆ వేషం తీసుకున్నాడు.

ఆనాటి సినిమా రథం జానపద పథంలో నడుస్తున్నందువల్ల 'సంసారం' చిత్రమే ఒక పెద్ద సంచలనం. అదే ఒక పెద్ద మైలురాయి. ఆ నాటికి అపూర్వమైన విజయం సాధించింది అది. నాగేశ్వరరావుకు రెండింతలు పేరు తెచ్చిపెట్టింది. పల్లెటూరి కుర్రాడు బస్తీ వచ్చి నాజూకు దేలతాడు అందులో. రెండు భాగాలూ అతను వ్యక్తిగా ఎరిగున్నవే. రెండిటా హాయిగా అందంగా మనోహరంగా విహరించాడు నాగేశ్వరరావు. కత్తి యుద్ధాలు, ఇద్దరు ముగ్గురు పెళ్ళాలు, రాక్షసులూ తప్పినందువల్ల అతనికీ హాయిగా ఉంది. ఆ ధోరణి నటన తప్పించుకోవడం మాత్రం శ్రమ సాధ్యమే అయింది. ఆ చిత్రంలోనే సావిత్రి అనే అమ్మాయి అతనికి హీరోయిన్‌గా రాబోయి పనికి రాదనిపించుకుని చిన్న వేషం ఏదో వేసింది....

నాగేశ్వరరావును అంతా అభినందించారు. మెచ్చుకున్నారు. ఆశీర్వదించారు.

'సంసారం'లో దెబ్బ తింటే, ఉన్న ఫోక్ పిక్చర్లలో కూడా ఛాన్సు లేకుండా పోతాడన్న వాళ్లు దరిమిలాను అభిప్రాయాన్ని కొంత సవరించుకోవలసి వచ్చింది. 'సంసారం'తో ప్రేక్షకులకి ఫోక్ చిత్రాలమీద చిరాకు పెరిగింది. ఆ తరవాత వచ్చిన జానపదాలన్నీ దెబ్బ తిన్నాయి. నాగేశ్వరరావు 'సంసారం'లో నటించి పేరు తెచ్చుకుని ఉండకపోతే, జానపదాలనే నమ్ముకుని ఉంటే అతను నిజంగా దెబ్బతినేవాడు. కొంతవరకు అది జరిగింది కూడా.

'సంసారం' తరవాత అతని జానపద చిత్రాలే చాలా వచ్చాయి – తిలోత్తమ, సౌదామిని, మాయలమారి, స్త్రీ సాహసం, మంత్రదండం, వయారిభామ వగైరాలు. ముఖ్యంగా 1951లో చిత్రాలు వరసగా దెబ్బ తినడంతో 1952లో ఒక్క భరణీ సంస్థ తప్ప మరెవ్వరూ అతన్ని బుక్ చెయ్యలేదు. 'ప్రేమ', 'కాదల్' (తమిళం) రెంటిలో నటించాడు. అవీ బాగా పోకపోవడంతో కొత్త కథానాయకుడి కథ అయిపోయింది అనసాగారు పరిశ్రమలో జనం.

అందరికన్నా ఎక్కువగా అతనికే అనిపించింది. దిగాలు పడిపోయాడు. అంతకు మునుపు ఓహో అన్నవారు అనడం మానేశారు. కొందరు హూఁ అన్నారు. కొందరు మొఖం చాటేశారు. కొందరు మొహమాటానికి పలకరించారు. నాగేశ్వరరావు కీ ఛాయలన్నీ బోధపడ్డాయి.

మధుసూదనరావుగారూ, రామబ్రహ్మంగారూ చాలా బాధ పడ్డారు.

ఇంటి దగ్గర భార్య అన్నపూర్ణ అతనికి ధైర్యం చెప్పింది.

"ఇంతకన్న పెద్ద గండాలు దాటాను నేను" అన్నాడు నాగేశ్వరరావు ధైర్యం నటించి.

అన్నపూర్ణ సానుభూతితో మందహాసం చేసింది. అక్కడే ఉన్న ఆప్తమిత్రుడొకడు నాగేశ్వరరావు వంక చూసి చిత్రంగా నవ్వాడు.

నాగేశ్వరరావు బాగా నటించలేకపోయిన కొద్దిపాటి సందర్భాలలో ఇది ఒకటి అనుకున్నా డతను. నాగేశ్వరరావు బాధపడుతున్నాడు. భయపడుతున్నాడేమో కూడా... ఒకందుకు అతను సంతోషించాడు. తన అభిమాననటుడు అపజయాన్ని, అధైర్యాన్ని ఎరగడు – అది నటించడం కూడా రాదు. రాకూడదు.

1953 సంవత్సరం కూడా అలాగే సాగింది. కాని రెండు మంచి చిత్రాలలో నటించాడు. ఒకటి 'పరదేశి'; మరొకటి 'కన్నతల్లి'. 'పరదేశి'లో వయసు మళ్ళినవాడి పాత్ర ధరించాడు. ఇదొక కొత్త సాహస యాత్ర. నటన, నడక, పలుకుబడి అన్నీ చిన్న చిన్న విషయాల దగ్గర నుండి ఆలోచించుకుని నటించాడు.

ఇంచుమించు ఆ సమయంలోనే పెద్ద దుమారం చెలరేగింది. ఈసారి పరిశ్రమలోని వారేకాక, దేశంలో ప్రేక్షకులు కూడా చాలామంది కలగజేసుకున్నారు.

"డి. ఎల్. నారాయణగారు 'దేవదాసు' తీస్తున్నారట. అందులో నాగేశ్వరరావు ముఖ్య పాత్ర ధరిస్తున్నాడట. డి. ఎల్. కు మతేమన్నా పోయిందా" అన్నారు కొందరు మృదువుగా.

నాగేశ్వరరావు అనర్హతను చాటడానికి భాష చాలని వారు, అతని పాత చిత్రాలను కూడా తిట్టసాగారు. కొన్ని పత్రికలు ఉద్రేకంతో వ్యాసాలు రాశాయి. ఆంధ్రుల అభిమాన కథ. అందులో అభిమాన పాత్ర తెర కెక్కించినపుడు జాగ్రత్త అవసరమని హెచ్చరించాయి.

'దేవదాసు' పట్ల అభిమానం ఇంతగా ఉందన్న సంగతి ఆ సంచలనం ద్వారా ఋజువైంది. డి. ఎల్. మాత్రం చలించలేదు.

నాగేశ్వరరావు ఎక్కడలేని ధైర్యంతో ఆ పాత్రను చేపట్టాడు. ప్రతి విమర్శ అతని పౌరుషాన్ని రెచ్చగొట్టింది.

అతను అంతకు ముందు కొంత కాలంగా శరత్ సాహిత్యం అంతా చదువుతున్నాడు. సముద్రాల రాఘవాచార్యులవారు పుస్తకాలు తెప్పించి పెట్టారు. ఇపుడు 'దేవదాసు' చేతబట్టుకొని శ్రద్ధగా చదవసాగాడు. దేవదాసుకు తెలుగులో వచ్చిన అనువాదాలలో చక్రపాణిగారిది చాలా మంచిది. అప్పటికి ఉన్నదీ అదే.

నాగేశ్వరరావు తరుచు చక్రపాణిగారి దగ్గరకు వెళ్ళి ఆ నవలను గురించి, అందులో పాత్రల గురించి చర్చించి, వాటి గురించి చాలా తెలుసుకున్నాడు.

దర్శకుడు వేదాంతం రాఘవయ్యగారితో ఇంకెంతో చర్చించేవాడు.

"డి. ఎల్., తాత (వేదాంతం), ఆచార్యులుగారూ అంతా నా మీద అభిమానంతో, ఎంతో ఓపికతో నాకు తోడ్పడ్డారు. ఆ రోజులు, ఆ అనుభూతి ఎన్నటికీ మరువలేను" అంటారు నాగేశ్వరరావు ఈ నాటికీ.

దేవదాసు తాగుబోతు అయి, ఆరోగ్యం నాశనం చేసుకున్న ఘట్టాలలో నటనకు దేహస్థితి. కూడా తోడుకావాలని నాగేశ్వరరావు నిద్రాహారాలు మానేశాడు. రాత్రి మేలుకుని పనిచేస్తే కొన్ని భావాలకు వీలుగా వుంటుందని, కొన్నాళ్ళపాటు రాత్రి పన్నెండు నుండి తెల్లవారే వరకూ షూటింగ్ పెట్టించాడు. తోటి నటీనటులంతా ఎంతో సహృదయంతో అతని కోరిక మన్నించి, వారికి అవసరం లేకపోయినా రాత్రిళ్ళు పనిచేయడానికి వచ్చేవారు.

చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రానికి డబ్బు వస్తుందా రాదా అన్నది ప్రశ్న కాదు. జనం, విమర్శకులు రాళ్ళు రువ్వుతారా, పూలు విసురుతారా అన్నదే దర్శక నిర్మాతలను, నటులను ఆందోళన పరచిన ప్రశ్న.

పరిశ్రమలో కొందరు పెద్దలకు చూపించారు. పత్రికలవారికి చూపించారు. తరవాత ప్రజలకు చూపించారు. ఎంత దుమారం రేగిందో అంతటి గొప్ప సంచలనం కలిగింది. పుష్పవృష్టి. కనకవర్షం.

దేశాన్ని ఉత్తేజితం చేశాడు దేవదాసు.

'నభూతో న భవిష్యతి' అన్నారు చూసినవారు. విమర్శకులు ఎంత ఉద్రేకంతో, ఎంత తీవ్రంగా ఒకప్పుడు ఖండించారో, ఇప్పుడు అంత గట్టిగా హృదయపూర్వకంగా నాగేశ్వరరావును మెచ్చుకున్నారు.

నాగేశ్వరరావు కంట నీరు తిరిగింది.

నాగేశ్వరరావు చిరంజీవి అవుతాడని దీవించారు. సినీ జీవితంలో ఇంక అతనికి అపజయం ఉండదన్నారు. అతనికి ఉత్తమ నటుల శ్రేణిలో గౌరవస్థానం ఇచ్చారు. తమిళ దేశంలో కూడా దేవదాసు అంతగాను ప్రజాదరణ పొందింది.

నాగేశ్వరరావు ఉచ్చారణలో స్వల్ప లోపాలున్నా వాటిని ఎవరూ పట్టించుకోలేదు.

ఈ నాటికీ మద్రాసులో విద్యావంతుల దగ్గర నుంచి రిక్షావాడి వరకూ నాగేశ్వరరావు పేరు చెబితే దేవదాసును తలచి మెచ్చుకుంటారు.

వ్యక్తిగా, నటుడుగా నాగేశ్వరరావుకి అది ఘన విజయం.

చిన్ననాటి గండాలు, సినిమాలో చిన్ననాటి గండాలు అన్నీ ఒక ఎత్తు; ఇది ఒక్కటే ఒక ఎత్తు. అప్పటికే పడిపోయాడనిపించుకున్న నాగేశ్వరరావు ఇందులో దేవదాసు పాత్రను పాడుచేశా డనిపించుకుని ఉంటే అదే అతని ఆఖరు చిత్రం అయుండేది.

కాని నాగేశ్వరరావు సంతోషించింది - తనకి కొత్త ఆయుర్దాయం కలిగినందుకు కాదు; కొత్త చిత్రాలు వస్తాయని కాదు. ఈ చిత్రంలో ఈ అగ్ని పరీక్షలో నెగ్గినందుకు.

'దేవదాసు'తో నాగేశ్వరరావుకు రోజులు మారాయి.

అతని పద్ధతులూ మారాయి. మంచి పేరు రుచి తెలిసింది. మంచి కథ పస తెలిసింది. కష్టపడి గడించిన రూపాయతో, ఆనందంగా భోజనంచేసిన గొప్ప రోజు అది.

ఇంక ఈ మూడిటినీ వదలుకోకూడదు. ఇంకో రకం వాటి జోలికి పోకూడదు. కథను, పాత్రను జాగ్రత్తగా ఎన్నుకోవాలి.

తరువాత వచ్చిన చిత్రాలూ అనుకూలమైనవే - చక్రపాణి, పరివర్తన, విప్రనారాయణ, అర్ధాంగి, రోజులు మారాయి, అనార్కలి, సంతానం, వదిన, దొంగరాముడు, తెనాలి రామకృష్ణ, ఇలవేల్పు, చరణదాసి మొదలైనవి.

విప్రనారాయణ చిత్రం ఒకటి కొంత ఇబ్బంది పెట్టింది.

నాగేశ్వరరావు వేషం వేస్తున్నాడంటే, కూడదనే ధోరణి పూర్తిగా పోయింది. కాని ఒక ప్రముఖ దర్శకుడు - నాగేశ్వరరావు విశేషంగా గౌరవించే వ్యక్తి స్నేహరీత్యా హితవు చెప్పాడు.

"నాగేశ్వరరావు, నువ్వు నాస్తికుడివి. నీకు భక్తి అంటే ఏమిటో బొత్తిగా తెలియదు. విప్రనారాయణ పాత్ర ధరిస్తే వెలితిగా ఉండవచ్చు." అన్నాడాయన.

నాగేశ్వరరావు నవ్వాడు.

"నాకు భక్తి ఉండి, ఉన్న భక్తిని ప్రదర్శిస్తే నేను నటుడినే కాను. ఒక కళాకారుడుగా ఆ పాత్రను అర్థం చేసుకుని నటించ ప్రయత్నిస్తాను" అన్నాడు....

ప్రయత్నించి సాధించాడు.

నాటి నుండి అతని యాత్ర సాఫీగా సాగిపోతోంది.....

నాగేశ్వరరావుకు మంచి పేరు, రాష్ట్రపతి బహుమతి తెచ్చి పెట్టిన చిత్రాలలో అది ఒకటి.

అతని చిత్రాల్లో పేరు తెచ్చి పెట్టి, అతన్ని మంచి నటుడుగా ప్రతిష్ఠించిన చాలా చిత్రాలకు రా తగినంత డబ్బు రాలేదు. అతనికి, అతను పాల్గొన్న చిత్రాలకూ విశేషంగా డబ్బు గడించిపెట్టి, అతనిని బాక్సాఫీసు హీరోగా నిలబెట్టిన చిత్రాలు వేరు.....



ధర్మపత్ని



శ్రీ సీతారామజననం



మాయలోకం



ముగ్గురు మరాటీలు



రత్నమాల



పల్నాటి యుద్ధం



బాలరాజు



లైలామజ్ను



దేవదాసు



పల్లెటూరి పిల్ల


మణిదన్ మరవిల్లై తమిళం


బాటసారి


భార్యాభర్తలు


బుద్ధిమంతుడు


అక్కినేని నాగేశ్వరరావు స్వంత సంస్థ అన్నపూర్ణా పిక్చర్స్ వారి తొలి చిత్రం
దొంగ రాముడు ఘన విజయం సాధించింది.



"ఇదే నా నిజమైన ఆస్తి" అంటారు నాగేశ్వరరావు.
అభిమానులిచ్చిన ఈ బహుమతులు ఒక గదినిండా ఉన్నాయి.





కీ॥శే॥ ఘంటసాల
బలరామయ్యగారు



కీ॥శే॥ గూడపల్లి
రామబ్రహ్మంగారు



నాగేశ్వరరావు తల్లి
పున్నమ్మగారు



అక్కినేని రామబ్రహ్మంగారూ తమ్ముడూ



ఇద్దరు దేవదాసులు

దుక్కిపాటి
మధుసూదనరావు గారు



నాగేశ్వరరావు, కుటుంబం నాగసుశీల, నాగార్జున, శ్రీమతి అన్నపూర్ణ, సత్యవతి, వెంకటనారాయణ, సరోజ.



అక్కినేని నాగేశ్వరరావు తైలవర్ణ చిత్రపటం ప్రసిద్ధ చిత్రకారులు శ్రీఎస్.ఎన్. చామకుమార్ రూపొందించారు.
గుడివాడలో నాగేశ్వరరావు కళాశాలలో ఇది ఆవిష్కరించబడింది.

నాగేశ్వరరావు నటజీవన శిల్ప విశిష్టత ఈ రెండు రకాలనూ తగు పాళ్ళలో మేళవించుకోవడంలోనే ఉంది.

ఆబాలగోపాలానికీ అతణ్ణి అభిమాన పాత్రుణ్ణి చేసిన మొదటి చిత్రం 'బాలరాజు'. జానపదాలు వదిలి సాంఘికాలకు వచ్చాక ఆదర్శ ప్రేమికుడికి రూపకల్పన జరిగింది.

చక్కని ముఖం, చక్రాలలాంటి కళ్ళు, సన్నటిమీసం, చురుకైన చూపులు, ధైర్యం, సంస్కారం ఇవన్నీ కలిసి రూపొందిందా మూర్తి. నాగేశ్వరరావు ఆత్మశక్తి దానికి ప్రాణప్రతిష్ఠ చేసింది.

ప్రేమికుడుగా అతడు ప్రేక్షక ప్రపంచం అంతటినీ సమ్మోహితం చేశాడు. ఆడపిల్ల లందరికీ అతను స్వప్న సుందరుడు. వారు కోరే భర్త రూపం నాగేశ్వరరావు మాయా ఛాయా చిత్ర దర్పణంలో ప్రతిబింబించింది. యువకులకు వారు ఊహించుకునే అందం, ధైర్యసాహసాలూ అతనిలో కనిపించాయి. వయసు మళ్ళిన వాళ్ళకు తమ తమ చిన్ననాటి రూపాలు గోచరించాయి. నాగేశ్వరావుతోనే హీరోవర్షిప్ ఆరంభమైంది. ఏ తారకీ లభించని గ్లామర్ అతని చుట్టూ వెలిగింది. అతని ఫాన్‌మెయిల్‌లో ఆడపిల్లలు రాసిన ఉత్తరాలు ఎన్నో వుండేవి. విద్యార్థులు, ఉపాధ్యాయులు, లెక్చరర్లు, ఉద్యోగులు, రాజకీయవాదులు, మంత్రులూ కూడా అతని అభిమాన బృందంలో ఉన్నారు.

అందరి హృదయాలలోనూ వెలిగే ప్రేమకు అతడు ప్రాణమై, రూపమై భాసించాడు.

❀ ❀ ❀

# ప్రేమకథలు



దాదాపు వందమంది ఆడపిల్లలతో (జానపద, పౌరాణిక చిత్రాలలోని ఎక్స్ట్రా భార్యలు కలిపితే నూటయాభై మంది) సరసాలాడి, డ్యూయెట్లు పాడి, ప్రేమించి, ప్రేమించబడి, పెళ్ళాడిన కథానాయకుడి అసలు కథలో ప్రేమకి చోటెంత? నాగేశ్వరరావు లవర్స్ ఎంత మంది?

అతన్ని అడిగితే 'ముక్కోటి ఆంధ్ర ప్రేక్షకులు' అనవచ్చు. తన లవ్ ఎఫైర్స్ నూటనాలుగు చిత్రాలు అనవచ్చు. కళ అనవచ్చు కాకరకాయ అనవచ్చు. (అది అతని కిష్టమే అని గుర్తు)

ఒక విధంగా ఇవన్నీ నిజమే. అతను జీవితాన్ని ప్రేమించాడు. కీర్తిని ప్రేమించాడు. డబ్బుని ప్రేమించాడు. సుఖాన్ని ప్రేమించాడు. ఆనందాన్ని ప్రేమించాడు. వాటితో సరాగాలాడాడు. పరిగెడితే తరిమాడు. అవకాశాల పొదరిళ్ళలో పొంచి కూర్చుని, రాగానే పట్టుకున్నాడు.

అతను కళలో ఉన్నతిని ప్రేమించాడు. దానికోసం సాధన చేశాడు. తపస్సు చేశాడు. నిద్రాహారాలు మానేశాడు. ఐహిక సుఖాలు వదులుకున్నాడు. విజయం సాధించాడు.

కాని అతని జీవితంలో ప్రేమకథల కోసం అన్వేషిస్తే వాటిలో మీకు అల్లరి చిల్లరి లవర్ బాయ్ కనిపిస్తాడు. భగ్న ప్రేమికుడు కనిపిస్తాడు. త్యాగి కనిపిస్తాడు. నిండు హృదయాన్ని ప్రియురాలికి అర్పించి ఆమెను గౌరవిస్తున్న ఉత్తముడూ కనిపిస్తాడు.

నాగేశ్వరరావు చిన్నతనంలో ముదినేపల్లిలో నాటకాలాడే రోజుల్లో వాళ్ళ సమాజం ఉన్న యింటికి పక్క ఓ చక్కని చుక్క ఉండేది. సిలుకు చొక్కా వేసుకుని పచ్చగా బొద్దుగా ఉన్న ఈ కుర్రాణ్ణి చూసి ఒకనాడు నవ్వింది. అతనూ విశాలంగా నవ్వాడు.

ఆ తరవాత ఆ అమ్మాయి కనిపించినప్పుడల్లా నవ్వేసేవాడు. ఏం తోచకపోతే వీధిలోకి వెళ్ళి ఆమె వచ్చేదాకా నించుని, రాగానే నవ్వి, నవ్వగానే వెళ్ళిపోయేవాడు.

ఒకసారి ఆ అమ్మాయి దగ్గరగా వచ్చి, "అలా నవ్వుతా వేమిటి?" అంది.

"ఎలా?" అన్నాడు నాగేశ్వరరావు...

"అందంగా." అంది అమ్మాయి సిగ్గుపడి.

"నేనందంగా ఉంటానుగా" అన్నాడు అబ్బాయి సిగ్గులేకుండా.

"అది కాదు. అందరూ ఉంటే అలా నవ్వకూడదు." అంది.

"ఎలా నవ్వాలి?"

"అది కాదు. అసలు నవ్వకూడదు.... ఎక్కడో పల్లెటూరి బైతులా వున్నావే" అంది అమ్మాయి.

"నేనేం బైతుని కాను. సిలుకు డ్రెస్సు వేసుకోరు బైతులు." అన్నాడు నాగేశ్వరరావు కోపంగా.

తరవాత ఆ అమ్మాయి తరచు రిహార్సల్సు చూడడానికి వచ్చి నాగేశ్వరరావును చూస్తూ కూర్చునేది. నాగేశ్వరరావు ఆ అమ్మాయిని చూస్తూ వుండేవాడు.

"నువ్వంటే నా కిష్టం" అందా అమ్మాయి.

"నాక్కూడా" అన్నాడు అబ్బాయి.

"నీక్కూడా నువ్వంటేనే యిష్టమా?" అంది అమ్మాయి చమత్కారంగా.

భవిష్యత్తులో అదే నిజమవుతుందని ఆ పిల్లకు తెలిసి వుండదు.

రాత్రిళ్ళు అందరూ పడుకున్నాక ఆ అమ్మాయి మెల్లిగా వచ్చి ఇతని పక్కకి పక్కన పడుకుని ఒక లవంగం పెట్టి ఇతని చెంపమీదా, చేతులమీదా గీకేది.

అదేదో తమాషాగా వుందనుకున్నాడు అతను.

"ఇదుగో రేపు నాక్కూడా ఓ లవంగం తెచ్చిపెట్టు" అన్నాడు.

మర్నాడు రాత్రి తనూ లవంగం పుచ్చుకుని ఆ అమ్మాయి చేతుల మీదా, చెంప మీదా గీకాడు.

"పల్లెటూరి బైతు" అని వెళ్ళిపోయిం దాపిల్ల.

అమ్మాయీ అబ్బాయిల వరస మధుసూదనరావుగారు కనిపెట్టారు. అమ్మాయికి చివాట్లు, అబ్బాయికి టెంకిజెల్లలు వేశారు.

"తప్పు కాదూ?" అని గద్దించారు.

అది తప్పో కాదో నాగేశ్వరరావు కానాటికి తెలియలేదు. అతను పెరిగి తిరిగిన వాతావరణం అలాంటిది.

ఆ రోజుల్లో మధుసూధనరావుగారూ, అచ్చయ్యగారూ, పెంద్యాలా అంతా కలిసి సినిమాకో, నాటకానికో, బజారుకో వెళ్ళినప్పుడు నాగేశ్వరరావు, ఆడపిల్ల లెవరైనా ఎదురైతే నిస్సంకోచంగా వాళ్ళ వంక ఆపాదమస్తకం పరిశీలిస్తూ, చూసేవాడు. అతని దృష్టి వాళ్ళ చీర, రవిక, జడ, గాజులు, పట్టీలు ఎలా ఉన్నాయో, ఎలా చూస్తారో గమనించి తన వేషాన్ని దిద్దుకోవడానికే. అయినా మధుసూదనరావుగారు అడపాతడపా టెంకిజెల్లలు వేసి కోప్పడేవారు.

మద్రాసు వచ్చిన నాటికి నాగేశ్వరరావుకు బుద్ధి తెలిసింది.

ఇక్కడ ఉండగా ఇంకో అమ్మాయితో పరిచయం అయింది. ఇక్కడ టెంకిజెల్లలు కొట్టే ఆయన దగ్గర లేడు. పైగా దగ్గర ఉన్నవాళ్ళు ఆ అమ్మాయిని అతనికిచ్చి పెళ్ళి చేసే ధోరణిలో మాట్లాడేవారు. పెద్దల మాట వినవలెనని అతను ఆ అమ్మాయి పట్ల ఇష్టపడ్డాడు. అన్నిటికన్న ముఖ్యం ఆ అమ్మాయి ఇతనంటే ఇష్టంగా ఉండేది. ఒక ఘట్టంలో ఇద్దరూ ఉంగరాలు కూడా మార్చుకున్నారు.

అంతలో ఆ అమ్మాయి తలిదండ్రుల కిది తెలిసింది. సినీమావాడికి పిల్లనివ్వడం వాళ్ళ కిష్టంలేదు. బుద్ధిమంతుడైనా సరే వాళ్ళ కుటుంబం తమ అంతస్తుకు తూగదన్నారు. ఆస్తి చాలదన్నారు.

ఆ అమ్మాయి బాధపడింది. "నువ్వు పోట్లాడు నాగేశ్వరరావ్" అంది.

నాగేశ్వరరావు ధైర్యంగా భయపడ్డాడు.

"నాకు భయం.... నన్ను క్షమించు," అన్నాడు.

అవి అతను పైకి వస్తున్న రోజులు. అతని ఫస్ట్ లవ్ – వేరే వుంది. తన లక్ష్యం. ఇప్పుడు పెళ్ళికోసం తను రచ్చకెక్కి సాహసాలు చేస్తే తన వృత్తి దెబ్బ తింటుంది. తనకి చదువులేదు. ఈ వృత్తి వదిలితే జీవనోపాధి ఏమిటో తెలియదు. పెళ్ళాడి, ఇద్దరూ అవస్థపడాలి. తన లక్ష్యం దెబ్బతిందన్న బాధ తన కుంటుంది. అవన్నీ ఎలా వున్నా, అసలు తన లక్ష్యం దెబ్బతినడం తన కిష్టంలేదు.

"అదీకాక అసలు మనిద్దరికీ ఇష్టం కలగడానికి ముందు పెద్దల ప్రోత్సాహమే కారణం. ఇవాళ పెద్దలే ఒద్దంటున్నారు... ఒద్దు.... " అన్నాడు నాగేశ్వరావు.

ఆనాడు అలా పిరికివాడిలా, స్వార్థంతో మాట్లాడినందుకు సిగ్గుపడాలో కూడదో అతను తేల్చుకోలేకపోయాడు. కాని ఈనాడు గర్వపడుతున్నాడు.

ఆనాడు మాత్రం, సంగతి చెప్పినా చాలా ఆశపడ్డాడు. అందుకు తగ్గ నిరాశపడ్డాడు. ఎంతో బాధపడ్డాడు.

ఆ అమ్మాయిని పెద్దలు స్వగ్రామం తీసుకువెళ్ళిపోయారు. అక్కడకు వెళ్ళాక కూడా ఉత్తరాలు రాసుకునే వారిద్దరూ.

కొద్ది కాలం తరవాత, హఠాత్తుగా, నాగేశ్వరరావు చచ్చిపోయాడన్న నీలివార్త పుట్టింది. దేశంలో అతని అభిమానులు చాలా మంది కంగారుపడ్డారు. కొందరు మద్రాసు కూడా వచ్చారు.

ఈ వార్త నీలివార్తేననీ, నాగేశ్వరరావు బ్రతికే ఉన్నాడనీ ఘంటసాల బలరామయ్యగారు ఒక ప్రకటన చేశారు.

నాగేశ్వరరావు పెద్దన్న రామబ్రహ్మంగారు మద్రాసు వచ్చారు. జరిగిన దానికి చాలా బాధపడ్డారు.

"సినిమాలో చేర్పించినప్పుడే అనుకున్నాను. అన్నాను కూడా. భయపడ్డట్టే జరిగింది," అన్నారు.

వెంటనే పెళ్ళి ప్రయత్నాలు చేస్తానన్నారు.

నాగేశ్వరరావు కొంతసేపు సందేహించి నెమ్మదిగా మనవి చేశాడు అన్నగారికి. "పెళ్ళి కొన్నాళ్ళు వాయిదా వెయ్యా"లని. ఆ అమ్మాయి వివాహం అయ్యే పర్యంతం తను చేసుకోవడం ఇష్టం లేదు....

ఒక సంవత్సరం ఆగారు రామబ్రహ్మంగారు – తమ్ముడి మాటలో సహృదయతను మన్నించి.

నాగేశ్వరరావు చాలా రోజులు ఆ అమ్మాయిని తలచుకొని బాధపడ్డాడు. కాని తనలోనే. తన లక్ష్యం కోసం, తన ఆశలకోసం, అన్నగారు తన మీద పెట్టుకున్న ఆశలకోసం తను తన విధ్యుక్త ధర్మం ఒక్కటే అనుసరించాలి. అందుకోసం తన కోరికలను చంపుకోవడం అవసరమైతే అందుకు సిద్ధం కావాలి.

కొంత కాలం తరువాత అతని దృఢనిశ్చయానికి మరో ఘాతం తగలబోయింది. మరొక చిన్నది మనసు పడింది.

"నన్ను మన్నించు. నాకు నువ్వంటే గౌరవం వుంది. ఇష్టం ఉంది. కాని, నా జీవితంలో ముఖ్యమైన లక్ష్యంకోసం నా మనసును నేను చంపుకున్నాను...." అన్నాడు నాగేశ్వరరావు స్పష్టంగా, ఖచ్చితంగా.

ఆ అమ్మాయి ఇతని కేసి జాలిగా చూసింది.



# వివాహం



'లైలామజ్నూ' తీసే రోజుల్లో నాగేశ్వరరావుకు వివాహం (18 ఫిబ్రవరి, 1949) అయింది. వధువు దెందులూరు వాస్తవ్యులు శ్రీ కొల్లిపర వెంకటనారాయణగారి కుమార్తె అన్నపూర్ణ.

వాళ్ళు పెద్ద స్థితిపరులు. ఆ ప్రాంతాల గౌరవప్రతిష్ఠలు గల కుటుంబం.

అమ్మాయికి ఇంట మేనరికం ఉన్నా, అది ఇంట్లో అందరి ఆమోదమూ పొందలేదు.

అక్కినేని వారబ్బాయి వచ్చి చూసివెళ్ళాడు. కుర్రాడు బుద్ధిమంతుడిలాగే ఉన్నాడని తల్లిదండ్రులు భావించారు. అమ్మాయి అతని అర్ధాంగి కావటానికి మౌనంద్వారా అర్ధాంగీకారం సూచించింది.

నాగేశ్వరరావు జీవితంలో అనేక ఉద్యమాలు సంచలనం కలిగించి సమస్యలైనట్టే ఇదీ చర్చలూ, వాగ్వాదాలూ రేపింది.

అప్పటికి నాగేశ్వరరావు, ఇతరుల అసూయా ద్వేషాలకు గురికాతగినంత పేరు, డబ్బు గడించుకున్నాడు. వీపు తట్టడానికి వీల్లేనంత ఎత్తుకు ఎదిగాడు. ఒక వ్యక్తిత్వం గడించుకున్నాడు. ఇతరులకు కోపం తెప్పించగలిగేటంత స్వతంత్రంగా అభిప్రాయాలు (తనకి సంబంధించినవే) వెల్లడించసాగాడు. ఏమిటి, ఎందుకు లాటి ప్రశ్నలు అడిగే ధీమా గడించుకున్నాడు.

అందువల్ల అతని గురించి ఆకాశరామన్న ఉత్తరాలూ, అసభ్యకర ప్రచారాలూ ఆరంభమయ్యాయి. నాగేశ్వరరావు వట్టి అవినీతిపరుడనీ, వ్యభిచారి అనీ కొన్ని ఉత్తరాలు చాటాయి. మగసిరిలేనివాడని కొన్ని చాటాయి. అందువల్ల ఆ వుత్తరాల నిగ్గు వెంటనే తేలిపోయింది.

అయినా, సినిమావాడు సినిమావాడేననీ, నమ్మలేమనీ వెంకటనారాయణగారి బంధువర్గంలో కొందరు వాదించారు. నాగేశ్వరరావు భావిజీవితంలో బావమరిదీ, ఆప్తమిత్రుడూ కాబోతున్న వెంకటేశ్వరరావుగారు (వెంకటనారాయణగారి సోదరుడి పుత్రుడు) ప్రతికూల వర్గంలో ముఖ్యుడయ్యాడు.

"నాకు చెప్పకుండా, అమ్మాయి నసలు పెళ్ళిచూపుల కెందుకు కూర్చోబెట్టారు...." అంటూ పెద్దనాన్నగారితో వాదన ఆరంభించాడాయన.

అప్పటికే వెంకటనారాయణగారు మాట ఇచ్చేశారు.

వెంకటనారాయణగారు వత్తిళ్ళకు లొంగిపోయారు. ఏలూరు వెళ్తూ "అట్నించి గుడివాడ వెళ్ళి స్వయంగా సంగతి చెప్పివస్తాను" అని బయల్దేరా రాయన.

వెంకటేశ్వరరావుగారు కూడా ఆయనతో వెళ్ళారు. వెళ్ళిన మర్నాడే దెందులూరు నుంచి వాళ్ళ దగ్గరి బంధు వొకాయన వచ్చాడు. వెంకటేశ్వరరావును పక్కకు పిలిచాడు.

"పాప (అన్నపూర్ణ) నీతో ఓ కబురు చెప్పమందయ్యా" అన్నాడు.

"ఏమని?"

"అదే - వెంకటరాఘవపురం సంబంధం వద్దని చెప్పొద్దని నాన్నతో చెప్పమని అన్నయ్యతో చెప్పు-అంది" అన్నా డాయన నవ్వి.

"అలాగా - నిజమే?" అన్నాడు వెంకటేశ్వరరావు ఆశ్చర్యపోయి.

"అవును. నన్ను పంపిం దందుకే. వాళ్ళ పెద్దమ్మ ద్వారా నాకు చెప్పించింది.... మనది పెద్ద కుటుంబము - అలా మాటలు జరిగిపోయాక, మళ్ళీ మాట తప్పడం మర్యాద కాదు... అందుకనీ...."

వెంకటేశ్వరరావుగారు స్వగ్రామం వెళ్ళారు.

తల్లి ద్వారా అన్నపూర్ణ తేల్చేసింది-

"అతడు తప్ప మరొక సంబంధం అక్కరలేదు-" అని.

❀ ❀ ❀ ❀

అమ్మాయి ఇష్టపడింది కాబట్టి తప్పనిసరిగా అన్నగారు దారికి వచ్చారు.

ముహూర్తం గురించి నాగేశ్వరరావుతో మాట్లాడే ముందు ఆస్తిపాస్తుల వివరం అడిగారు. విజయా పిక్చర్స్ అధిపతి చెరుకూరి పూర్ణచంద్రరావుగారూ, కొడాలి వెంకటేశ్వర్లుగారూ కూడా వెళ్ళారు.

"ఐదెకరాల భూమి పిత్రార్జితం - పాతికవేల నగదు స్వార్జితం ఉంద"ని చెప్పాడు నాగేశ్వరరావు.

"బాంకులోనే ఉందిగా... చూడవచ్చా..." అన్నారు వెంకటేశ్వరరావుగారు.

నాగేశ్వరరావు నవ్వాడు.

"నేను చూపించగలిగేది నా డబ్బే అని మీరు నమ్మే పక్షంలో పాతికేం ఖర్మ, లక్ష రూపాయలు చూపిస్తా.... నే నెటుదిరిగీ సినిమావాణ్ణే గదా...."

వెంకటేశ్వరరావుగారు అదిరిపడ్డారు.

చప్పున చెంపదెబ్బ కొట్టినట్టయింది. గట్టివాడే అనుకున్నారు. ఒక నిముషం మౌనం ప్రవర్తిల్లింది.

గెలుపు నాగేశ్వరరావుదే. లౌక్యాన్ని ఒక్క సూటిమాటతో కొట్టేశాడు.

"ఇంకేం కావాలి?" అన్నాడు కొంచెం నిర్లక్ష్యంగా.

"ఎటు దిరిగీ మీరలా చెప్పాక ఇంక మేము ఇప్పుడు అడిగి తెలుసుకోవలసినవేమీ లేవు. ముమ్ముందు జీవితంలో చూసి తెలుసుకునేవే ఉంటాయి" అన్నాడు బావమరిది, కొంచెం అభిమానం కొద్దీ.

నాగేశ్వరరావు నవ్వాడు.

పెళ్ళి, ఆడపిల్ల ఇంటివారి అంతస్తుకు తగ్గ వైభవంతో, మొగ పెళ్ళివారికున్న గ్లేమర్‌కు తగ్గ సంరంభంతో ఫెళ్లున జరిగింది. సినిమా ప్రముఖులు పలువురు వెళ్లారు. ఎస్. వరలక్ష్మి గానసభ చేసింది. రామబ్రహ్మంగారు, పున్నమ్మగారూ తృప్తిగా నిట్టూర్చారు.

పెళ్ళి అయిన నాలుగైదు రోజుల తరువాత మద్రాసు ప్రయాణమవుతూ నాగేశ్వరరావు బావమరిదిని పక్కకు పిలిచాడు.

"చూడండి బావగారూ! నా దగ్గిర పెళ్ళికి ముందు రొఖ్ఖం పాతికవేలుందన్నాను కదా... ఇదుగో అందులో పెళ్ళి కర్చు ఇరవై రెండువేలయింది. రామబ్రహ్మంగారే పద్దువేసి ఇచ్చారు. పోతే ఇంక నా దగ్గరున్న దెంత? ఐదెకరాల పిత్రార్జితం మూడు వేల రొఖ్ఖం," అన్నాడు.

బావమరిది నిర్ఘాంతపోయాడు.

ఆనాటి మాటను ఇంకా గుర్తుంచుకున్నారు అల్లుడుగారు. ఇవాళ ఇంత ఘాటుగా ఒప్పగిస్తున్నారు.

"ఇతని గురించి చాలా పొరబాటుగా అంచనా వేసుకున్నాం. అసాధ్యుడు. అమ్మాయి కిక ఫరవాలేదు" అనుకున్నాడు ఆయన. ఆ క్షణంలోనే ఆయనకు నాగేశ్వరరావు మీద గౌరవం ఏర్పడింది. అప్పుడే ఆయన ఆప్తమిత్రుడయ్యాడు.

"బావగారూ, మన్నించాలి" అన్నాడు ఉద్వేగంతో చేతులు పట్టుకుని.

"మీవంటి అల్లుడు దొరికినందుకు నేను నిజంగా ఇపుడు గర్విస్తున్నాను. మా పాప అదృష్టవంతురాలు." అన్నాడు.

నిజానికి అదృష్టవంతుడు - భానుమతి మరో సందర్భంలో అన్నట్టు - నాగేశ్వరరావే. మిగతా ఏ అంశంలో ఒప్పుకున్నా మానినా - ఇందులో మాత్రం నాగేశ్వరరావు నిజంగా అదృష్టవంతుడు అని అతని బంధుమిత్రులంతా అంటారు. అతనూ హృదయపూర్వకంగా, గర్వంగా అంటాడు. అంతటి అనుకూలవతి, ఉత్తమా యిల్లాలు, సత్యవతి దొరకడం అతను జీవితంలో శుభోన్నతి సాధించడానికి ఎంతో దోహదం చేసింది.

ఆమె అతనికి ఉపన్యాసాలిచ్చి నీతులు చెప్పిందనికాదు. తెనాలి రామలింగకవి ఉపమించినట్లు - ఆ దాంపత్యంలో ఆమె ఆకు మాటు పిందెలా అమరి అందగించింది. భర్త పద్ధతులలో మార్పుకావాలని తోచినపుడు మౌనంతోనే, సహనంతోనే అది సాధించింది. ఆంధ్రదేశంలో ఎందరో ఆడపడుచులు భర్త కావాలని కోరుకొనే యువకుడు తనకు వరుడుగా లభించాడని ఆమెకు తెలుసు. కాని జీవితం సినిమా కథలో నాయికా నాయకుల ప్రేమఘట్టాలలా పూర్తిగా ఆనందంతో నిండిపోయి ఉండదనీ, అలా నింపుకోవడం వ్యక్తుల వంతు అనీ ఆమె నేర్చుకుంది. డాక్టర్ల భార్యలలాగా యాక్టర్ల భార్యలకీ ఇది కొంత అనుభవానికి వస్తుంది.

నాగేశ్వరరావు ఆనాటి వత్తిడిని బట్టి రాత్రింబవళ్ళూ స్టుడియోలకు వెళ్ళి పనిచేయవలసి వచ్చేది. రావడం పూర్తిగా అలసిపోయి, నీరసంగా, విసుగ్గా వచ్చేవాడు. ఇంట్లో అత్తగారికీ తనకూ, లోకంలోని అత్తాకోడళ్ళందరి లాగే రివాజు ప్రకారం కొన్నాళ్ళపాటు కొంత కలతలు తప్పేవికావు. గొప్పింటి పిల్ల కాబట్టి గారంగా పెరిగిన పిల్ల కాబట్టి మాట పడడం అలవాటు లేక సాయంత్రం భర్తరాగానే తన గోడు చెప్పుకోబోయింది. అలసటవల్ల, నీరసంవల్ల, తల్లిమీద అపార గౌరవంవల్ల నాగేశ్వరరావు భార్యమీదే కొంత చిరాకు పడేవాడు. వృత్తి రీత్యా ఉన్న చికాకులవల్ల అతనికి సానుభూతి చూపించి అనునయించే ఓపికా, తీరికా ఉండేవి కావు. భర్త నడత గురించి నిందలు ప్రచారం అయి అమెదాకా వచ్చినపుడు ఆమె వాదించకపోయినా కష్టబెట్టుకుంది.

మొత్తం మీద ఇంట్లో కలతలు ఒక ఘట్టంలో భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు తెచ్చేదాకా వెళ్ళాయి. "మీ అమ్మాయిని మీరు ఇంటికి తీసుకెళ్ళి పరిస్థితి గతులు నచ్చజెప్పుకోవడం మంచిది." అని ఒకసారి నాగేశ్వరరావు బావమరిదికి రాశాడు. వెంకటేశ్వరరావుగారు వెంటనే వచ్చి చెల్లెలికి హితబోధ చేశారు.

   

ముహూర్తం గురించి నాగేశ్వరరావుతో మాట్లాడే ముందు ఆస్తిపాస్తుల వివరం అడిగారు. విజయా పిక్చర్స్ అధిపతి చెరుకూరి పూర్ణచంద్రరావుగారూ, కొడాలి వెంకటేశ్వర్లుగారూ కూడా వెళ్ళారు.

"ఐదెకరా భూమి పిత్రార్జితం - పాతికవేల నగదు స్వార్జితం ఉంద"ని చెప్పాడు నాగేశ్వరరావు.

"బాంకులోనే ఉందిగా... చూడవచ్చా..." అన్నారు వెంకటేశ్వరరావుగారు.

నాగేశ్వరరావు నవ్వాడు.

"నేను చూపించగలిగేది నా డబ్బే అని మీరు నమ్మే పక్షంలో పాతికేం ఖర్మ, లక్ష రూపాయలు చూపిస్తా.... నే నెటుదిరిగీ సినిమావాణ్ణే గదా...."

వెంకటేశ్వరరావుగారు అదిరిపడ్డారు.

చుర్రున చెంపదెబ్బ కొట్టినట్టయింది. గట్టివాడే అనుకున్నారు. ఒక నిముషం మౌనం ప్రవర్తిల్లింది.

గెలుపు నాగేశ్వరరావుదే. లౌక్యాన్ని ఒక్క సూటిమాటతో కొట్టేశాడు.

"ఇంకేం కావాలి?" అన్నాడు కొంచెం నిర్లక్ష్యంగా.

"ఎటు దిరిగీ మీరలా చెప్పాక ఇంక మేము ఇప్పుడు అడిగి తెలుసుకోవలసినవేమీ లేవు. ముస్ముందు జీవితంలో చూసి తెలుసుకునేవే ఉంటాయి" అన్నాడు బావమరిది, కొంచెం అభిమానం కొద్దీ.

నాగేశ్వరరావు నవ్వాడు.

పెళ్ళి, ఆడపిల్ల ఇంటివారి అంతస్తుకు తగ్గ వైభవంతో, మొగ పెళ్ళివారికున్న గ్లేమర్‌కు తగ్గ సంరంభంతో ఫెళ్లున జరిగింది. సినిమా ప్రముఖులు పలువురు వెళ్లారు. ఎస్. వరలక్ష్మి గానసభ చేసింది. రామబ్రహ్మంగారు, పున్నమ్మగారూ తృప్తిగా నిట్టూర్చారు.

పెళ్ళి అయిన నాలుగైదు రోజుల తరువాత మద్రాసు ప్రయాణమవుతూ నాగేశ్వరరావు బావమరిదిని పక్కకు పిలిచాడు.

"చూడండి బావగారూ! నా దగ్గిర పెళ్ళికి ముందు రొఖ్ఖం పాతికవేలుందన్నాను కదా... ఇదుగో అందులో పెళ్ళి కర్చు ఇరవై రెండువేలయింది. రామబ్రహ్మంగారే పద్దువేసి ఇచ్చారు. పోతే ఇంక నా దగ్గరున్న దెంత? ఐదెకరాల పిత్రార్జితం మూడు వేల రొఖ్ఖం," అన్నాడు.

బావమరిది నిర్ఘాంతపోయాడు.

ఆనాటి మాటను ఇంకా గుర్తుంచుకున్నారు అల్లుడుగారు. ఇవాళ ఇంత ఘాటుగా ఒప్పగిస్తున్నారు.

"ఇతని గురించి చాలా పొరబాటుగా అంచనా వేసుకున్నాం. అసాధ్యుడు. అమ్మాయి కిక ఫరవాలేదు" అనుకున్నాడు ఆయన. ఆ క్షణంలోనే ఆయనకు నాగేశ్వరరావు మీద గౌరవం ఏర్పడింది. అప్పుడే ఆయన ఆప్తమిత్రుడయ్యాడు.

"బావగారూ, మన్నించాలి" అన్నాడు ఉద్వేగంతో చేతులు పట్టుకుని.

"మీవంటి అల్లుడు దొరికినందుకు నేను నిజంగా ఇపుడు గర్విస్తున్నాను. మా పాప అదృష్టవంతురాలు." అన్నాడు.

నిజానికి అదృష్టవంతుడు - భానుమతి మరో సందర్భంలో అన్నట్టు - నాగేశ్వరరావే. మిగతా ఏ అంశంలో ఒప్పుకున్నా మానినా - ఇందులో మాత్రం నాగేశ్వరరావు నిజంగా అదృష్టవంతుడు అని అతని బంధుమిత్రులంతా అంటారు. అతనూ హృదయపూర్వకంగా, గర్వంగా అంటాడు. అంతటి అనుకూలవతి, ఉత్తమా యిల్లాలు, సత్యవతి దొరకడం అతను జీవితంలో శుభోన్నతి సాధించడానికి ఎంతో దోహదం చేసింది.

ఆమె అతనికి ఉపన్యాసాలిచ్చి నీతులు చెప్పిందనికాదు. తెనాలి రామలింగకవి ఉపమించినట్లు - ఆ దాంపత్యంలో ఆమె ఆకు మాటు పిందెలా అమరి అందగించింది. భర్త పద్ధతులలో మార్పుకావాలని తోచినపుడు మౌనంతోనే, సహనంతోనే అది సాధించింది. ఆంధ్రదేశంలో ఎందరో ఆడపడుచులు భర్త కావాలని కోరుకొనే యువకుడు తనకు వరుడుగా లభించాడని ఆమెకు తెలుసు. కాని జీవితం సినిమా కథలో నాయికా నాయకుల ప్రేమఘట్టాలలా పూర్తిగా ఆనందంతో నిండిపోయి ఉండదనీ, అలా నింపుకోవడం వ్యక్తుల వంతు అనీ ఆమె నేర్చుకుంది. డాక్టర్ల భార్యలలాగా యాక్టర్ల భార్యలకీ ఇది కొంత అనుభవానికి వస్తుంది.

నాగేశ్వరరావు ఆనాటి వత్తిడిని బట్టి రాత్రింబవళ్ళూ స్టుడియోలకు వెళ్ళి పనిచేయవలసి వచ్చేది. రావడం పూర్తిగా అలసిపోయి, నీరసంగా, విసుగ్గా వచ్చేవాడు. ఇంట్లో అత్తగారికీ తనకూ, లోకంలోని అత్తాకోడళ్ళందరి లాగే రివాజు ప్రకారం కొన్నాళ్ళపాటు కొంత కలతలు తప్పేవికావు. గొప్పింటి పిల్ల కాబట్టి గారంగా పెరిగిన పిల్ల కాబట్టి మాట పడడం అలవాటు లేక సాయంత్రం భర్తరాగానే తన గోడు చెప్పుకోబోయింది. అలసటవల్ల, నీరసంవల్ల, తల్లిమీద అపార గౌరవంవల్ల నాగేశ్వరరావు భార్యమీదే కొంత చిరాకు పడేవాడు. వృత్తి రీత్యా ఉన్న చికాకులవల్ల అతనికి సానుభూతి చూపించి అనునయించే ఓపికా, తీరికా ఉండేవి కావు. భర్త నడత గురించి నిందలు ప్రచారం అయి అమెదాకా వచ్చినపుడు ఆమె వాదించకపోయినా కష్టబెట్టుకుంది.

మొత్తం మీద ఇంట్లో కలతలు ఒక ఘట్టంలో భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు తెచ్చేదాకా వెళ్ళాయి. "మీ అమ్మాయిని మీరు ఇంటికి తీసుకెళ్ళి పరిస్థితి గతులు నచ్చజెప్పుకోవడం మంచిది." అని ఒకసారి నాగేశ్వరరావు బావమరిదికి రాశాడు. వెంకటేశ్వరరావుగారు వెంటనే వచ్చి చెల్లెలికి హితబోధ చేశారు.

   

అందరూ దుర్వ్యసనం అనే మద్యపానం గురించి స్వయంగా తెలుసుకోవాలన్న కుతూహలంవల్ల, వయసు అలాంటిది కావటంవల్ల, మిత్రుల వత్తిడివల్ల, నలుగురూ వత్తిడి చేసినపుడు తాగకపోతే కల్చరు కాదంటారన్న అపోహవల్ల, తన వృత్తికి అది మంచిది కాదన్న దురభిప్రాయంవల్ల నాగేశ్వరరావు ఒక ఘట్టంలో అప్పుడప్పుడు మద్యం తాగుతూ వచ్చాడు. అలవాటు పడ్డాడని కాదు. గత పది పదిహేనేళ్ళలో అతను మొత్తం ఒక ఇరవైసార్లు తాగివుంటాడు. అదేనా ఒక పాలు మద్యం అయితే తొమ్మిదింతలు సోడా వేసుకుని.

ఇది భార్యకు తెలియడం ఇష్టం లేదు.

ఒకనాడు కొందరు మిత్రుల వత్తిడివల్ల మామూలుకన్న కొంచెం ఎక్కువ తీసుకున్నాడు. భోజనం చేస్తే ఆమె పసిగట్ట వచ్చునన్న ఉద్దేశ్యంతో, లేని చిరాకు నటించి "తినే వచ్చాను" అని ముక్తసరిగా లాంగ్ షాట్‌లో చెప్పి వెళ్ళి పడుకున్నాడు.

అన్నపూర్ణ మాట్లాడలేదు. ఎక్కడ, ఎప్పుడు అని ప్రశ్నించలేదు. రాత్రి అతను ఆకలితో అవస్థపడ్డాడు.

మర్నాడు ఉదయం అతను స్తిమితపడ్డాక అడిగింది.

"మీరు రాత్రి అబద్ధం చెప్పారు" అంది.

నాగేశ్వరరావు ఉలికిపడి తలెత్తి చూశాడు.

"రాత్రి మీరు తాగారు. అన్నం తినలేదు. తిన్నానని అబద్ధం చెప్పారు. నాకు అప్పుడే తెలిసినా, మీరు ఇబ్బంది పడతారని అడగలేదు" అందామె.

తను చాలా తెలివైన వాడిననీ, అద్భుతంగా నటిస్తాననీ, అబద్ధం అవసరమైతే బాగా చెప్తాననీ, వెర్రిబాగుల పిల్లని నమ్మించడం సులువనీ అనుకుంటున్న నాగేశ్వరరావు తొలిసారిగా ఒక కొత్త సత్యం నేర్చుకున్నాడు–

ఎదటివాళ్ళ తెలివి తేటలను చాలా తక్కువగా అంచనాకట్టి, మనం అబద్ధం చెప్పి తప్పించుకుపోవడం చాలా తెలివితక్కువతనం అని.

ఈ అమ్మాయి తనకన్న తెలివైనది. తను చెబుతున్నది అబద్ధం అని తెలిసి కూడా, ఆ సమయానికి నమ్మినట్టు నటించి, తననే వెర్రిబాగుల వాడిని చేసింది.

నాగేశ్వరరావుకు భార్యమీద గౌరవం కలిగింది.

ఆమె ఎన్నడూ అబద్ధం చెప్పదు. చెప్పవలసిన అవసరం, ఆస్కారం లేని వాతావరణంలో పెరిగిన పిల్ల. అబద్ధం చెప్పేవాళ్ళ మీద ఆమె కోపగించుకుంటుందనీ, మాట్లాడదనీ అతనికి తెలుసు.

అతను తొలిసారిగా భయపడ్డాడు. నైతికంగా ఆమె ఉన్నత స్థాయిలో ఉంది.

"నిజమే అన్నపూర్ణా" అన్నాడు.

❀ ❀ ❀ ❀

రోజుకు రెండు మూడు కాల్‌షీట్లు పడినందువల్ల ఉదయం ఆరు గంటలకు వెళ్ళే నాగేశ్వరరావు రాత్రి ఏ రెండు మూడు గంటలకో ఇంటికి వచ్చిన రోజులు

1951-54ల మధ్య ఎన్నో ఉన్నాయి. సగటున రోజుకు 20 గంటలు పని చేసేవాడు. జీవితం ఏదో నటన ఏదో, నిజమేదో కల ఏదో, నిద్ర ఏదో మెలకువ ఏదో తెలియక తికమక పడిపోయిన రోజులవి. ఇంటికి వచ్చినా, ఇంత తిని ఒళ్ళు తెలియకుండా నిద్రపోవడం తప్ప ఇంట్లో వాళ్ళని పలకరించే తీరికా, ఓపికా ఉండేవి కావు. ఆ ప్రాంతంలోనే, వాసన్‌గారు 'సంసారం' హిందీలో తీయ సంకల్పించి నాగేశ్వరరావును బుక్ చేయిబోయి, అతను షాటుకీ షాటుకీ మధ్య నిద్రపోయే స్థితిలో ఉండడం చూసి అతనిని వదులుకున్నారు....

ఒకనాడు నాగేశ్వరరావు బాగా అలసిపోయి నీరసంతో, నిద్రమత్తుతో రాత్రి పూట కారు దిగి కుళాయి దగ్గిర కాళ్ళు కడుక్కుంటూ అక్కడే పడుకొని నిద్రపోయాడు.

కారు చప్పుడయినా తలుపు తట్టిన చప్పుడు కాకపోవడంతో పది నిముషాలు చూచి అన్నపూర్ణ ఇవతలికి వచ్చింది. అలసటలో ఒళ్ళు తెలియని నాగేశ్వరరావును భార్య, తల్లి ఇంచుమించు మోసుకుని లోపలికి తీసుకువెళ్ళారు.

మర్నాడు ఉదయం నాగేశ్వరరావుకు జరిగినదంతా గుర్తుకు వచ్చింది.

ఎదర అన్నపూర్ణ, ఎన్నడూ లేనిది కంట తడిపెట్టింది.

"లేదు అన్నపూర్ణా, ఇంక ఇన్ని పిక్చర్లలో ఎప్పుడూ వెయ్యను. ఎక్కువ పని చెయ్యడం కూడా ఒక వ్యసనమని ఇప్పుడు తెలుస్తోంది... బాధపడకు" అన్నాడు నాగేశ్వరరావు.

ఆనాడు ఆరంభించిన ప్రయత్నం అమలులోకి వచ్చి సాలుకు ఐదారు చిత్రాలకు పరిమితం కావడానికి రెండు మూడేళ్ళు పట్టింది.

"నే నా నిర్ణయం చేయడానికి మిగత కారణాలు ఉన్నా, ముఖ్యమైనది ఆమె మనసు నొప్పించకూడదన్నదే" అన్నాడు నాగేశ్వరరావు.



# నటుడు - వ్యక్తి



నాగేశ్వరరావు పుట్టి బుద్ధెరిగిన నాటినుంచి నటుడు. బడికి వెళ్ళి చదువుకోవలసిన రోజులలో స్టేజికి వెళ్ళి డైలాగులు చదువుకున్నాడు. చాలా మంది చదువుకుని వృత్తి ఉద్యోగాలు చూసుకునే వేళకు, నటనలో ప్రతిభ ఉండడం వల్లనో, ఆశ ఉండడం వల్లనో, అవకాశాలు రావడం వల్లనో ఈ రంగానికి వస్తారు.

నాగేశ్వరరావుకు పదో ఏటనే తల్లి, అన్నగారూ 'నటనయే ఇతని వృత్తి' అని నిర్ణయించారు. అదే అతని విద్య అని నిర్ణయించారు. నాటి కతనికి ఇష్టం వున్నా లేకపోయినా, ప్రతిభ మాత్రం ఉన్నందువల్ల - ఉన్నదని పెద్దలన్నందువల్ల పెద్దల మాట శిరసావహించాడు.

బడి మానేసేనాటికి అతను సెకండు ఫారం మధ్యలో ఉన్నాడు. హిందీ మాధ్యమిక పరీక్ష ప్యాసయ్యాడు.

అందువల్ల, అతని చదువు స్టేజి మీద డైలాగులు చదువుకోవడానికి మాత్రం సరిపడా వచ్చింది. రూపాయిచ్చి, పావలా అర్ధణా సిల్కు చొక్కా కొంటే, చిల్లర లెక్కెట్టుకునే పాటి లెక్కలు వచ్చాయి. డబ్బు సంపాదిస్తే కావలసినవి కొనుక్కోవచ్చు; బాగా నటిస్తే పేరొస్తుంది – అన్నవే 'ప్రపంచజ్ఞానం' అన్న శీర్షిక కింద అతనికి తెలిసిన విషయాలు. సోడా, కిళ్ళీ, కొబ్బరిపచ్చడి, సిగరెట్ గొంతుకకు మంచివికావు; ఆడపిల్లలకేసి వాళ్ళ జడలు, నగలు, చీరెంచు చూడడానికి కూడా చూడకూడదు; చక్కని అమ్మాయి లవంగంతో గీరితే ఒద్దనాలి అన్నవి అతనికి తెలిసిన నీతులు. బహుశా ఏలక్కాయతో చెంప నిమిరితే తప్పో కాదో తేల్చలేకపోయేవాడేమో!

రంగస్థలమే ఒక పాఠశాలగా, జీవితమే వాచక పుస్తకంగా, పెదవిరివాడలో, కుదరవల్లిలో, ముదినేపల్లిలో, గుడివాడలో గురువుల దగ్గర, తోటి నటీనటుల దగ్గర, భద్రాచారి, శ్రీరామమూర్తి, మధుసూదనరావు, అచ్చయ్య, దైతా గోపాలం, పెండ్యాల గారల దగ్గర తొలి పాఠాలు నేర్చుకున్నాడు. స్థానం వంటి ప్రముఖ నటుల నాటకాలు చూసి మెలకువలు దిద్దుకున్నాడు.

ఈ దారి పొడుగునా అతను పాఠశాల విద్య నేర్చుకోలేదని బాధ పడుతూనే వచ్చాడు. డబ్బు అందుకు కారణం అన్న సత్యం అతనికి గుచ్చుకుంటూనే వచ్చింది. చదువుకోవాలని తాపత్రయ పడుతూనే వచ్చాడు. గుడివాడ మహాపట్నం వచ్చి నాజూకు తేలాడనిపించుకున్న పల్లెటూరి కుర్రాడు, మద్రాసు వచ్చేసరికి బైతు అనిపించుకునే స్థితిలోనే ఉన్నాడు.

పౌరాణిక నాటకాల నుంచి సాంఘిక నాటకాలకి, స్త్రీ పాత్రలనుంచి వీరపురుష పాత్రలకు, సాంఘికాలనుంచి జానపదాలకూ మారుతూ, లౌక్యం, సినిమా లౌక్యం కూడా కలిపి నేర్చుకుంటూ, అష్టావధానం చేసి అందరిని మెప్పించుకొస్తూ సినిమా నటనలో గురువులందరి ప్రభావాలూ పడి తను నలిగిపోకుండా, తన వ్యక్తిత్వం, తన ముద్ర, తన జెండా పోకుండా, తప్పో ఒప్పో – తనది అనతగ్గ పద్ధతి రూపొందించుకుంటూ పెరిగాడు. ఇంతింతై నటుడింతయై అన్నట్టు పెరిగాడు. ఈ ఘట్టంలోనే – తన సొంత పద్ధతి ఏర్పరచుకో బోవడంలోనే అతని నేటి వ్యక్తిత్వానికి మొట్టమొదటి చిత్తు రేఖాచిత్రం తయారైంది.

'సంసారం' చిత్రం వచ్చేవరకూ అతను ఏర్పరచుకుంటున్నది తన నటనకు పునాదే తప్ప, నటనాశిల్పం కాదు. బుద్ధిపూర్వకంగా చేసిందీ లేదు. 'బాలరాజు', 'బాలచంద్రుడు' పాత్రలు మాత్రం అతనికి పేరు తెచ్చాయి. ప్రేక్షకులకూ, పరిశ్రమలో వారికీ అభిమానపాత్రుడిని చేశాయి. కొత్త నటుడికి బలమిచ్చి నిలబెట్టేవి మంచి పాత్రలు. వాటిని నటుడు ధరించడు. అవే నటుడిని అవలీలగా ధరిస్తాయి. వాటి ఆకర్షణవల్ల ఇతనికి పేరు వస్తుంది. ఆ తరవాత నటుడు రూపొందుతాడు. పాత్రను తను ధరించే శక్తి గడిస్తాడు. నాగేశ్వరరావు వరస ఇదే అయింది.

'లైలామజ్నూ'లో భానుమతి పక్కన కాస్త అర్భకుడిలా కనిపించినా బహుశా అందువల్లనే – ఆ వార కమ్ముకుందుకి కష్టపడి ఒక స్థాయి ఎక్కువ నటించాడు.

అయినా ఆ పాత్రవల్లనే అతనికి పేరు వచ్చింది. అలాగే శ్రీ లక్ష్మమ్మ కథలో కూడా కొంచెం ధాటిగానే నటించాడు. గోపీచంద్‌గారి లక్ష్మమ్మతో పోటీపడి 30 రోజులలో తీసిన చిత్రం అది. అందులో ఆనాటి ప్రసిద్ధ నటుడు, సి. హెచ్. నారాయణరావు నాయకుడు. ఇందులో వెంకయ్య నాయుడు నాగేశ్వరరావు. పాత్రల రూపకల్పనలో ఉన్న భేదాలను బట్టి, తన పాత్ర అవధుల మేరకు చాలా సమర్థంగా సహజత్వానికి దగ్గరగా ఉండేలా నడిపాడు నాగేశ్వరరావు. అంతవరకూ అర్భకుడు అనిపించుకున్న నాగేశ్వరరావుకు మగసిరిగల నటుడు అని పేరు వచ్చింది. పత్రికలు మాత్రం వేనోళ్ళ కొనియాడలేదు.

అప్పటికి అతనికి 'ఫోక్‌లోర్ హీరో' అన్న బిరుదు వచ్చింది. అతనికీ అదే అభిప్రాయం. ఆ గాడి వదిలితే దెబ్బతింటామన్న భయం వచ్చింది. ఆ స్థితిలో ఉన్న వాడికి ఆ భయం అర్థం అవుతుంది. నాగేశ్వరరావు తెగించాడు. 'సంసారం' అతన్ని సోషల్‌హీరోగా, నటుడుగా, వ్యక్తిగా నిలబెట్టింది. అయినా తరువాత ఏడాది ఏణ్ణర్థంపాటు వచ్చినవన్నీ జానపదాలే. జానపదాలు చిత్రాలు కావనీ, వాటిలో నటనకు అవకాశం లేదనీ, కళ జొరబడదనీ ఈ వాక్యాలు చెప్పబోవడం లేదు. సాధారణంగా జానపద కథలు బాక్సాఫీసు సూత్రాలకు అనుగుణంగా మలచి సెట్టింగులహంగులు ప్రధానంగా తయారు చేసేవారు కాబట్టి పాత్రల రూపకల్పనలో తగుపాటి శ్రద్ధ ఉండేది కాదు. అందువల్ల చిత్రాలకు డబ్బు రావడం తప్ప నటులకు పేరు రావడం, పాత్రలు ప్రేక్షక హృదయాలకు హత్తుకోవడం కొంత తక్కువ.

నాగేశ్వరరావు రక్షరేఖ, పరమానందయ్య శిష్యులు, తిలోత్తమ, సౌదామిని, స్త్రీ సాహసం, మంత్రదండం వంటి చిత్రాలలో కూడా నటనకు ఆస్కారం ఉందేమోనని వెతికి, వీలైన చోట్ల కల్పించుకుని వన్నెలు చిన్నెలు పెట్టి ప్రయత్నించేవాడు.

మొదటినుండి నాగేశ్వరరావు నటన - పరిభాష ప్రకారం "అండర్ యాక్టింగ్" - ఒక రవ తక్కువగా ఉండే పద్ధతిలోనే ఉండేది. కనీసం - అతను ఎన్నడూ ఓవర్ యాక్టింగ్ - మితిమీరి నటించడం - చెయ్యలేదని ఒప్పుకోవాలి. ఇందుకు కారణం అతను స్టేజిమీద స్త్రీ పాత్రలు ధరించడం, ఎక్సెల్సియర్ క్లబ్బులో మధుసూదనరావుగారి అభిరుచికి అనుగుణంగా సాధన చెయ్యడం అని చెప్పాలి.

గిట్టని వాళ్ళూ, పరాచికా లాడే చనువున్న వాళ్ళూ ఇంకోటి కూడా అంటారు. నాగేశ్వరరావు వచ్చిన కొత్తల్లో భయపడేవాడు గాబట్టి సగం సగం నటించే వాడనీ, అదే క్రమంగా ఒక మోతాదుకు వచ్చిందనీను.

కారణాల తోరణాలు ఎలా వున్నా నాగేశ్వరరావు శైలి, మితి తెలిసి, క్రమ విధానంలో, నెలల తరబడి తీర్చి దిద్దుకున్నదని ఒప్పుకోవాలి. కొత్త రచయితకి మాటలు జోరుగా వాడాలనీ, కొత్త గాయకుడికి సంగతులు గుప్పించాలనీ ఉన్నట్టే, కొత్త నటుడికీ, పాతబడ్డా పరిణతి చెందనివాడికీ కళ్ళా నోరా, కాళ్ళా చేతులా నటించి అవతల పారెయ్యాలని ఉండడం సహజం. నాగేశ్వరరావు జానపద చిత్రాల నాడే ఈ ప్రమాదాన్ని హద్దులో ఉంచగలిగాడు. ఆనాడే 'సంసారం'లో హాస్యం కూడా

నటించగలిగాడు. అందులో అతను చూపిన నిగ్రహం, స్వచ్ఛత దరిమిలాను పెద్దవాడయ్యాక చూపడంలో దెబ్బతిన్నాడేమో అని కూడా అనిపిస్తుంది. 'పెళ్ళిసందడి' వంటి చిత్రాలలో, అతను కామెడీ చాలా చులకన అయినట్టూ, దాన్ని తను అవలీలగా పోషించి అవతల పారేస్తున్నట్టూ తేలికగా తీసుకుని కొంత హద్దు మీరాడు. ఆత్మవిశ్వాసం హద్దు జరిగి అహంకారం అయినపుడు కలిగే ఫలితం అది... పేరు ప్రఖ్యాతులు చేయగల అపకారాలలో అది ఒకటి.....

దరిమిలాను వచ్చిన చిత్రాలలోని హాస్య సన్నివేశాలలో తిరిగి నిగ్రహంతో నటించిన తన సామర్థ్యాన్ని ఋజువు చేసుకున్నాడు.

మొత్తానికి 'దేవదాసు' చిత్రంతో అతనికి నటుడుగా దశ ఎత్తుకుంది. ప్రజలూ, పరిశ్రమా కూడా బ్రహ్మరథం పట్టారు. ఆ ఘట్టం నుండి నాగేశ్వరరావు వ్యక్తిత్వం స్ఫుటమైన రూపురేఖలు దిద్దుకోసాగింది. వచ్చిన పేరును నిలబెట్టుకోవాలంటే, దేవదాసు పునర్జన్మ ప్రసాదించడానికి ముందు వచ్చిన గండం మళ్ళీ రాకుండా వుండాలంటే, తను పడవలసిన జాగ్రత్తలూ, అనుసరించతగ్గ పద్ధతులూ ఆలోచించుకున్నాడు. నట జీవితంలో నటన దృష్ట్యాగాని, చిత్ర విజయం దృష్ట్యాగాని అపజయం అన్నది ఉండరాదని తీర్మానించుకున్నాడు.

వెంటనే చిత్రాల సంఖ్య తగ్గించుకో సాగాడు. ఇది అనుకున్నంత సులభం కాదు; కాలేదు. అతనికి 'పరదేశి', 'బ్రతుకు తెరువు', 'కన్నతల్లి' చిత్రాలతోనే మంచి పేరు వచ్చింది. 'దేవదాసు'లో స్టార్ వాల్యూ కూడా వచ్చింది. మిత్రులు, అమిత్రులు అంతా అతన్ని బుక్ చెయ్యడానికి ఎగబడ సాగారు.

అతని నటనను గాక స్టార్ వాల్యూను, ఫేస్ వాల్యూను ఉపయోగించుకునేవారు కూడా ఉన్నారని అతనికి తెలుసు.

నాగేశ్వరరావు కథలు చదివి, వాటి నిగ్గు స్వయంగా తేల్చుకునే వాడు. అవి బాగుండవని తోచే పక్షంలో నిరాకరించేవాడు. కొందరిని సక్రమంగా ఒప్పించాడు. కొందరిని నొప్పించాడు. తన రేటు పెంచి కొందరిని తప్పించుకున్నాడు. ఇక్కడే భయపడే పరిస్థితి. ఇవాళ నొచ్చుకున్న వాళ్ళు రేపు మంచి కథ వచ్చినపుడు తన దగ్గరకు రాకపోతే?.... తను మంచి నటుడుగా ఉండి ప్రజలు ఆదరించినంతకాలం ఆ ప్రమాదం లేదని ధైర్యం చెప్పుకున్నాడు.

అప్పట్లో అతను వదులుకున్న చిత్రాలు పదిహేను వరకూ ఉంటాయి.

'దేవదాసు' తరవాత డి. ఎల్. గారే మరో విషాదాంత చిత్రం తీయ నిశ్చయించి నాగేశ్వరరావుకు కథ చెప్పారు.

మూడు రోజులు ఆలోచించి, అతను వద్దన్నాడు. 'దేవదాసు'కు ఒక పేరూ, స్థాయీ వచ్చాయి. దాని బలం అన్ని కథలకూరాదు. వచ్చినా, దాని వెంటనే ట్రాజెడీ తీస్తే హిట్ చిత్రం ప్రభావం, అనుకరణ ఉండక తప్పదు. ప్రేక్షకులు కూడా రెంటినీ పోల్చుతారు. విధిగా మొదటి దాన్నే మెచ్చుకుంటారు. ఇందులో నెగ్గుకు రావడం కష్టం... ఇదీ అతని వాదం. డి.ఎల్. గారు నిర్మాణం సాగించారు. అది విజయవంతం కాలేదు.

"మీరుంటే హిట్ అయ్యేది" అన్నాడు ఒక అభిమాని.

నాగేశ్వరరావు నవ్వాడు. "మీరు చాలా పొరబడుతున్నారు. ఆ కథ నెగ్గేది కాదని నేను ముందరే చెప్పాను. ఇప్పుడూ అంతే అంటున్నాను" అన్నాడు.

అలాగే, ఎ.వి.ఎం. వారి 'సదారమ' చిత్రం కూడా అతను వదులుకున్నాడు. ఆ చిత్రంలో వేషం ఒప్పుకుని నాలుగు రోజులు పని చేశాడు. అతనికి ఆ చిత్రం మీద గురి తప్పింది. విరమిస్తున్నట్టు చెప్పాడు చెట్టియారుగారికి.

"నీకేం మతిపోయిందా" అన్నా రాయన.

"భోంచేసి పడుకో" అన్నారు.

"మూడు రోజులు రెస్టు తీసుకుని ఆలోచించుకు రా" అన్నారు. "రేటు పెంచుతా" నన్నారు.

"అయిన ఖర్చుకు పరిహారం కావాలిస్తే ఇస్తాను, నన్ను వదిలెయ్యండి" అన్నాడు నాగేశ్వరరావు ఖచ్చితంగా. తన కిచ్చిన ఎడ్వాన్సు తిరిగి ఇవ్వబోయాడు.

"తరవాత ఎప్పుడన్నా ఇంకో చిత్రానికి పనిచేద్దు గాని, ఎడ్వాన్సు ఉంచు" అన్నారు.

తరవాత 'భూకైలాస్'లో నారద పాత్ర నటించాడు నాగేశ్వరరావు.

సోదరతుల్యంగా గౌరవించిన డి.ఎల్. గారి మాట కాదన్నందుకు గాను దరిమిలాను 'దొంగల్లో దొర'లో నటించాడు. అదే అతని 60వ చిత్రం అయింది.

'దేవదాసు' తరువాత అతను నటించిన చిత్రాల్లో సర్వేసర్వత్రా ప్రశంసలందుకున్నవి, స్థాయిని అందుకున్నవి – 'చక్రపాణి', 'విప్రనారాయణ', 'అర్ధాంగి', 'దొంగరాముడు', 'తెనాలిరామకృష్ణ', 'ఇలవేల్పు', 'చరణదాసి' ముఖ్యంగా చెప్పుకో తగ్గవి.

'చక్రపాణి'లో, 'అర్ధాంగి'లో, 'దొంగరాముడు'లో పూర్వార్ధంలో అతను ఆహ్లాదకరమైన, అందమైన హాస్యాన్ని సాధించాడు.

'విప్రనారాయణ' అతను ఒక దర్శకుడితో, తన ప్రతిభను శంకించే అందరితో సవాలు చేసి చేపట్టిన పాత్ర. విప్రనారాయణ విగ్రహస్ఫూర్తి, అతిలోకమైన భక్తి పారవశ్యం, ఐహికలోకాన్ని చూస్తున్నా రంగనాథుణ్ణి వెతుక్కునే చూపులూ మోహనంగా, ప్రేక్షకులకు గౌరవం కలిగే విధంగా సమకూర్చుకున్నాడు. కాని, భక్తుడు విప్రనారాయణ 'దివి' నుండి భువికి దిగివచ్చి కామి అయిన సందర్భంలో, ఆ తరువాత కూడా భక్తి భావాన్ని వర్జించలేదు. రంగనాథుడిని దేవదాసిలో చూసి కౌగలించుకున్నాడన్న భ్రమ కలిగించాడే తప్ప, ఒక భక్తుడు నైతికంగా పతనం చెందుతున్న సన్నివేశాన్ని ప్రేక్షకుడు దర్శించే అవకాశం ఇవ్వలేదు. ఇది నటనకు సంబంధించినది కాదు. పాత్రకు రూపకల్పన, మనస్తత్వ నిదానం, నైతిక పరివర్తన క్రమం నిర్ణయించుకోవడంలో ఏర్పడిన వైఖరిని బట్టి వస్తుంది. అయినా విమర్శ మాత్రం నాగేశ్వరరావు భరించక తప్పదు.

ఈ విమర్శ ఉన్నా, నాగేశ్వరరావుకు ఈ పాత్రతో దేశంలో అంతవరకూ ఉన్న అభిమానం గౌరవం స్థాయికి, భక్తి స్థాయికి పెరిగింది. కొందరు వైష్ణవ భక్తులు అతన్ని శ్లాఘిస్తూ సుదీర్ఘమైన లేఖలు రాశారు. ఒక భాగవతుడు గౌరవ ప్రపత్తులతో కౌగలించుకొని, శాలవకప్పి సత్కరించాడు. "నాయనా, వర్ధిల్లు" అని దీవించాడు.....

అతను పరిణతి చెందిన నటన ప్రదర్శించిన మరొక ముఖ్య చిత్రం 'అర్ధాంగి'. అందులో జడుడి పాత్రను అతి మెలకువతో నటించి దానికి, ఆ కోవ వ్యక్తులకు అభిమానం, సానుభూతి సంపాదించి పెట్టాడు. కె.వి. రెడ్డిగారు తీర్చిదిద్దిన 'దొంగరాముడు' అతనికీ, ఆంధ్రులకూ అభిమానపాత్రమైన పాత్ర. కె.వి. అంటే అతనికి ఎనలేని గౌరవం. తనకు స్టారుగా పేరొచ్చిన తరువాత ఒకనాడు స్వయంగా వెళ్ళి ఆయనను కోరాడు - "మీతో ఒక చిత్రానికి పనిచేయాలని ఉంది" అని. నటుడి ప్రతిభ చూపడానికి దర్శకుడి ప్రతిభ ఎంతో దోహదం చేస్తుందని అతనికి తెలుసు. కె.వి. గారు ఈ చిత్రం చేపట్టడానికి రెండేళ్ళు పట్టింది. మధుసూదనరావుగారు, నాగేశ్వరరావు, శ్రీనివాసరావుగారూ కలసి నెలకొల్పిన అన్నపూర్ణా పిక్చర్స్ తొలిచిత్రం నిర్మాణం కె. వి. కోసం రెండేళ్ళు ఆపారు.....

'తెనాలి రామకృష్ణ' చిత్రం అఖిలభారత స్థాయిన ప్రశంసాపత్రాన్ని, రాష్ట్రస్థాయిన రజతపతకం, ప్రేక్షకుల స్థాయిన జోహార్లు అందుకుంది. కాని ఇందులో ముఖ్యపాత్ర నాగేశ్వరరావు. నటుడుగా కొంతవరకూ గొప్పది కావచ్చుగాని, రూపకల్పనలో, చిత్రణలో దాన్ని మెచ్చుకుంటూ పేజీలకొద్దీ రాయడం కష్టం. మహాకవిగా, పాండురంగ మహాత్మ్య కర్తగా రామకృష్ణకవిని వారు చిత్రించలేదు. చమత్కారి, రాజనీతివేత్త అన్నట్లుగా చూపారు. ఉన్న అవకాశాన్ని బట్టే నాగేశ్వరరావు నటించాడు. బాధ్యతగల నటుడు కాబట్టి ఈ అసమగ్ర చిత్రణకు అతనూ బాధ్యత పంచుకొనక తప్పదు.

నాగేశ్వరరావు ధరించిన విషాదాంత కథానాయక పాత్రలు కొద్దే అయినా అవన్నీ గొప్పవి. గొప్పగా నటించినవి. ఖయస్, దేవదాసు, సలీం పాత్రలతో అతనికి ట్రాజెడీ కింగ్ ఆఫ్ ది సౌత్ అని బిరుదు వచ్చింది. ఖయస్ పాత్ర ధరించే నాటికి అతను సినిమా నటనకు కొత్త. అయినా దేశంలో ప్రేక్షక హృదయంలో ఒక స్థానం గడించుకున్నాడు. దేవదాసుతో ఉత్తమ నటుడనిపించుకున్నాడు. తరవాత 'అనార్కలీ'లో సలీంగా నటించాడు. అప్పటికి అతను సుశిక్షితుడు. వ్యక్తిలోనే నిండుతనం, హుందా వచ్చాయి. యువరాజు సలీంకు అతను తెరమీద అక్షరాలా ప్రాణప్రతిష్ఠ చేశాడు. ఆ పాత్రకు, దాని ప్రేమకు, క్షోభకూ ఒక ఠీవిని సమకూర్చాడు. విగ్రహం తగినంత లేకపోయినా, ఆ లోపం కనబడకుండా కమ్ముకు రాగలడానికి అతని ప్రతిభే కారణం.

ఇలవేలుపు, చరణదాసి అతని ఉత్తమ చిత్రాలలో ఎన్నతగ్గవి. భాషకందని బాధను - ప్రేక్షక హృదయాలలో కరుణ ఉప్పొంగేటంత గొప్పగా ప్రస్తరించాడు. నటనకే ఒక కొత్త వరవడి పెట్టుకున్నాడు.

కళారాధన ద్వారా ఆనందం ప్రసాదించి, సుఖజీవనానికి డబ్బు ఇస్తున్న ఈ పరిశ్రమకు కృతజ్ఞత చెప్పుకోవాలనుకున్నాడు నాగేశ్వరరావు.

సౌఖ్యం తోడివారితో పంచుకున్నప్పుడే ఆనందం అవుతుందని అతని విశ్వాసం. కుదరవల్లి నుంచి ఇంత దూరం వచ్చాడు తను. స్కూలు నాటకం నుంచి ఇంత దూరం వచ్చాడు. నాలుగు రూపాయల కిరాయినుంచి నలభై వేలకు వచ్చాడు. సెకండు ఫారం నుంచి సుసంస్కృతుడు, వివేకం గలవాడు అనిపించుకునేదాకా వచ్చాడు.

ఇపుడు 60 చిత్రాలు పూర్తయ్యాయి. ఇది తను గర్వించతగ్గ ఘడియ. బహిరంగంగా గర్వించతగ్గ ఘట్టం. వినయంగా గర్వపడతగ్గ ఘట్టం. డబ్బులేక చదువు మానుకున్న తను, చదువులేక బాధపడిన తను తనలా ఆ సమస్యను ఎదుర్కొనవలసివచ్చే వారిలో కొందరికైనా సాయం చెయ్యాలి. చెయ్యగల స్తోమత వచ్చింది.

నాగేశ్వరరావు వజ్రోత్సవం సంకల్పించాడు. ఆ ఉత్సవంలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి 25 వేలు విరాళం ఇవ్వ సంకల్పించాడు.

సంకల్పశుద్ధి ఉన్నవాడికి జరగతగినంత ఘనంగా, బ్రహ్మాండంగా జరిగిందా ఉత్సవం. 'నభూతో న భవిష్యతి' అనేలా జరిగింది. నాగేశ్వరరావు సద్భావం అంతటా ఇంద్రజాలమై అందరినీ సమ్మోగ్ధులను చేసింది. దేశంలో పత్రికలన్నీ, ఏ రంగంలోనూ ఏ వ్యక్తికీ చేయనంత గొప్పగా, ఉత్సాహంగా ప్రత్యేకానుబంధాలూ, సంచికలూ ప్రచురించి నాగేశ్వరరావు ప్రగతిని కొనియాడాయి. ఆంధ్ర మద్రాసు రాష్ట్రాల ముఖ్యమంత్రులు శ్రీ సంజీవరెడ్డి, శ్రీ కామరాజ్, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి.వి. రాజమన్నార్, శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు ప్రభృతులు లంతా వచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు డా॥ వి. ఎస్. కృష్ణ వచ్చి చెక్కు అందుకున్నారు. తెలుగు తమిళ చలనచిత్ర పరిశ్రమలో చిన్నా పెద్దా నాలుగు వేలమంది సభకు వచ్చారు. నాటివరకూ బంజరుగా ఉన్న స్థలాన్ని నాగేశ్వరరావు పేరు చెప్పి ఉత్సవం నాటికి నందన వనవాటికగా మార్చేశారు విజయాధిపతి నాగిరెడ్డిగారు.

ఒక వృత్తిలో వృద్ధికొచ్చిన వ్యక్తి ఇలా తనకు ఉపాధి అయిన పరిశ్రమను తల్లిగా, తోడివారిని సోదరులుగా గౌరవించి, తన చిత్రాలు నిర్మించిన నిర్మాతలకు, దర్శకులకు, రచయితలకు, తోడినటులకు కృతజ్ఞత తెలియజేసుకోవడం అపూర్వమైన ఊహ. మౌలికత గల ఆలోచన. ఉత్తమ సంస్కారానికి నిదర్శనం. పబ్లిసిటీ స్టంటు అని కూడా అన్నారు జనం. ఈ చివరి అంశం కూడా ఉండడం దోషం కాదు; ద్రోహం కాదు. మానవ సహజం.

నాగేశ్వరరావు సత్సంకల్పాన్ని దేశంలో ప్రేక్షకులు హర్షించారు. మద్రాసు ఉత్సవం సంరంభం ఆంధ్రలో ఊరూరా నూరంతలై ఉత్సవాలు జరిపించింది. అన్ని పట్టణాలలోనూ అతన్ని ఊరేగించి సన్మానాలు జరిపారు. కనకాభిషేకాలు చేశారు.

లక్షలాది అభిమానులు అతన్ని అభినందించారు. పెద్ద పట్టణాలన్నిటా పురపాలక సంఘాలు అధికారికమైన పౌర సన్మానాలు జరిపాయి. అన్ని పౌర సన్మానాలు ఒక వ్యక్తికి జరగడం బహు అరుదు.

ఈ ఉత్సవం తరువాత నాగేశ్వరరావుకు నటుడుగా, వ్యక్తిగా ప్రతిష్ఠ పెరిగింది. అతని సంస్కారానికి ఒక కొత్త శోభ వచ్చింది. సినిమా పరిశ్రమను సమాజంలో ప్రముఖులకు, ప్రభుత్వ ప్రముఖులకు దగ్గరగా తీసుకువెళ్ళి, దాని గొప్పతనాన్ని చాటి గౌరవం గడించిన ఘనత నాగేశ్వరరావుకు దక్కింది.

అతనికి తెలియకుండానే, ప్రజాభిమానాన్ని దగ్గరనుండి అనుభవించిన ఆనందం అతనిలో నవచైతన్యాన్ని, తేజాన్ని ఉద్దీప్తం చేసింది.

అది బహుశా ప్రేక్షకుడి మనస్సుమీద కూడా ప్రభావం ప్రసరించి వుండవచ్చు.

విశ్వ విద్యాపీఠానికి విరాళం ఇచ్చినందుకు నాగేశ్వరరావుకు సెనెట్‌లో యావజ్జీవిత సభ్యత్వం లభించింది.

సెనేట్ సభ్యుడుగా తొలిసారి లాంఛనయుతమైన పట్టభద్రుడి దుస్తులు ధరించినపుడు నాగేశ్వరరావు కళ్ళు చెమ్మగిల్లాయి.

"అచ్చు బియ్యేలా వున్నావు" అన్నా డొక మిత్రుడు.

" 'లా వుండడం,' లా కనబడడం, 'లా నటించడం నాకు మామూలే.... అదే మిగిలింది" అన్నాడు నాగేశ్వరరావు విచిత్రంగా నవ్వి...

❀ ❀ ❀ ❀

వజ్రోత్సవం తరువాతి నుంచి అతని జీవితం, నట జీవితం కూడా పంచకళ్యాణిలా అందంగా వేగంగా సాగిపోతోంది. రైలులా సాఫీగా సాగిపోతోంది. గమ్యం, అక్కడికి వెళ్ళే దారీ తెలిసిన బాటసారిలా ధీమాగా సాగిపోతోంది. అటువంటి సమయంలోనే చూచేవారికి ఆ బాట పూలబాటలా కనిపిస్తుంది. కాని ఆ బాట వెయ్యడానికి ముందు, గమ్యం తెలుసుకోవడానికీ, అక్కడి దారి నిశ్చయించుకోవడానికీ, రాళ్ళూ ముళ్ళూ ఏరి నున్నని బాట వేయడానికీ పదిహేనేళ్ళు నాగేశ్వరరావు శారీరకంగా, మానసికంగా అనన్య సామాన్యమైన శ్రమపడ్డాడు; క్షోభపడ్డాడు. అతని హృదయంలో ఎన్నో ఆశలూ దురాశలూ, భయాలూ అనుమానాలూ ఉండేవి. వాటిని పరిష్కరించుకొని, దురాశలు అనిపించినవీ కొన్నిటిని సాధించి, సాధ్యంకాని ఆశలను దురాశలుగా సంస్కరించి, భయం మీద అహంకారపు రంగు పూసుకుని, అవసరమైనపుడు ఉత్తమ లక్ష్య సాధనకోసం తనను తానే వంచించుకుని పోరాటం సాగించాడు. ఈ యాత్రలో, ఈ సమరంలో అతను ఋజువర్తనను, నైతిక బలాన్ని తన ముఖ్యాయుధంగా ఉపయోగించుకున్నాడు. కోరికలను అణచుకుని చంపుకుని తన వ్యక్తిగత సుఖాన్ని త్యాగం చేయడంలో నిరంతరంగా సాధన చేశాడు.

వ్యక్తిలోని ఈ శక్తులే అతను తెరమీద నటించే నాయక పాత్రలలో ప్రతిబింబించాయి. సినిమాలో నాగేశ్వరరావు ఎన్నడూ తప్పు చెయ్యడు; భయపడడు. త్యాగాలు చేస్తాడు; కష్టాలు పడతాడు. తన లక్ష్యాన్ని – సినిమాలో అది హీరోయిను వేషంలో ఉంటుంది కాబట్టి, పెళ్ళి చేసుకుంటాడు. అది హీరోదాత్త నాయకుడి రూపకల్పన. నాగేశ్వరరావును బట్టి చలనచిత్రకారులు ఆ పాత్రలను మలచడం, వాటి ప్రభావం ఇతని వ్యక్తిగత జీవితంపై పడడం, రెండూ జరిగాయి. ప్రేక్షకుల దృష్టిలో నాగేశ్వరరావు ఆదర్శయువకుడికి చిహ్నం. నటుల దృష్టిలో ఆదర్శ నటుడు. జీవితంలో కూడా ఆదర్శ పురుషుడు కావడానికి ప్రయత్నించి సాధించాడు నాగేశ్వరరావు.

అందువల్లనే అతని వ్యక్తినీ, నటననూ కలిపి చర్చించడం అవసరమైంది. ఈ కలయిక బహు అరుదు.

❀ ❀ ❀ ❀

1957 తరువాత నాగేశ్వరరావు నటించిన చిత్రాలలో ప్రశస్తి చెయ్యతగ్గవి – 'మాంగల్యబలం', 'జయభేరి', 'పెళ్ళినాటి ప్రమాణాలు', 'ఇల్లరికం', 'కాళిదాసు', 'భార్యా భర్తలు', 'జయదేవ', 'గుండమ్మకథ', 'బాటసారి'.

'మాంగల్యబలం'లో పాత్ర చాలా క్లిష్టమైనది. అన్నపూర్ణా పిక్చర్స్ అతని స్వంత సంస్థ. అయినా స్వంత చిత్రాలలో చాలామంది నటీనటులు తమకి ఏర్పరచుకునే ప్రాధాన్యం అతను ఏర్పరచుకోలేదు. మధుసూదనరావుగారి సారథ్యాన నడిచే ఆ సంస్థ చిత్రాలలో చిత్రం బాగుండడమే ప్రధానం. అందువల్లనే అవి విజయం సాధించాయి. అన్నపూర్ణ చిత్రాలలో నాగేశ్వరరావుకు మంచి పాత్రలు ఇచ్చినవి దొంగరాముడు, మాంగల్యబలం, ఇద్దరు మిత్రులు.

'ఇద్దరు మిత్రులు' అతనికి వ్యక్తిగత విజయం. అంతవరకూ నాగేశ్వరరావు – ఎస్. వరలక్ష్మి, నాగేశ్వరరావు – భానుమతి, నాగేశ్వరరావు – అంజలీదేవి, నాగేశ్వరరావు – సావిత్రి అద్భుతమైన జోడాలనీ, వాళ్ళుంటే చిత్రం హిట్ అవుతుందనీ అంటూ వచ్చిన ప్రేక్షకులు ఈ చిత్రంలో నాగేశ్వరరావూ – నాగేశ్వరరావూ కూడా గ్రేట్ కాంబినేషన్ అన్నారు.

'జయభేరి'లో కాశీనాథ్ పాత్ర నాగేశ్వరరావు నటించిన వాటిలో ఉత్తమశ్రేణిలో నిలుస్తుంది. ఈ పాత్రమీద ఎన్నో విమర్శలు కూడా వచ్చాయి. అయినా, కల్పించిన పాత్రను నాగేశ్వరరావు నడిపించిన శిల్పం జోహార్లు అర్పించతగినది.

అలాగే, అతని 'కాళిదాసు' అతని శత చిత్రమాలలో మణి. శాకుంతలాన్ని కాళిదాసు జీవితంలో భువన మోహనంగా సమన్వయించి పింగళి నాగేంద్రరావుగారు చేసిన రూపకల్పనను నాగేశ్వరరావు అత్యంత స్తుతిపాత్రంగా వ్యాఖ్యానించాడు. అరవై చిత్రాల పండుగనాడు అంతకు ముందు అతనికి అభిమానులూ, భక్తులూ ఇచ్చిన బిరుదులు అతిశయోక్తులనీ, అతనికి అంత అర్హత లేదనీ అభిప్రాయపడినవారంతా (ఈ వాక్యకారుడు సహా) అతని తరువాతి చిత్రాలు – 'జయభేరి', 'కాళిదాసు',

'బాటసారి' మొదలైనవి – చూచిన మీదట, పాత చిత్రాలు గుర్తు చేసుకుని తమ అభిప్రాయాలు సవరించుకుని అతనికి గౌరవపురస్సరంగా నమస్కరించారు. 'బాటసారి'లో అతని ప్రతిభకు జోహార్లు చేశారు. పదిహేనేళ్ళుగా అతనికి ఆప్తమిత్రుడై అభిమానిస్తున్నా, నటుడుగా అంతటి గౌరవంలేని ఒకాయన – ఉత్తరాలలో 'డియర్ నాగేశ్వరరావ్' అని రాసే ఆయన – 'బాటసారి' చూచిన నాటి రాత్రి ఉత్తరం రాయబోయి, "పూజ్యులు శ్రీ నాగేశ్వరరావుగారికి–" అని అప్రయత్నంగా వ్రాసేశారు. అతని కన్న పెద్దవాడయినందువల్ల నాలిక్కరుచుకున్నాడు. కొట్టివేయబోయాడు. మనస్కరించ లేదు. ఇంతకన్నా స్వచ్ఛమైన, సత్యమైన ప్రశంస ఏ నటుడికీ లభించదు.

ఈ చిత్రాలలో నాగేశ్వరరావు సమర్థంగా నడపనివి, పొరబాటు చేసినవి, మొండిగా "బాగున్నాయి" అనేవి కొన్ని లేకపోలేదు. 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రానికి ఆ రకంలో అకాడమీ బహుమతి ఇవ్వవచ్చు. నాగేశ్వరరావు ఎన్నో కథలు విని, బాగులే వన్నాడు. అవి చాలావరకు తరవాత చిత్రాలుగా దెబ్బతిన్నాయి. అతను ఎన్నిక చేసిన వెన్నో విజయం సాధించాయి. కొన్ని పేరు తెచ్చుకున్నాయి.

కాని, ఇలా వికటించినది ఇదొక్కటే నేమో.

ఈ కథ 'సెవెన్ ఇయర్ ఇచ్' అనే చిత్రానికి కొంతవరకూ అనుకరణ అని అన్నవాళ్ళంతా దుర్మార్గు లనిపించుకున్నారు. అనుకరణ మాట ఎలా వున్నా రూపొందించిన కథ అద్భుతంగా లేదు. అందులో హీరో పాత్ర కూడా అంతే. దానికి నాగేశ్వరరావు తగడనిపిస్తుంది. అలాటి వాళ్ళు – ఆ వయసువాళ్ళు చలించరని కాదు గాని, ఆ కథావస్తువు హృద్యంగా చెప్పడానికి ఉండతగ్గ రూపకల్పన వేరు. నాగేశ్వరరావు ధరించినా ఆ వేషంతో కాదు. ఆ వైఖరితో కాదు. ఆ నటనతో అంతకన్నా కాదు. ఇన్ని చిత్రాలలో ఇంత బాగా నటించిన నాగేశ్వరరావు హఠాత్తుగా అసమర్థుడైపోయాడని ఈ వాక్యాలు అనటంలేదు. ఒక స్థాయి గలవాడు దిగజారడు. నాగేశ్వరరావు ఎన్నటికీ కాడు.

కాని అతని వైఖరి, అతను ఏర్పరచుకున్న నిర్వచనం, నటన అన్నీ పొరబాటులో సాగాయి. అతనిమీద గౌరవం, అభిమానం ఉన్న వారికి బాధ కలిగించాయి.

ఇటీవలి చిత్రాలలో నాగేశ్వరరావు వరసగా పాతికేళ్ళ కుర్రాడి వేషాలలో కనిపిస్తున్నాడు.

100 చిత్రాలలో నటించి, అనుభవంతో పండి, జీవితంతో పోరాటంలో అలసిపోయి వుండవలసిన నాగేశ్వరరావు, నేడు పైలాపచ్చీసు కుర్రాడి వేషం కట్టి పూలరంగడిలా, శక్తి చైతన్యాలకు రూపంలా, నడుస్తున్న యౌవనంలా విహరిస్తున్నాడంటే, అది అతని నటనకూ, వయసును జయించిన అతని ఆత్మశక్తికీ, చిరంజీవమైన అతని ఉత్సాహానికీ నిదర్శనం.

"నేను హీరోగా వచ్చిననాడు నాగేశ్వరరావు నాకు తండ్రి వేషం ధరించాడు. ఈనాడు, నాకు కుమారుడి వేషం వెయ్యడానికి సిద్ధంగా ఉన్నాడు. అతని శక్తి అంతటిది" అన్నాడు ప్రసిద్ధ తమిళ నటుడు శివాజీ గణేశన్.

'గుండమ్మ కథ'లో అతని నటన అందం రెండు మూడుసార్లు చూసిన వారికి బాగా కనిపిస్తుంది. పరిణతుడైన నటుడి పనివాడితనం కనిపిస్తుంది.

చలనచిత్ర నటనకు నాగేశ్వరరావు చేసిన సేవ - నిగ్రహం గల నటనకు, సహజత్వానికి చక్కని వరవడి పెట్టడం; మాన్యుల, సామాన్యుల జీవితాలను హృదయంగమంగా చిత్రించడం. అతని ఆసక్తి, కృషి, సహకారం లేకపోతే 'కాళిదాసు' వంటి చిత్రాలు వచ్చేవి కావు. వచ్చినా, అంత ప్రశంసనీయంగా రూపొందేవి కావు. నచ్చిన కథ, పాత్ర ఉన్నపుడు అతను ఆ కంపెనీకి గులామై పని చేస్తాడు. స్థాయి పడకుండా నిర్మాణం జరిపించడంలో చండశాసనుడై నడిపిస్తాడు.

వ్యక్తిగా నాగేశ్వరరావు సమాజానికి చేసినది కూడా ఇంతగానూ ప్రశంసించ తగ్గది. ఆదర్శప్రాయమైనది.

తను చదువుకో లేకపోయాడన్న బాధ పన్నెండవ ఏటనుండీ అతని హృదయంలో మసలుతూనే ఉంది. ఈ నాటికీ అతను సందర్భం వచ్చినపుడల్లా 'నేను సెకండు ఫారం వాడిని' అని నవ్వుతూ గొప్పచెబుతున్నట్టు అంటాడు. కాని, దాని వెనక బాధ ఉంది. ఆ బాధలోంచే విద్యకు తను యథాశక్తి సేవచేయాలన్న సత్సంకల్పం కలిగింది. డబ్బు లేనందువల్ల చదువుకునే అవకాశాలులేని వాళ్ళకు ఆ అడ్డంకి లేకుండా తనకు ఓపినంత సహాయం చేయాలనించింది.

ఆ సంకల్పంతోనే ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పాతిక వేలు విరాళం ఇచ్చాడు. ఆ దృష్టితోనే నూరు చిత్రాలు పూర్తి అయి మొన్న పరిశ్రమకు కృతజ్ఞత చెప్పుకున్ననాడు మద్రాసు విశ్వవిద్యాలయానికి 25 వేలు సమర్పించాడు. 'తమిళ పీఠానికి నువ్విచ్చేవ మేమి'టని ఒక రన్నారు.

కాని తమిళదేశం అతన్ని ఎంతో ఆదరించింది. అతను పాతిక తమిళ చిత్రాలలో నటించాడు. అతని 'దేవదాసు'ను నేటికీ తమిళ ప్రేక్షకులు గౌరవాభిమానాలతో జ్ఞాపకం చేసుకుంటారు.

వజ్రోత్సవం తరువాత తన స్వంత వూరు గుడివాడలో కళాశాల నిర్మాణానికి కూడా అతను భూరి విరాళం ఇచ్చాడు. అతని బంధుమిత్రులు అభిమానుల సంఘంగా ఏర్పడి మరి కొంత ఇచ్చారు.

కళాశాల కమిటీ వారు ఆ విద్యా నిలయానికి 'అక్కినేని నాగేశ్వరరావు కళాశాల' అని నామకరణం చేశారు. డబ్బు లేక తను చేరలేని కళాశాల ఈనాడు అతని పేరిట వెలసింది. అక్కడ అతని తైలవర్ణ చిత్రపటం (శ్రీ చామకూర్ వ్రాసినది) ప్రతిష్ఠితం అయి వుంది. అది సినిమా నటుడిదని ఎవరూ అనరు. ఒక నిండైన వ్యక్తిది. వ్యక్తిలో శక్తిది. విద్యమీద గౌరవానికీ, శ్రద్ధాసక్తులకూ అది రూపకల్పన.

ఒకవేళ పట్టభద్రుడు అయినా బహుశా సంపాదించి వుండనంత బుద్ధివికాసం, వివేకం, ప్రపంచజ్ఞానం నాగేశ్వరరావు సంపాదించుకున్నా, అది, విద్య లేదన్న బాధవల్లనే. ఆ లోటు భర్తీ కావాలన్న పట్టుదలతో అతను విద్యకు ఏకలవ్య శిష్యరికం చేశాడు.

'రౌతుకొద్దీ గుర్రం' అంటారు గాని నాగేశ్వరరావు విషయంలో 'గుర్రం కొద్దీ రౌతు' అని చెప్పుకోవడం సమంజసం. అతను ఎక్కబోయిన గుర్రం అడవి గుర్రం. అతని కన్న ఎత్తు. అతని కన్న బలం గలది; జవం గలది. అటువంటి జీవితంతో అర్భకుడు నాగేశ్వరరావు పోరాడాడు. అతని ఆయుధం ఒక్కటే - దాన్ని లొంగదీయాలన్న దృఢ సంకల్పం.

ఈనాడు అతను అడవి గుర్రాన్ని లొంగదీసి, మచ్చికచేసి, దానిమీద వీరుడై సవారి చేస్తున్నాడు. జానపద చిత్రాలలో మాయలను, మంత్రాలను, రాక్షసులను జయించి, నట జీవితంలో అవరోధాలను అధిగమించాడు. సినిమాలో లాగే జీవితంలోనూ హీరో అనిపించుకున్నాడు. అనిపించుకుందికీ, అవడానికీ అతను ఎక్కడా రాజీ పడలేదు. తన నీతినియమాలను వదులుకోలేదు.

గుర్రం లొంగనప్పుడల్లా, ఎత్తికొట్టి విసిరేసినపుడల్లా, మరింత ఉత్సాహంతో పోరాడాడు.

"జీవితంలో నన్ను తిట్టినవారు, అవమానించినవారు, విమర్శలు చేసిన వారూ నాకు శత్రువులు కారు. వారే నా శ్రేయోభిలాషులుగా నేను భావించాను. కువిమర్శలవల్ల కూడా నే నొక పాఠం నేర్చుకున్నాను. వాటిని నిర్లక్ష్యం చేయా"లని అంటాడు నాగేశ్వరరావు.

ఒకనాడు - 'రామబ్రహ్మంగారి తమ్ముడు'గా కుదరపల్లి, ముదినేపల్లి, గుడివాడ, మద్రాసులకు వెళ్ళాడు నాగేశ్వరరావు. ఈనాడు కొత్తతరం వాళ్ళు రామబ్రహ్మంగారిని చూసినపుడు - 'నాగేసర్రావు అన్నయ్యగారు' అని చెప్పుకొంటున్నారు.

ఇది నాగేశ్వరరావుకన్న ఆయనకే గర్వకారణం.

నిజానికి ఇది రామబ్రహ్మంగారి స్వప్నం - ఫలించిన ఆయన కోరిక-

"నేను కృషి చేయడానికి, కోరినది సాధించడానికీ బలం ప్రసాదించినది ఆయన వాత్సల్యం" అంటాడు నాగేశ్వరరావు.



# మొదటి ప్రకరణం



ప్రతిభాశాలి జీవితంలా కళకళ లాడుతోంది విజయవాడ రైల్వేస్టేషన్....

జనం సందడిగా పరుగులు పెడుతున్నారు. బుక్ చెయ్యని సీట్ల కోసం.

"బుక్ చేసిన సీటు నా జీవితం" అన్నట్టు ఒక పెట్టెదగ్గర ధీమాగా నిల్చున్నాడొక దీపంలాంటి యువకుడు. అతనిచుట్టూ ఒక జనద్వీపం ఏర్పడింది.

"ఎవరండి" అన్నాడు ఆ గుంపు ఇవతలగా నిల్చున్న ఒకాయన కాళ్ళెత్తి చూడప్రయత్నిస్తూ.

"నాగేశ్వరరావు" అన్నాడు లోపలికి శ్రద్ధగా చూస్తూ కబుర్లాలకిస్తున్న ఒక పెద్దమనిషి.

"ఏనాగేసర్రావు?"

పెద్దమనిషి తీరికచేసుకుని వెనక్కి తిరిగాడు. పక్కతనికేసి వింతగా చూశాడు.

"ఇంకే నాగేసర్రావు? ది నాగేసర్రావు" అన్నాడు గర్వంగా.

నాగేశ్వరరావు ఒప్పుకున్నా మానినా - భానుమతి అన్నట్టు - అతను అదృష్టవంతుడు. ప్రేక్షకులు తన పేరును గర్వంగా చెప్పుకునేటంతటి అదృష్టవంతుడు.

నాగేశ్వరరావు ఒప్పుకోడు. అతను కట్టుకున్న జీవితపు విలువలలో ఇది లేదు. ఉన్నా ఈ మాటకి అతని అర్థం వేరు. అతని దైవం వేరు. స్వర్గం వేరు. నరకం వేరు.

"నే నారాధించే కళ నా దైవం... నేను పనిచేసే ఫిలిం పరిశ్రమ నా స్వర్గం. ఒక పాత్ర ధరిస్తున్నప్పుడు హావభావాలు, భాష చక్కగా రావడానికి నేను పడే శ్రమే నా పూజ. కృషి ఫలించినపుడు, నా ప్రేక్షకులు నన్ను మెచ్చుకున్నపుడు పొందేదే స్వర్గసుఖానుభూతి, విఫలుడిని అయినపుడు పడేది నరకబాధ.... ఇంతకు మించిన దైవాన్ని స్వర్గాన్ని బాధను నేనెరుగను. నేనెరుగని దాన్ని నమ్మను." అంటాడతను.

అతను ఎన్నడూ పూజలూ పునస్కారాలూ చెయ్యడు. అతని అదృష్టం. అతనితో మనసారా ఏకీభవించగలిగిన సహధర్మచారిణి లభించడం.

ఆమె అతని ఇంటిని స్వర్గధామంగా తీర్చి దిద్దిపెట్టింది. ఒకప్పుడు నాగేశ్వరరావు అహోరాత్రులూ పనిచేసి ఆరోగ్యం, మనశ్శాంతి లేకుండా హైరాణ పడుతున్నపుడు అతనికి ఆనందదాయకమైన మార్గం కనిపించింది ఆమె వల్లనే.

"నేను రోజుకి పధ్నాలుగు గంటలు సెట్ మీద ఎవరి జీవితాన్నో నటిస్తున్నాను. నా పాత్రల సమస్యలు ఆలోచిస్తున్నాను. వాళ్ళ కష్టసుఖాలు అనుభవిస్తున్నాను. నా జీవితం అనుభవించే దెప్పుడు? నాకొక్క దోసెడు సానుభూతి, జానెడు తీరుబాటు సంపాదించుకునేదెప్పుడు.... అన్న ఆలోచన కలిగింది.. అందుకని నా చిత్రాలు తగ్గించుకున్నాను. వారాని కోరోజు, ఏడాదికో నెల, సెలవు సంపాదించుకున్నాను...." అంటా డీనాడు నాగేశ్వరరావు.

విక్రమార్కుడు ఒకపుడు భట్టితో సమంగా రెండు వేలేళ్ళు బతకడానికి, వెయ్యేళ్ళు రాజ్యమేలు అన్న కాళికాదేవి వరానికీ అక్షరాలా అర్థం తీసి ఏడాదికి ఆరు నెలలే రాజ్యపాలన, ఆరు నెలలు దేశాటనం చేశాడు. ఈ విధంగా అతను రెండు వేలేళ్ళు జీవించాడు.

నాగేశ్వరరావు, తన నూరేళ్ళ జీవితంలో పదిహేనేళ్ళకు పైగా ఇతరుల జీవితాలు ధరిస్తున్నాడు. మరి పదిహేనేళ్ళు ధరించగలడు. అందువల్ల అతని వయస్సు 20 వ ఏట ఆగింది. అందువల్ల అతను నిత్యయౌవనుడు. ఉత్తరాదిన అశోక్‌కుమార్ లా నిత్యనూతనుడు. మరో శతచిత్రోత్సవం చేసుకుందికి, మరో పది గదుల బహుమతులు గడించుకుందికి సిద్ధంగా ఉన్నాడు.

పెళ్ళినాడు, అత్తవారి తరపున బావమరిది వచ్చి 'ఆస్తి ఎంత' అని అడిగాడు. ఈనాడు "ఏమయ్యా, ఐదుగురు పిల్లల తండ్రివి. లక్షలకొద్దీ ఖర్చు పెడుతున్నావు. దానాలిస్తున్నావు. ఏ మాత్రం జాగర్తజేశావు? నీ ఆస్తెంత?" అంటే తన గదినిండా ఉన్న షీల్డులు, వెండికప్పులు, నటరాజ విగ్రహాలూ, చిత్రాలూ చూపిస్తాడు. "ఇవే నా సిరిసంపదలు" అంటాడు.

వాటిని అంత అపురూపంగా చూసుకుంటాడు. అడయారు అన్నామలైపురంలో నాలుగైదు లక్షల రూపాయలతో మనోహరమైన భవనం కట్టించుకున్నపుడు - అతను ఈ సిరిసంపదల గదికి ప్రత్యేకం డిజైను వేయించి పదివేల రూపాయల ఖర్చుతో దానికి హంగులమర్చాడు. ఈ పదిహేనేళ్ళలో లక్షలాది ప్రేక్షకులు తనకు అభిమానంతో చదివించిన సన్మానపత్రాలు గదులు నిండిపోయే పర్యంతరం అయి కాలదోషాన పాడైపోయే స్థితి రావచ్చని తోచగానే, వాటన్నిటికి ఫోటోలు తీయించి పది కాలాలపాటు వన్నె తరగకుండా, చెక్కు చెదరకుండా ఉండేలా అల్బం తయారు చేయించాడు. 'ఈ శ్రద్ధ కో సన్మానం చెయ్యా'లన్నాడు ఫోటోగ్రాఫరు నవ్వి.

ఇలాటి మౌలికమైన ఆలోచనలలో అతని కతనే సాటి.

తను జీవితంలో ఒక స్థితికి వచ్చాడనుకున్నపుడు అందుకు కారణమైన నిర్మాతలకు, తన ప్రేక్షకులకు కృతజ్ఞతాభివందనాలు అర్పించాలన్న వూహ అలాటిదే. విద్యా సంస్థలకు దానం ఇచ్చి సినిమా పరిశ్రమకే ఒక విధంగా గౌరవకారణమైన పని చేసినవాడు అతనే.

ఇపుడు సరికొత్త ఉద్యమం ఆరంభించాడు.

తగుపాటి డబ్బు సంపాదించినపుడు - సినిమా పరిశ్రమలో తిప్పు తగ్గది తిప్పుతున్నపుడు, మరొక పరిశ్రమ స్థాపించిన తను బాగుపడి, మరి పదిమందికి ఉపాధులు చూపాలన్న సంకల్పం కలిగింది.

ఇటీవలే బంధుమిత్రుల సహకారంతో అన్నపూర్ణా పల్వరైజింగ్ మిల్స్ ఏలూరులో నెలకొల్పాడు. మరి ఒకటి రెండు స్థాపించడానికి సన్నాహాలు చేస్తున్నాడు.

ఇది కొత్త రంగం. ఇది కొత్త సంగరం.

ఇందులో అతను ఈనాడు కాలుపెడుతున్నాడు. ఇందులోనూ విజయం సాధిస్తాడనడానికి సందేహం లేదు.

ఇటుపై సవ్యసాచిలా పని చేస్తాడు. మున్ముందు అతని చిత్రాలు సంఖ్యలో తక్కువ అయినా స్థాయిలో ఉత్తమంగా ఉంటాయనడానికి సందేహం లేదు.

అతనికి ప్రతీదీ కొత్త ఉద్యమమే. కొత్త యాత్రే. కొత్త జీవితం కోసం, కొత్త విజయాలకోసం అతను రాజధానికి తరలివెళ్తున్నాడు. మున్ముందు అతను ఏరంగాలకు వెళ్తాడో, ఏమి చేస్తాడో జీవితపు వెండితెరమీద చూడవలసిందే. ఇపుడు ఇంటర్ వెల్ కూడా కాలేదు.

అందువల్లే ఈ పుస్తకానికి సంపూర్తిలేదు. దీనికి కథ ఆకారం లేదు. అయినది ఉపోద్ఘాతమే.

ఇది ఒకటో ప్రకరణం. "నేర్చినది కాదు; నేర్వవలసింది చాలా వుంది. చేసింది కాదు: చెయ్యవలసింది చాలా వుంది" అని అతను వినమ్రతతో అంటాడు.

అందువల్ల ఈ పుస్తకం, ఈ ప్రకరణం, ఈ వాక్యం కూడా అసంపూర్తిగా...



సినీవ్యాస రమణీయం (నటీనటులు)

# ధృవతార



గ్లిసరిన్ లేకుండా కడవలకొద్దీ కన్నీళ్ళు కురిపించగల తార అనిమటుకే సినీమనీషులు, కన్నాంబను ఒకప్పుడు మెచ్చుకునేవారు. తరువాత కొన్నాళ్ళకి తెలిసింది; గ్లిసరిన్ లేకుండా తను కంట నీరు పెట్టడమే కాక, వేలాది ప్రేక్షకులను శోకావహుల్ని చేయగల ప్రజ్ఞ ఆమె సొత్తు అని అందరూ గ్రహించారని. ఆ తరువాత ఇంకొకటి తెలిసింది. కన్నాంబ కోపం నటిస్తే కథలో పాత్రలే కాక, సినిమా తీసేచోట సాటి నటీనటులూ సినిమాలో ప్రేక్షకులు కూడా భయపడతారనీను. తరవాత మరోటి తెలిసింది. కన్నాంబ మాతృవాత్సల్యం ప్రదర్శిస్తే ముగ్ధులు కాని ప్రేక్షకులుండరు అని. బహుశా ఆమెలో నిజమైన ప్రజ్ఞ ఉన్నందువల్లనే ఆమె గ్లేమర్ స్టార్ కాకపోయి ఉండాలని చాలామంది అంటూ ఉంటారు.

సినీతారాపథంలో ఆమె స్థానం ఎక్కడవున్నా నటిగా ఆమెది ధృవస్థానం.

సినీలోక భ్రమణంలో వెళ్ళగలిగినంత ఎత్తుకు వెళ్ళాక, అక్కడ నుంచి దిగిపోవడం సాధారణం. ఎవరో కొందరే అలా స్థిరంగా నిలబడగలరు. కొందరే, అటు ప్రేక్షకుల అభిమానంతోపాటు ఇటు సాటి నటీనటుల గౌరవమూ సంపాదించి

నిలుపుకోగలరు. కన్నాంబ 24 సంవత్సరాలుగా ఈ అరుదైన స్థానంలో నిలిచింది. వయసుతోపాటు మనిషి పెరగకుండా తరగకుండా, ఎప్పుడూ ఒక్కలాగే ఉండడం కూడా సినిమా ప్రపంచంలో బహు అరుదు. కన్నాంబను సెట్ మీద చూసినవారు ఈవిడ నానాటికీ పెద్దదవుతోందా చిన్నదవుతోందా అని విస్తుపోతూ వుంటారు.



'ఆడపెత్తనం' లో పెరుమాళ్ళు, కన్నాంబ

తెలుగు నాటక రంగస్థలం మీదా సినిమాలోనూ గడించిన అనుభవంతోను, కొన్నాళ్ళు కష్టపడి నేర్చుకున్న తమిళంతోను కన్నాంబ ఈనాడు తమిళ చలనచిత్ర ప్రపంచంలో కూడా గౌరవనీయమైన స్థానం ఆక్రమించుకుంది. ఆమె విగ్రహం, మాటతీరూ కూడా కావాలంటే పదహారణాల దక్షిణాది ఫక్కీలో కుదురుతాయి ఆమెకు.

తమిళ చిత్రాలలో, ఆమె నడిపిన కణ్ణగి పాత్రకు, చాలా గౌరవం ఉంది. ఒకనాడు దొమ్మేటి పక్కన రంగూన్‌రౌడీలో ప్రభావతి పాత్రకూ, హరిశ్చంద్రలో చంద్రమతికీ, తెలుగుదేశంలో లభించినంత గౌరవం ఇక్కడ ఈ పాత్ర నిర్వహణ పొందింది. ఈ రోజున తమిళనాడులో, ఆదర్శమాతకు రూపకల్పన కన్నాంబనుచూసే చేస్తారు. ప్రజ్ఞకొద్దీ పైకి వచ్చిన వారి పేరుమటుకు వాడుకునేవారు అక్కడా ఇక్కడా ఎక్కడా ఉంటూనే వుంటారు. ఆ కారణంగా కన్నాంబ ఒక్కొక్కసారి తలా తోకాలేని పాత్రలు భరించవలసి వస్తోంది. ఉన్నపళంగా పాత్రలో కరిగి లీనమై పోవాలన్న దురభిప్రాయాలూ అపోహలూ లేని నటి కాబట్టి, ఆమె తగని భూమికను చేపట్టినా దాని పక్కన నిలబడి చాతుర్యంతో, సమర్థుల స్థైర్యంతో దానిని ఉద్ధరించి, తీరుగా నడపగలదు. అయితే ఇటువంటి ప్రజ్ఞ ఉన్నదన్న ధీమాతో తరచుగా ఆమె ఆ ప్రజ్ఞను పరీక్షకు పెట్టడం తగదు. తన ప్రజ్ఞకు తగినవాటినే ఎన్నుకోవడం మంచిది; వాంఛనీయం. ***(ఆంధ్ర వారపత్రిక - 1959)***

1964లో 51వ యేట మరణించేనాటికి 150 సినిమాలలో నటించిన కన్నాంబ ఆఖరిచిత్రం 'వివాహబంధం'. రాజసం, ఠీవి, ఒలికించే పాత్రలకు, కంచుకంఠానికి ఇప్పటికీ ఆమెను తలచుకుంటారు. తమిళరంగాన కూడా ఆమె ఎనలేని కీర్తి గడించింది. భర్త కడారు నాగభూషణంతో కలిసి తెలుగు, తమిళ, కన్నడాలలో 30 సినిమాలు నిర్మించారు.

# రేలంగీ-వెంకట్రామయ్యా



"మీకు బాగా నచ్చిన వాటిలో బెస్ట్ జోక్ ఏమిటి?" అని ఒక మిత్రుడు అడిగితే, ఏముందీ, "లైఫ్, అనగా జీవితం" అన్నాడు రేలంగి వెంకటరామయ్య.

రాళ్ళూ రప్పలూ తిని హరాయించుకోగల రోజున మరమరాలు కూడా దొరకవు! తీరా వజ్రాలూ వైడూర్యాలూ పోగేసుకొన్నాక మరమరాలు కూడా అరగవు... రేలంగీ-వెంకట్రామయ్యా తెరమీదా జీవితంమీదా షికారు వెళ్తూన్నపుడు తరుచు ఈ మాట చెప్పుకుని పగలబడి నవ్వుకుంటూ ఉంటారు. దొరక్క వీడూ, అరక్క వాడూ అనుకుంటూ ఉంటారు.

నవ్వడం, నవ్వించడం, నవ్వుకోవడం రేలంగికి ఈనాటి విద్యకాదు! కాకినాడ యంగ్‌మన్స్ హాపీ క్లబ్‌లో చేరిన "అన్ హాపీ మెంబర్ల"తో కలిసి తిరిగిననాడు కూడా నవ్వడం నవ్వించడమే రేలంగి ఉద్యోగం. సినిమా పేటలలో వేషాల వేట సాగించినపుడు, హేళన మాటలు పడినపుడు, జార్జిటవున్‌లో ఉల్పాగా సినిమా చూసి నిశిరాత్రివేళ, ఆరుమైళ్ళ దూరాన ఉన్న ఆళ్వారుపేటకి రాజబాట కొలుస్తూ వచ్చి బార్లీగంజి తాగి కళ్ళు మూసుకు పడుకున్నపుడు, ఉచ్చస్థితికి వెళ్ళి జారిపడినపుడు, తనని చూసీ, తనని చూసి నవ్విన వాళ్ళని చూసీ కూడా నవ్వుతూనే వచ్చాడు; నవ్వుకుంటూనే వచ్చాడు. అతను కష్టాలుపడ్డా దుఃఖం ఎరగడు. భోజనంలేక శోషవస్తే నిద్ర నటించి జీవితంతోనే సరసమాడి దాన్ని నవ్వించాడు. మెప్పించాడు.

లొంగదీసుకు సవారీ చేస్తున్నాడు. ఈ విధంగా ఎంతసేపూ తన కష్టాలు తలుచుకు కుమిలిపోయి తనమీద తనే జాలిపడుతూ కూర్చున్నవాడు కాదు కాబట్టి తనచుట్టూ ఉన్నవాళ్ళ కష్టసుఖాలు చూడగలిగాడు. ఇలా హాలాహలంలోంచి అమృత భాండాలను, బాధలను చిలికిచిలికి తీసిన అతని నవ్వు; అతని హాస్యం, సినిమాలో అతను పలికే మాటలు కొన్ని వెలితిమాటలయినా అతనినోట వచ్చినపుడు నిండుగా ఉండడానికి ఒక కారణం ఇదే.

పాత "చింతామణి" చిత్రం నుంచి నేటివరకూ నూటికి పైబడ్డ చిత్రాలలో నటించినా హాస్యం మటుకు పాత చింతకాయ పచ్చడిలా తయారవకుండా ఉండడానికి అతను చేసిన కృషి అపారం. సినిమాలో వేషానికి సాధారణంగా రచయితా దర్శకుడూ రూపకల్పన చేయడం నిజమే అయినా, రేలంగి అందులో జీవం పూరించి ఏదో కొత్తదనం తేవడానికి, సమకాలిన జీవితానికి దగ్గర కావడానికి కృషి చేస్తూవచ్చాడు. కొత్తల్లో చేసిన ఆ కృషి వల్లనే పాత్రల బదులు రేలంగే ప్రజాదరణ పొందాడు. 'రేలంగి ఉంటే చాలండీ' అనే జనం పెరిగారు. చివరికి, రేలంగి తత్వాన్నిబట్టి, జీవితంపట్ల ఆయన దృక్పథాన్నిబట్టి ఆయన ధరించే పాత్రలకు రూపకల్పన చేయడం, వేషభాషలు నిర్ణయించడం జరిగింది. సినిమా ఏదైనాసరే-కథ ఏదైనా సరే రేలంగి, హాస్యానికి ఒక వ్యవస్థ అనిపించుకున్నాడు. తెలుగు సినిమాలో ఒక శకం నెలకొల్పాడు. నిజంగా ఒక నటుడుగా వ్యక్తిగా ఆయన ఘనతకు ఇది జోహారు చేయడమే కావచ్చుకాని, సినీ విపణి వీధిలో ఇది బాక్సాఫీసు సూత్రమైపోయింది. దుమ్ముకొట్టింది. క్రమంగా రేలంగి పేరునే తప్ప ప్రజ్ఞని వాడుకోడం మర్చిపోతున్నారు సినీపారిశ్రామికులు. రేలంగి కూడా కొంత పరాకు చిత్తగించడం, కొంత మొహమాటాలకు లొంగడం జరిగిందని ఆయన విమర్శకులు అంటారు. ఇలాటివి చిత్రపరిశ్రమలో తప్పవు. అయితే ఇలాటివి వచ్చినా రేలంగి ఓడిపోడు.

పదేళ్ళనాడు పైకివస్తున్న రేలంగిని కిందకి కొట్టింది అదృష్టం! రెట్టించిన జవసత్వాలతో బంతిలా పైకి ఎగిరాడు తను. అదీ అతని తరహా.

తెరమీద రేలంగి ఎంత సందడయినవాడో జీవితం మీద వెంకట్రామయ్యగారూ అంత సందడయిన మనిషీను. సినిమాలో పాత్రలు మన సొమ్మేం పోయిందన్నట్టు దయాదాక్షిణ్యాలు వెదజల్లితే, జీవితంలో రేలంగి అంతకన్నా దర్జాగా ఉదారంగా ధారాళంగా మంచి పనులు చేస్తాడు. కష్టాలను, కష్టాలలో ఆదుకున్న మిత్రులను మరచిపోలేడు. తిరపతి విశ్వవిద్యాలయానికిచ్చిన విరాళం వంటివి కాక, గుప్తదానాలు ఎన్నో చేశాడు. పెళ్ళిళ్ళు చేయించి ఇళ్ళు నిలబెట్టడం అతని సరదా. ఎప్పుడూ దిగులు తన జోలికిరాకుండా చుట్టూరా పదిమందిని కూర్చోబెట్టుకుని కబుర్లాడుతూ తిని తిరగడం సరదా. తన యింట్లో రోజూ పాతిక ముప్ఫై విస్తళ్ళు లేవగా చూడడం సరదా. నిత్యకల్యాణం పచ్చతోరణం అన్నట్టుగా జీవించడం - సందడిగా జీవించడం సరదా. ***(ఆంధ్ర వారపత్రిక - 1959)***

# బ్రిటిష్ నటుడు అలెక్ గినెస్



"నువ్వు పనికిరావు; పైకిరావు" అని ఆశీర్వచనాలు అందుకునేవాళ్ళు మెతక మనుషులైతే దీవించినవారిమాట అక్షరాలా జరుగుతుంది; అలెక్ గినెస్‌లాటి వాళ్ళయితే అన్యథా అవుతుంది. 'గినెస్ చూట్టానికి ఎంత సౌమ్యుడుగా, మొహమాటస్థుడుగా కనిపిస్తాడో అంత మొండిపట్టుదల గల మనిషి' అని అతన్ని ఎరిగినవాళ్ళు చెబుతారు. బాగా ఎరిగినవాళ్ళు, 'అతను ఎవరికీ అర్థం కాడు; దుర్భేద్యమైన మనసు' అంటారు. వెండితెర ద్వారానే పరిచయం ఉన్నవాళ్ళు, 1947లో "గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్"తో ఆరంభమై పదేళ్ళు తిరిగేసరికి ప్రపంచావధిని అగ్రశ్రేణి నటుడనిపించుకొనే స్థాయికి వచ్చిన అతని చలనయాత్రకథ చదువుకుని, పూర్వాపరాలు తెలుసుకుంటే, అతని ఆత్మవిశ్వాసం పట్టుదల కొట్టొచ్చినట్టు కనబడతాయి.

'బ్రిడ్జి ఆన్ ది రివర్ క్వాయ్' లో బ్రిటిష్ జనరల్‌గా ప్రదర్శించిన నటనకు మొన్న అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ అవార్డును అందుకొన్నాడు గినెస్. రెండువారాలక్రితం, బ్రిటిష్ దర్శకుడు డొనాల్ నీమ్ తీసిన 'హార్సెస్ మౌత్'లో నటనకు, వెనిస్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ఉత్తమనటుడుగా ఎన్నిక అయి బహుమతినందుకున్నాడు. ఈ చిత్రానికి అతడు స్క్రీన్‌ప్లే కూడా వ్రాశాడు.

గినెస్ వాలకంచూసినా, విగ్రహం చూసినా సినిమావాళ్ళు ఎగిరిగంతేసి బుక్ చెయ్యరు. అతడు తెరమీద అద్భుతంగా నటించే సగటుమనిషిలాగే నిత్యజీవితంలోనూ

కనిపిస్తాడు. కాని ఎంత సామాన్యుడుగా కనిపిస్తాడో అంత ప్రత్యేకత అతనిలోవుంది. అతడు ఎదుటివాళ్ళని క్షణాలమీద పుస్తకంలా చదివేసుకుంటాడు; కాని తనుమాత్రం దొరకడు.

అలెక్ గినెస్ పశ్చిమ లండన్‌లో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. అతని జననం వైనం ఆ వూరి పరిపాలనా పుస్తకాల్లో దొరకలేదట. అతని తమాషా మాటల్లోనే చెప్పుకోవాలంటే– "నన్ను మా నాన్న తన 64వ ఏట 'ఉత్పత్తి' చేశాడు. ఆయన బ్యాంకు ఏజెంటు. పేరు ఆండ్రూ. మా అమ్మపేరు అగ్నిస్"...

ఆండ్రూకి చాలా డబ్బుంది. ఉంటేనేం? అలెక్ దారిద్ర్యంలో పెరిగాడు... అతని చదువుకి, భోజనానికి స్కాలర్‌షిప్ సంపాదించాడు. విశేషం ఏమిటి అంటే, అది వాళ్ళనాన్న బీదపిల్లలకోసం పెట్టిన నిధికి చెందినది!

దాదాపు ఏడో ఏటనించీ గినెస్‌కు నాటకాల్లో వేషాలెయ్యాలనే ప్రయత్నం. బడిలో మేష్టర్లూ, దరిమిలా లండన్ నాటక కంపెనీలూ "నువ్వు పనికిరావు గినెస్" అంటూనే వచ్చారు. అన్న కొద్దీ పట్టుదల పెరిగింది గినెస్‌కి. ప్రసిద్ధ బ్రిటిష్ నటుడు సర్ జాన్ గీల్‌గడ్ అతనికి ఆ రోజుల్లో ప్రోత్సాహం, డబ్బులూ కూడా ఇచ్చి సాయం చేయబోయాడు. గినెస్ మొదటిది పుచ్చుకుని రెండోది తప్పించుకున్నాడు. రోజుల తరబడి తప్పనిసరి ఉపవాస దీక్ష వహించి, నీరసించి, శుష్కించిపోతున్నా అతను దేహి అనలేదు. ఆ స్థితిలో అతనికి, ఒక నాటకంలో రోజుకి మూడు వేషాలు వేస్తే వారానికి రెండు పౌండ్లు కిరాయి దొరికేఛాన్సు వచ్చింది. ఆ వేషాలు చైనీస్ కూలీ, ఫ్రెంచి సముద్రపు దొంగా, బ్రిటీష్ నావికుడూను. మాటలేమీ లేవు. అయితే ఆ రోజున ఆ వేషాలతో లండన్ స్టేజి ఎక్కిన గినెస్, – ఆ కాస్తలోనే ప్రజ్ఞను చూపి మళ్ళీ నిరుద్యోగం ఆకలీ, వాకిలి ఛాయలకు రాకుండా చేసుకున్నాడు.



ఆలివర్‌ట్విస్ట్‌లో దుష్టభూమికలో

దాదాపు 30 ఏళ్ళపాటు గినెస్ నాటకరంగంమీదనే జీవించాడు. షేక్స్పియర్, షెరిడాన్, పిసెరూ, చెకోవ్ మొదలైనవాళ్ళ నాటకాలలో గీల్‌గడ్, సిలీవియల్ వంటి హేమాహేమీలతో నటించాడు. అప్పట్లో అతనికి సినిమాలంటే చిన్నచూపుగానే ఉండేది.

నిజానికి మనదేశంలో తప్ప మరెక్కడైనా నటులు సినిమాలని తేలిక చెయ్యకపోయినా నాటకాలని ఎక్కువ ఆదరిస్తారు. సర్ లారెన్స్ ఒలీవియర్ గత సంవత్సరం ఒక సందర్భంలో ఒక హాలివుడ్ చిత్రంలో నటించడానికి 3,50,000 డాలర్లకి ఒప్పందం కుదరబోయింది. అంతలోనే 'ది ఎంట డెయ్‌సర్' అనే ఒక నాటకం ప్రదర్శనకు వచ్చింది. అందులో నటించమని ఆహ్వానం వచ్చింది. దీనివల్ల రాబడి వారానికి నూటపాతిక డాలర్లే. ఒలీవియర్ అట్టే ఆలోచించకుండానే సినిమా కాంట్రాక్టు తిరస్కరించి రంగస్థలం మీదకు వెళ్ళాడు!... గినెస్‌కు సినిమా మీద మోజు లేకపోయినా, తను విషాదాంత నాటకాలకు పనికొస్తాడని అనుకున్నా అతడు 1950లో వేసిన 'హామ్లెట్' పాత్ర రాణించలేదు... అందుకు తగ్గట్టే అతని మొదటి మూడు చిత్రాలూ - గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్, ఆలివర్‌ట్విస్ట్, కైండ్ హార్ట్స్ అండీ కారొనెట్స్ మంచి విజయం సాధించి, అతనికి పేరు తెచ్చిపెట్టాయి. చివరికి గినెస్ సినిమాలో దిగాడు... వచ్చినవి కొద్దిచిత్రాలే అయినా ప్రతీదీ అతని ప్రఖ్యాతిని మరింత పెంచుతూ వచ్చింది. 1955లో 'స్వాన్' చిత్రం అమెరికాలో పేరు తెచ్చిపెట్టింది. 1957లో 'క్వాయ్' చిత్రం ప్రపంచ ఖ్యాతినీ, అకాడమీ బహుమతినీ, మొన్న మొన్నటివరకూ అతనిలో అప్పుడపుడు జంకుతూవచ్చిన ఆత్మవిశ్వాసానికి పుష్టినీ ఇచ్చింది.

భాష వాడకుండా, భావం ప్రదర్శించకుండా పాత్ర తత్వాన్నీ, సంక్లిష్టమైన సన్నివేశాల సారాంశాన్ని ప్రేక్షకులు గ్రహించి ఆకళింపు చేసుకునేలా చేయగల కొద్దిమంది గొప్ప నటులలోనూ గొప్పవాడు అలెక్ గినెస్ అని ఆ చిత్రంలో అతని నటన నిరూపించింది. ***(ఆంధ్ర వారపత్రిక - 1959)***



అలెక్ గినెస్ - సర్ బిరుదంతోపాటు అలెక్‌కు తర్వాతి కాలంలో ఎన్నో గౌరవాలు లభించాయి. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీవారు 1977లో, కేంబ్రిడ్జ్ వారు 1991లో ఆనరరీ డి.లిట్ ఇచ్చారు. నటుడిగా అనేక పాత్రల్లో రాణించిన అలెక్ ప్రొ॥ గోడ్‌బోలేగా 'ఎ పాసేజి టు ఇండియా' (1984)లో నటించారు. 'స్టార్‌వార్స్' (1977) సిరీస్‌లో ఓబివాన్‌గా నటించి తర్వాతి తరాన్ని కూడా ఆకట్టుకున్నా, దానికి ఆస్కార్ నామినేషన్ వచ్చినా ఆయనకు ఆ సినిమాలోని పాత్ర అస్సలు నచ్చలేదట. 'ఎపాజిటిప్లీ ఫైనల్ అపిరియన్స్' పేర తన జ్ఞాపకాలను గ్రంథస్తం చేసిన అలెక్ 2000 సంవత్సరంలో మరణించారు. ఆయన ఆఖరి స్టేజిషో 'ఎ వాక్ ఇన్ ది వుడ్స్ (1989) అనే కామెడీ నాటకం కాగా, ఆయన ఆఖరి టివి సినిమా 'ఎస్కిమో డే' (1996). 'బ్రిడ్జి ఆన్ ది రివర్ క్వాయ్'లో అభినయానికి ఆయనకు ఆస్కార్ లభించింది.

సినీవ్యాస రమణీయం (సాంకేతిక నిపుణులు)

# మిస్టర్ హాలీవుడ్ - సిసిల్ బి డిమిల్

చలనచిత్ర చరిత్రలో నిలబడి, పదికాలాలపాటు వినబడే పేరు గలవాడు, తోటివారు, మేటివారు సగౌరవంగా చెప్పుకోవలసిన పేరుగలవాడూ, అమెరికన్ చలనచిత్ర పరిశ్రమ సాంకేతిక పారిశ్రామిక ప్రగతికి దోహదకారుడు, బ్రహ్మాండమైనవనతగ్గ చలనచిత్రాల నిర్మాణ కథకు నాయకుడూ అయిన సిసిల్ బ్లౌంట్ డిమిల్ హఠాన్మరణం (1959 జనవరి 21) దేశదేశాల చలనచిత్ర అభిమానులకు విచారం కలిగించింది. మరణకాలం నాటికి 77 ఏళ్ళవయోవృద్ధులైనా, ఆయన జవసత్వాలను, ఆయన వేసుకున్న పథకాలను కన్నవారికిగాక విన్నవారికి కూడా వారిది అకాలమృత్యువు అనిపించింది.



హాలీవుడ్ ప్రొడ్యూసర్లకు గల వికారాలు అనండి మరి ఏమైనా అనండి - చుట్టపీకలు నమలటం, హంగామా చేయడం మొదలయిన లక్షణాలు డిమిల్‌లో లేకపోవడం చేత ఆయనను 'మిస్టర్ హాలీవుడ్' అని పిలవడం కొంచెం చిత్రంగానే కనిపిస్తుంది, హాలీవుడ్ ఆవిర్భావం చరిత్ర తెలియనివారికి -

1913 - కన్నుల విందనతగ్గ ప్రకృతి దృశ్యాలు, పుష్కలంగా సూర్యకాంతి లేకపోతే కథ నడవదని, ఫిల్ము తీసి చూడలేమనీ అంగీకరించవలసిన రోజులు. ఫిల్ముతీస్తే తీసినా, చూడగలమని నమ్మకం లేదు. అందువల్ల 'స్క్వామాన్' చిత్రం నిర్మాణబృందం 'గో వెస్ట్' అనుకుని రైలెక్కి పడమటి దిశగా బయల్దేరారు. ఎండ, అందమైన కొండలూ అడవులూ మెండుగా ఉండగల చోటు వెతుకుతూ! వెళ్ళి వెళ్ళి అరిజోనా రాష్ట్రంలో ఫ్లాగ్‌స్టాఫ్ పట్నం దగ్గిర దిగారు. తీరా చూస్తే ఎండ ఏమాత్రం మెండుగా లేదు. ఆ మాటకొస్తే హోరున వాన కురుస్తోంది. ప్రకృతి దృశ్యాలు కూడా, కెమెరా కంటికి యింపుగా లేవు. దండగ అయితే అయిందని, ఆ బృందం నాయకుడు సిసిల్ బ్లౌంట్ డిమిల్ మళ్ళీ రైలెక్కమన్నాడు. ఈసారి ఈ రైలు ఎందాకా పోతుందో అక్కడికి టిక్కెట్టు తీసుకున్నాడు.

వెళ్ళివెళ్ళి ఆ రైలు ఒక కుగ్రామం దగ్గిర ఆగిపోయింది. అక్కడ ఎండ వెచ్చగా, నారింజరంగులో అందంగా ఉంది. ప్రకృతి కూడా రమణీయంగా ఉంది. నారింజతోటలూ, మిరియాల చెట్లూ అవీను. డిమిల్ అక్కడ ఒక గొడ్లచావడి వాడితో మాట్లాడి ఒక పెద్ద చావడిలో సగభాగం అద్దెకు తీసుకుని ఇదే స్టూడియో అన్నాడు. గుర్రాలు కట్టేసే గదులు చూపించి ఇవి మేకప్ రూమ్స్ అన్నాడు.

అదే జగద్విఖ్యాతి నొందిన చలనచిత్ర దర్శక నిర్మాత సిసిల్ డిమిల్ కథకు మొదలు. ఆ గొడ్లసావిడే ఇప్పటి సువిశాలమైన పారమౌంట్ చిత్రభువనభవనాలకు పునాదిరాయి లాంటిది. ఆ సావడి పెద్ద స్టుడియోగా పెరిగినట్టే ఆ కుగ్రామం ఆనాడు మొదలై ఈనాటి ప్రపంచ చలనచిత్ర పరిశ్రమ రాజధాని హాలీవుడ్‌గా విస్తరించింది. అందువల్లనే సిసిల్ డిమిల్‌ను హాలీవుడ్ వ్యవస్థాపకుడు అంటారు.

హాలీవుడ్‌లో పెరిగిన, లేదా దాన్ని పెంచిన డిమిల్ చలనచిత్రకళకు రెండు ముఖ్యసాధనాలు ప్రప్రథమంగా సమకూర్చి, అభివృద్ధికి దారితీశాడు. ఒకటి సెట్ మీద లైటింగుకి సంబంధించింది.

రెంబ్రాంట్ లైటింగ్- కాలిఫోర్నియాలో కూడా సూర్యుడు ఎప్పుడుపడితే అప్పుడు కాల్‌షీటుకి హాజరవుతాడని గారంటీ కనబడక, ఒక చిత్రానికని డిమిల్ ఒక అపెరా హౌస్ వాళ్ళ దగ్గిర్నుంచి ఒక స్పాట్‌లైట్ ఎరువు తెచ్చాడు. దాని కాంతిని ఒక నటుని మొహం బాగా చూపించడానికి వాడాడు. ఆ వాడడంలో మొహం అంతా కాకుండా కెమెరా వైపు బాగా ఉన్న భాగం మీద మటుకు పడేలా వేశారు. అలా చెయ్యడానికి అదే తొలిసారి. సరే చిత్రం పూర్తయింది. న్యూయార్కు పంపించారు ప్రదర్శనకి. హఠాత్తుగా న్యూయార్కు డిస్ట్రిబ్యూషన్ వ్యవహారాలు చూసే శామ్యుల్ గోల్డ్‌విన్ (దరిమిలా ఈయన మెట్రో గోల్డ్‌విన్ మేయర్ సంస్థ స్థాపకులలో ఒకడైనాడు) దగ్గర్నుంచి తంతి వచ్చింది.

సిసిల్ డిమిల్ కొంపముంచాడనీ, ఫిలింలో హీరో మొహం సగానికే లైటింగు ఉంది కాబట్టి, సినిమాహాలు యజమానులు సగం రేటే ఇస్తామంటున్నారనీ తంతి వార్త వెల్లడించింది.

డిమిల్‌కి మతిపోయింది.

"కాని హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చేసింది." అంటాడాయన ఆ సంగతి ప్రస్తావనకి వస్తే.

అదే లైటింగులో కొత్త అధ్యాయానికి నాంది అయింది. డిమిల్ డబాయింపు జవాబు ఇలా ఉంది. "నీకూ ఆ హాలు వాళ్ళకీ రెంబ్రాంట్ టైపు లైటింగు తెలియకపోతే మీ ఖర్మం అది. నా తప్పుకాదు." అని.

మర్నాటికల్లా కథ తరహా మారిపోయింది. "రక్షించావు. నీ రెంబ్రాంట్ లైటింగ్ నచ్చిందట. హాలువాళ్ళు మామూలు రేటుకి రెట్టింపు ఇస్తున్నారు." అని గోల్డ్‌విన్ జవాబు పంపాడు.



డిమిల్ చిత్రపరిశ్రమకు సమకూర్చిపెట్టిన మరొకహంగు 'కెమెరా బూమ్'. అది సంభవించిన సందర్భం కూడా తమాషాగానే ఉంటుంది.

ఒక చిత్రంలో ఒక మేడమీద గది షూట్ చెయ్యవలసి వచ్చింది. మేడ ఇవతల నుంచి, గోడ వెంబడే కెమెరాను పైకి ఎక్కించి కిటికీలోంచి లోపలి మనుషుల్ని తియ్యాలనుకున్నాడు డిమిల్.

'కెమెరాలు ఎక్కడైనా గోడలెక్కుతాయా?' అన్నాడు ఒక 'వాస్తవికవాది' విడ్డూరంగా, వెటకారంగా.

డిమిల్ అతనికేసి ఒక క్షణం చూసి "నేర్చుకుంటే ఎక్కగలవు" అన్నాడు. వెంటనే ఒక మేడ నిచ్చెన (దన్ను ఉండేది) తెచ్చారు. దాని మీద పొడుగుపాటి పలక వేసి బిగించారు. ఈ చివర కెమెరా ఉంచి, ఇంకో చివర ఇసుక బస్తాలు పెట్టి తూకం అమర్చుకుని షూట్ చేశారు. చక్రాలు, బండీ, హంగులు కుదిరాక కొన్నాళ్ళకి అదే కెమెరా బూమ్ అయింది. కెమెరా చుట్టూ తిరగడానికి పై నుంచి కిందకు చూడటానికి సదుపాయం కలిగింది.

ఈ విధంగా తన చిత్ర నిర్మాణయాత్రే చలన చిత్ర పరిశ్రమ ప్రగతిగా కొత్తవింతలు కనిబెడుతూ, ప్రపంచావధిని అద్భుతమైన చిత్రాలు తీస్తూ పేరు, ప్రఖ్యాతులు గడించిన సిసిల్ డిమిల్ ఆగష్టు 12వ తేదీని 1881లో జన్మించాడు. ఆయన నిర్మించిన 'ది టెన్‌కమాండ్‌మెంట్స్' బ్రహ్మాండమైన చలన చిత్రమని, అలాంటి చిత్రాన్ని ఇంతవరకు ఎవరూ నిర్మించలేదనీ, ఇంతలో నిర్మించగల అవకాశాలు కూడా ఉండక పోవచ్చునని చెప్పవచ్చు. తన 44 సంవత్సరాల చలన చిత్ర జీవితంలో డిమిల్ నిర్మించిన చిత్రాలలో అది 70వ చిత్రం.



శామ్సన్ అండ్ డిలైలా

తొలిసారిగా 1931లో "ది స్క్వామాన్" అనే చిత్రం నిర్మించాడు. హాలివుడ్ కూడా అప్పటి నుంచే అభివృద్ధి చెందుతూ వచ్చింది. 1915లో ఆయన 'కార్మెన్' అనే చిత్రం నిర్మించాడు. 1918లో ఆయన దర్శకత్వం వహించిన 'జోన్ ది ఉమన్' విజయవంతం గావటంతో ఆయన ఖ్యాతి ద్విగుణీకృతమైంది. దానిలో యుద్ధ దృశ్యాలూ, స్వప్నలోక విహారాలూ, డబుల్ ఎక్స్‌పోజర్లు ప్రేక్షకులనూ, విమర్శకులనూ కల్పనాలోకంలో విహరింప చేశాయి.

1927లో సిసిల్ బి. డిమిల్ నిర్మించిన 'కింగ్ ఆఫ్ కింగ్స్' ఏ నాటికీ మరవలేనిది. అలాటి అద్వితీయ కళాఖండాల్లో 'ది సైన్ ఆఫ్ ది క్రాస్' 'క్లియోపాత్రా' 'ది క్రూసేడ్స్', 'ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్', 'అన్‌కాంకర్డ్' నిత్యనూతనంగా భాసిస్తూ చలనచిత్ర ప్రేక్షకులను ఆకర్షిస్తున్నవి.

డిమిల్ చలన చిత్ర కళకు రసపుష్టి కూర్చలేకపోయినాడని ఆయనను కొందరు విమర్శకులు అనవసరంగా వెక్కిరించవచ్చు. స్నానమందిరాలు, రాజసభలు, యుద్ధరంగాలు మొదలైనవాటికి ఆయన వెచ్చించే ధనానికి ఆయనను హేళన చేయవచ్చు. కాని సిసిల్ బి.డిమిల్ చిత్రాలు ప్రపంచంలో మరి ఏ ఇతర నిర్మాత తీసిన చిత్రాలకన్న ఎన్నో రెట్లు ప్రేక్షకులను ఆకర్షించి కోటానుకోట్లుగా కనకవర్షం కురిపించేసినవి అనేది వారంతా ఒప్పుకొంటారు. ఆయన నిర్మించిన చిత్రాలు 'బ్రహ్మాండం'గా ఉండటమే గాక, చలనచిత్ర సీమలో ఎంతోమంది నిర్మాతలు ఉన్నప్పటికీ, ఆయన ఒక్కడే 'మిస్టర్ హాలివుడ్' అనే నామధేయంతో విశ్వవిఖ్యాతి గాంచేటట్టు చేశాయి. ఆ బిరుదు ఆయన కొక్కడికే తగును. తగదని ఎవరూ అనలేదు. అనరు.

ఆయనలో కళాకారుని లక్షణాలు, వ్యాపారవేత్త లక్షణాలు ఆధునిక రూపంలో సమన్వయముగా వుండేవి. ప్రతిరోజూ 12 నుండి 14 గంటల వరకు నిర్విరామంగా పని చేసేవాడు. ఎక్కడ వున్నా ప్రొడ్యూసర్ - డైరెక్టరుగా సాంకేతిక నటీ నట బృందం మీద అజమాయిషీ చేస్తూ ప్రతి పని అనుకొన్న ప్రకారం నిర్విఘ్నంగా జరిగేటట్లు చూసేవాడు. ఆయన బృందం అంటే సామాన్యం కాదు - 'టెన్ కమాండ్‌మెంట్స్' చిత్రంలో ఒకేసారి 15,000 మంది వరకు పని చేశారు.



భారీతనానికి మచ్చుతునక 'టెన్ కమాండ్‌మెంట్స్'

మోసెస్ జీవితం ఆధారంగా తీసుకొని నిర్మించిన 'టెన్ కమాండ్‌మెంట్స్' షూటింగ్స్ ప్రారంభించక పూర్వం అన్ని ఏర్పాట్లు చేయటానికి మూడు సంవత్సరాలకు పైగా పట్టింది. ఇతిహాస పరిశోధనలో 1800 గ్రంథాలూ, అన్ని ఖండాలకూ సంబంధించిన ఎన్నో పత్రాలు పరిశీలించవలసి వచ్చింది. వేలాది ఉపనటీనటులనూ, ఒంటెలు మొదలైన పశుగుణాలనూ ఉపయోగించుతూ ఈజిప్టు, పాలస్తీనాలలో రెండు నెలలు అవుట్‌డోరు షూటింగ్ జరిపారు. అంతకు పూర్వం ఒక సంవత్సరం నుంచీ ఈజిప్టులో నూరు అడుగులకు పైగా ఎత్తుగల సెట్లు నిర్మించారు. సాధారణంగా పెద్ద ప్రొడక్షన్‌కు పట్టేదానికంటె రెట్టింపు రోజులు అంటే నూరు రోజులకు పైగా హాలీవుడ్‌లో ఆ పిక్చరు షూటు చేశారు.

ఆయన తొలి 'టెన్ కమాండ్‌మెంట్స్' కూడా మిలియన్ డాలర్లు (సుమారు 45 లక్షల రూపాయలు) ఖర్చుతో పేరమౌంట్ వారికి తీసిపెట్టాడు. అంతడబ్బు వెచ్చించి తీసినందుకు ఆయనను పేరమౌంట్ వారు ఎన్నో మాటలన్నారు.

చిత్రం విడుదల అయింది. పెట్టుబడికి ఎన్నో రెట్లు డబ్బు వచ్చిపడింది. డిమిల్‌ను తొందరపడి మాటలన్నందుకు పేరమౌంట్‌వారు ఎంతో నొచ్చుకున్నారు.



షూటింగ్ చేస్తూ...

1912లో న్యూయార్కు నగరంలో ఒకనాటి భోజన సమయంలో ఆయన జెస్సీ లాస్కీతోనూ, సామ్యూల్ గోల్డివిన్‌తోనూ చలన చిత్ర నిర్మాణ భాగస్వామిగా చేరాడు. అంతకుముందు ఆయనకు కెమెరా అంటే ఏమిటో అట్టే తెలియదు. కాని నాటక కళారాధకుల కుటుంబంలో మనిషి కాబట్టి నాటకకళ గురించి తెలుసు. ఆ పైన స్వయంకృషి వల్ల అమోఘమైన అనుభవం గడించాడు.

బ్రాడ్వే ప్రొడ్యూసర్ డేవిడ్ బెలాస్కో, సిసిల్ తండ్రి హెన్రీతో, సి.డిమిల్ కలిసి పని చేస్తుండేవాడు. తల్లి బ్రాడ్వే నాటక ప్రతినిధిగా ప్రఖ్యాతి చెందింది. న్యూయార్కులోని అమెరికన్ అకాడెమి ఆఫ్ డ్రెమెటిక్ ఆర్ట్సులో శిక్షణ పొందాడు. నటుడిగా ఆయన అమెరికాలో పది సంవత్సరాలు పర్యటించాడు. నాటకాలు రచించాడు. తర్వాత సొంత కంపెనీ స్థాపించాడు. 1913లో చిత్ర నిర్మాణం ప్రారంభించాడు.

పది సంవత్సరాలైన పిమ్మట త్రిమూర్తులు (డిమిల్, లాస్కీ, గోల్డ్విన్) విడిపోయారు. అప్పుడే పారమౌంట్ వారికి 'టెన్ కమాండమెంట్స్' తీసిపెట్టడం జరిగింది. ఆ తర్వాత డిమిల్ తన సొంత స్టూడియో స్థాపించి చలన చిత్ర నిర్మాణం నిర్విరామంగా సాగిస్తూవచ్చాడు. దానితోపాటు మెట్రో గోల్డ్‌విన్ మేయర్ సంస్థలో ప్రొడ్యూసర్‌గా కూడా పని చేశాడు. అలా ఎనిమిది సంవత్సరాలు గడిచింది. తిరిగి పేరమౌంటు సంస్థలో చేరాడు.

బ్రహ్మాండమైన సెట్‌ల మీద నిజం అనిపించే వాతావరణంలో చిత్రిస్తే తప్ప కథలో రసపోషణ సాధ్యం కాదని డిమిల్ నమ్మకం. ఆయన కృషి ఫలితాలలో ఎక్కువ భాగం క్రైస్తవ పౌరాణిక గాథలు ఆధారంగా తీసిన చిత్రాలే. 'ది కింగ్ ఆఫ్ కింగ్స్'

'ది క్రూసేడ్స్', 'ది టెన్ కమాండ్‌మెంట్స్' (మూకీ, టాకీ) 'శామ్సన్ అండ్ డిలైలా' వంటివి.

ఒళ్ళు ఝుల్లుమనిపించే దృశ్యాలతో నింపుతూ డిమిల్ చేసిన ఇతర చిత్రాలలో 'ది అన్‌కాంకర్డ్', 'ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్' చెప్పుకో తగ్గవి. వెస్టర్న్ చిత్రాలలో డిమిల్ చిత్రం 'ది ప్లెయిన్స్‌మన్' నాటికీ నేటికీ కూడా విశిష్ట చిత్రంగా పరిగణించ బడుతోంది.

'బ్రహ్మాండమైన సెట్ కానీ, లక్షలాది డబ్బు తీసుకునే తారాగణం గానీ, ప్రముఖ దర్శకత్వం గానీ ఒక చిత్రాన్ని విజయవంతంగా నడిచేటట్లు చేయలేవు. కానీ ఒక్కదానికి మాత్రమే ఆ మహత్తర శక్తి ఉన్నది – అదే కథ' అని ఆయన నొక్కి వక్కాణించేవారు.

ఆయనకు సిరితోపాటు సంతానం కూడా ఉన్నది. 1902లో కాంన్టన్స్ ఆడమ్‌ను వివాహమాడారు. వారికి నలుగురు పిల్లలు. ఆయన పోయే నాటికి, 77వ పడిలో పడినప్పటికీ, 40 సంవత్సరాలవాడి చురుకుదనం ఆయన మరణించేవరకూ కానరావడానికి కారణం – ఆయన 'రసస్పృష్టి' అనే ఔషధం సేవించడం.

మామూలు కాన్వాసుమీద పెయింట్ చేసి, నాలుగు ఫ్లాట్లు అడ్డం పెట్టి, ఇవే రాజసౌధాలు, లతానికుంజాలు, భీకర రణరంగాలు, పర్వత శిఖరాలు, పాతాళలోకాలు అనే రోజుల్లో సాధ్యమైనంత వరకు అవి యదార్థంగా ఎలా కనిపిస్తాయో అంత కళ్ళు చెదిరేలా సెట్‌లు వేయాలని ఆయనకు ఎంత పట్టుదల ఉండేదో, ఇందులో గుండుసూది ప్రాముఖ్యాన్ని కూడా గుర్తించి ఆలోచించేటంత శ్రద్ధ కూడా ఉండేది. ఊహలూ, మాటలూ ఎగిరినంత ఎత్తుకి తాను ఎగరాలన్న పట్టుదల, దానికోసం లక్షలు ఖర్చు పెట్టే సాహసం, అహోరాత్రులు తాను శ్రమపడి, తోటి పనివారిని శ్రమపెట్టి ఫలితాన్ని సాధించ ప్రయత్నించే ఓర్పు (ఒకసారి భోజనానికి ఆలస్యమయిన కారణంగా ఉప నటీనటులు విసుక్కోనడం మొదలు పెట్టగా ఆయన, 'మీరందరూ నన్ను అసహ్యించుకున్నా మరేం ఫరవాలేదు. కాని రేపు మీ మొహాలను తెరమీద చూసుకొని మిమ్మల్ని మీరే అసహ్యించుకోకుండా ఉంటే అదే పదివేలు' అని గర్జిస్తే వారంతా బుద్ధి తెచ్చుకొని మనస్ఫూర్తిగా నటించేరట) వ్యయప్రయాసలు రెండిటినీ లవలేశం కూడా పొల్లుపోకుండా పూర్తిగా సద్వినియోగం చేసుకొని ప్రేక్షకులకు తృప్తిని కలిగించగల ప్రజ్ఞ డిమిల్‌కి గల సిరిసంపదలు.

ఇతరులు ఖర్చుపెట్టే మిలియన్ డాలర్లకూ డిమిల్ ఖర్చు పెట్టే 'డి–మిలియన్' డాలర్లకూ ఉన్న తేడా ఇదే. పరాజయంతో పరిచయం కాకుండా ప్రజల మనస్సుల్లో కలకాలం నిలిచిపోయేట్లా డిమిల్‌ను నిలిపిన శక్తి ఇదే.

*(ఆంధ్ర వారపత్రిక - 1959)*

## వేపరసం, హ్యూమరసం కలిసి - కళాత్మక వ్యాపారశీలి వెరసి

# చక్రపాణి



"లో బడ్జెట్ సినిమా తియ్యాలంటే ఎలా సార్? మంచి కిటుకు చెప్పండి"

"ఎగ్గొట్టడం" అన్నారు చక్రపాణిగారు.

**దటీజ్ చక్రపాణి.**

ఆ ఒక్కమాటకి టీకా తాత్పర్యాలు ఇలా సాగుతాయి.

నువ్వు తీసే సినిమా కొత్తిమీరా? కొబ్బరిచెట్టా? అనేది ముందు చూసుకో...కొత్తిమీర సువాసనే. కొబ్బరిచెట్టు పదికాలాలు పంటనిస్తుంది. దాన్నిబట్టి నీ బడ్జెట్టు, కథా, స్క్రిప్టూ ఖచ్చితంగా రాసుకుని దిగితే - అది లక్షలే అయినా కోట్లయినా లో బడ్జెట్టే...అలా కాకుండా గాడి తప్పితే కొత్తిమీర సినిమా కూడా హైబడ్జెట్టే....అప్పుడు ఎగ్గొట్టడం తప్పదు.

**దటీజ్ చక్రపాణి.**

❄ ❄ ❄

"నేను ఆంధ్రపత్రిక నుంచి వచ్చానండి."

"ఎందుకూ?"

"మీతో యింటర్వ్యూ చేసి -"

"ఎందుకు?"

"మీ గురించి రాద్దామని"

"నా గురించి నేను చెప్పడానికేముంది...నువ్వు రాయడేనికేముంది...నేను నేనే"

"అంతేనా?"

"అంతే గదా"

"సరే సర్"

**దట్ - ఎగెయిన్ ఈజ్ చక్రపాణి.**



టూకీ మాటలు....అమిత మితభాషి.... ముక్కుకి సూటి.... అయినా గుడ్డిగా వెళ్ళి గోడకి గుద్దుకోలేదు - నెగ్గుకొచ్చారు-

ఈ యింటర్వ్యూలు రెండూ నలభైయేళ్ళనాడు ఈ రచయిత చేసినవే - ఆంధ్రసచిత్ర వారపత్రిక సినిమా ఎడిటర్‌గా.

నేను చిన్నవాడినైనా పెద్దపత్రిక తరపున వచ్చానని కూడా చూడకుండా అలా మొరటుగా జవాబిస్తే నాకు కోపం వచ్చింది.

కోడంబాకం నుంచి జార్జిటౌను దాకా బస్సుమీద కాకుండా కోపం మీద వచ్చేసి కోపంగానే కాయితాలు తీసుకుని ఆయన గురించి రాయబోయాను.

ఈలోగా కోపం కరిగిపోయింది. నవ్వు వచ్చింది.

నేనంటే నేనే అనే మాటలోనే ఆయన పర్సనాలిటీ వుంది గదా. ఆమాటలకి టీకా తాత్పర్యాలు రాస్తే సరి అనుకున్నాను. దారి కనిపించింది. వ్యాసం రాస్తున్నాను - రాత్రి ఎనిమిదయింది. అయ్యవారు (శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు) ఇంటికి వెళ్తూ నా దగ్గరకు వచ్చారు.

"మీరు కోపంగా వచ్చేశారంట గదా - ఆయన నవ్వుకున్నాడు" అన్నారు.

"నాకు మర్యాద అక్కర్లేదు గాని నా పత్రికకయినా విలువ యివ్వాలి గదా...అదే మరి - నాగిరెడ్డిగారు నిన్న నాతో రెండుగంటలు మాట్లాడారు" అన్నాను రోషంగా.

"అవును - దటీజ్ నాగిరెడ్డి...దిసీజ్ చక్రపాణి. అందుకే వాళ్ళిద్దరూ ఫ్రెండ్సయ్యారు..ఉప్పూ ఉసిరికాయీని" అన్నారు అయ్యవారు-

నేను రాసిన వ్యాసాన్ని మర్నాడు ఉదయం చదివారు.

"మీతో రెండు గంటలు మాట్లాడిన నాగిరెడ్డిగారి స్కెచ్చి కన్నా ఒక్క ముక్క చెప్పిన చక్కన్న మీదే ఎక్కువ రాశారు - ఆయన 'నేను నేనే' వాక్యానికి సరైన కోణంలో వ్యాఖ్య రాశారు - బాగుంది" అన్నారు అయ్యవారు.

అది విజయా స్టూడియోస్ గురించిన ప్రత్యేక సంచిక - ఆంధ్ర సచిత్ర వార పత్రిక కోసం రాసినది...

ఫిలిం స్టూడియో అన్నది నాగిరెడ్డి, చక్రపాణి గారల రెండవ వ్యాపారరంగం...

అంతకు ముందు చక్రపాణి గారిది తెనాలి – రెడ్డి గారిది తాడిపత్రి...

ఉప్పూ ఉసిరికాయా మెద్రాస్ కొత్వాలు సావడి ఆచారప్పన్ వీధిలో కలిశాయి. ఒక ప్రెస్సు, ఒక పత్రిక పెట్టాయి.

అప్పటి నుంచి విజయా రథానికి

నాగిరెడ్డి సారథి, చక్రపాణి రథ సారథి.

చక్రపాణి గారు ఆంధ్రజ్యోతి, యువ పత్రికలకు సంపాదకుడు, దరిమిలాను దేశం మొత్తం మీద పధ్నాలుగు భాషలలో విజయవిహారం చేసిన 'చందమామ' పత్రికకు 'సంచాలకుడు'...షావుకారు, పాతాళభైరవి, పెళ్ళిచేసిచూడు, మిస్సమ్మ, గుండమ్మ కథ వంటి విజయాచిత్రాలకు సర్వాంతర్యామి. అంటే కథ, మాటలు, పాటలు, సంగీతం.

అన్నిటా ఆయన పాలలో వెన్నలా పరుచుకుని వుంటారు – ఒకటి రెండు చిత్రాలకు డైరెక్టరు పేరు వేసుకున్నా సర్వసాధారణంగా ఇండైరెక్టరు...కాసుకీ కళకీ పెళ్ళి చేసి–చూసి–చూపెట్టిన కళాత్మక వ్యాపారశీలి – వ్యాపారాత్మక కళాలోలుడు.

చక్రపాణిగారు కింగ్‌సైజు సిగరెట్‌లా పొడుగ్గా – ఆప్తమిత్రుల అభిప్రాయ భేదంలా సన్నగా నాజూకుగా ఉంటారు... మితభాషి... ఖచ్చితమైన మనిషి... పనిలో తప్పు జరిగితే డొక్క చీరేస్తారు. అయినా అలా చేసేది రోజూ కాదు... శిశుపాలుడు నూట ఒకటవ తప్పు దాకా భూదేవిని మించిన ఓర్పు చూపిస్తారు – దాన్ని ఎడ్వర్‌టైజ్ చెయ్యరు – అందువల్ల అందరికీ కోపిష్టిలాగా టాస్క్‌మాస్టరు లాగ కనిపిస్తారు... ఎవరినయినా పని సందర్భంగా మాటలు అని నొప్పించినా మరుక్షణంలో తనూ నొచ్చుకుంటారు.

"అయినా ఆ మనిషికి ఇది నూట ఒకటోసారి బాపూ! అనక తప్పలేదు. అదీకాక మా అమ్మ నాకు చిన్నప్పుడు ఉగ్గుతోపాటు వేపరసం కలిపి తాగించింది" అన్నారు ఒకసారి నవ్వుతూ...

తొలిదశలో... కళ అనేది కళకోసమా – కాసుల కోసమా అని మీమాంసలు చెలరేగే రోజులలో షావుకారు తీశారు.. చెయి కాల్చుకోలేదు. కాని కళాఖండం కనిపించింది.. షావుకారుకు మాత్రం పదహారణాల తెలుగు సినిమా అని పేరు వచ్చింది... చిత్రనిర్మాణ పథంలో అదొక మైలురాయిగా నిలబడింది. ఆ తెలుగుతనం, ఆ యింపుసొంపులు అన్నీ చక్రపాణి గారివే... అయినా ఈ మీడియమ్ చాలా ఖరీదయినది. పొయిట్రీ బుక్కో కథల పుస్తకమో వేసుకోవటం కాదు... లాభాలు రాక పెట్టుబడీ పొగొట్టలూ వస్తే చాలదు, పనికిరాదు. కళ కాసుల కోసమే – అయితే కాసులంటే మనుషులు అని అర్థం తోచింది..

ఆ మనుషుల కోసం పాతాళభైరవి తీశారు... ఆ తరువాత ఎన్నో తీశారు... అన్నీ సొమ్ముతోపాటు గొప్ప పేరును తెచ్చుకున్నవే...అన్నిటా చక్రపాణి గారిది అదృశ్య హస్తమే..



"మీరు ఎక్కువగా బైబిలు కథలు సినిమాలు తీస్తారు ఎందుకూ" అని అడిగారు సిసిల్ బి. డిమిల్‌ను.

"వాటికి రెండువేల సంవత్సరాల పబ్లిసిటీ వాల్యూవుంది గదా" అన్నాడాయన.

చక్రపాణిగారు ఆ పబ్లిసిటీ వాల్యూని అనేక విధాలుగా అర్థం చేసుకుని వాడుకున్నారు. స్టార్ వాల్యూ మీద ఆయనకి నమ్మకం.

"ఒక అత్తగారు గయ్యాళి... కోడల్ని బాధపెడుతుంది. అని సినిమాలో ఎస్టాబ్లిష్ చెయ్యాలంటే వెయ్యి అడుగులు తియ్యాలి...దానికి బదులు సూర్యకాంతమ్మని ఆపాత్రలో నిలబెడితే – పట్టుమని పదడుగులు కూడా పట్టదు – పైగా ఆవిడ బొమ్మ రాగానే హాల్లో చప్పట్లు పడతాయి" అనేవారు.

గుండమ్మ కథలో జమున యింటికి నాగేశ్వరరావు తొలిసారిగా వెళ్ళాడు. వెళ్ళగానే డ్యూయెట్ పాడాడు. "అదేంటి సార్ – వాళ్ళు లవ్ చేసుకున్నారని ఎస్టాబ్లిష్ చెయ్యొద్దా" అనడిగితే – "ఆడు నాగేసర్రావు అది జమునా – ఆళ్ళు ఆళ్ళతో గాక నీతో పాడతారా డూయెట్టూ" అన్నారు–

ఒకసారి ఎన్.టి.రామారావు భీష్మ వేషం వేసుకున్నారు – సెట్‌లో చూసిన ఒకాయన చక్రపాణిగారి దగ్గరకు పరుగున వచ్చాడు.

"చక్కన్నా – ఎన్టీవోడికి భీష్మ గెటప్‌లో తెల్లగడ్డం గట్రా పెట్టి మేకప్ చేశారు. అసలు ఆడని తెలీడమే లేదు" అన్నాడు రొప్పుతూ.

"ఆడని తెలీపోతే ఆవేషానికి ఆడెందుకు డబ్బు దండగా – నువ్వు సాలు" అన్నారు చక్కన్నగారు నవ్వుకుంటూ.

ఒకసారి పెద్ద గొప్పింటి సెట్‌లో షూటింగ్ జరుగుతోంది – చాలా విశాలంగా వేసిన మేడమెట్లు – వాటి పక్కగా వచ్చే బానిస్టర్ పొడుగూతా చిరుచిరు గంటలు అలంకారంగా కట్టారు.

షాట్ సిద్ధమైంది. హీరో కృష్ణ స్టయిలుగా కిందికి దిగుతూ రావాలి.

'స్టార్ట్' అన్నాడు డైరెక్టర్.

'స్టాప్ స్టాప్' అంటూ అసిస్టెంటు డైరెక్టరు మెట్ల దగ్గరకు పరుగెత్తాడు. ఆ బానిస్టర్ మీదున్న వందన్నర గంటల్లో ఒక గంట ఊడిపోయిందిట – దాన్ని తిరిగి అతికించి – డ్యూటీ చేశానన్న తృప్తితో గర్వంతో చూశాడు అసిస్టెంటు.

"అబ్బాయ్! ఆడియన్సు ఆ గంట మెలికను గమనించారూ అంటే మన యీరోగారి మొగం జూసినట్టే" అన్నారు చక్రపాణిగారు.

హీరోగారు పకపక నవ్వారు.

చక్రపాణి గారు జీనియస్ – నేటివ్ జీనియస్..

ఆయన కన్న గొప్పవాడు వుండవచ్చు – తక్కువ వాళ్ళు వుండవచ్చు కాని ఆయన లాటి వారు లేదు – ఉండబోరు – ఆయనకు ఆయనే సాటి.

*(హాసం-హాస్య సంగీత పత్రిక -2003)*

## స్నేహమే తప్ప శత్రువుల పరిచయం కూడా లేని మనిషి

## అసాధారణ వ్యక్తి

# ఆదుర్తి సుబ్బారావు





ఆదుర్తి - అంటే హాయిగా నవ్వడం.

ఆదుర్తి - అంటే హుషారుగా ఊపిరి పొయ్యడం.

ఆదుర్తి - అంటే గుండె చేవ; మొండి ధైర్యం; అందమైన పొగరు; పొగరు లాంటి దర్జా; నిర్లక్ష్యం, మొండితనం; ఏడాదికి 18 మాసాల స్పీడు; నిర్లక్ష్యం, మొండితనం, పొగరు, ఎవరూ అనుకరించలేని స్పీడు, జోరు.

ఆదుర్తి - అంటే నయాగరా - అందులోంచి ఆకాశమెత్తున విజృంభించే ఎనర్జీ. శతకోటి ఆటంబాంబుల శక్తి. 5 1/2 అడుగుల శరీరంలో మామూలు గుండెలో యిమడని శక్తి, ప్రేమ, ఆపేక్ష, దయ, కన్నీరు, పన్నీటి పరిమళం, గుబాళించే కన్నీరు, మాటకీ... బొమ్మకీ... ఫోటోకీ లొంగని, ఎందులోనూ యిమడని వెలుగు.

చెడు సావాసాలు అందర్నీ పాడుచేస్తే ఆదుర్తి లాటివాళ్ళు కొందర్ని బాగుచేస్తారు.

రాజమండ్రి సావాసాల్లో చెడి, చెన్నపట్నం చేరేముందు బొంబాయిలో మజిలీ వేశాడు. అడక్కుండానే ఆకలెరిగి అన్నంపెట్టే అమ్మనీ, అయ్యనీ కాదని - అడిగినా

పెట్టని పరాయిచోట – ఉపోషాలు టానిక్కులుగా, పట్టుదలే బలంగా, సినిమా విద్య–రచన–జీవితం – అన్నీ సొంత 'ఖర్చు' మీద చదువుకున్నారు.

తాసీల్దారుగారి పెద్దబ్బాయి చెన్నపట్నం వచ్చాక, ఆయన విజయాల కథ అందరం తెరమీద చూసినదే.

'అమర సందేశం'తో దర్శకుడై, అన్నపూర్ణ సంస్థకు – తద్వారా ఆంధ్ర చిత్ర చరిత్రలో ఒక ముఖ్యాధ్యాయానికి – నాయకుడై నడిచాడు. తరువాత నిర్మాతగా, దర్శకుడిగా – తను మనసుపడ్డ, మనసు గల చిత్రాలు తీసి, దర్శకుడి పదవికి తొలిసారిగా గ్లామర్ గడించిపెట్టాడు. దర్శకుడంటే సర్వాంతర్యామి అన్న అర్థాన్ని నిలబెట్టాడు. ఒక కొత్త వరవడి తీర్చాడు.

ఎప్పటికప్పుడే... దేనికదే ఎక్స్‌పెరిమెంట్! దేనికదే సక్సెస్.

తేనెమనసులు నాడు కొంచెం చిన్నబుచ్చుకుంటే – ఒక మిత్రుడన్నారు. "ఆదుర్తిగారూ! ఇది ఫ్లాప్ – అయినా మీరు హిట్టే! ప్రాజెక్టు గొప్పే! ప్రయత్నం ముఖ్యం; ఫలితం కాదు. కోటీశ్వరులక్కూడా మీ గుండె దమ్ములేదు. అది – డబ్బుతో వచ్చేది కాదు!" – అని. ఆయన హాయిగా నవ్వేశాడు. ఎప్పుడూ పొగరే. తన దారి తనదే.

హిందీ చిత్రరంగంలో కూడా కొత్త మనుషులు, కొత్తమార్గాలు కావాలని, రావాలని, సాహసాలు చేశాడు. వినోద్ ఖన్నా, లీనా చందావర్కర్ ఆయన ఆర్టిస్టులే.

సెట్లోకి తెల్లటి బట్టలతో ప్రవేశించిన అరగంటలో అన్నీ మాపుకుని, చించుకుని, బాయ్స్‌లో కలిసిపోయేవాడు.

ఎడిటింగ్‌లో ఎంత అనుభవం అంటే అందరు ఫిలింను మూవియోలా మీద వేసి నడిపి సౌండ్ ట్రాక్ చెక్ చేసుకుంటే – ఈన చేత్తో పట్టుకుని, కిటికీ ఎదురుగా వెల్తురులో చూసి – డైలాగ్ ఎక్కడాగిందో... మ్యూజిక్ యింకెన్ని ఫ్రేములు సాగిందో– చెప్పేవాడు. దాన్ని కత్తెరతో కత్తిరించే ఓపికా... తీరికా ఉండవు. నోట్లో పెట్టుకుని, పళ్ళతో చీల్చిపారేసి, శిష్యుడికిచ్చేవాడు. అతికించాక – శబ్దం ఖచ్చితంగా సరిపోయేది. ఈ విద్య, కేవలం కొన్ని ఏళ్ళ అనుభవంతో ఊరడం వల్లనే అబ్బదు.

సెకండుకు వంద ఎక్స్‌రేలు తీసే కళ్ళు – లక్ష లెక్కలు చేసి గుర్తు పెట్టాలనుకునే కంప్యూటర్ బ్రెయిన్ వుంటేనే సాధ్యం.

ఎడిటింగ్ – అనే కాదు; అన్ని విద్యలు అంతే. ఒక కథకి సినిమా రూపం తయారు చేస్తున్నప్పుడు – ఒక ఘట్టం లేదా ఒక పాత్ర, ఒక డైలాగు, ఏదైనా పేచీ పెట్టి, మొండికేస్తే – ఒక పదినిముషాలు ఆలోచించేవాడు.

అంతే! అక్కడ నుంచి వెయ్యిటన్నుల చిచ్చుబుడ్డీలా – కొత్త సన్నివేశాలు, మెలికలు, మాటలు, పాటలు – ఉప్పొంగేవి. చెప్పింది చెప్పకుండా, అనర్గళంగా అయిడియాలు చెప్పేవాడు. అన్నీ బాగుండేవి. అవతలివాడు ఉక్కిరిబిక్కిరైపోయేవాడు. పొగడుతూంటే వినేవాడు కాదు. ఫైనల్‌గా వచ్చిన సన్నివేశం ఎన్నికయ్యాక అరగంట

సేపు చెప్పిందే చెప్పేవాడు. అంటే మనకి చెముదని కాదు. పదిసార్లు చెప్పడంతో దాని బలాబలాలు తాను తేల్చుకోవడం.

మనం పొగిడినా - బాగాలేకపోతే - ఆయన తనని తనే హేళన చేసుకునేవాడు. ఓసారి పిక్చరు మూడో సీను, 73కి జరిపాడు. బాగానే వుందన్నారంతా. పకపక నవ్వి మన స్క్రీన్‌ప్లే మగసిరి ఇలా ఏడిసింది - అనేశాడు.

సినిమా తీశాక ఒక్కక్షణం ఎక్కడ బోరు కొట్టినా నిర్దాక్షిణ్యంగా లాగిపారేసేవాడు - దానికెంత ఖర్చయినా... ఎవరికోపం వచ్చినా...

10వేల ఓల్టుల కరెంటు లాంటి మనసాయనది. HT Wire లో అంత కరెంటు వెడుతుంటే మనం ముట్టుకున్నా షాకివ్వదు. టైముండదు. అలాగ ఆయన ఆలోచిస్తూ వుంటే - పక్కన బాంబులు పేలినా వినపడదు. అందుకే నేను ఒక్కోసారి భుజం తట్టి, గిల్లి, అడిగేవాడిని - ఏమైనా ఆలోచిస్తున్నారా - అని, లేదంటేనే మాట్లాడ్డం - లేదా - నేనింకేదో ఆలోచించుకునేవాణ్ణి. పక్కపక్కనే కార్లో కూర్చున్నా- చెరో ధృవంలో వుండే వాళ్ళం.

50 ఏళ్ళు వచ్చినా కూడా ఆయన వాళ్ళబ్బాయికన్నా చిన్నవాడే. ఆయనలో అన్ని తత్వాలూ కలబోసి వుండేవి. పని చేపడితే - కొండలమీద బాలగోదారిలా ఉరకలు. ఒక నిర్ణయం తీసుకుంటే వరద గోదారిలా కష్టాల గట్టుల్ని కోసి, తోసి, దూకుతూ పోడమే, ఇతరుల కష్టాల కథలు వింటే - శాంత గోదారిలా నిదానంగా... విశాలంగా... శాంతంగా ఆలోచించి మేలు చేస్తూ ప్రవహించేవాడు.

ఆయనకి తలపెట్టిన పని తప్పక సాధించగలనన్న పొగరుందే తప్ప - అంతా నేనే చేశానన్న అహంకారం ఎన్నడూ లేదు. ఆయన కృషి ఫలిస్తే - అందరితో పంచుకునేవారు. ఫలించకపోతే కారణం తాననేవాడు. అది తెచ్చిపెట్టుకున్న అలవాటు కాదు. సహజగుణం.

"ఆత్రేయ, రమణా నాకు రెండు కళ్ళు. విశ్వం, కృష్ణ నా భుజాలు. మహదేవన్ నా హృదయం" అనేవాడు.

పోతే ఆదుర్తి ఎవరు?

ఈ మనుషుల్నీ, వాళ్ళ కృషినీ కలబోసి, చక్కని రూపకల్పన చేసే సౌందర్య పిపాసి, సృష్టికర్త, ఒక మహత్తర శక్తి, చైతన్య స్రవంతి.

ఈ శక్తి... ఈ వేగమే ఆయనతో పోటీ చేసి చివర కాయన్ని గెలిచేసింది.

గంటకు గంటన్నర వేగం.

ఏడాదికి ఏణ్ణర్ధం.

జీవితానికి రెండున్నర జీవితాల వేగంతో High Tension కరెంట్‌లా... నయాగరా జలపాతంలా - ఉరకలు పరుగులు గానే జీవనం సాగించాడు. ఆయన తీసిన సినిమాల్లాగానే - జీవితంలో కూడా ఏదీ - ఎక్కడా బోరు కొట్టకూడదు. ఈజీబివీ రాకూడదు. అనవసరపు నీడలు, క్రీనీడలూ పడకూడదు. సోడా

తెరవాలంటే - ఓపెనర్ తెచ్చేలోగా - ఓపిక ఉండదు. నోట్లో పెట్టి పళ్ళతో కార్కు లాగేసే వేగం; పొగరు.

మృత్యుదూత వచ్చినా - మొహమాటపడి ఆలోచిస్తూ వుంటే - "ఏయ్! ఏమిటా నస? బండి కట్టు! పోనీ! చల్‌రే బేటా చల్" అనేసి, బండి మీదకు ఉరికే మనిషి! చివరికంత పనీ చేశాడు.

రైలు రావడానికి చాలా టైముంది సార్ - అంటే - నిల్చోడం బోరు. "ఈలోగా మనం పట్టాలంబడి నడుస్తూ పోదాం. రైలొస్తే పరుగెత్తి ఎక్కేద్దాం" అనే మనిషి! దేవుడి లాంటి మనిషి!

పసిబిడ్డలాంటి మనిషి!! యవ్వనం లాటి మనిషి!! పొగరులాటి మనిషి!! ప్రేమలాటి మనిషి! వెలుగులాటి మనిషి!! నవ్వులాటి మనిషి! హాయిలాటి మనిషి! నీడపడని మనిషి! స్నేహమే తప్ప శత్రువుల పరిచయం కూడా లేని మనిషి! మంచి మనిషి!! చాలా గొప్ప మనిషి!!!

అందుకే ఆదుర్తి చనిపోలేదు. వీల్లేదు.

ఆయన శిష్యులు, మిత్రులు, ఆయన ప్రేక్షకులు... హాయిగా నవ్వుతూ... కేరింతలు కొడుతూన్న ప్రతిచోటా - ఆయన నవ్వు... ఆయన కంఠస్వరం... శృతి కలుపుతూ ఉంటాయి.



ఆదుర్తి సుబ్బారావు - 'అమర సందేశం'తో మొదలైన ఆయన కెరియర్ అన్నపూర్ణా వారికి 'తోడికోడళ్లు', 'మాంగల్యబలం'తో ఊపందుకుంది. సి. సుందరంతో కలిసి బాబూమూవీస్ స్థాపించి 'మంచిమనసులు', 'మూగమనసులు' తీసి, విజయం సాధించాక అందరూ కొత్తతారలతో తొలిసారిగా కలర్‌లో సాంఘిక చిత్రం 'తేనె మనసులు' తీశారు. అక్కినేని నాగేశ్వరరావుతో కలిసి చక్రవర్తి చిత్ర పేర 'సుడిగుండాలు', 'మరోప్రపంచం' వంటి ప్రయోగాత్మక సినిమాలు, స్వంతంగా 'మాయదారి మల్లిగాడు' 'గాజుల కిష్టయ్య' తీశారు. 'మూగమనసులు'లను 'మిలన్'గా తీయడానికి హిందీ రంగానికి వెళ్లి తన తెలుగు సినిమాలను హిందీలో పునర్నిర్మించి అక్కడా జయకేతనాన్ని ఎగురవేశారు. 'క్షేత్రయ్య' సినిమా డైరక్టు చేస్తూండగానే 1975లో అకాలమరణం చెందారు. రమణ ప్రతిభను గుర్తించి తొలిరోజుల్లో ప్రోత్సహించిన దర్శకుడాయన!

# దర్శకుపతి



నవ్విన ఊళ్ళే పట్నాలవుతాయన్న నానుడి నీరసించిపోతున్నపుడల్లా ఎవరో ఒక ప్రజ్ఞాశాలి వచ్చి, దాన్ని ఆదుకుని ఆ మాట నిలబెట్టి, 'ఇది ఉట్టి సామెతే'నని నిస్పృహ చెందేవారికి ధైర్యం చెబుతూ ఉంటాడు. చలనచిత్ర రంగంలో సినిమా దర్శకుడు ఎల్.వి. ప్రసాద్‌గారి జీవితపు నుడికారం ఇదే. ఒకప్పుడు ఒక పెద్దమనిషి ఆయనను చూచి నవ్వారు – నువ్వు డైరెక్టరేమిటని. నిదానస్తుడు ప్రసాద్ మాటకు మాట జవాబుగా చెప్పలేదు. తన సమాధానాన్ని 15 సంవత్సరాల జీవితంలోకి అనువదించి చూపించారు. అది ఆరంభించడానికి పూర్వం – ఎన్నేళ్ళో బొంబాయి వీధులలో స్టుడియో ప్రాంతాలలో చలనచిత్రకారుల వాడలలో ఆయనా, ఆత్మవిశ్వాసం కలసి కలలుకని అవే తిని తిరగడం జరిగింది. పట్టుదల, ఆశాభావం, అనుభవం, దిగులు, ప్రతిభ, నిదానం – ఇవే బాబాయి, మావయ్య, పెద్ద పదవిలో ఉన్న బంధువు, సంరక్షకుడు అయి ఆయనను నడిపాయి. కట్, స్టార్ట్ అని నాజూగ్గా షోగ్గా జబర్దస్తీ కేకలు వేయడం నేర్చుకోలేకపోయినా, మిగతావన్నీ – నటన, ఛాయాగ్రహణం, కథాచిత్రణ, దర్శకత్వం, అన్నిటికన్న మిన్నగా జీవితమూ అర్థం చేసుకొని, చెన్నపట్నం వచ్చాడు. ఆనాడు, ఆయన కాదలచుకొంటె పెద్దనటుడు అయేవారు. సత్యమే జయంలో దొంగపాత్ర, ద్రోహిలో రౌడీరాముడు తెలుగు చిత్రాల చరిత్రలోనే చిరస్మరణీయమైన రెండు సందర్భాలుగా తీర్చిదిద్దారు. జీవితం మీద

ప్రసాద్‌ను చూసినవారికి, తెరమీద ప్రసాద్ చైతన్యం బోధపడనంత అద్భుతంగా వుండేది. ప్రసాద్ ఆ మార్గంలో వెళ్ళివుంటే తెలుగువారు గర్వించతగ్గ నటుడై ఈ పాటికి అనేక గొప్ప పాత్రలను తెరమీద నిలిపి ఉండేవాడు. చాలా మైలురాళ్ళు వేసి ఉండేవారు.

కాని, ఆయన దర్శకుడుగా ముందుకుసాగి – ఆ మార్గంలో ఈ ఘనకార్యం చేశారు. ఆయన తీసిన గృహప్రవేశం, షావుకారు, పెళ్ళిచేసి చూడు తెలుగు చలనచిత్ర చరిత్రలో కొత్త బాటలు పరచిన చిత్రాలు. ప్రసాదగుణ ప్రధానమైన చిత్రణ ప్రసాద్‌గారి పద్ధతి. ఒక కుటుంబం సినిమా చూడవస్తే అందర్నీ సంతోషపెట్టగల శిల్పం ఆయనది. కంటికి ఇంపుగా, చెవికి ఇంపుగా ఉండేలా చలనచిత్రంలో కనపడేదీ వినబడేదీ ఉండాలనీ ఆయన మతం. ఇందుకోసం ఆయన సెట్ మీద, నటీనటులందరికీ అవసరమైతే ఆయా సందర్భాలలో నటించి చూపెడతాడు. సంభాషణలు ఉచ్చరించి నేర్పుతాడు. ఇది ఈనాడు చాదస్తంగా కనిపించవచ్చు – ఆ నేర్పూ ఓర్పూ లేని వారికి. ఎవరేమనుకొన్నా అంతా ఆయనను మనసా గౌరవిస్తారు. తెలుగు చిత్రసీమలో ఏ దర్శకుడికి జరగని సత్కారం – ఆయన శిష్యులు పెద్దవాళ్ళు అయి ఆ గురువుకు సన్మానంచేసి గురుదక్షిణ – ఇవ్వడం – ఆయనకు మూడేళ్ళ క్రితం ఒక ఉగాదినాడు జరిగింది. నవ్విన ఊరే పట్నమయింది.

ఆ తరువాత ఆయన కట్టెలమ్మినచోట పూలమ్మబోయాడు. ఒకనాడు ఏకాకిగా, కాకిలా వీధులవెంట తిరిగి కష్టపడిన బొంబాయిలో రెండు హిందీ చిత్రాలు తీసి తొలి ప్రయత్నంతోనే ఘనవిజయం సాధించారు. ఆనాడూ ఆయన హంగూ ఆర్భాటం లేకుండానే వెళ్ళి గెలుపు సాధించారు.



ఎల్.వి. ప్రసాద్ దర్శకుడిగా, నిర్మాతగా ఖ్యాతి గడించారు. ముఖ్యంగా హిందీ చిత్రరంగానికి వెళ్ళి తెలుగు, తమిళ సినిమాలను రీమేక్ చేసి పేరును, ధనాన్ని సంపాదించారు. చిత్రనిర్మాణంలోని సాంకేతిక విభాగాల పై దృష్టి సారించి కలర్ లాబ్స్ వంటివి నెలకొల్పారు. అంతేకాక హైదరాబాదులో కంటి ఆసుపత్రి స్థాపించారు. ఆయన కుమారులు ఆయన పేర హైదరాబాదులో ప్రతిష్ఠాత్మకమైన 'ప్రసాద్ మల్టిప్లెక్స్' అనే అత్యాధునిక థియేటర్ సముదాయాన్ని ప్రారంభించారు. రమణ 'మూగమనసులు'ను 'మిలన్' పేర హిందీలో తీయడమే కాక 'సాక్షి'ని హిందీలో, తమిళంలో తీయడానికి హక్కులు కొనుక్కున్నారు.

సినీవ్యాస రమణీయం (సంగీతకారులు)

# ప్లేబాక్ గాయకుడు పి.బి. శ్రీనివాస్



సాయంత్రం 6-55కి రివ్వున పరిగెత్తుకొచ్చేవాడు ఓ కుర్రాడు. మూడేమూడు నిముషాలసేపు ఆ సినిమాగేటుకి కొంచెం దగ్గిరగా నిలబడి మళ్ళీ తుర్రున ఎగిరిపోయేవాడు. మళ్ళీ 7-23 నుంచి 7-26 వరకూ అలా కళ్ళు మూసుకు నిలబడి రివ్వున వెళ్ళిపోయేవాడు.

8-40కి సినిమాగేటు ఆసామిని పక్కగేటు అతను పిలిచి "ఇపుడు మళ్ళీ వస్తాడు కదూ ఆ కుర్రాడు" అన్నాడు.

"రాడులే ఈ పాట బావుండదు. అతనికి నచ్చలేదు. అందుకే నిన్న రాలేదు" అన్నాడు మొదటి ఆసామి.

ఆ కుర్రాడు రోజూ అంతే. కొత్తసినిమా రాగానే తొలిరోజున టికెట్‌కొని వెళ్ళి చూసేసేవాడు. అందులో అతనికి నచ్చిన పాటలు రెండో మూడో ఉంటాయి.

మర్నాడు, ఆపాటలు సరిగ్గా ఎన్ని గంటల ఎన్ని నిమిషాలకి వస్తాయో గుర్తుపెట్టుకునేవాడు. మూడోరోజునించి, సరిగ్గా ఆ నిముషానికి ఇంటిదగ్గర్నించి పరుగెత్తుకువచ్చి గేటుదగ్గిర నిలబడి ఆ పాటవిని వెళ్ళిపోయేవాడు. మళ్ళీ రెండోపాట (అతనికి నచ్చినది) మొదలయే వేళకి మళ్ళీవచ్చి మూడునిమిషాలూ వినేసి, ఇంటికెళిపోయేవాడు.

ఇలా బాల్యంలో ఏకలవ్య శిష్యరికం నెరపిన నేటి ప్లేబాక్ గాయకుడిపేరు పి.బి. శ్రీనివాస్.

కళాకారుడుగా పేరుతెచ్చుకుని వృద్ధిలోకి రావలసిన ప్రతివ్యక్తీ పువ్వులాగా పుట్టగానే పరిమళించడం,. రెండు రెండు రెళ్ళు నాలుగన్నంత ఖరారు. అలాగే, కళారాధకుల కథలన్నింటా అంత ఖరారుగానూ కనబడే మరోఘట్టం, ప్రతిబంధకాలను ఎదుర్కొనడం, లైలామజ్నూ ప్రేమించుకుంటే, వాళ్ళనాన్నలూ, మావయ్యలూ, సంఘం తాలూకు దళసరి గోడలూ అడ్డు నిలబడడం మామూలు. లలితకళాభిరుచికల చిన్నవాడుగాని చిన్నదిగాని అవి నేర్చుకుని ఆ రంగంలో కృషి చేయాలని ఉబలాటపడ్డపుడు తాలూకాఫీసు గుమాస్తాగిరీ చెయ్యక తప్పదని బలవంత పెడతారు పెద్దవాళ్ళు.

ఉద్యోగం లేకున్నా అదే పోయెగాని ఆ సినిమాలవెంట, నాటకాలవెంట తిరగడానికి వల్లకాదని శాసిస్తారు. నటుల నర్తకుల జీవిత కథలలో ఈ ఘట్టం మామూలే.

పి.బి. శ్రీనివాస్ గాయకుడుగా చలనచిత్ర పరిశ్రమలో చేరదలచుకొన్నపుడు వాళ్ళ నాన్నగారు ఫణేంద్రస్వామిగారు కఠినంగా శాసించలేదు కాని, మంచిచెడ్డలూ సాధక బాధకాలూ ఆలోచించుకోవలసిందని గట్టిగా తెలియచెప్పారు. ఈ లోగా 'లా' చదవమన్నారు.

శ్రీనివాస్‌కి తన లక్ష్యం సిద్ధిస్తుందన్న గట్టి నమ్మకం, సాధించాలన్న పట్టుదలా ఉన్నా తండ్రిని ఎదిరించ మనస్కరించలేదు. ఆయన చెప్పినట్టు న్యాయశాస్త్రం చదువుతూ ఆలోచించవచ్చునని తోచింది. ఈ రెండు పనులతోపాటు కాస్త ప్రయత్నాలు కూడా సాగించడానికి విశాఖపట్టణంకన్న చెన్నపట్నంలో ఎక్కువ వీలుంటుందనికూడా తోచింది. ఫిలిం స్టుడియోలు అక్కడే ఉంటాయి మరి. అందుకని మద్రాసు న్యాయ కళాశాలలో చేరాడు శ్రీనివాస్ తన ఊహలు మటుకు తనలోనే దాచుకుని.

"అప్పటి కది "ఏక్‌హీ రాస్తా" అనిపించింది." అంటాడు శ్రీనివాస్ ఇపుడా విషయం చెప్పి నవ్వుతూ.

శ్రీనివాస్‌కి హిందీ బాగావచ్చు. విశారద పట్టం పుచ్చుకున్నాడు ఆ భాషలో. ఇక, అరవం, ఉర్దూకూడా తెలుగంత ధారాళంగా వాడగలడు.

"సంస్కృతంలో కూడా కొంచెం జ్ఞానం ఉందని చెప్పుకోవడానికి సంతోషిస్తున్నాను" అంటాడు శ్రీనివాస్. ఇంటర్మీడియెట్ దాకా సంస్కృతం "సెకండ్ లాంగ్వేజ్"గా అభ్యసించాడు.

సంగీతం తరవాత అతనికి అత్యంత ప్రియమైనది వివిధ భాషలు నేర్చుకోవడం.



అవ్వయ్యార్

ఈ రోజున ఆ "చిన్ననాటి సరదాలు" అతని వృత్తి పది విధాల రాణించడానికి ఉపయోగించాయి. తెలుగుతోపాటు తమిళ, మలయాళ, హిందీ భాషా చిత్రాలలో కూడా శ్రీనివాస్ పాటలు పాడాడు. చక్కని కంఠస్వరంతోపాటు, పాడే పాటలో భాష ఉచ్చారణ కూడా చక్కగా నేర్చుకుని ఉండడం గాయకుడికి ఒక ముఖ్యమైన అర్హత.

❀ ❀ ❀ ❀

లా కాలేజిలో చదువుతున్న రోజుల్లో శ్రీనివాస్ అంతర్ కళాశాల సంగీత పోటీలో ప్రథమ బహుమతి నందుకున్నాడు. అచిరకాలంలోనే చలన చిత్ర సీమలో ప్రవేశానికి ఆహ్వానం అందుకున్నాడు. జెమినీ స్టుడియోలో సంగీత దర్శకుడు శ్రీ ఈమని శంకరశాస్త్రి శ్రీనివాస్‌కు తొలిసారిగా ఈ అవకాశం కల్పించారు. జెమినీవారి "అవ్వయ్యార్" "రాజీ నా ప్రాణం" "బహుద్ దిన్ హుయే" "మిస్టర్ సంపత్" చిత్రాలలో శ్రీనివాస్ పాడాడు. "నాగుల చవితి"లో శ్రీనివాస్ పాడిన "సాగర మీదుట నీదరి జేరుట" అనే పాట బహుళ జనాదరణ పొందింది.

తరువాత పది పదిహేను తమిళ చిత్రాలలోనూ పది తెలుగు చిత్రాలలో శ్రీనివాస్ పాడాడు. ఐతే వీటిలో ఒక విశేషం ఉంది. అది నేటి చలన చిత్ర పరిశ్రమలోని అన్ని రంగాలలోను పరిపాటే. ఒక నటిగాని నటుడుగాని ఒక వేషం గొప్పగా ఒప్పిస్తే తరువాత వచ్చే అవకాశాలన్నీ అక్షరాలా అలాటివే అయి ఉంటాయి. ఒక దర్శకుడు ఒక రకం చిత్రం బాగా తీసినా ఒక నర్తకి ఫలానా పద్ధతి నృత్యం అద్భుతంగా చేసినా వారి ప్రతిభ అంతా ఎప్పుడూ 'డిటో డిటో' పనులకే అంకితం అయిపోతుంది. శ్రీనివాస్ కొంతకాలం క్రితం ఒక తరహా పాటను హుషారుగా పాడి

భేష్ అనిపించుకున్నాడు. దరిమిలా అతడు పాడిన పాటలు నూటికి తొంభైవరకూ అదే ఫక్కీలో ఉన్నాయి.

మిగతా పదింటిలోను మణిపూసల్లాంటి పాటలున్నాయి. సాహిణి వారి తొలి చిత్రం 'అమర సందేశం'లో "దయామయీ శారదా' అనే పాట శ్రీనివాస్ కంఠంలో మాధుర్యాని కొక నిదర్శనం. అలాగే ఇటీవల సెల్వకోటీవారు నిర్మించిన "స్వయంప్రభ"లో "ఆనంద మధురమీ వేళ" అన్న పాట అతని ప్రతిభను ప్రతిబింబిస్తుంది. ఈ పాటను ఇంత మధురంగా పాడగలిగిన గాయకుడి కంఠం, ఎక్కువగా మరొకరకం పాటలకే వినియోగించడం జరుగుతోందేం అనిపిస్తుంది జనానికి నిజానికి.

*(ఆంధ్ర వారపత్రిక - 1957)*



తెలుగులోనే కాక తమిళరంగాన, ముఖ్యంగా కన్నడరంగాన శ్రీనివాస్ గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. కొన్ని సినిమాలకు సంగీతదర్శకత్వం వహించారు. పలుభాషావేత్తగా, రచయితగా మంచిపేరు తెచ్చుకున్నారు. తమిళనాడు ప్రభుత్వం వారిని గొప్పపదవితో సత్కరించింది. బాపు, రమణల స్వంత సినిమాలలో ముఖ్యంగా 'గోరంతదీపం'లో చక్కటి పద్యాలు, పాటలు పాడారు.

# రసాయూరు



ఫలానావాడు బహుదొడ్డవాడు అంటే, 'కాదు' అనేవాడు వెంటనే ఆ మాట అనడం లోకం మీద రివాజు. అగ్రతాంబూలానికి అర్హుడెవడన్న ప్రశ్న దగ్గర శ్రీకృష్ణభగవాను డంతటి వాడికి పోటీ వచ్చింది.

తెలుగునాట ఆధునిక లలితసంగీత ప్రపంచానికి పితృపాదుడు, రాజు సాలూరి రాజేశ్వరరావు అన్న అభిప్రాయాన్ని మాత్రం చిన్నా పెద్దా కూడా మన్నిస్తారు. లలిత సంగీతంలోను, తెలుగు సినిమా సంగీతంలోనూ కూడా రాజేశ్వరరావు సంగీతానిది ప్రథమస్థానం. రష్యన్ సారస్వతమంతా 'గోగొల్' కోటు జేబులోంచి వచ్చిందన్నట్టే మధుర స్వరకల్పనా శిల్పం రాజేశ్వరరావు రచించిన లలిత సంగీత సరళ స్వరాలలోంచి, ఆయన ఏర్పరచిన ఛందోవ్యాకరణ సంప్రదాయాలలోంచి వచ్చిందని చెప్పుకోవాలి.

సంగీత రచనా ప్రతిభ గౌరవప్రపత్తులు గడించి పెడితే, ప్రకృతి పురుషులను మేళవించుకొని వరస్వర సరోవరంలో రాజహంసలా విహరించే ఆయన మంగళగళం నుంచి ప్రవహించిన మధుర సంగీతం శ్రోతల ప్రేమనే సంపాదించి పెట్టింది. కిందటితరం యువతలో అనురాగ మనురాగాన్ని భువన మోహనంగా ప్రస్తరించి లతాంత లలితాలైన స్వరాలతో, ఉషఃకాలపు లేతరంగులతో మనోహరమయిన రూపకల్పనచేసి చూపిన సంగీత చిత్రకారుడు రాజేశ్వరరావు. తెలుగునేల మీద చల్లని

తెల్లని వెన్నెల పడినపుడల్లా, తుమ్మెద ఝుంకారం చేసినపుడల్లా, రాధ కోపగించినపుడల్లా, పొదరింటిలో నుండి పొంచి చూసేవారు చూసినపుడల్లా, ప్రియుడి దర్శనభాగ్యం కలగని ప్రేయసి కల గని లేచినపుడల్లా హృదయంలో సన్నగా రాజేశ్వరరావు మురళీరవళి వినిపిస్తూనే వుంటుంది. వాటిలో ఏ పాట గొప్పదన్న ప్రశ్నకు, సప్తస్వరాలలో ఏది ముఖ్యం అన్న ప్రశ్నే సమాధానం!

ఆయన చేసిన పాట లన్నింటికీ సంగీతశాస్త్రం పేరుపెట్టిన మేళ కర్తరాగాలేవైనా వాటన్నిటికీ మాతృక అనురాగమనురాగమే. ఆయన సంగీతం ఆహ్లాదగుణాకరం. ప్రసాద లక్షణ లక్షితం. సంగీత రచయితగా రాజేశ్వరరావు పదిహేనేళ్ళనాడు పద్దెనిమిదేళ్ళ వాడుగా చేసిన ప్రయోగాలూ, వేసిన కళలూ, సాధించిన ఫలితాలూ ఈనాటికీ చాలామంది సంగీత దర్శకులకు అందనంత ఎత్తునే ఉన్నాయి. ఈనాడు వాద్య సమ్మేళన విద్యలో నిష్ణాతు లనిపించుకొంటున్న ఔత్తరాహ సంగీత దర్శకుల ఆధునిక శిల్పాన్ని రాజేశ్వరరావు ఆనాడే సాధించాడు. అన్ని రకాల వాద్యాలపైనా ప్రభుత్వంగల ఒకరిద్దరు సంగీత దర్శకులలో ఆయన ఒకడు.

ఇవికాక శ్రోతల హృదయ వీణలపై కూడా మనోహరమైన మూర్ఛనలు పోగలగడం ఆయన గడుసుదనం.

ఆర్కెస్ట్రాలో ఏ వాద్యానికి ఏ స్వరానికీ సందర్భానికీ యతి మైత్రి ఉందో వేటికి విరోధమో, వేటికేవి ప్రాసలో, ఏది యతి, ఏది ప్రతి, ఏది ఉపశ్రుతి అనేవి అనాడాయన ఇచ్చిన ప్రయివేటు రికార్డులు చెప్పినంత శ్రుతి మధురంగా, అధికారికంగా మరేవి చెప్పలేవు.

వ్యాపార సరళీ స్వరాలకే విలువ ఉన్న సినిమాలో కూడా రాజేశ్వరరావు చేసిన పాటలు కొన్ని అనన్య సాధ్యాలనిపించాయి.

ఆయన మనసుంచి పనిచేసిన 'మల్లీశ్వరి' వంటి చిత్రాలలో సంగీతం స్వరస్వరం చిరకాలం రసిక హృదయాలలో స్పందిస్తూనే ఉంటుంది. అయితే రాజేశ్వరరావు మనసుంచి పనిచేసే దెప్పుడూ అని ఆయన విమర్శకులు అంటారు. 'జీనియస్' బిరుదుకు ఉదాహరణలుగా భాసించే వారందరికీ ఈ విమర్శ తగులుతూనే ఉంటుంది. సబబే, ఇది పూర్తిగా హర్షించగల విషయం కాదు. అననుకూల వాతావరణంలో కూడా అచంచలంగా నిలబడి ఉత్తమ కళాసృష్టి చేయడమే ప్రతిభావంతుల లక్షణం. పరిస్థితులమీద అలిగి తనూ వాటితో కలిసి కుట్రచేయడం రాజేశ్వరరావు వంటి బహుముఖ ప్రజ్ఞాశాలికి, సర్వజన ప్రేమపాత్రుడికి భావ్యం కాదు.

*(ఆంధ్ర వారపత్రిక - 1958)*

# శంకర్, జైకిషన్



పదేళ్ళ క్రితం ఒక రోజున నౌషదాలీ అంశ ఒకటి ఆర్కే స్టూడియోలోని ఆర్కెస్ట్రా ముందు దిగి, సరికొత్త రూపురేఖలు తీర్చిదిద్దుకొని కొత్త మార్గాలలో సంగీత ప్రియుల హృదయాలలో విహరించబోయింది. ఆ అంశ పేరు చైతన్యం, ఉత్సాహం, లేక శంకర్, జైకిషన్. ఈ పదేళ్లుగా వాళ్ళు కట్టిన లలిత స్వరవల్లరి, వాళ్ళు చేసిన ఉత్సాహకరమైన అల్లరి దేశంలో కూనిరాగాల నుంచి, గానసభల వరకూ పాట వినే వారందరికీ ప్రాణతుల్యం అయిపోయింది. వాళ్ళు కట్టిన పాటలన్నీ 'హిట్'లు అయ్యాయి. హిట్‌లలో ప్రతి 'బిట్టూ' ఒక్కొక్క హిట్టు అయింది. అందువల్ల శంకర్ జైకిషన్‌ల చిత్రాలు - ఇంతవరకు విడుదల అయినవి 40కి మించకపోయినా వాళ్ళు వినిపించిన మూడు నాలుగు వందల పాటలలోనూ మంచివి, మాకు నచ్చినవీ అంటూ ఏరి జాబితా వేయబోవడంకన్నా గ్రామఫోను కంపెనీల కేటలాగులను చూసుకోవచ్చు ననిపిస్తుంది.

ఒక్కమాటలో చెప్పుకోవాలంటే (సింధు) భైరవి అని ఊరుకోవచ్చు.

ఆ రాగాన్ని ఆరాధించి వీరు సాధించినన్ని వరస్వరసరాలు, మరెవ్వరూ ఏ రాగసుధనుండీ సాధించలేదు. భైరవిలో వారు చేసిన పాటలలో చాలామంచివని ఎన్నిక చేయతగ్గవి ఇరవై పై చిలుకు ఉన్నాయి.

వీటిలో బాధని పలికే పాటలున్నాయి. ఉత్సాహాన్ని వెదజల్లేవి ఉన్నాయి. ఆరోగ్యం కలిగించేవి వున్నాయి. వీటన్నిటా ఆశ్చర్యం కలిగించే పసివాడితనం ఉంది. ఇంకో విశేషం ఉంది. శంకర్ జైకిషన్‌ల పాటలు అన్నిటికి ప్రాణం లయ. ఊపిరి ఉత్సాహం. విచారాన్ని తెలిపే పాటలను కూడా చురుకయిన తాళంమీద నడిపే సాహసం, నడిపి శ్రోతని ఒప్పించగల నైపుణ్యం ఉన్నాయి. ఫలానా ఫలానా సందర్భాలలో ఆయా విధాల మనస్థితిగతులను వ్యాఖ్యానించడానికి ఈయీ విధాలయిన రాగాలూ తాళాలూ పనికివస్తాయనో, ఈయీ రాగాలను తాళాలనూ దగ్గరకు రానివ్వరాదనో కొందరు చేసే సంగీతాలంకార సూత్రాలూ నియమ నిబంధనలూ ఇక్కడమటుకు వీరు చెప్పినట్టు విని పనిచేస్తాయి. వాళ్ళకి లలితసంగీత రచనలో రాగతాళాల మీద అటువంటి ప్రభుత్వం ఉంది.

నౌషాద్, రామచంద్ర, బర్మన్ ప్రభృతులందరూ ఒక్కొక్కరు ఒకొక్క వాద్యం మీద ప్రత్యేకాభిమానం చూపి ప్రయోగాలుచేస్తే, శంకర్, జైకిషన్‌లు ప్రతివాద్యం మీదా ప్రత్యేకాభిమానం చూపి అన్నిటినీ అద్భుతంగా వాడారు.

శంకర్, జైకిషన్ పాటలలో అన్ని వాద్యాలకు విశేష ప్రాముఖ్యం వుంది. మాండలిన్‌తో చాలా ప్రయోగాలు చేశారు. అకార్డియన్ మాండలిన్, ఫ్లూటూ మాండలిన్, క్లారినెట్ మాండలీన్ కలుపుతూ పూరించిన కొత్తనాదాలు ఒళ్ళు ఝుల్లుమనిపిస్తాయి – ముఖ్యంగా తొలిసారి విన్నపుడు. ఇవేకాక, ఇంకా ఆలోచనకు అందని వాద్య సమ్మేళనాలు కూడా కొన్ని వున్నాయి.



బర్సాత్‌లో నర్గీస్, రాజ్‌కపూర్

ఇలా వాద్యాలను కలిపీ విడదీసి, చిత్ర విచిత్ర గతులలో ముందుకూ వెనక్కూ, పైకీ కిందకీ, కుడికీ ఎడమకూ పరుగులెత్తిస్తూ చేసే పాటలలో – కనీసం

చాలా వాటిలో అసలు పాటల వరసలు, మంచివాడి మాటలా సూటిగా, పటిక కలిపిన నీటిలా తేటగా, ముఖేష్ కంఠంలా అమాయకంగా, మహాకవి రచనలా నిరాడంబరంగా ఉంటాయి. యావద్భారతంలోనూ ఈ మధ్య సోవియట్ రష్యా అంతటాకూడా నోనోటా వినబడిన పాట ఆవారా హు నాలుగయిదు స్వరాలలో టూకీగా తెమిల్చి కట్టినది. దాగ్ చిత్రంలో తలత్ పాడిన ఐ మేరే దిల్ కహీ అలాటి పాటే. శ్రీ 420 చిత్రంలో మన్నాడే, లతా పాడిన ప్యార్ హువా ఇక్ రార్ హువా, ఇటీవలి కన్హయా చిత్రంలో ముఖేష్ ముఖతః వచ్చిన రుక్మజా వో - జానేవాలీ రుక్మజా ఈ కోవలోవే. షరారత్‌లో లతా పాడిన తేరాతీర్ బేపీర్, అదే వరసలో కొద్దిగా స్వరాలవరస మార్చిపోసిన తెరెజలువా (ఉజాలాలో లతా పాటలూ ఇలాటివే).

బర్సాత్‌లో లత, ముఖేష్ పాడిన ఛోడ్‌గయే బాలం ఆహ్‌లో రాత్ అంధేరీ (ముఖేష్), పూనంలో లత పాడిన ఆయీ ఆయీ రాత్ సుహానీ, బసంత్ బహార్ లో లత, మన్నాడే పాడిన నైన్‌మిలే చైన్‌కహాఁ మొదలయినవీ ఈ తరహావే.

మూడు లక్షల 70 వేల మందిని ముగ్ధుల్ని చేసేలా పాడలేనివాళ్ళూ, పాట రానివాళ్ళూ, రాదనే వాళ్ళూ కూడా హాయిగా పాడుకోవడానికి ఇటు వీలుగానూ, అటు అందంగానూ కూడా ఉండేలా తీర్చిన పాటలు వీరివి.




సరళీస్వరాలూ, జంటలూ, స్వరజతులూ వగైరాలలో స్వరగతులు ఎంత తేలికగా కనిపిస్తాయో అంత అందంగానూ వినిపిస్తాయి. ఆ మొదటి పాఠాల స్వరక్రమంలో అపురూపమైన సౌందర్యం ఉంది. ఆ అందాన్ని పుణికి పుచ్చుకుని ఇందులో నిలపబోవడమే గొప్ప విషయం; ఆ పని చేయగలగడం మరీ గొప్ప విషయం. వీటి ముఖ్‌డాలు (పల్లవి) కూడా చిన్నవిగా ఉంటాయి. పాటవరస లాగే మాటవరసలూ తేలికగా కుదరడంవల్ల ఇవి మరింత రాణించాయి. అనన్య సాధారణమైన మరొక గొప్ప విశేషం ఉంది. శంకర్, జైకిషన్‌ల పాటలలో ఆర్కెస్ట్రాబిట్‌లు కూడా అసలు పాటలంతగా మనసుకు హత్తుకోవడం. ఆవారాహుఁ,

ప్యార్‌హువా, రుకుజా వంటి పాటలలో వాద్యసమ్మేళనంతో వరసలు కూడా పాటతోబాటు సమానంగా శ్రోతలను తమ వశం చేసుకున్నాయి. ఇవి శ్రోతలనే కాక, తమ సృష్టికర్తలను కూడా తమ వశం చేసుకుని ఉండాలి. ఒక పాట పల్లవిని కొద్దిగా సర్దో, తిరగామరగా వేసో కొత్తపాట చేయడం, ఒక పాట తాలుకు ఆర్కెస్ట్రాలో స్వరఖండకావ్యాన్ని మరోపాటకి తొడిగి ముస్తాబు చేయడం ఈ శిల్పంలో భాగం. ఈ సంగతి మనం పసిగట్టి పోల్చుకోగలిగినా, ఆ పాట సరికొత్తబాటలో కట్టిన పాటలాగే మనకి మధురంగా మనోహరంగా వినిపిస్తుంది. ఇలా కొన్ని వరసలు, వరసలు మారి కొత్తకొత్త అవతారాలు ఎత్తినమీదట, హఠాత్తుగా ఒక చిత్రాన సరికొత్తవరస, సరికొత్త శిల్పం ఆవిర్భవిస్తాయి. మళ్ళీ కొన్ని చిత్రాలపాటు ఆ రాగ సుధను మథిస్తూనే ఉంటారు. ఆ వరసలో స్వరాలకు పురి బిగించి సడలించి, జరిపి, సాగదీసి ఆడుకుంటూ పాడుకుంటూ కొత్త వరసలు చేస్తూనే వుంటారు. శ్రుతిమించుతుందని వారూ మీరూ అనుకోకుండానే మళ్ళీ 'ప్లేటు' మారుస్తారు.

ఇలా చూస్తే స్థూలంగా వీళ్ళ సంగీతంలో మైలురాళ్ళు – కొత్త అధ్యాయాలు ఆరంభించిన శీర్షికలు – బర్సాత్ నుండి (అదే తొలిచిత్రం) ఆవారావరకు ఒక ఘట్టం.

తరువాత 'పూనమ్' చిత్రంలో పాటలు కొత్తబాటలు తొక్కాయి.

తరువాతి ప్రకరణం 'ఆహ్' చిత్రంతో ఆరంభం కాగానే అంతా ఓహో అన్నారు. ఆపైన దేశాన్ని ఊపేసింది చోరీ చోరీ.

దాని తరువాత మైలురాయి షరారత్.

ఈ విధంగా ఒకటి రెండు రాగాలు, (ఇంకో రెండు కలిసినవికూడా ఉండవచ్చు) తీసుకొని వాటిమీద కూలంకషంగా చర్చించి, వాటిని సమగ్రంగా విమర్శన చేస్తూ వాటిలోని స్వరాల సహస్రముఖద్యుతులను చూపిస్తూ, మరొకవంక, ఆ చేసే పాటలు అన్నీ అందంగా ఆహ్లాదకరంగా, సర్వజనరంజకంగా ఉండే విధంగా – సినిమా తీసినవాడికి లాభసాటి అయేవిధంగా కూడా తీర్చిదిద్దగలగడం అపారమైన ఉత్సాహం, సృజనాత్మక ప్రతిభ ఉన్న ఏ కొద్దిమందికో చెల్లుతుంది.

❀ ❀ ❀ ❀

కొద్దిపాటి స్వరాలతో ఒకే స్థాయిలో పాట చేసుకుపోవడంలో ఎంత పనివాడితనం చూపించారో, సంక్లిష్టస్వర క్రమంతో, ఒకటి రెండుసార్లు వక్రస్వరాలతో పాటలు కట్టడంలో, స్థాయీ భేదాలతో శ్రుతి భేదాలతో భావస్ఫోరకమైన విన్యాసాలు చేయడంలో కూడా అంతటి శిల్పాన్నీ ప్రదర్శించారు. ఇలా కింది గాంధారం మీదినుంచి పై షడ్జమానికి లతాకంఠంతో తారాజువ్వలా లేచినపాట తూ క్యూఁ ముఝ్‌కో పుకారే (మయూర్ పంఖ్) ఈ తరహా పాటలలో చెప్పుకోతగ్గది. అలాగే చోరీ చోరీ చిత్రంలో రసికబలమా పాట వింటున్నపుడు ఆ స్వరాలలో బిగువు ముహూర్తకాలంపాటు హృదయాన్ని, శ్రోతజ్ఞానానికి సంబంధించిన

సమస్త ప్రపంచాన్నీ స్తంభింపచేసివేస్తుంది. మైనషేమెహూ చిత్రంలో సజన్ సంగ్ కా హే వింటున్నప్పుడు కూడా మనసు ఆనందోద్వేగంతో పరవశం చెందుతుంది.

స్థాయి మారుస్తూ చేసిన మంచిపాటలలో ఆహ్‌లోని ఏ శ్యామ్‌కీ, (ప్రేమలేఖలులో ఏకాంతమూ సాయంత్రమూ) బూట్‌పాలిష్‌లో రఫీపాడిన నన్నేమున్నే బచ్చే కూడా చెప్పుకోతగ్గవి. సప్తస్వరాలమీదా పెద్దపెద్ద అంగలువేస్తూ షడ్జపంచమ పైషడ్జమాలను స్పృశిస్తూ షికారు వెళ్ళి వచ్చేపాట - అతి తేలికఅయిన శైలిలో కట్టినది దాగ్‌లో ఐమేరీ దిల్ కహి ఔర్ చల్. ఇంచుమించు ఈ ఫక్కీలోనే సాగిన మరి రెండుపాటలు- 'పతిత' చిత్రంలో తలత్ పాడిన అంధే జహాకే అంధేరాస్తే, అందులోనే హేమంతకుమార్, లత పాడిన యాద్‌కియా దిల్‌నె కహాఁ హో తుమ్.

ఎకార్డియన్‌పై శంకర్ జైకిషన్‌లకు గల పలుకుబడి అంధెజహాకే పాటలోను, పతిత చిత్రంలోని పై రెండు పాటలలోనూ ఆవారా హూఁ పాటలోను బాగా కనిపిస్తుంది. వయొలిన్, మాండలిన్‌లు ఎందులో బాగావాడారు అన్న ప్రశ్నకి జవాబు ఇంచుమించు ప్రతిపాటా ధాటీగా చెప్పగలదు.

అనుకరణ అనేది అన్నిటినీ మించిన అభివందనం అయితే, కల్యాణ్‌జీ వీర్‌జీ (ప్రస్తుతం ఆనంద్ జీ), దత్తారాంల పాటలు ఈ విషయంలో ముఖ్యంగా వయొలిన్ బిట్‌ల ప్రయోగంలో శంకర్ జైకిషన్‌ల ప్రజ్ఞకు, ఆ వాద్యాలమీద వారి సార్వభౌమత్వానికి ఎన్నోసార్లు జోహార్లు చేశాయి అని చెప్పుకోవాలి. ఒక్కొక్కసారి ఏది ఎవరిదో కూడా చెప్పడం సాధ్యం కానంతగా వీరి శైలిని వారు అనుకరిస్తా రనిపిస్తుంది. ఎందుకంటే అకార్డియన్ మాండలిన్, టాప్ వయొలిన్‌లు, వేణువులను ప్రయోగించడంలో శంకర్, జైకిషన్‌లది విశిష్టమైన శైలి. ఆ శైలిమీద వాళ్ళ ముద్ర స్పష్టంగా ఉంటుంది. దానిమీది వాళ్ళజెండా ఎగురుతూ ఉంటుంది.

శాస్త్రీయమైన ఫణితిలో కూడా అవసరాలను బట్టి శంకర్, జైకిషన్‌లు చేసిన పాటలు చాలా ఉన్నాయి. బసంత్ బహార్‌లో రఫీ పాడిన చరణోమే అటు పెద్దలను ఒప్పించి, ఇటూ లలిత సంగీత ప్రియులను అలరించిన పాట. బూట్ పాలిష్‌లో మన్నాడే పాడిన లబకుఝబకు. రసిక బలమా, న్యూఢిల్లీలో మురళీ బైరన్ భయీ, పత్రాణి చిత్రంలో లత పాడిన 'చంద్రమా మత్ బరా' మొదలైనవి నిండుగానూ వీనుల విందుగానూ కుదిరాయి.

అన్నిటికన్న మిన్నగా శంకర్ జైకిషన్‌లకు పాటలిచ్చిన కామధేనువు భైరవి రాగమే. సినిమా పరిభాష ప్రకారం బాక్సాఫీస్ హిట్‌లు అయినపాటలూ, ఆయా చిత్రాలు కూడా హిట్ కావడానికి కారణాలయిన పాటలూ ఈ రాగంలో చేసినవాటిలో చాలా వున్నాయి. వాటిలో ఎన్నతగ్గవి: లత పాడిన బర్‌సాత్ మే, ఛోడ్‌గయే బాలం, బిచ్‌డె హుయె పరదేశి, ఆవారాహుఁ. సునో ఛోటీ సీ గుడియాకీ లంబీకహానీ (లత), తు మానే య నమానే (లత), మయూర్ పంఖ్‌లో తాజ్‌మహల్‌పై చేసినపాట ఖుషియోంకిచాంద్ ముస్కురాయి రే (లత), తుంహారె హై తుంసే (రఫీ ఆశాబృందం), హాయ్ తూహి గయా (లత), తూనే హాయ్ మేరే జఖమ్ (లత),

కైసీకుషీకి హై రాత్ (లత), ఏ మెరే దిల్ కహీ ఔర్ చల్ (తలత్), జుల్మ్‌కె నగరీ మే కిసీకా కోన్‌సహారాహై (లత), రామయ్యా వస్తావయ్యా (రఫీ ముఖేష్, లత) రాజాకీ ఆయెగీ బారాత్, జారె జారె, దో దిన్ కెలియే, ఉన్సెప్యార్ హోగయా, కహా ఝూమ్‌ఝూమ్ తా ఎ సుహానీ (ఇవన్నీ లతా పాడినవి.) ముఝ్‌కో యారో మాఫ్ కర్ నా (ముఖేష్), మన్‌భావన్ (లత, ఆశా).

❀ ❀ ❀ ❀

ఇద్దరిలోనూ ఎవరి ప్రభావమో చెప్పలేముగాని (వాళ్ళూ చెప్పలేరు), లయ శంకర్ జైకిషన్‌ల సంగీతానికి ప్రాణం. మామూలుగా ఒక ఘట్టంలో పాత్రల మనస్థితినిబట్టి, సాఫీగా ప్రవహించే తరహాలో పాట అవసరమని అంతా అనుకుంటే, తాళానికి ఎప్పుడూ పక్క తాళంవేసే ఈ సంగీతదర్శకు లిద్దరూ పాటకి ఉత్సాహగతిగల తాళం పెడతామని అంతపనీ చేసి ఒప్పిస్తారు. పాటకూడా ఉత్సాహమైనదైతే చెప్పనక్కరలేదు. కట్‌పుత్లీలో పాటలు, లయ ప్రయోగానికి మచ్చుతునకలు. బసంత్ బహార్‌లో జజారెజా (లత) పాట ఎదురుతాళంమీద పుంజుకున్నప్పుడు వినేవాడి ప్రాణం ఝల్లుమని తేలిపోతుంది. ఈ జంటలో జైకిషన్ తబ్లావాద్యంలో ప్రవీణుడు కాబట్టి ఇందులో కొంత ఘనత ఆయనకు దక్కాలి. హుషారైన తాళంమీద పరుగులెత్తే పాటల్లో పూనమ్ చిత్రంలోని దిన్‌సుహానీ జూమెజూమె దిల్ మెరా టుమ్మకు టుమ్మక్ ఎన్నతగ్గవి. చివరిపాట మన తెలుగు జానపద గేయం సీతమ్మ పెళ్ళికూతురాయెనే ఛాయలో కట్టింది.

సాఫీగా, నిండైననదిలా ప్రవహించే మెత్తని పాటలలో "బాద్‌షా" చిత్రానికి చేసిన ఆ నీల్ గగన్‌సే (లత హేమంత్) బసంత్ బహార్‌లో లత పాడిన మైపియా తేరీ తు మానే య నమానే చాలా గొప్పగా ఉంటాయి. కాని ఇలాటి పాటలు శంకర్ జైకిషన్‌ల సంగీతంలో తక్కువ.

❀ ❀ ❀ ❀

శంకర్ జైకిషన్‌లూ, మన్నాడేకి చాలా మంచిపాటలు ఇచ్చి అతనివల్ల పాటలూ, పాటలవల్ల అతనూ బహుళ జనాదరణ పొందడానికి దోహదం చేశారు. మన్నాడే పాడినవాటిలో వీరు చేసిన మంచి పాటలు లబక్ జబక్ (బూట్ పాలిష్), దిన్ అల్‌బెలీ (బేగునాహ్) తూ ప్యార్ కే సాగర్ హై (సీమ), ఏరాత్ భీగీ భీగీ (చోరీ చోరి), నైన్‌మిలే చైన్‌కహా, సునానాసజే (బసంత్ బహార్) చాలామంచి పాటలు.

లతామంగేష్కర్ కీర్తి వర్థిల్లడానికి శంకర్, జైకిషన్‌ల పాటలు ఎంత తోడ్పడ్డాయో, వీళ్ళ పాటలు రాణించటానికి – వీళ్ళ స్వరాలను కంఠస్వరంలోకి అనువదించడంలో లత చూపిన ప్రజ్ఞ అంత దోహదమూ చేసిందనవచ్చు. కొందరు లతాభిమానులు, అసలామె లేకపోతే వీళ్ళకి ఇంత చక్కని పాటలు కుదిరేవి కావంటారు. ఔరత్, పూనమ్ చిత్రాలలో పాటలన్నీ లతానే పాడింది. వాటిలో

పురుషకంఠాలు వినబడవు. అన్ని పాటలూ చాలా బాగున్నాయి. అన్నీ చాలామందికి నచ్చాయి.

శంకర్ జైకిషన్‌ల సంగీతానికి అందరికన్న దగ్గర చుట్టరికం ఉన్నవాడు ముఖేష్. అతను వెనుకబడుతున్నాడని అంతా అనుకుంటున్న రోజుల్లో ఈ జంట చేసిన సంగీతం, అదృష్టంలా, మహదవకాశంలా వచ్చి అతన్ని పైకెత్తేసింది. ముఖేష్ కంఠం గారడీ చేయ్యలేదు. చెయ్యదు. మెత్తని మందస్వరం మంద్రమంద్రంగా అలా ప్రవహిస్తూపోతుంది. శంకర్ జైకిషన్‌లు దాని వీలు తెలిసి దానికోసమే అనిపించే విధంగా చేసిన పాటలు అతనికీ వాళ్ళకీ కూడా పేరు తెచ్చిపెట్టాయి. ఖండాతరంలో కూడా మంచిపేరు గడించిపెట్టాయి.

మొత్తంమీద శంకర్ జైకిషన్‌లు చేసిన పాటలలో వాళ్ళ సంగీత రచనాచాతుర్యాన్ని, వాద్యసమ్మేళనా శిల్పాన్ని చూపుతూ సర్వజన మనోహరంగా రూపొందిన మంచి పాటలు చాలా ఉన్నాయి. వాటిలో ఎన్నతగ్గ మరికొన్ని పాటలు:

రాజ్‌హఠ్ లో ఆయే బహార్ (రఫీ), బసంత్ బహార్‌లో చరణ్‌మే (రఫీ), మైపియా తెరీ తు మానే యా నమానే (లత), కట్‌పుత్లిలో తోయెలాహిగయా మొహె భూలోగయె, ఇత్ నే బడే జహామే (లత), బేగునాహ్‌లో నీల్ గగన్‌పర్ (మన్నాడే, లత), బాద్షాలో ఆ నీల్ గగన్ తేరీ (హేమంత్, లత), నగీనాలో 'తూనే' (లత) చోరీచోరీలో రసికబలమా, ఆహ్‌లో ఏ శామ్‌కీ రాత్ అంధేరీ (ముఖేష్), నయాఘర్, జారెజారె (లత), కాలిఘటాలో ఉన్‌కేసితమ్ నే లూట్ లియా (లత), యాహుదీలో అశూంకీ ఆగ్ లేకే (లత), న్యూఢిల్లీలో మురలీ బైరన్‌భయీ (లత), హలాకులో ఈజిప్షియన్ ఫక్కీలో చేసిన ఆజాకే ఇన్తిజార్ మే (రఫి లతా). ఛోటీ బహన్‌లో జావుకహాఁబతా యె దిల్ (ముఖేష్), కన్హయలో రుక్కుజా (ముఖేష్). మైనషే మె హుం లో సుజనసంగ్ కాహె (లత) లవ్‌మారెజీలో కాహెజూమ్‌జూమ్ (లత).



శంకర్, జైకిషన్‌లు ఇద్దరూ వాళ్ళపాటలలాగే నిత్యోత్సాహభరితులై, చైతన్య వంతులై ఉంటారు. వాళ్లలోని శక్తి చైతన్యాలను పాటలనిండా నింపి, వాటిని విని వాటిద్వారా కొత్త పాటకి ఉత్సాహం సంపాదించుకుంటారు ఇద్దరిలో ఎవరే పాట చేశారూ ఎవరే భాగం కూర్చారు అన్నది అడగతగ్గ ప్రశ్న కాదు, వెతకతగ్గ సంగతి కాదు. గర్వించతగ్గ స్థాయిన సజీవ సంగీతానికి సేవచేస్తున్న ఈ సృజనాత్మక ప్రతిభావంతు లిద్దరిలోను శంకర్ తెలుగువాడన్న మాటమటుకు మనం గర్వంగా చెప్పుకు సంతోషించవచ్చు. అంతకు మించి వాళ్ళ పనిని వాటాలు వేయబోవడం తగదు. వాళ్ళే అన్నారు ఒకసారి:

"ఇపుడే కాదు ఎప్పుడూ మా యిద్దరిలో ఎవరే పాట చేసినా దానికి శంకర్, జైకిషన్‌ల మకుటం ఉంటుంది. ఒకవేళ మా యిద్దరిలో ఒకడు ముందు గతించి,

రెండోవారు సంగీత రచనలు కొనసాగించినపుడు కూడా ఆ రచనల కర్తలు శంకర్ జైకిషన్‌లు అనే ఉంటుంది."

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

❄ ❄ ❄

శంకర్-జైకిషన్‌ల ప్రభ రెండు దశాబ్దాలపాటు అప్రతిహతంగా సాగింది. ప్రజలు సులభంగా పాడుకునే వీలుగా బాణీలు సమకూర్చడంలో నేర్పు చూపి సామాన్యుల హృదయాలను గెలుచుకున్నారు. 'సంగమ్' (1964) తర్వాత కలిసి పనిచేయడం మానేసి విడివిడిగా సంగీతాన్ని అందించినా, శంకర్-జైకిషన్ పేరనే ప్రకటించుకోవడం జరిగింది. 1971లో జైకిషన్ మరణించాక కూడా అదే పద్ధతి. హైదరాబాదుకి చెందిన శంకర్ కొన్ని తెలుగు సినిమాలకు కూడా సంగీతాన్నందించారు. 1987లో మరణించేవరకూ శంకర్‌కు ఆఫర్లు వస్తూనే ఉన్నాయి. వారు సమకూర్చిన ట్యూన్‌లు ఆర్.కె. ఫిలింస్ ఖజానాలో ఇంకా ఎన్నో ఉన్నాయంటారు.

# పొగడపూలు



దర్శకుడుగా బాపుకీ, నిర్మాతగా రమణకూ తొలి చిత్రం సాక్షి (1967). దాని పాటల కంపోజింగ్ కోసం బెంగుళూరు వుడ్‌లాండ్స్‌లో సిట్టింగ్సు పెట్టుకున్నాం. శ్రీ మహదేవన్, పుహళేంది, మైకేల్ (తబలా), రచయిత ఆరుద్ర మేమిద్దరం కూర్చున్నాం... అంతకుముందు నుంచి ఆరుద్రగారు మాకు రాతగీతల నేస్తం అయినా సినిమా పాటల సిట్టింగు దగ్గర కొత్త పరియమే...

లోగడ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నా సినిమా సమీక్షలు బాగున్నాయని నలుగురూ మెచ్చుకున్న రోజులలో మొలిచిన చిన్నచిన్న కొమ్ములను బులబులాగ్గా తడుముకుంటూ నేను కొంచెం గొప్పలు పోబోయాను.



కృష్ణ, విజయనిర్మల

ఆరుద్రగారూ! మీరు పూర్వం 'అత్తాఒకింటికోడలే' లో ఒక పాట రాశారు. అశోక వనమున సీతా - శోకించె వియోగము చేతా - అని ప్రాస వేశారు గుర్తుందా... అలాంటి అంత్యప్రాసం ఈ సినిమాలో మనకొద్దు... ఎందుకంటే

అప్పుడు నేను వాటిని విమర్శించాను - ఇపుడు అలాంటివి ఒప్పుకోలేను - అన్నాను.

ఆరుద్రగారు - అప్పటికింకా పెంచని రాగి రంగు గడ్డాన్ని నిమురుకుంటూ- నావంక చిరునవ్వుతో చూశారు - రాసుకోండి అన్నారు - అది వీధినాటకంలో రాధాకృష్ణుల సరసాల ఘట్టం...

'దయ లేదా నీకు దయ రాదా' అంటూ పల్లెటూరి బల్లకట్టు కిష్టమూర్తి - రాధ గుమ్మంలో పాడుతున్న సన్నివేశం అది...

సత్యభామ యింట కాలితో తన్నులు తినివచ్చాడని తెలిసిన రాధ దెప్పుతూ - పొమ్మంది.

ఆలూ-

ఎఱ్ఱతేలూ

దాని కాలూ

నీకు చాలూ... అని చెప్పారు - ఆరుద్రగారు.

ఆ మాటల జోరుకీ చక్కదనానికీ నాకు దిమ్మదిరిగి పోయింది - వాగిన నాలుకను కటుక్కున కొరుక్కుని మూర్ఛపోయి - లేచి - నీళ్ళుతాగి - అద్భుతం - అని రౌడీ ఈలవేసి (అప్పుడీ అలవాటుండేది) చప్పట్లు కొట్టాను.. ఒద్దన్నదాన్ని కావాలనిపించేలా చెప్పి ఒప్పించడం... దటీజ్ ఆరుద్ర...

❀ ❀ ❀ ❀

సినిమాలో పాటలు రాసే రచయితలెందరో - దాదాపు అందరూ మాకు మిత్రులూ యిష్టులే అయినా తొలిచిత్రం సాక్షిగా ఆరుద్రగారే మాకు పరమ ఆప్తుడు- అయిపోయారు. సాక్షిలో ఒకటి తప్ప అన్నిపాటలూ ఆయనే రాశారు... ఆ చిత్రమే కాదు. 1967 తరువాత నుండి 28 ఏళ్ళపాటు - ఒకటి తప్ప (వంశవృక్షం) - ఆయనే అన్నిటికీ ఎక్కువ పాటలు రాశారు - ఆయనని "మాస్థాన కవి" అని ముద్దుగా పిలుచుకునే వాళ్ళం - ఆయన తరువాత ఆయన వలెనే పాతిక ముప్పయి ఏళ్ళు - అంతగానూ దగ్గరయి ప్రేమ ఆదరం చూపిస్తూ పాటలు రాసినవారు మరి యిద్దరు ఉన్నారు. - శ్రీ సినారే - శ్రీ కొసరాజుగారు.

❀ ❀ ❀ ❀

సాక్షిలో ఒక్కపాటకు మాత్రం ఆరుద్ర చాలా శ్రమపడ్డారు... దారి దొరకలేదు - మాట కుదరలేదు - కుదిరినవి బాపు గారికి నచ్చలేదు... వారం తిరిగింది - బెంగుళూరు బడ్జెట్టు నిండుకునే దశకి చేరుకుంది.

ఆరుద్రకి రోషం వచ్చింది. పంతం పెరిగింది. చివరిరోజు ఉదయం - ఆయన ఆరుగంటలకే లేచి బయటకు వెళ్ళి వుడ్‌లాండ్స్ హోటల్ కాంపౌండు కలయ తిరుగుతున్నాడు... హఠాత్తుగా గురువుగారు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు గుర్తుకొచ్చారు... వారు మా అందరికీ గురుదేవులే.

ఈ బాపూ రమణలు - ఈ పాటని గురువుగారికిస్తే - ఏం జరిగేదీ అని ఆలోచన వచ్చింది... అది పెళ్ళిపాట - చావు బతుకుల మధ్య గిలగిలలాడే కిష్టిగాడి చేత - చుక్క వాడిని కాపాడడానికోసం బలవంతాన తాళికట్టించుకుంటూ పాడేపాట - ఇలాటప్పుడు గురువుగారు ఏమంటారు-??..

'అమ్మ కడుపు చల్లగా అత్త కడుపు చల్లగా బతకరా బతకరా పచ్చగా" - అనిపించింది... అంతే. అరగంటలో - పాట ప్రవహించింది.

ఆ పాటతోనే సాక్షి చిత్రం షూటింగు ఆరంభించాము - పులిదిండి గ్రామంలోని కోవెలలో - ఆరు నిముషాల పాటను డైరెక్టర్ బాపు, కెమెరామన్ సెల్వరాజ్‌గారు మూడు గంటలలో చిత్రించి ముగించారు.

సంపూర్ణ రామాయణం ఒక చిత్రమైన అనుభవం... నేను నిర్మాత వేషం కూడా పోషిస్తున్నందువల్ల స్క్రిప్టును ప్రధానంగా అయనే రాశారు - స్క్రీన్‌ప్లే కూర్చుకున్నపుడు అనుకున్న పాటలూ సందర్భాలూ కాకుండా- వెడలెను కోదండపాణి లాంటి సుదీర్ఘ కథా కథన గీతంలో ఎన్నో కొత్త చరణాలూ పద్యాలూ మెలకువలూ ఆయన కలంలో నుంచి ప్రవహించాయి - వాటిలో అక్షరం తేడా లేకుండా స్వీకరించాము- అది ఆయన ఘనత...

మేము తీసిన రామకథా చిత్రాలలో కొన్ని మరపురాని పరిమళభరితాలయిన పొగడపూలవంటి సందర్భాలు ఉన్నాయి...

శ్రీ రామాంజనేయయుద్ధం తీస్తున్నపుడు యయాతి కథను ప్రధానంగా నేపథ్యంలో చెబుతూ - రామచంద్రుని మహిమను వర్ణించాలి - ఎన్నో ప్రయత్నాలు చేసినా - కుదరలేదు - రికార్డింగు డేటు దగ్గర పడింది - శ్రీ ఎన్.టి.ఆర్ గారి కాల్‌షీట్! ఆయనకి కోపం వస్తే అంతా ఫటాఫట్! చివరి సమయంలో ఆరుద్రగారు దొరికారు - అంతవరకూ - బహుశా ఇందుకోసమేనేమో ఆయన అందుబాటులో లేరేమో! రెండే రోజుల వ్యవధి - పిలిచి కథా సందర్భాలు చెప్పాము - శ్రీరామ నామం - శ్రీరామ పాదం - శ్రీరామ శపథం - శ్రీరామ బాణం అంటూ శ్రీరామ మహిమాన్వితములైన నాలుగు కేంద్రాలను కల్పించారు. ఒక్కపూటలో పాట రాసారు.

1. శ్రీకరమౌ శ్రీరామనామం
   జీవామృత సారం...
   పావన మీ రఘురామనామం
   భవ తారక మంత్రం
2. శ్రీయుతమౌ శ్రీరామ పాదం
   శ్రితజన మందారం...
   పావన మీ రఘురామపాదం
   పాప వినాశకరం



3. భీషణమౌ శ్రీరామ శపథం
వీడదు ధర్మపథం
ఇప్పటి ఈ రఘురామ శపథం
హృదయ విదారకం

4. భీకరమౌ శ్రీరామ బాణం
తిరుగులేని అస్త్రం
పావనమౌ రఘురామ బాణం
భక్త పరిత్రాణం

❀ ❀ ❀ ❀

గోరంతదీపం తీస్తునప్పుడు ఒక ప్రయివేట్ రికార్డు విన్నాం-

**రాయినైనా కాకపోతిని రామపాదము సోకగా**
**బోయనైనా కాకపోతిని పుణ్యకావ్యము వ్రాయగా-**
**కాకినైనా కాకపోతిని ఘాతుకమ్ములు సేయగా**
**గరిక పోచను శరము చేసే ఘనత రాముడు చూపగా-**

అది విని ముగ్ధులమై - అది ఆరుద్రగారిదే అని తెలిసి - ఆశ్చర్యపోలేదు - అనితరసాధ్యం కనుక! అది ప్రయివేటు రికార్డుగా విడుదల అయి ప్రజాదరణ పొందిందని తెలిసినా గ్రామఫోను కంపెనీ వద్ద దానిపై హక్కులు తీసు - 'కొని' సంగీతం - అప్పుడూ శ్రీ మామయే - ఆ చిత్రంలో అమర్చుకున్నాము... ఆ పాట విని డా॥ సినారెగారు థ్రిల్లయిపోయారు-

"జన్మ మొత్తానికి ఇలాటి పాట ఒక్కటి రాస్తే చాలు - జన్మధన్యం అవుతుంది" అన్నారు. ఆడది మెచ్చిందే అందం అన్నట్టు సాటి కవి - అంతటి జోహారం వెయ్యడం - దానికదే సాటి...

❀ ❀ ❀ ❀

(సినారె వర్షించిన అమృత గేయాలలో వటపత్ర శాయికీ వరహాల లాలీ... అనే పాట కూడా అన్ని విధాలా అంత గొప్పది అనిపిస్తుంది.)

❀ ❀ ❀ ❀

సీతాకళ్యాణం తీస్తున్నపుడు - సీతమ్మవారూ చెలులూ ఆటలాడుకోవడం సందర్భం వచ్చింది. బాపుగారు దాగుడుమూతలు ఆట గురించి చెప్పి - సీతకి ఇంత పెద్ద కన్నులు అయితే- వాటిని మూయడం ఎలాగమ్మా - దాగుడుమూతలు ఆడడం ఎలాగమ్మా - అని చెలులు సరసాలు ఆడేలా రాయమని - ఆ పాట రాయవచ్చిన కవిగారికి చెప్పారు. ఆయనకు అది పట్టినట్టు లేదు. "అద్దం మీద ఆవాలలా"

అంటూ పరుగెత్తే చెలుల గురించి ఏవో ఉపమానాలు వేసారు. బాపుగారికి నచ్చలేదు. ఆ రచయిత కూడా సామాన్యుడు కాదు. అసాధారణ ప్రతిభాశాలి. మహాపండితుడు (కవిసేనాపతి). ఎంత పండితుడైనా అవసరమైనవేళ తేలు మంత్రం కూడా వచ్చి ఉండాలి. ఆయనకు కోపం వచ్చింది. "సినిమా పాటల్లోకి కూడా కాస్త కవిత్వం చొరబడనివ్వండి సార్" అని వ్యంగ్యం విసిరారు...

ఆ మర్నాడు ఆరుద్రగారు వచ్చారు.

అదే సందర్భానికి ఆరుద్ర రాసిన పంక్తులు ఇవీ:



**సీతమ్మకు సింగారం చేతాము రారమ్మ**
**సిరితల్లి ముచ్చటలు చూతాము**
**రారమ్మ**

**రారమ్మా రారమ్మా**
**ఆటలలో హరినే తలిచి**
**మనలోకంలో ఉండదు**
**పంటల వేళ పరాకు వల్ల**
**పడతి జానకి పండదు**
**చెంపకు చారెడు**
**కన్నులు ఐతే ఎల్లాగమ్మా మూసేది**
**సైయ్యా? సై**
**దాగినవారిని వెతకదు సీత**
**ఎల్లాగమ్మా ఆడేది...**
**అవునమ్మా అవునమ్మా**

సీతమ్మవారితో చెలులు ఆటలాడుకునే
ఈ సన్నివేశానికే ఆరుద్రగారు మరో చరణం కూడా రాశారు.



**బంతుల ఆటకు ఇంతిరావే**
**ఇదిగో బంతిపూల బంతి**
**ఇదిగో సన్నజాజి బంతి**
**ఇదిగో మల్లెపూల బంతి**
**ఇదిగో కలువపూల బంతి**
**చెలికత్తెలు విరిబంతులు రువ్వ**
**చిరునవ్వులు రువ్వను సీతమ్మ**
**ఆదిలక్ష్మికి పువ్వుల పూజలు**
**అలవాటే గద అవునమ్మ**

అవునమ్మా అవునమ్మా
ఆరుద్రగారు నాస్తికుడు అయినా
'ఆదిలక్ష్మికి పువ్వుల పూజలు
అలవాటే గద అవునమ్మ' అంటూ మా మనసుల్లోకి దూరి 'స్వరకాయ ప్రవేశం' చేశాడనిపించేలా రాశారు.

ఆరుద్రగారు నాస్తికుడే అయినా ఆయన ఇల్లాలు రామలక్ష్మిగారిని - ఎల్లప్పుడూ 'రామా' 'రామా' అని పిలిచేవారు.

❀ ❀ ❀ ❀

50లలో పెంకి పెళ్ళాం అనే సినిమాలో ఆరుద్రగారు ఒక పెంకి పాట రాశారు. "పడుచుదనం రైలుబండి పోతున్నదీ వయసు వాళ్ళకందులో చోటున్నదీ..."

"ఎక్కవలసిన రైలు ఎక్కాను - దిగవలసిన స్టేషన్ వచ్చింది - సీటు కాళీ చేయాలి - దిగిపోతున్నాను" అని చెప్పి మరీ దిగిపోయారు.

దిగే ముందు... చిట్టచివరిగా మళ్ళీ రామనామం! ఆయన అక్షరాలా మంచాన్ని ఆశ్రయించి విశ్రమించే వేళ - మేము - ఈ టీవీ కోసం తీసే శ్రీ భాగవత కథలలో రామాయణ కథను తీస్తున్న వేళ - సుందరకాండను సమగ్రంగా వ్రాయమని కోరాము... అంపశయ్య మీద విశ్రమించిన కురువృద్ధుడు భీష్ముడు - శ్రీ విష్ణుసహస్రనామం చెప్పినంత మహోజ్జ్వలంగా ఆరుద్రగారు సుందరకాండను గానం చేసారు. ఆ పాట అరవై నిముషాల పై మాట... ఆలిండియా రికార్డు అని రికార్డింగు రంగారావుగారు అన్నారు. మేము ధన్యులం...

❀ ❀ ❀ ❀

"ఆరుద్రా! సెబ్ బాష్ ష్!"
అనేవాడు లిమరిగ్వేది ఆగ్డెన్ నాష్ష్-
"హియర్ హియర్"
అనేవాడు ఎడ్వర్డ్ - డియర్ లియర్ -
అమెరికాన్ టెలుగూస్ మీద
ఆరుద్ర ఈనాటి ఇంటింటి పజ్యాలు
ఆనాడు వాళ్ళు చదివి - వుంటే గింటే
అయితే - కానీ -
ది గోల్డెన్ ట్రాషరీ ఆఫ్ ఆగ్డెన్ నాషరీ అంతా గాలించినా
లియర్ గారివిజర్డరీ వరల్డ్ శోధించినా
దొరకేది లిమరిక్కుల
పదసంపద ట్రిక్కులే

మరి నీ మాటల మాటో?
నీ అక్షర తూణీరం నుండి
మనసున్న మనుషులందరిలోకీ
అక్షర లక్షల అక్షరాస్త్రాలు ప్రయోగించి
కవితలూ కథలూ గాథలూ గేయాలూ
గాయాలూ నవలలూ నృత్త నృత్య
నాట్య నాటకాలూ సినిమాటలూ
ఆటలూ పేకాటలూ నుడికట్టులూ
గుడి (చేటి) కట్లూ వాక్ చతురంగాలూ...
ఓహో! పుంఖాను పుంఖాలుగా
ప్రయోగించి... జయించి...
హౌరా!
ఆరుద్రా
అక్షర శరీరా!
పరిశోధన పరమేశ్వరా!
క్షరమైన దేహాన్ని
అక్షర శరీరంగా అనువదించుకుని
సాహిత్యాకాశంలో
ధ్రువ కవిరాజల్లే రంజిల్లే
ఆరుద్రా! సెహబ్బాష్ ష్.

*(హాసం, హాస్య సంగీత పత్రిక - 2002,*

ఆరుద్ర - ఆరుద్ర పేరుతో విఖ్యాతులయిన భాగవంతుల శంకరశాస్త్రి కవి, పండుతుడు, పరిశోధకుడు, కథారచయిత. ఆయన స్పృశించని సాహితీ ప్రక్రియ లేదు. సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర వ్రాసి తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని కైవసం చేసుకున్న ఆరుద్ర సినిమాలకు మాటలు, పాటలు వ్రాసి ఎంతో పేరు తెచ్చుకున్నారు. బాపు, రమణలకు ఆప్తుడు. వారి సినిమా లెన్నిటికో పనిచేశారు. 1999లో మరణించారు.

# దటీజ్ భానుమతి..! వై..!?

**కో**కిల పాటని అందరూ ఎందుకు బాగుందంటారు?

కోకిలకు మంచి కంఠం ఉంది. పాటలో సొగసు ఉంది.

కోకిలకు ఆ కంఠాన్ని దేవుడిచ్చాడు.

ముప్ఫైఏళ్ళ క్రితం ఒక రోజున ఒంగోలులో ఒక అమ్మాయికి కూడా దేవుడు ఇలాటి వరం ఇచ్చాడు. అందుకని ఆ అమ్మాయి హాయిగా పాడేది. ఆ పిల్లపేరు భానుమతి.



"ఈ పాట దేశం అంతా విని ఉంటే ఎంత బాగుండేది! అనేవారు మానాన్న" అంది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి పేరు బొమ్మరాజు భానుమతి.

❀ ❀ ❀ ❀

పదిహేనేళ్ళ క్రితం ఒక కొత్త పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ మధుపర్కాలు కట్టుకుని ఒక ఇంటికి వెళ్ళి తలుపు కొట్టారు. తలుపు తీసిన ఆయనకి పాదాభివందనం చేశారు దంపతులు. "నాన్నా మమ్మల్ని దీవించు" అంది పెళ్ళికూతురు.

నాన్నగారు విస్తుపోయారు.

"నాన్నా! నాకూ, దేవుడికీ, జాతకానికీ నచ్చిన అబ్బాయి నీకు నచ్చలేదు. అయినా నీలో ఉండే ఆత్మవిశ్వాసం, పట్టుదల, నీ కూతురునైన నాకూ అణువణువునా వంటబట్టాయి. అందుకని స్వతంత్రించి పెళ్ళి చేసుకున్న మమ్మల్ని మనసారా దీవించు" అంది పెళ్ళికూతురు.

ఆ పెళ్ళికూతురి పేరు శ్రీమతి పాలువాయి భానుమతి. ఆయన పేరు శ్రీ రామకృష్ణ.

❀ ❀ ❀ ❀

"మీకు చాలా టెక్కు అంటారు."

"నామీద నాకున్న నమ్మకాన్ని, గౌరవాన్ని - అహంకారం అనే వాళ్ళకి, మోసగించే మొహమాటం, వికారపు వినయం అభినయించడానికి ఇష్టంలేక నేను నిష్కర్షగా అనే మాటలని విని తలపొగరు అని విమర్శించే వాళ్ళకి నేను చెప్పగలిగేదేం లేదు" అన్నదామె.

ఆమె నటి, గాయని, దర్శకురాలు, సంగీత దర్శకురాలు అయిన బహుముఖ ప్రజ్ఞావతి భానుమతి.

---

"నా చిన్నప్పుడు నేను ఎన్నడూ పెద్ద సినిమా స్టార్‌ని అవాలని ఆశపడలేదు. బెంగపెట్టుకోలేదు. దేవుళ్ళకి మొక్కుకోలేదు. అసలు ఈ విషయంలో అప్పుడూ ఇప్పుడూ కూడా ఇంతే. నేను దేవుడికి నమస్కారం పెడతాను గానీ ఆశపెట్టను. అలాగే, శివుణ్ణి చూడడానికి పనిగట్టుకు కాశీ వెళ్ళాలని పట్టింపులేదు. ఆయన ఎక్కడైనా, ఎప్పుడైనా ఎవరికైనా ఉంటాడు. నేనిక్కణ్ణించి నమస్కారం పెట్టగలను - ఆయన అందుకోనూ గలడు" అంది భానుమతి.

భానుమతి చిన్నతనం రోజుల్లో ఆడపిల్ల సినిమాల్లో చేరడం అంటే, "అమ్మో! ఇంకేమైనా ఉందా" అని జనం పబ్లీకున విస్తుపోయేవారు.

"నేను అలాగే అనుకునేదాన్ని" అంది భానుమతి నవ్వుతూ.

తల్లిదండ్రుల చాటున నాలుగు గోడల మధ్య భయభక్తులతో పెరిగిన పిల్ల. సంప్రదాయాన్ని, పెద్దల ఆచారాలను గౌరవించి మన్నించడం నేర్చుకున్న అమ్మాయి.

వాళ్ళ నాన్నగారు సంగీత విద్వాంసులు. తనలో తాను సన్నగా మెత్తగా పాడుకునే భానుమతి కంఠంలో ఆయనకు మంచి భవిష్యత్తు కనపడింది" కొత్తలో ఆయన కుమార్తె పాటే కాదు, "ఆ పిల్ల చాలా బాగా పాడుతుంది" అని వాళ్ళూ వీళ్ళూ మెచ్చుకుంటూ అన్న మాటలు స్వయంగా తను కూడా విన్నాకా, వెంకట సుబ్బయ్యగారు కుమార్తె విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించి , సంగీతం చెప్పడం మొదలుపెట్టారు. ఆమె పాట దేశమంతా వినాలని ఆయన సంకల్పించారు.

పధ్నాలుగో ఏటనో, పదిహేనో ఏటనో ఆమెకి "వరవిక్రయం"లో నటించే అవకాశం వచ్చింది.

"పెళ్ళికాని పిల్ల వేషమే" అని చెప్పారు అడుగవచ్చిన దర్శకుడు శ్రీ పి.పుల్లయ్యగారు.

వెంకట సుబ్బయ్యగారు ఆలోచిస్తామన్నారు అప్పటికి. మర్నాటి నుంచీ భానుమతి భవిష్యత్తుమీద వాద ప్రతివాదాలు జరిగాయి. అన్నయ్యలు వద్దన్నారు. శ్రేయోభిలాషులు కొందరు "శ్రేయస్సు" అన్నారు, మరికొందరు అప్రతిష్ఠ అన్నారు. అమ్మ సందేహించింది. నాన్న తటపటాయించారు.

"నాన్న చెప్పినట్టు వినడం అలవాటు. అందుకని నేనేమీ అనలేదు. అప్పటికి తలవంచుకున్నాను" అంది భానుమతి.

అలా తలవంచుకుని ఉండటం తన కలవాటు. "వరవిక్రయం"లో నటిస్తున్నప్పుడు సెట్సుమీద కూడా అంతే. కెమేరా అంటే ఎలా వుంటుందో కొన్నాళ్ళవరకు తెలీదామెకి.

అందరూ హేళన చేసేవారు, అలా గొర్రెలా తలవంచుకుని నిలబడతావేమని.

"మా చెల్లెళ్ళూ వాళ్ళూ గొర్రె అని పేరు కూడా పెట్టారు నాకు....ఇది నచ్చలేదు. పెంకెఘటం అంటారంతా" అంది భానుమతి పకపక నవ్వుతూ....

❀ ❀ ❀ ❀

ఫిలింస్టారు కావాలన్న ఉబలాటంతో బయలుదేరలేదు కాబట్టి అయిన రోజున అయ్యానని మురిసిపోలేదు. గర్వంతో విర్రవీగనూ లేదు. పెద్దలు కూడా ఆమెని అన్నల కన్న, చెల్లెళ్ళకన్న మిన్నగా 'స్పెషల్'గా పెంచలేదు. అందరికి మల్లేనే భయభక్తులతో క్రమశిక్షణతో పెంచి పెద్దచేశారు.



ఇలా, అన్నాచెల్లెళ్ళూ, అమ్మా నాన్నా, సంగీతం తప్ప ప్రపంచం ఏమిటో తెలియదు పధ్నాలుగేళ్ళ భానుమతికి. ఆమెకి బొమ్మల పెళ్ళిళ్ళు చెయ్యడమంటే ఎంతో సరదా. తాటాకు బొమ్మలూ, కొండపల్లి బొమ్మలూ బోలెడు పోగుచేసుకునేది.

వాటితోనే ఆడుకునేది. చిన్నప్పుడు ఆమె ఆశలూ, కలలూ కూడా బొమ్మల పెళ్ళిళ్ళ పంథాలోనే ఉండేవి.

"ఎన్ని వందల బొమ్మల పెళ్ళిళ్ళు చేశానో" అంది భానుమతి, ఆలోచిస్తూ, ఎన్ని వందలో అంచనా వేయ ప్రయత్నిస్తూ.

ఇప్పటికీ అంతే. బొమ్మలంటే ఎంతో ఇష్టం. ఏటా బొమ్మల కొలువు పెడుతుంది ఎన్ని బొమ్మలున్నా.

"ఆయన నవ్వేవారు. ఇన్ని పనులుంటే చిన్న పిల్లలా బొమ్మల ఆటలేమిటి? అనేవారు" అంటుందామె.

అందువల్ల నిత్యం తాటాకు బొమ్మలు కట్టుతూ, వాటికి అలంకారాలు చేయడంలో నిమగ్నమైన భానుమతికి మరో ధ్యాస ఉండేది కాదు. ఎన్నడూ ఆమె తల్లిదండ్రుల మాట జవదాటలేదు. కాదనలేదు. కాదన్నదల్లా ఒక్కసారే. అది ఆమె వివాహం విషయంలో.

"అది చిత్రమైన కథ. నాకు పవిత్రమైన కథ" అన్నది భానుమతి.

కృష్ణప్రేమ చిత్రం తయారవుతున్న రోజులు. భానుమతి తొలిసారిగా రామకృష్ణని చూసింది. ఆయన ఆ చిత్రానికి సహాయ దర్శకుడు. ఆయనకి ఎంతసేపూ తన పనేంటో, తన లోకమేంటో. మంచివాడు. ఆమాట అందరూ అస్తమానం చెప్పుకునేవారు అప్పుడూ ఇప్పుడూ కూడా అంతే.



ఈ మంచివాడు మంచివాడు అనే సర్టిఫికేటు పదహారేళ్ళ భానుమతిని ఆకర్షించింది. క్రమంగా ఆయనమీద గౌరవభావం ఏర్పడింది. ప్రేమ అనవచ్చు. అభిమానం అనురాగం అనవచ్చు. ఏమయితేనేం, ఈ అమ్మాయి తనకి తెలియకుండా ఆ అబ్బాయిని ఆరాధించసాగింది. ఈ కృష్ణప్రేమ సంగతి రామకృష్ణకి అంతకన్న తెలియదు.

ఈ సంగతి పసిగట్టినది, పనికట్టుకు కనిపెట్టినది భానుమతి చెల్లెలు.

"ఔను కాని అక్కా. ఒక్క సంగతి అడుగుతాను చెప్తావా?" అంది ఒకనాడు. భానుమతి చెప్పమంది.

"నీకు తెలుసునో లేదో నాకు తెలీదు గాని సెట్స్ మీద నువ్వెప్పుడూ ఆ అబ్బాయి కేసే చూస్తుంటావు" అంది చెల్లెలు.

ఈమాట నిజమైనా భానుమతికి ఈ వైనం తెలియదు.

ఆ సంగతే చెప్పింది చెల్లెలికి.

"పోన్లే నాకు తెలుసు. నేను రోజూ చూస్తూనే ఉన్నా. దొంగ దొరికింది" అందా అమ్మాయి నవ్వుతూ.

భానుమతికి కూడా తనలో ఉన్న దొంగ ఆరోజునే దొరికింది. భానుమతి ఆ దొంగని ఎక్కడికీ పారిపోనివ్వలేదు. అలా అని ఆ సంగతి ఎవరికీ చెప్పనూ లేదు. రామకృష్ణకి కూడా.

"కాని ఎన్నాళ్ళు..?...చివరికి ఒకరోజున అమ్మకి చెప్పాను. అమ్మ నాన్నకి చెప్పింది. నాన్నా నన్నడిగారు. నేను ఔనన్నాను. అమ్మా నాన్న కాదన్నారు. అమ్మ చెప్పిన కారణం...'ఆయనకి ఆస్తిలేదు' నాన్న అభిప్రాయం 'పోనీ పర్సనాలిటీ ఉండాలి కదా' అని. నేను...నేనేమనుకున్నట్లు...నేనేమనుకున్నా పెద్దవాళ్లు కాబట్టి అట్టే పట్టించుకోలేదు. చిన్నపిల్ల అన్నారు. మానాన్న మీద పూర్తి గౌరవంతోనే చెప్తున్నాను. ఆయనే కాదు. పెద్దవాళ్ళు అంతా ఇంతే. సదసద్వివేచక్షణా జ్ఞానం పిల్లలకి ఉంటుందని, వాళ్ళకి స్వంత అభిప్రాయాలూ, లక్ష్యాలు ఉంటాయనీ...చటుక్కున ఒప్పుకోరు..నేను అప్పటికి ఊరుకున్నాను" అంది భానుమతి.

అయితే వాళ్ళ నాన్నగారు ఊరుకోలేదు. రామకృష్ణ గారి తలితండ్రులతో ఈ విషయం ప్రస్తావించారు. వాళ్ళకి పెద్ద ఆస్తి ఏమీ లేదు. "మా అబ్బాయి చాలా మంచివాడు. బుద్ధిమంతుడు" అన్నారు మామగారు సగర్వంగా.

ఇది జరిగే వరకూ రామకృష్ణకి యీ విషయం ఏమీ తెలియదు. డైరెక్టరుగా పని నేర్చుకుంటున్న తను, ఒక కథకి హీరో అన్న వైనం ఏమీ తెలియదు. వెంకటసుబ్బయ్యగారికి తోచిన కారణాల వల్ల అప్పటి వరకూ ఆయన కృషి కూడా భానుమతి వంకకు వెళ్లలేదు.

వేరే సంబంధాలు చూస్తామన్నారు వెంకటసుబ్బయ్యగారు...తొలిసారిగా ఒకరి మీద గౌరవం, అభిమానం కుదిరిన తర్వాత, ఏ ఆడపిల్లకైనా మనసు మారదు. భానుమతికీ మారలేదు.

పెద్దలు నాడే జాతకాన్ని తిరగేయించారు. బహు యోగ్యుడు, సౌమ్యుడు ఆమెకి భర్త కాగలడని ఆ జాతకం ద్యోతకం చేసింది.

భానుమతి ఓర్పుతో రోజులు గడపసాగింది. కృష్ణప్రేమ చిత్రం పూర్తికావడానికి రెండేళ్ళు పట్టింది. భానుమతి లక్ష్యం ఫలించడానికి ఎనిమిది నెలలు పట్టింది. ఈ లోగా ప్రాణం విసుగెత్తింది కూడా. ఒకరోజున స్టార్ కంబైన్స్ అధిపతి శ్రీరామయ్య గారి భార్య శ్రీమతి కణ్ణామణికి ఈ సంగతి చూచాయగా తెలిసి, భానుమతిని చేరదీసి లాలనగా అడిగింది. భానుమతి మనసు విప్పి చెప్పింది. ఆపైన ఆమె రామకృష్ణకి కబురంపి అడిగింది. ఆయన కూడా దాపరికం లేకుండా సమాధానం చెప్పాడు.

   

కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని ఆర్యోక్తి. మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అని ఆంగ్లోక్తి!



భర్త రామకృష్ణతో భానుమతి

రావలసిన కల్యాణ ఘడియలు వచ్చాయి. అవి రావడానికి రెండు ఘడియలు ముందుగా, భానుమతికి, ఒక శ్రేయోభిలాషి ఇంటి నుండి ఒకసారి రమ్మని కబురు వచ్చింది. అలాగే రామకృష్ణకీనూ.

ఇద్దరూ అక్కడికి వెళ్ళాక, "మీకిప్పుడు పెళ్ళి" అన్నారు ఆ పిలువనంపిన కుటుంబంలోని వారంతా చుట్టూ చేరి.

"మా నాన్నకి చెప్పొద్దూ" అంది భానుమతి విస్తుబోయి. "అలాగే చెబుదాం" అన్నారు వారు. "అదేమిటీ... ఇలా హఠాత్తుగా ముహూర్తం ఏమిటి?" అన్నాడు రామకృష్ణ విస్తుబోయి. "అది అంతేలే ఘటన" అన్నారు వారు.

జార్జిటౌన్‌లోని ఒక దేవాలయంలో ఈశ్వర సమక్షాన, శుభముహూర్తాన శాస్త్రోక్తంగా, సలక్షణంగా, అయితే నిరాడంబరంగా వివాహం జరిగింది.

వధువు తల్లిదండ్రులూ, వరుడి తల్లిదండ్రులూ మాత్రం ఆ క్షణాన అక్కడ లేరు. అయితే పెళ్ళి అయిన ఉత్తరక్షణాన, వధూవరులు మధుపర్కాలతో, సరాసరి నాలుగు వీధులు అవతల వున్న భానుమతి ఇంటికి వెళ్ళి వందనం చేశారు. "నాన్నా, మమ్మల్ని దీవించు" అంది భానుమతి.

"నీకింత పట్టుదలయితే, నేను మాత్రం ఆపేవాణ్ణా తల్లీ, కన్యాదానం అన్యులు చేయవలసి వచ్చింది" అన్నారు వెంకటసుబ్బయ్య గారు కంటతడిపెట్టి.

"నాన్నా, నీ పట్టుదల, నీ ఆత్మవిశ్వాసం నాలోనూ ఉన్నాయి. అందుకే ఇలా స్వతంత్రించాను. దీవించు నాన్నా" అన్నది భానుమతి. ఆయన మనసారా దీవించారు.

❀ ❀ ❀ ❀

"ఒకరోజున ఆయన పెట్టిన విద్యాభిక్ష, ఆరోజున ఆయన దీవెన నా పురోభివృద్ధికి పునాదిరాళ్ళు" అన్నది భానుమతి తన పెళ్ళినాటి ముచ్చట్లు చెబుతూ. పెళ్లి అయిన నాటికి ఆమె "గరుడ గర్వభంగం" చిత్రంలో నటిస్తోంది. తరవాత ఆమె కొంతకాలం చిత్రసీమ నుండి విరమించుకుంది. మాంబళంలో బొమ్మరిల్లు లాంటి చక్కని ఇల్లు పదిహేను రూపాయల బాడుగకి తీసుకున్నారు, కాపురం పెట్టిన నవదంపతులు.

❀ ❀ ❀ ❀

భారత భాగవతాలు చదువుకుంది భానుమతి. సంప్రదాయాలను గౌరవిస్తుంది. మన్నిస్తుంది. శాస్త్రీయ సంగీతం అంటే ఆమెకు అభిమానం, గౌరవం. ఒకప్పుడు వాళ్ల నాన్నగారికి మాట ఇచ్చింది తను తీసే ప్రతి చిత్రంలోనూ శాస్త్రీయ సంగీతానికి స్థానం వుంటుందని, తాను ఒక్క కీర్తన అయినా పాడుతుందనీను. ఇతరుల చిత్రాలలో తాను పాల్గొన్నప్పుడు కూడా ఈ మాట నిలబెట్టుకోలేకపోయినా, తను నిర్మించే ప్రతి చిత్రంలో సంప్రదాయానుగుణమైన సంగీతం వుంటుంది. ఆమె ఒక కీర్తన గాని, వర్ణం గాని పాడుతుంది. హాస్యరస ప్రధానమైన చిత్రం "చక్రపాణి" ప్రారంభ సంగీతం కదన కుతూహల రాగంలోని కీర్తన, "రఘువంశ సుధాంబుధి".

కళారాధకురాలుగా ఆమె స్వేచ్ఛనీ, ప్రశంసనీ ఆపేక్షిస్తుంది. ఈ సంగతి తానుగా చెబుతుంది. వీటివల్ల మనస్సుకి ఆనందం ఉత్సాహం కలుగుతాయి అంటుంది.

పక్షిరాజా వారి "అగ్గిరాముడు", "మలై కళ్లన్" చిత్రాలు తయారవుతున్న సమయంలో, అవసరాన్ని బట్టి, భానుమతి సరిగా ఇరవై నాలుగు గంటలలో ఆరు పాటలు రికార్డు చేసింది, ఒక నిముషం కాలం, ఒక అడుగు సెల్యులాయిడ్ వృధాగా పోకుండా.

"నేను పాడడానికీ, నటించడానికీ ప్రత్యేకం కష్టపడి ప్రయత్నం ఏమీ చెయ్యను. నా కృషి ఫలితం బాగుంటుందని నామీద నాకు నమ్మకం ఉంది. ఇలా చెప్పడానికి నాకు జంకేమీ లేదు. ఫాల్స్ డిగ్నిటీ లాగే ఫాల్స్ మాడెస్టీ కూడా నాకు నచ్చదు" అంటుంది భానుమతి.

*(ఆంధ్ర వారపత్రిక - 1956)*

❋ ❋ ❋

బహుముఖప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన భానుమతి రచయిత్రి, గాయని, సంగీత దర్శకురాలు, నటీమణి, దర్శకురాలు, స్టూడియో అధినేత్రి, 1990ల వరకు నటిస్తూనే ఉన్నారు. సినిమాలు నిర్మిస్తూనే ఉన్నారు. ఎన్నో బిరుదుల, పదవులు ఆమెను వరించాయి. 'అత్తగారి కథలు'తో సాహితీ లోకంలో ప్రాచుర్యం పొందారు.

# సి. రామచంద్ర



ప్రొద్దున్న నిద్రలేస్తూనే అరచేతిలో శ్రీరామచుట్టుకు కళ్లకద్దుకు మరీ లోకాన్ని చూసేవారున్నారు; ఈనాడు లలిత సంగీత ప్రియులలో 'సీ–రామచంద్ర' చుట్టుకునేవారూ అనేకులున్నారు. 'లలిత సంగీతం' అనే మాటలో మొదటి మూడక్షరాలకూ వర్ణక్రమం అనిపించే క్రమంలో స్వరాలను అమర్చడం రామచంద్ర శిల్పం. అందమైన స్వరాలను అందంగా కలిపి హాయిగొలిపే వరసలతో ఒళ్లు పులకింప చేయడం ఆయన ప్రత్యేకత. రాగాలకూ రాగాలకూ 'పెళ్ళిళ్ళు' చేసి వాటితో మధుర సరాగాలాడించి ఆడుతూ పాడుతూ పాటలుచేసి పాడించి అందర్నీ మధుమధుర స్వరవశులనూ, పరవశులనూ చేయడం రామచంద్ర హాబీ, వృత్తి, జీవితం.

అందుకే ఆయన ఒక సందర్భంలో, "నేను సంగీతదర్శకుడిని కాను స్వరసమ్మేళన కర్తని" అని నమ్రతగా అన్నారు.

అయితే రామచంద్ర ప్రజ్ఞాప్రాభవాల విషయంలో, ఆవంతైనా అపశ్రుతిగా తోచే మాట అననివ్వని అభిమానులతో ఈ మాటని 'గిట్టనివాళ్ళే' కాక, సాక్షాత్తూ రామచంద్రే అన్నాడన్నా–

"ఏడిశారుపోదురూ మీ మొహం, మీకేం తెలుసు మిమ్మల్ని గురించీ" అనేస్తారు రామచంద్రపాటలా మృదువుగా.

ఇందులో కొంత నిజం లేకపోలేదు. ఆమాటకొస్తే కొంతకన్న ఎక్కువే ఉంది. రామచంద్ర చిత్రాల రద్దీనిబట్టీ, తనకిగల 'ఊహాపోహలను'బట్టి, డబ్బిచ్చేవారి అభిరుచులనుబట్టి కొన్ని సందర్భాలలో కేవలం వ్యాపార–సరళీస్వరాలమీదనే సినిమాపాటల వరసలు కట్టినా సృజనాత్మక ప్రతిభతో మనోహరమైన కృతులు ఎన్నో చేసి, సజీవ సంగీతానికి (శాస్త్రీయ విద్వాంసులది తదన్యమంటున్నట్లు భావించతగదని ప్రార్థన; నవ్యరచనా సృష్టివిశేషంగా, ప్రధానంగా జరుగుతున్న రంగం అని మటుకే పై వాక్యం హృదయం) వాటిని సమర్పించినవారిలో రామచంద్ర చితల్కర్ అగ్రగణ్యుడు. ప్రసాదగుణ లక్షణలక్షితమైన సంగీతం రామచంద్రసొత్తు. ఆయనచేతిలో స్వరాలన్నీ మంచివాడి మాటలా మృదువుగా, కొత్త పెళ్ళికూతురు సిగ్గులా మనోహరంగా, బాలసరస్వతి కంఠంలా మధురంగా, మబ్బుచాటు చంద్రుడి

కాంతిలా మెత్తగా, పగటి కలలా మత్తుగా ఉంటాయి. మంచి బాలుడు రాముాలా చెప్పినట్లువింటాయి. ఒకపాటలో (యాస్మిన్ లో అబ్ వో రాతే కహాం) ఒక్కొక్క పాదానికి ఒకటే స్వరం చొప్పున తీసుకొని - స్వరానికీ ఎడాపెడా అనుకుని ఆకుమాటు పిందెలా అందులో ఒదిగి ఉండే ఉపస్వరార్థాలచేత ఉపశ్రుతులు వేయిస్తూ అందమైన వరసకటాడు. పాటవెనకాల వాద్యాలతో రాగరేఖా చిత్రాలు రచించే విద్యలో నిష్ణాతులైన సజ్జద్, షఫీ మహమద్‌ల శిల్పంలో రామ్‌చంద్ర చెప్పుకోతగ్గ ప్రావీణ్యం గడించాడు. ఈ విషయంలో వారిద్దరిపై రామ్‌చంద్రకూ అన్యులకూ కూడా అమితమైన గౌరవం...

అయితే రామచంద్ర, ఒకపాట వినేవాడి మనసుకు పట్టడానికి, హుషారైన లయ సులభమార్గం అని గాని తప్పనిసరి అని గాని ఒప్పుకోడు.

ఒక వస్తువు తత్వాన్ని చెప్పడానికి, ఒక మానసికమైన ఒక స్థితిని వ్యాఖ్యానించడానికి రాగమే ముఖ్యం. స్వరాలే మాట్లాడగలవు. ఒక్కొక్కసారి అవసరమైతే లయను ఉపయోగించుకోవచ్చు అంటాడాయన.

మెత్తని పాటలు గుత్తకి తీసుకున్నాడు కాబట్టి, రామ్‌చంద్ర పాటలలో లయ, పంచకళ్యాణి గుర్రంలా పరుగులెత్తిందనుకోవడం పొరబాటు. రకరకాలఛందస్సులలో, గతులలో ఆయన పాటలు చేశారు. ఆయన పాటలలో ప్రధానంగా విశేషంగా కనిపించేది త్రిశ్రగతి. అయితే ప్రగతిశీలమైన బాణీలో దాన్ని ఆయన నడిపి, విశిష్టమైన రామచంద్ర మార్కు ఫణితిని ఏర్పాటుచేశాడు. రామచంద్ర పాటలకు తబ్లావాయించే 'లాల్' ఈ శిల్పానికి పట్టుగొమ్మ. ఎదురు తాళంలో లయ ఆరంభించి వినేవాడి గుండెఝల్లు మనిపించేలా పాటను ఎత్తుకోగల అసాధ్యుడితను. దాదాపు రామచంద్ర కుడిభుజం అంటారు. ఆయన ఎడమభుజం పేరు సుమంత్ రాజ్. ఈయన బేస్‌లో వేణువు పూరిస్తే అసలుపాటకి అరఫర్లాంగు అవతలవున్న ఆ నాదం మనని పాటకూడా వినకుండా ఆకట్టగలదు. లయగురించి మాట్లాడుకున్నప్పుడే శహనాయ్‌తో ప్రాణానికి హాయ్‌మనిపించే ఊపులతోపాట నడిపినవాడు కూడా రామచంద్ర అనే చెప్పుకోవాలి. 'శహనాయి' చిత్రంలో ఆజ్ బాజే శహనాయిలో ఈ వాద్యాన్ని చాలా సమర్థంగా వాడాడు. బిస్మిల్లాఖాన్‌సాహెబ్ శాస్త్రీయ సంగీత రంగస్థలంమీద చేసే అద్భుతాలలో ఇవి ఎన్నోవంతో కాకపోవచ్చు. వాటిలో శకలాలే కావచ్చు. సినిమాలోమటుకు ఇంతబాగా వాడింది (అప్పట్లో) ఈయనే. కొన్ని సందర్భాలలో రెండు క్లారినెట్‌లను మనోహరంగా కలిపి శహనాయికి దగ్గిరగా ఉందనిపించే కొత్తనాదాన్ని సృష్టించాడు. వీటినే స్థాయీభేదాలతో ప్రయోగించి గమ్మత్తు చేసి, వాటిమీద రామచంద్రముద్ర వేశాడనిపించుకున్నాడు. ఆఫ్రికన్ అటవిక సంగీతంలో చక్కటి డోళ్ల నాదాలను ఎత్తుకొచ్చి లలిత సంగీత బాణీలో ఇమిడ్చి అమర్చిన ఘనతకూడా రామచంద్రకే దక్కుతుంది. "సర్గమ్", "ఖజానా"లలో వీటిని బాగా వాడారు.

   

రామ్‌చంద్ర చితల్కర్ సినిమాకు చిరపరిచితుడు. నౌషాద్‌కు ముందువాడు. అప్పట్లో ఈ 'పేరూ', ప్రతిష్ఠాకూడా లేవు. ఆనాటిపేరు ఆర్. చితల్కర్, కొన్నాళ్ళు 'అన్నా సాహెబ్'గా ఉన్నాడు. దరిమిలా ఆర్. చితల్కర్‌లో ఆర్‌ను రామచంద్రగా సాగదీసి చితల్కర్‌ను 'సి'గా చితగ్గొట్టి సి. రామ్‌చంద్ర అయి ఊరుకున్నాడు. ఊరుకోలేదు – పుంజుకొన్నాడు.

కొత్తలో చితల్కర్ స్టంటు చిత్రాలకు (సుమారు ఒక డజను) సంగీతం సమకూర్చేవాడు. హాస్యనటుడు భగ్‌వాన్ ఆ చిత్రాల నిర్మాత, నటుడూను. ఆనాటివాటిలో 'నగ్మా–ఎ–సహారా' ఆనేదాంట్లో పాటలు బాగున్నాయనిపించుకున్నాయి. ఆ కాలంలోనే ఒక తమిళ చిత్రానికి కూడా ఈయన పాటలు చేశాడు. పదేళ్ల తరువాత ఆ భగ్‌వాన్, ఈ రామచంద్రలే తిరిగి కలిసి 'అల్బేలా' 'ఝమేలా' చిత్రాలను సృష్టించారు. వాటిలో రామచంద్ర, సంగీతరచనలో స్టంటులు అనతగ్గ అద్భుత విన్యాసాలను చేశాడనీ, అవి నభూతో న భవిష్యతి అనిపించుకున్నాయనీ ఒక రామచంద్రాభిమాని నమ్మకం.

జయంత్ దేశాయి తీసిన 'భక్తరాజ్' అనే చిత్రం రజతోత్సవాలు జరుపుకోవడంతో రామ్‌చంద్ర పేరు మారుమోగింది. ఆ ప్రాంతాలలోనే చితల్కర్ నుండి రామచంద్రకు పేరూ, స్టంటు ఫిలిం మ్యూజిక్ నుండి సాఫ్ట్ మ్యూజిక్‌కు ప్లేటూ మార్చేశాడు. ఆయన పాటలు చేసిన (సుమారు 50) చిత్రాలలోను 18 చిత్రాలు రజతోత్సవాలు జరుపుకొన్నాయి. మిగతా వాటిలో కొన్ని అతి విజయవంతంగా (సంగీతం సహా) దెబ్బతిన్నాయి. ఆయన సొంతంగా తీసిన చిత్రాలు ఝంఝార్, లహరేఁ, దునియా గోల్ హై చిత్రాలు మూడూ – షిన్‌షినాకీ బబ్లాబూ చిత్రంలో 'తుమ్ క్యాజానో తుమ్హారీ యాద్ మేఁ హం కిత్నారోయే' అనే పాట ఎంత జనాదరణ పొందిందో అంత అనాదరణ పొందాయి.

ఐనా కొన్ని పాటలు చాలా బాగున్నాయి. ఈ పాట– 'తుంక్యా జానో' అనేది రామ్‌చంద్రకు కూడా అభిమాన పాత్రమైనది. ఇలా చాలామందికి అభిమాన పాత్రాలు అయినవీ, కాగలవీ చెప్పుకోడం మొదలుపెడితే, చాలా తేల్తాయి. ఉన్నవాటిలో గొప్పగా చెప్పుకోతగ్గవి: పర్‌ఛాయ్ చిత్రంలో లతా, తలత్ బృందం పాడిన దిల్ దిల్ సె కహ్‌రహాహై. ఇందులో క్లారినెట్ మీద స్వరాలను పాట అంతటా అల్లుకు పోవడం విశేషం. ఈ చిత్రంలోనే బాగుందనిపించిన మరి రెండు పాటలు– తలత్ పాడిన 'మొహొబ్బత్ హీ న జో సమ్‌ఝే', లతా పాడిన కట్ తేహై దుఖ్‌మేఁ యేదిన్ అనే మరో పాటలో వాద్య సమ్మేళనం సరికొత్త పద్ధతిలో పాటను అనుకరించింది. శాస్త్రీయమైన బాణీలలో రామచంద్ర పాటలు దాదాపు అన్నీ పండితుల మన్నన, లలితసంగీతప్రియుల ప్రశంసలూ అందుకొన్నాయి. అనార్కలీలో లతా పాడిన మొహబ్బత్ ఐసీ ధడ్‌కన్ హై, హేమంతకుమార్, లత పాడిన జాగ్‌దర్ద్ ఇష్క్‌జాగ్, లతా హేమంత్ జిందగీ ప్యార్‌కి దోచార్ ఘడీ హోతీ హై, పర్ఛాయిలో మొహొబత్ హీ నజోసమఝె (తలత్), తుంక్యాజానో తుంహారి యాద్ మే

(షిన్‌షినాకీ). ఆజాద్‌లో నా బోలె నా బోలె నా బోలేరే (లత), జారీ జారీ ఒ కారీ బదరియా (లత), సర్‌గమ్ చిత్రంలో ఛేడ్‌సఖీ సర్‌గమ్ (లత) తినక్ తిన్‌తనీ (లత), పప్లీ ఝులక్‌లో కైసీ ఆయె సఖీరితి సావన్‌కీ ఈ కోవలోవి. జైకృష్ణహరే (శహనాయి), కహాఁ బజాయే బాఁసూరీ (నాస్తిక్), బాఁసురియా బోలే (ఇన్సానియత్), బాఁ సురివాలా కహాఁ కలా(భక్తరాజ్) మొదలైన భక్తిరస ప్రధాన గీతాలు అంత పనీచేసి పాడినవాడిలో, వినేవాడిలో సద్భావాలను కలిగిస్తాయి.

దేవత చిత్రంలో జమునాకేతీర్ అనే పాట లతాంత కోమలమైన స్వరాలతో అమరి లతామంగేష్కర్ మంగళ గళంలోంచి మధురంగా ప్రవహించింది. అయితే ఇది దాదాపుగా ఖాన్‌సాహెబ్ అబ్దుల్ ఖారీమ్‌ఖాన్ స్వరఝరిలోంచి సినిమాలోకి ఒరిగిన రసధుని. పాటలో గోపిక హృదయాన్ని కరీంఖాన్‌సాహెబ్ ఆవిష్కరించినంత మనోహరంగా మరొకరు చేయలేరని ఒకవంక అనిపించినా మరొక వంక లతామంగేష్కర్ పట్లకూడా మనకు గౌరవభావం కలుగుతుంది.

మొత్తంమీద శాస్త్రీయ రాగాలలో స్వారస్యాన్ని బహుళ ప్రజానీకానికి అనేక రూపాల, రూపాంతరాల అందించిన రామ్‌చంద్ర విదేశీయ సంగీతంలో గుణదోషాలను కూడా పట్టుకొచ్చి అమ్మచూపాడు. వాటిలో కొన్ని రాణించాయి. కొన్ని బాగులేవనిపించాయి. హాయిగొలిపే హవాయి సంగీతాన్ని అందంగా కలిపిన పాటలలో ఎన్న తగ్గది: యాస్మిన్ చిత్రంలో లతాపాడిన 'అబ్ వో రాతే కహాఁ'. రాత్రివేళ ప్రవర్తిల్లే ప్రశాంతతను, నిశ్శబ్ద సౌందర్యాన్నీ ఈ పాట తనలో నిలిపికొని శ్రోతలను పరవశులను చేసింది. పాట మొత్తంమీద ఈ ఘనకార్యం సాధించినది అనుశ్రుతిగా వచ్చిన వయొలిన్.



అనార్కలిలో బీనారాయ్, ప్రదీప్ కుమార్



షహనాయ్

ఆఫ్రికన్స్ లయలనూ, హవాయి సంగీత రీతులను మేళవించి అల్లిన గీతాలలో షిన్‌షినాకీ బబ్లాబూ, సౌదాగర్‌లో గుల్ గులేరా, సర్‌గమ్‌లో మొంబాసా, యార్ వైవై, ఖజానాలోని బంబీనా, బాబ్డీ బూబ్డీ అల్‌బేలాలోని దీవానా పర్వానా (రామచంద్ర బృందం) చెప్పుకోతగ్గవి. రొమాంటిక్ చిత్రం 'ఆశా'లో ఈనామీనాడీకా అనే రాకెండ్రోల్ పాటా, కారిగార్‌లో మైహుం రోజీకూడా ఈయన పేరనే జమపడి ఉన్నాయి. షిన్‌షినాకీ బబ్లాబూ అనే పాటను లతాతోకలసి రామచంద్ర స్వయంగా పాడాడు. రామచంద్ర సంగీతం గురించి చెప్పుకున్నంత గొప్పగా పాట గురించి చెప్పుకోలేకపోయినా, ఈ పాట బాగుందనే అనవచ్చు. ఇదీ ఖజానా చిత్రంలోని బాబిడి బూబుడీ అ మరో పాటా కలిపి ఒక రికార్డుగా (భారతీయ సినిమా సంగీత చిత్రంలో తొలిసారిగా) విదేశీ మార్కెట్‌లో విడుదల అయ్యాయి.

కవాలీమార్కు పాటలలో ఖిడ్కి చిత్రంలోని జల్నేవాలే జలాకరే (షంషాద్), పెహ్లీఝులక్‌లోని ముహబ్బత్‌నే ముఝె మారా ఉత్సాహకరమైనవి.


షిన్‌షినాకే బబ్లూబూ

అల్బేలాలో జోలపాట ధీరేసే ఆజారే (లత) ఆనాడు దేశమంతటా నోనోటా వినబడింది. సినిమా సంగీతానికి లాలిపాటలలో ఇది విప్లవంతెచ్చి ఒక శకాన్ని ఆరంభించింది. ఒకటే ఒక్క వయొలిన్‌తో బంగారు తీగెలాటి లతాకంఠంతో 'మ్యూజిక్‌లో మాజిక్' అనిపించేటంత సులభశైలిలో ఆయన ఈ పాట చేసాడు.

నిరాడంబరంగా సూటిగా ఉండి అమాయకత్వమల్లె మనసులో చిరముద్ర వేసుకుని ఆప్తమిత్రుడిలా మనవెంటనే వచ్చే పాటలలో నిరాలా చిత్రంలో లతాపాడిన మెహఫిల్‌మే జల్‌ఉఠీ షమా, మజ్‌బూర్ ఆంఖే, మీనార్‌లోని బర్‌బాద్ మొహబ్బత్ మెరీ చెప్పుకోవాలి. చివరి పాటలో లయ విశిష్టంగా కొత్తగా ఉంటుంది. పెహ్లీఝులక్‌లో నమారో నజరియాకే బాన్ (లత), 'సుబాకాతారా'లో గయా అంధేరా హువా ఉజలా (తలత్, లత), శత్‌రంజ్‌లో బద్లీ మె ఛుప్పీ (హేమంత్, లత), అమర్‌దీప్‌లో దిల్ కీ దునియామే (లత) చాలామందికి యిష్టమైన పాటలు. తలాక్ చిత్రంలో అనురాగోదయానికి స్వరరూపకల్పన అనతగ్గ మధుమధురమైన పాట 'బోల్ తుమ్ కౌన్ హో?' ఆశా, మన్నాడే, మొత్తం సినిమా పాటలన్నిటా గొప్పవనిపించుకునే వాటిలో నిలుస్తుంది. ఆ పాటకి వాద్యసమ్మేళనం అనురాగాన్ని విశ్వజనీనంగా ఆలపించింది. ఈ చిత్రంలోనే "సంభల్‌కె రెహనా అప్నె ఘర్ హో..." అనే మరోపాట ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రశంసలుకూడా అందుకొందిట.

తీయనిబాధని ఆలపిస్తూ హృదయాన్ని కదిలించి రసార్ద్రంచేసిన గీతాలు కనీసం రెండైనా ఉన్నాయి. వాటిలో నౌషర్వానే ఆదిల్ చిత్రంలో రఫీ, లతాపాడిన 'భూల్ జాయే సారె గమ్' ఒకటి. అనార్కలీలో నాయిక నిస్సహాయతను పోషిస్తూ లతాపాడిన "ఆజా అబ్‌తో ఆజా మెరికిస్మత్ కె ఖరీదార్" మరపురానిపాట. నాస్తిక్‌లో కూడా ఇదే వస్తువుగల పాట ఉంది. మానవుడు నిస్పృహచెంది, ఏమీ యిది స్వామీ అని ముఖాముఖిన సంగతి అడగబోయేవేళ లత పాడిన 'అరె పత్థర్‌కె భగవాన్' పాట అంతా, ముఖ్యంగా అది అటుతిరిగి ఇటు తిరిగి పెద్ద గాంధారంమీద ఆగిపోయేక్షణాన, ఆ గాంధారంలో రామ్‌చంద్ర, ఆ వ్యక్తి నిస్సహాయతనంతా పూరించగలిగాడు. సంగీత శాస్త్రంలో సాధకబాధకాలు ఎరిగినవారు ఇది చిన్న సైజు అద్భుతం అంటారు. రామచంద్ర విద్య అంతా ఈ పాటకు ప్రాతిపదిక అయిన 'సి మేజర్ స్కేల్' మీదకు (కర్ణాటకలో శంకరాభరణ మేళం అంటారు) నిలబడి సాగిందనవచ్చు. కొందరు కొందరు ఒక్కొక్క మేళకర్తను ప్రధానంగా తీసుకుని సొంతం చేసుకుని దాన్ని కామధేనువులా వాడుకుంటారు. రామచంద్ర పాలిట కామధేనువు ఈ శంకరాభరణమేళ నవాలి.

రామచంద్ర ఇప్పటికి దాదాపు 50 చిత్రాలకు సంగీతం కూర్చాడు. వీటిలో కొన్ని పాటలు ఏమాత్రం చర్చించ తగ్గవి కావు. పాశ్చాత్య సంగీతానికి అనుసరణలో అనుకరణలో ఎన్నో ఉన్నాయి. వీటిలో బాగులేనివి ఉన్నాయి. తనని తనే అనుకరించి ఈ పాట పల్లవిని ఆ పాట చరణానికి, ఆ పాట చరణాన్ని లేదా అందులో ఆర్కెస్ట్రా బిట్‌ని ఇంకోపాట పల్లవికి వాడిన సందర్భాలున్నాయి. వ్యాపారవు వత్తిళ్ళను బట్టి ఇష్టం లేకపోయినా కొన్ని అలా చేశాడు. ఒకసారి ఒకపాట రికార్డు చేస్తు 'ఇలా కనక ఇంకాసిని రోజులు పాటలు కడితే తరువాత నన్నెవ్వరూ పిలవరు" అనేశాడు ఆ నిర్మాత మొహం మీదనే.

రామచంద్రతత్వం అలాటిదని అతన్ని బాగా ఎరిగినవారు చెబుతారు. వ్యక్తిగా అతడు ఉత్సాహానికి భౌతికానువాదం. నిత్యసంతోషి. స్వర సర్వస్వాన్ని మథించి అమృతప్రాయమైన మధురశ్రుతులు కల్పించాలని నిత్యం మధురమైనబాధలో మునిగితేలుతూ నవ్వుతూ నవ్విస్తూ ఉంటాడు. అందుకే రామచంద్ర హుషారైన పాటచేసినపుడు, మిత్రులు "దాదాపు నీ అంత హుషారుగా ఉంది బ్రదర్" అంటారు.

***(ఆంధ్ర-వారపత్రిక - 1959)***

> 1960 వరకు అగ్రశ్రేణి సంగీతదర్శకుడిగా ఉన్న రామచంద్ర డిమాండ్ క్రమంగా తగ్గింది. తొలిదశలో లతామంగేష్కర్‌చే అనేక అద్భుతమైన పాటలు పాడించినా వారిద్దరికీ పేచీ వచ్చింది. చితల్కర్ పేరుతో పాటలు కూడా పాడిన రామచంద్ర కొన్ని తెలుగు సినిమాలకు కూడా సంగీతం సమకూర్చారు. ఈ వ్యాసరచన తర్వాత 'నవరంగ్' (1959) 'స్త్రీ' (1961) 'బహూరాణీ' (1963) సినిమాలు ఎన్నదగినవి.

సినీవస్తు రమణీయం

# సినిమాలో మనిషి - తెరవేలుపు

చిలకలపూడిలో ఉన్న చిన్నదానికీ చిన్నవాడికీ భూలోక స్వర్గంలా కనపడే సినీ లోకంలో నటీనటులనబడే యావన్మందీ దేవతలుగా కనిపిస్తారు. డిస్టెంట్ లాంగ్ షాట్‌లో చూచే ఈ ఆశాపూరిత లోచనులకే గాక, చెన్నపట్నంలోనే ఉంటూ, సినిమాలు తీసే వారికి కూడా వీరు దేవతలుగా కనిపిస్తారు, విద్యుద్దీపాలలా ప్రకాశిస్తారు. ఎటొచ్చీ ఈ దగ్గిరవారి దృష్టిలో విద్యుద్దీపాలుగా వెలిగే శాల్తీలు రెండే. మహా అయితే మూడు. వీటినే నటీనటులు లేక హీరో,హీరోయిన్‌యి అంటారు. మిగతా నటాళి అంతా ఓ మోస్తరు హరికేన్ దీపావళి లేదా కోడిగుడ్డు దీపావళీను.

తెరలోక వేలుపులకు, సురలోక వేలుపులకూ పోలికలు బోలెడున్నాయి. మాట వరసకి ఆ వేలుపులు అనిమిషులు; ఈ తెరవేలుపులు రోజుకి 48 గంటలు మేలుకుని సెట్‌మీద పనిచేస్తూ వుంటారు గాబట్టి వీరినీ ఆ దేవ లక్షణ లక్షితులని చెప్పుకోవచ్చు. కాలమానంలోకూడా కొంత పోలిక వుంది. మామూలు మానవుల కాలమానం ప్రకారం మూడు నాలుగు ఏళ్లు కొందరికి ఒక సంవత్సరం అవుతుంది. ఉదాహరణకు బొంబాయిలో ఒక సినిమావతికి 22వ సంవత్సరం నడుస్తోంది అంటే నాలుగేళ్ళుగా 18వ ఏడు కొనసాగుతోంది.

దేవతలకథలు చాలావరకూ ఒకే పంథాలో నడుస్తాయి. ముందర నవ్వుతూ పాడుతూ ఉంటారు. రాక్షసు డొస్తాడు. లేదా ఇంద్రుడు శపిస్తాడు. అక్కడి నించి కొంచెం బాధలు పడతారు. చివరికి దానవ సంహారం; దేవేంద్ర శాపోప సంహారం జరుగుతుంది.

తెరవేలుపులు కనబడే సినిమా కథలకి చిరకాలంగా ఇదే వరవడి. దేవతలు చాలామంది ఉన్నారు. అక్కడ పాత్రలలో వైవిధ్యం, ఉంటుది. ఇక్కడి బాక్సాఫీసు దేవతల సంఖ్య పరిమితం కాబట్టి ఆ అవకాశాలు ఇక్కడ తక్కువ. ఆదిమధ్యాంత రహితాలయిన కథారాజాన్ని తలయున్ దోకయులేని పాత్రలో పోసినట్టు, ఒకేజాతి సంతానంలా, ఒకేవిధమైన అవతరించడానికి ఆధారం ఈ తెరవేలుపులే.

ఇందుకు నిదర్శనం ఇన్నాళ్లు మనం చూసిన, ఇపుడు చూస్తున్న అనేక చిత్రాలే. వీటన్నిటి కథలను, వీటిలో పాత్రలను ఉమ్మడిగా మూడుముక్కల్లో ఇలా చెప్పుకోవచ్చు:

అనగాగనగా ఒకరాజు, లేదా ఒక రైతు అతనికి ఒక నాగేశ్వరరావు. లేదా దిలీప్ కుమారుడు. ఆ ఊళ్లోనే (అనగా బొంబాయి లేక మద్రాసు) ఒక జమీందారు, లేదా గుమాస్తా. అతగాడికొక అంజలీ, బొంబాయి వాడయితే మీనాకుమారి, ఇది ప్రాతిపదిక.

ఆ తరవాత కుహూకుహూమనే కోయిలలూ, సరంజామాతో ఏమోయీ ప్రేమోయీ అంటూ పాటలూ వగైరా. ఇంతట్లోకీ, కష్టాలూ దుఃఖం కలిసి ప్రాణ్, కె. ఎన్. సింగ్, లేదా గుమ్మడి, వేషం వేసుకుని పైప్ కాలుస్తూ విలన్‌లా చూస్తూ వస్తాయి.



హిందీ సినిమా విలన్ ప్రాణ్

ఇది కథకి పెట్రోలు, దీని సహాయంతో ఈ పాతకథ, డొక్కు కారులా (ముందుకో వెనక్కో) నడుస్తూ ఉంటుంది, అంతలో, పాటలో దాన్సులో అడ్డుపడి ఠకీమని ఆగి ఊరుకుంటుంది.

తరవాతి కథ ఏం కావాలో తేల్చుకునేలోగా కాస్తహాస్యం. ఈ హాస్యగాడు హీరోకి చెలికాడు. ఇతగాడి భార్య, లేదా ప్రేయసీ ముమ్మూర్తులా సూర్యకాంతం అనగా గయ్యాళి.

❀ ❀ ❀ ❀

పరిస్థితులు ఇలా తయారుకావడానికి నటీనటులు ప్రధానంగా నిమిత్తమాత్రులే తప్ప కారకులు మటుకు కాదని గమనించడం అవసరం అందుకు బాధ్యులు అసాధ్యులైన సినిమా పెద్దలు. ప్రజా హృదయము, లేక బాక్సాఫీస్ హృదయమును క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నాననుకొనేవారూ, అనేవారూను.

ఎందుకంటే, రకరకాల పాత్రలు, విలక్షణమైన పాత్రలూ, నిర్వహించి, తమబహుముఖ ప్రతిభను ప్రదర్శించాలనీ, కళలో పరాకాష్ట అనే స్థాయి సరిహద్దులు దాటకపోయినా, దరిదాపులకైనా చేరాలనీ నటులు సర్వదా అభిలషిస్తారు. ప్రగాఢంగా వాంఛిస్తారు.

అయితే, నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు వారివల్ల దర్శకులూ, కవులూ అంతా చేరి ముందు నిర్ణయించుకున్న నటీనటులనే ఆధారం చేసుకొని పాత్రలకు రూపకల్పన చేస్తారు; సంఘటనలు కల్పిస్తారు. కథలు నేస్తారు. ప్రసిద్ధికెక్కిన రచయితల కథలు తీసుకొన్నా, వాటిని ఉన్న నటీనటుల స్వతస్సిద్ధమైన స్వభావాలకీ, తీరు తెన్నులకూ ఒడ్డూ పొడుగులకూ, కుదించి, కథలు కాస్త సాగదీసి, లేకపోతే అప్పడాలు వత్తి ఎలాగో అలాగ సర్దేస్తారు.

కొత్త రకమైన భూమిక లభించబోదనుకున్న నటుడు తీరా వేషంకడితే అది మామూలు, మాసిపోయిన పాత వేషమేనని గ్రహిస్తాడు.

ఈ విధంగా, తమ కోరిక ఈడేరక ఈ నటీనటులు, ఆ పళంగా చెలరేగి తమకు తోచిన రీతిని, ఓపిక మేరకు ఆ పాత్రలను మరింత అపాత్రం చేయడానికి వడికట్టడం జరుగుతుంది.

*(ఆంధ్ర-వారపత్రిక - 1956)*

# కథా - కమామిషూ

నటన, చిత్రణ, ఛాయాగ్రహణం మొదలయిన విభాగాలన్నింటా స్థాయి నానాటికీ పెరుగుతూ వుండగా,కథల విషయంలో తెలుగు సినిమా వెనకబడుతూ ఉండడం శోచనీయమని అంతా అంగీకరిస్తారు. ఈనాటి సాంఘికాల తరహా చూడగా ఏనాటి జానపదాలో అనిపిస్తుంది. జానపదాలు అనడం మహాపాపం అని కాదు; మంచి జానపదాలు స్వాప్నిక జగతికి ద్వారాలు తెరిచి ప్రేక్షకుడిని షికారు తీసుకెళ్లగలవు. వీటిలో ఆ రుచీ, వెచ్చదనమూ వుండవు. కాగా, సిసలైన జానపద గాథలకు ఉండే అందచందాలూ,స్ఫుటమైన రూపురేఖలూ, తలాతోకా కూడా సవ్యంగా వుండవు. చొక్కా, లాగూ తొడిగి లీలా మోహన్ అని ఒకళ్ళ నొకళ్ళు పిల్చుకుని "నన్ను అర్థం చేసుకోటం లేదు" లాంటి మాటలు అన్నంత మాత్రాన అవి సమకాలిక జీవితాన్ని ప్రతిబింబించవు. సాంఘిక చిత్రాలు అనిపించుకోవు.

కథావస్తువు నిర్ణయం దగ్గరనించి, కథ కట్టుకు రావడం దాని గమ్యస్థానం ఇదమిత్థమని ఏర్పరచడం వరకు అంతా ఏనాడో ఎవరో పోసిన మూస ఆధారంగానే జరుగుతోంది. సినీ జన పరిభాషలో 'ట్రీట్‌మెంట్' అనబడే యజ్ఞంలో కథాంశం, సజీవమైన పాత్రలూ, సమర్థుల నటన మొదలైనవన్నీ కృష్ణార్పణం అవుతున్నాయి. ఆదిలో మంచివనిపించుకున్న కథలు కూడా ఈ 'సినీవైద్యం' పూర్తి అయేసరికి అందవికారంగా తయారవుతున్నాయి.



ఇందుకు ఏ ఒకరూ బాధ్యులు కారనడం సరియైన జవాబు కాదు. ఒక్కొక్కసారి ఏ ఒక్కరో మాత్రమే బాధ్యులు కాకుండా ఉండడమే కారణమనిపిస్తుంది. మొత్తానికి ఎవరు బాధ్యులైనా కాకపోయినా, నేటి చిత్రాలు చూస్తూ ఉంటే సామర్థ్యం లేకపోవడం మటుకు కారణంకాదని గట్టినమ్మకం కలుగుతుంది.

'సినిమాకథ' అనే దానిపట్ల చలనచిత్రకారుల వైఖరి మారాలి. పరిపాటి అయిన పద్ధతులు మారాలి. కొత్తపద్ధతి అనగానే, దాన్ని అనుమానంతో చూసేతత్వం పోవాలి. ఈ వాక్యాలు బొత్తిగా నీతిగీతలుగా, నినాదాలుగా కనిపించినా వినిపించినా అందుకు ఈ వాక్యకారుడు బాధ్యుడు కాదు. ఒక్కొక్క కొత్త చిత్రం వచ్చినప్పుడు, చూస్తున్న పెద్దమనుషులు ఎందరో ఆరంభంలోను, మధ్యలోనూ, చివరా, ఇంకా ఎక్కడ పడితే అక్కడా

వెలిబుచ్చే భావాలకు ఇవి అక్షరానువాదాలు. పరిస్థితులు వాదప్రతివాదాల స్థాయి దాటిపోతే నిస్పృహవల్ల ఆ వాదాలే నినాదాలు అవుతాయి. చలనచిత్రకారులు ఏమనుకున్నా, సినిమా చూడవచ్చేవాడు మొదట్నించి చివరదాకా శ్రద్ధగా గమనించేది కథనే. దాని నడక, దాని తీరూ మాత్రమే అతడి ఆసక్తిని ఆకట్టి నిలబెట్టేవి. ఇదే మిగతా వాటికి ఆలంబనం, ప్రాతిపదిక. ఈ సత్యాన్ని, బొత్తిగా మంచి చిత్రాలు తీసేవారే కాక, సిసిల్ బి.డిమిల్ వంటి బాక్సాఫీసు నిర్మాతలు కూడా మన్నించారు.

నాలుగు డాన్సులూ, వాళ్ళనీ వీళ్ళనీ కోప్పడే మాటలు నాలుగు, పాటలూ రెండూ ఉన్నంతసేపూ కథ ఎలాపోయినా ఫరవాలేదన్న ధోరణి సరికాదు. ఒకపాటలో అపశ్రుతి పలికితే, శ్రోత ప్రాణం ఎలా విలవిలలాడుతుందో అలాగే సినిమా కథలో తప్పటడుగుపడినా, ఆగిపోయిన కథ క్రూరంగా సాగిపోయినా, నడుస్తున్న కథ హఠాత్తుగా ఏ పాటకో డాన్సుకో మూర్ఛపోయినా, ప్రేక్షకుడికి ప్రాణం చివుక్కుమంటుంది. ప్రతిచిత్రంలోనూ పదే పదే అదేవిధంగా జరిగితే చికాకు, బాధ కలుగుతాయి. ఇలాటి భావాలు చాలా మందికి కలగడంవల్ల సంభవించిన ఫలితాలు ఏమిటో, కథతప్ప మిగతావన్నీ బాగున్న చిత్రాలు తీసినవారికీ, చూసినవారికీ తెలుసును....

అయినా ఈనాడు కథ ప్రాధాన్యం క్రమేపీ తగ్గి, దానిపట్ల నిర్లక్ష్యం పెరుగుతున్నట్లు కనిపిస్తుంది. దాదాపు నూటికి తొంభై కథల మాతృకలు కేవలం నటీనటుల పేర్లు "మొన్నటి" హిట్ చిత్రాలూ అందులో బాగున్నాయనిపించుకున్న పాత్రలూను. ఈనాడు చాలామంది రచయితలను కేవలం మాటలు, పాటలు రాయడానికే వినియోగిస్తున్నారు. తత్ఫలితంగా కథలు ప్రజల జీవితంలోంచి రావటంలేదు. కేవలం తాజా హిట్ చిత్రాలకి పుట్టుతున్నాయి. బాక్సాఫీస్ సూత్రాల మధ్య పెరుగుతున్నాయి. బాక్సాఫీసు డైలాగులు తొడుక్కు ఇవతలికి వచ్చేస్తున్నాయి. అవి వాటికి సరిపోతాయా లేదా అనికూడా చూచుకోవు.

దానాదీనా క్రమేపీ, కథలకు కరువనేది మళ్ళీ పుంజుకుంటూంది...

బాధ్యతగల పెద్దలు ఈ దుస్థితి నివారించడానికి గట్టిగా ప్రయత్నించడం పరిశ్రమలకు శ్రేయస్కరం.

హాలీవుడ్‌లో కథలకు లక్షలకొద్దీ డబ్బులు ఖర్చు పెడతారు. పెద్ద పెద్ద రచయితలు నవలూ నాటకాలూ రాసిపూర్తి చేస్తూ వుండగానే బేరాలు జరిగిపోతాయి. జాన్ ఒమారా ఇప్పుడే పూర్తిచేస్తున్న కొత్త నాటకం 'ఫ్రం ది టెర్రెస్"ను లక్ష పై చిలుకు డాలర్లకి కొనడానికి ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్‌వారు బేరం చేశారు.

మన సినిమా పరిశ్రమలోనే సమర్థులైన రచయితలు, కష్టసుఖాలు తెలిసిన వారు ఎందరో ఉన్నారు. సినిమా అవతల పెద్ద పెద్ద రచయితలు ఎందరో ఉన్నారు. కథారచన ఘట్టానికి ఇతోధిక ప్రాధాన్యం ఇచ్చి, వారి ప్రజ్ఞను వినియోగించుకుంటే, కొత్త కొత్త కథలు వస్తాయి. తెలుగు సినిమా అవధులు పెరుగుతాయి. కొత్తదారులు కనిపిస్తాయి. కొత్త పద్ధతులకు, శిల్పానికి అపుడే అవకాశం ఏర్పడుతుంది.

*(ఆంధ్ర వారపత్రిక - 1950)*

# బాలల చలనచిత్రాలు 'ప్రజాపిల్లల'కు కూడా చూపించాలనుకుంటే

# మాటుమార్చాలి

బాలలు అనగా ఎవరు?

ఢిల్లీ, ముంబై, చెన్నై, కలకత్తాల్లో వుండే పిల్లలు. అవసరాన్ని బట్టి హైద్రాబాద్, బెంగుళూరు, తిరువనంతపురాలలో కూడా వుండబడతారు.

ఇంతేనా?

మరి, పట్టణాలలో, గ్రామాలలో, మన్యం ప్రాంతాల్లో వుండే కోట్లాది మంది పిల్లలో?

వాళ్లంతా ప్రజలు గదా! జనసామాన్యం.

❀ ❀ ❀ ❀

భారత రథసారధి చాచానెహ్రూ నలభైయేళ్ల క్రితం - తన మేనపిల్లల కోసం సినీమాలు తీయించాలనుకున్నారు. నేరాలూ, ఖూనీలూ, ఏడుపులూ లేకుండా పిల్లల కోసం హాయిగా, సరదాగా వుండే చిత్రాలు తీయమని చెప్పి ఒక సంఘం పెట్టించి, దానికి డబ్బు ఏర్పాటు చేశారు. అయితే - ఆ సంఘం సారథులు పూర్తిగా - 'అపార్థ' సారథులై నడిచారు. పిల్లలు అంటే, పైన చెప్పిన ఢిల్లీ ఇంగ్లీషు పిల్లలనే అనుకున్నారు.

ఎనిడ్ బ్లైటన్‌లూ, నాన్సీడ్రూలూ, కొన్ని జంగిల్ అడ్వెంచర్లూ తీశారు. బోలెడు ఫారెన్ చిత్రాలు కొన్నారు. డబ్బింగ్ చేశారు.

కాని-

అవి అక్కడ వేశారు? ఎవరు చూశారు?

"అదే!... బలేవారే!... టొరాంటో, ఉగాండా, కాన్, గీన్, సిడ్నీ, గిడ్నీ, ఫెస్టివల్స్‌లో వేశాం. మనకి ఎన్నో అవార్డులూ, డిప్లమో సర్టిఫికేట్లూ వచ్చాయి., అంతర్జాతీయ విపణి వీధిలో భారత జెండా ఎగరేశాం. అన్నట్టు, మన స్కూళ్ళలో కూడా వేయించాం." అన్నారు గర్వంగా.

ఇదీ తేలిన ఫలితం. నిజానికి వాళ్ళ తప్పుకూడా కాదు.

ఇక్కడ ఈ దేశంలో బాలల చిత్రాలు వెయ్యడానికి థియేటర్స్ లేవు మరి, పెద్ద హాలుకి అద్దె చాలా ఎక్కువ. సరే అనివేసినా వాటికి హాలు కిరాయి కూడా రాలేదు. 'మనవడు మనువో' అని గోలపెడుతుంటే తాత మూడో పెళ్లికోసం తంటాలు

పడ్డాడని ముతక సామెత. మహామహా ఆర్టు పిక్చర్లకే హాలు దొరక్క ఇదౌతుంటే ఈ బాల చిత్రాలకి ఎవడిస్తాడట?.....

ఇదీ వరస... ఇదీ పరిస్థితి....




భారతీయ (?) బాలలచిత్రాలని భారతదేశంలో కూడా ఎక్కడో అక్కడ ఆడకపోతే మరీ బావుండదనుకున్నారు. వాళ్ళంతట వాళ్ళు టిక్కెట్టుకొని హాలు కొచ్చి చూడకపోతే. మనమే స్కూలు కెళ్లి చూపించేద్దాం అని పథకం వేశారు. సూక్ష్మంలో మోక్షంగా ఒక ఉపాయం వేశారు. ఇవన్నీ 16 మిల్లీమీటర్లు ప్రింట్లు తీసి, కొన్ని ఊళ్ళలోని స్కూళ్ళకి పంపి, ఒక 'జీవో', ఓ సర్క్యులర్ పంపారు. ఫలానా శనివారం సాయంత్రం స్కూల్లో బాలలచిత్రం ఆడిస్తాం. కాబట్టి పిల్లలందరూ పావలా పట్రావాలని హెడ్మాస్టారుచేత ఆర్డరేయించారు.

పావలాలు పట్టుకుని పరుగునవచ్చిన పిల్లలు, ఈ సినీమాలన్నిటినీ లెక్కల పాఠాలు నేర్చుకున్నంత ఉత్సాహంతో సరదాగా చూసి, ఆనందపడిపోయారు. వాళ్ల చప్పట్లు పార్లమెంటు గార్డెన్స్‌లో మారుమోగాయి. చాచానెహ్రూ కన్న కలలు ఫలించాయని, నేతలు గద్గద స్వరంతో ప్రకటించారు. ఆయన మేనబాలలు ఈ విధంగా చాలా చిత్రాలకు లాభాలు ఇవ్వలేకపోయినా, దారి భత్యాలూ, కరెంటు ఖర్చులదాకా భరించారు.

❀ ❀ ❀ ❀

ఈ పరిస్థితులు - నేను అక్కడ ఇక్కడా విని చెబుతున్నవి కావు. కొంతకాలం చూసి, తెలుసుకునీ, బాలల చలనచిత్ర సంస్థ కేంద్రకార్యాలయం సమావేశాల్లో ఒక డైరెక్టరుగా పాల్గొనీ, రిపోర్టులు చదివీ, తెలుసుకునీ చివరకు అర్థం చేసుకుని

చెబుతున్న మాటలు. ఇవన్నీ అక్కడ మీటింగ్‌లో అధ్యక్ష కార్యదర్శులతో సభ్యులతో కూడా చర్చించాను. ఫెస్టివల్స్ కోసం కాకుండా పిల్లల కోసం సినీమాలు తీయాలి అని వాదించాను. జాలిపడ్డారు. అదా సరే అంటూ, తరువాతి బడ్జెట్‌కు వెళ్లిపోయారు. నేను 'ఇంటి'కొచ్చేశాను.

అందువల్ల ఇవాళ పత్రికలద్వారా - అందరినీ చర్చించమని కోరుతున్నాను. 'ఇది తప్పు' అని చెప్పేవాడు - ఇది ఒప్పు అని తనకు తోచిన మార్గం చెప్పాలి.

ఈ ఉద్యమం లేచీ లేవడంతోనే ఇలా పడుకోడానికి మూడే మూడు ముఖ్యకారణాలు- ఖర్చు, మార్కెటింగ్, కథావస్తువు.

❀ ❀ ❀ ❀

బాలలచిత్రాలు కదా అని కొడక్ కంపెనీ ఫిలిముని అరటిక్కెట్టు రేటుకి అమ్మారు. కెమెరా కిరాయి, నటుల టెక్నీషియన్ల జీతాలూ అంతే. అందువల్ల బాలలచిత్రాల ఖర్చుకూడా పెద్ద చిత్రాల రేట్ల ప్రకారమే నడుస్తోంది.

రెండు గంటల బాలలచిత్రం తీయడానికి నెగటివ్, ఫస్ట్‌కాపీ వరకూ 25 నుండి 35 లక్షల ఖర్చు అవుతుంది. విడుదల చేసే ప్రింటు ఒక్కొక్కటి 40-50 వేలు అవుతుంది. హాలు కిరాయి వారానికి లక్ష రూపాయలు. కేవలం ముడిసరుకు, కిరాయిలే ఇలా వున్నాయి. ఇవి తగ్గించడానికి మార్గంలేదు. సబ్సిడీలతో పోషిస్తే, అంతా క్వాలిటీ తరిగి క్వాంటిటీ రెచ్చిపోతుంది.

నాకు తోచిన మార్గం... రూటు మార్చడం... బాలలచిత్రాలకు సినీమా ఫిలిం (35/16.మి.మీ.) ఫార్మెట్‌ను వదిలిపెట్టి-విడియో టేప్ ఫార్మాట్‌కు మార్చాలి.

ఫిలిం నెగటివ్ - పదినిమిషాల నిడివి గలది ఇవాళ రూ. 27వేలు. అదే బేటాకాం విడియోటేపు 20 నిమిషాలకి రూ.850 లు, సినీఫిలిం ఒకసారి ఎక్స్‌పోజ్ చేశాక తప్పైనా ఒప్పైనా ఇక రెండోసారి పనికిరాదు. విడియోటేపు అయితే, ఒకసారి తప్పు జరిగినా, రీవైండ్ చేసి మరొక్కసారి ఎక్స్‌పోజ్ చేయవచ్చు. ఒక గంటసేపు సినీమాకి సినీ ఫిల్ము నికరనిడివి మూడు రెట్లు ఖర్చవుతుంది. అదే విడియో టేపు అయితే, ఒకటికి - అర - అంటే 1 1/2 ఖర్చు. అంటే, నెగటివ్ అనే ముడిసరుకులో గంట నిడివి చిత్రానికి రాఫిలిం ఖర్చు 27×6=162,000, అదే ముడి సరుకు టేపు అయితే, 1000×5=5,000. అలాగే విడుదల చేసే ప్రింటు ఖరీదు - ఒక గంట నిడివిని గల ప్రింటు ఖరీదు 2,700×6=14,200. పి.హెచ్.ఎస్. టేపు (గంటకి) కేలం రూ.70 లు. సినీప్రింటు 500 ఆటలకి చెడిపోతే, మళ్ళీ 14 వేలు పెట్టాలి. వీడియో ప్రింటు వంద ఆటలకి పాడైనా, మళ్లీతీస్తే వందలోపే, ఈ విధంగా చూస్తే బాలల చిత్రం - రెండు గంటల బాలల చిత్రం - సినీఫిలిముగా 40-50 లక్షలయితే. విడియో చిత్రం మిగతా అంశాలమీద ఎంత బాగా ఖర్చుపెట్టినా - పదిలక్షలకు దాటదు. పధ్నాలుగు భాషలలో డబ్బింగ్ చేస్తే ఒక భాషకి లక్షన్నర చాలు. ఇది - కాస్టాఫ్ ప్రొడక్షన్.

2. మార్కెటింగ్! పదిమందిని విందుకు పిలిచినపుడు - తిండితోపాటు తినేవాడి చేతిలో ఆకో, ప్లేటో, వుండాలిగదా! అలాగే బాలలకి సినీమాలు తీసినపుడు - చూసేవాడు కూర్చోడానికి చోటూ, వాడి ఎదురుగా తెరా, వాడిలో చూడాలనే సరదా వుండాలి. అవి లేకుండానే వాళ్ళకి తోచినన్ని సినీమాలు తీసేశారు. చూసేవాళ్ళ కోసం హాళ్ళు దొరక్క, స్కూళ్ళకి పంపారు. హాలు దొరికిన ఊళ్ళలో మార్నింగు షోలు వేశారు. నలభై లక్షల నిర్మాణ ఖర్చు, యాభైవేలకి ఒక ప్రింటూ చొప్పున ఖర్చయితే మార్నింగు షోల మీద, స్కూళ్ళ దండయాత్రల మీదా వచ్చేదెంత?

ఇలా అడిగితే - 'అబ్బెబ్బే! ఇలాటి వాటికి లాభనష్టాలు ఒక లెక్కకాదు. డబ్బుకన్న ముఖ్యం-ఎంత కళాత్మకంగా ఒక చిత్రం తీశామన్నదే! ఆ తీసినదాన్ని ఎందరు చూశారట! "భలేవారే... ఫారెన్ ఫెస్టివల్‌లో అవార్డులు వచ్చాయి తెలీదా" అన్నారు.

ఈ 'అపార్థ' సారథులు బాలల చిత్రాలు కూడా ఆర్ట్ పిక్చర్స్‌లాగే అంటున్నారు.



పారాలల్ సినీమా - కళాత్మకంగా, ప్రయోగాత్మకంగా సినీమా తీసినపుడు దానికి కొంత నష్టం వచ్చినా సరే అని అటువంటి వాటిని ప్రోత్సహించడానికి నేషనల్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ కూడా వుంది. దాని నిధులు ఇందుకోసమే వున్నాయి. వాటి పని లాభాలు కాదు. కళాత్మక విలువలను పెంచడం.

కాని -

బాలల చిత్రాల లక్ష్యం అదికాదు.

బూతులూ, పచ్చి శృంగారం, రక్తపాతం, క్రౌర్యం వగైరా కమర్షియల్ సరుకుతో పేట్రేగిపోతున్న చిత్రాలబారి నుండి వారిని తప్పించి, పిల్లలు హాయిగా సరదాగా చూసే సినీమాలు తీయాలన్నదే ఆ సంస్థ పునాది... అవార్డు పిక్చర్లు కానేకాదు. వస్తే సంతోషమే. కాని వాటికోసం తీయరాదు.

అలాగని, సుమతీశతకంలో - నీతులు వర్ణించి బోరుకొట్టమనికాదు. స్కూళ్లలో బలవంతంగా చూపించేవికావు. "మాకోసం మంచి సినీమా వచ్చింది. తీసుకెళ్ళు" అని పిల్లలు తమ పెద్దలను అడిగి, టిక్కెట్లుకొని వెళ్ళే చూసేరకం సినీమాలూ రావాలి.

ఇపుడు వస్తున్న బాలలచిత్రాలకు అలాగ సినీమా వీధిలో పెద్దహాలు దొరకదు. దొరికినా వారం కిరాయి కూడా గిట్టదు. వాళ్ళకోసం హాళ్ళు కట్టడం అనేది ఎండమావిలో కాయితం పడవ తేలినంత ఒట్టు.

అంటే - దేశంలో హాలు నిండే పాటి పిల్లలు లేరనికాదు. హాలునిండేలా వాళ్ళను ఆకర్షించే దమ్ము గల చిత్రాలు లేవు.

ఇటు నిర్మాణం ఖర్చు - ప్రింటు ఖరీదూ - బాక్సాఫీసు చిత్రాల స్థాయిలోనే వున్నాయి. వుంటాయి. వేరే మార్గం లేదా?

ఉంది. అదే విడియో ఫార్మాట్.

ఈ పదేళ్ళ కాలంలో వీడియో చాలా పెద్ద విప్లవం తీసుకొచ్చింది. సినీమా ఖజానాలనే సవాలుచేసింది. ఇంటిలో హాలునే మినీ సినీహాలుగా మార్చివేసింది. స్కూళ్ళలో కాలేజీల్లో విద్యాబోధనకు ఎంతో మేలుచేస్తోంది.

అందువల్ల లేత దశలోపునే ఈ బాలచిత్ర నిర్మాణోద్యమానికి సినీఫిలింను వదిలి, విడియో మీడియం తీసుకుంటే - చిత్ర నిర్మాణ వ్యయం 40 బదులు పది లక్షలలో కుదురుతుంది.

ఇక చూసేవాళ్ళు.... పిల్లలులాగే-టీవీలు కూడా దేశమంతటా వున్నాయి. ఇవాళ దూరదర్శన్ రీచ్ నూటికి 85 మందికి అందుతోంది. నేషనల్ నెట్‌వర్కులోనూ, అన్ని ప్రాంతీయ కేంద్రాలలోనూ అన్ని భాషలలోనూ వారానికి రెండు - శని ఆదివారాలలో బాలలసినీమా ప్రోగ్రాములు ఏర్పాటుచేస్తే ఉద్యమం వూపందుకుంటుంది. ఊపందుకున్నదానికి జవసత్వాలు ఇవ్వడానికి ప్రైవేటు ఇండస్ట్రీ తప్పక ముందుకువస్తుంది.

మూడవదీ ముఖ్యమైనదీ - కథావస్తువు:

శ్రీ 'అపార్థ' సారథులు - పిల్లల సినీమా అనగానే నీతికథలూ - పసిపిల్లలు పెద్ద ఖూనీకోర్లను పట్టుకునే నేర చోరీ కథలూ మాత్రమే అని నిశ్చయించారు.

అది సరికాదు. నారాయణ్‌గారి మాల్గుడి కథలు, మార్క్‌ట్వేన్ రాజూ - పేదా, మన పురాణాల్లోని కథలూ - ఇవన్నీ మనం బతిమాలీ, బలవంతపెట్టీ చూపేలా కాకుండా - కమర్షియల్ విలువలతోనే - (హోమ్ ఎలోన్ సీరీస్‌లో లాగ బేబీస్ డే ఔట్ లాగ) యివ్వాలి.

పరిషత్తు నాటకాల్లా కాకుండా - సినీమాతో పోటీ పడేవిధంగా జవసత్వాలున్న కథలు ఆలోచించాలి. సినీమా అంటే రెండు గంటలూ వుండాలనే కాదు. రెండు గంటల ప్రోగ్రాములో ఒక గంటసేపు నడిచే మంచికథ. పదేసి నిముషాల చొప్పున కార్టూనులూ, వింతలూ, విశేషాలూ, ఆటపాటలూ, ఇతర దేశాల పిల్లలూ, వాళ్ళ అల్లర్లూ. ఇలా కదంబ కార్యక్రమంగా తీయవచ్చు.

తల్లి ఇంట్లో అందరికీ మసాలా దట్టించిన కూరలు వండినా - నాలుగేళ్ళ పసిపాపకి 'బీరకాయ సేఫ్' అని కాకుండా - బంగాళాదుంప పెడుతుంది. అది వుద్ధరింపు అనుకోదు. పిల్లలు ఇష్టపడి తినాలి.

అలాగే బాలల సినీమాలు వాళ్లను ఉద్ధరించడానికి తీయడానికి కాకుండా - హాయిగా సరదాగా ఇష్టపడి చూసేవి తీయాలన్న ప్రేమతో ఆశతో సరదాతో పనిచేయాలి.

రిస్కు తక్కువ.

బాలలకు - ప్రజాబాలల క్కూడా అందే అవకాశం ఎక్కువ.

(1997)

❀ ❀ ❀ ❀

నోట్: (పదేళ్ళ క్రితం శ్రీ ఎన్.టి.రామారావుగారు ప్రాథమిక విద్యా బోధనకోసం - పాఠాలన్నీ 16 ఎం. ఎం. ఫిలిం పై చిత్రించాలనుకున్నారు. జపానులో ప్రొజెక్టర్లు కూడా పురమాయించారు. ఆనాడు - ఫిలింకన్న విడియో మంచిది అని వాదించి - మూడు గంటల సినీప్రింటు - 18 వేల రూపాయలు కాగా మూడుగంటల విడియో టేపు రెండువందలు మాత్రమే అని చెప్పి, నిర్మాణంలో, నిర్వహణలో వుండే సాధక బాధకాలు వివరించారు బాపు-రమణలు. వెంటనే ఆయన ఫిలిం రూటు వదిలేవేసి వీడియో పాఠాలు ఆమోదించారు. లెక్కలు భూగోళం వంటి పాఠాలు కూడా ఆడిస్తూ పాడిస్తూ వినోదాత్మకంగా 32 గంటల టేపులు తీశారు. ఆనాడు పిల్లలు మళ్ళీ మళ్ళీ అడిగి వేయించుకుని చూశారు.)

# నేపథ్య సంగీతం

స్సరిగ ర్ రిగమ గ్ గమప మ్ మపద ప్ పదని ద్ దనిస... అని గుర్రాన్ని పరుగెత్తిస్తున్నాడు వయొలిన్‌మీద. తెరమీద గుర్రం పరుగుకు ఈ సంగీతం లయవేస్తోందో, దీనికి బదులుగా అది పరిగెడుతోందో తెలియటం లేదు. కాని వీటికి అనుగుణంగా ప్రేక్షకుల హృదయాలు పరుగెడుతున్నాయి.

తస్సా...నీధ స్నీద్ద పద... పమ పామగ.. ర్రి... సా అంటూ 'అరస్వరాలమీద రిగి పా...గి ఆగిన' వేళకు హాస్యగాడిని మోస్తున్న గుర్రం కూడా తప్పటడుగులు వేసి వేసి ఆగింది. ప్రేక్షకులు ఆ దృశ్యం అదృశ్యం అయేవరకూ నవ్వుతునే ఉన్నారు...

❀ ❀ ❀ ❀

సూర్యోదయాన్ని ప్రసారం చేస్తోంది భూపాల రాగం... చికాకులోంచి, సందడి లోంచి సుప్తావస్థలోకి- ఆరంభం కాబోతున్న సినీమాయా జగతిలోకి ప్రేక్షకులను మేల్కొలుపుతోంది. వాళ్ళ మనసులను స్థిమిత పరచి కాగల కథకు ఆయత్తం చేస్తోంది.

❀ ❀ ❀ ❀

మాయలపకీరు మీదిమీదికి వస్తున్నాడు. బాలనాగమ్మ చూపులు ఆర్తనాదాలు చేస్తున్నాయి. క్లారినెట్ వాటిని సంగీతంలోకి అనువదించి ప్రేక్షక హృదయాలను స్పందింపజేసింది.

నాయకుడు నాయికను ఓదార్చుతున్నాడు. ప్రతినాయకుడు వెనుక వేపుగా కత్తి చేత పట్టుకువస్తున్నాడు. ఇతడతణ్ణి చూస్తాడా? ఈలోగా అతడితణ్ణి వధిస్తాడా? ఎంత ప్రమాదం! అటు తిరిగిఉన్న నాయకుడిని హెచ్చరిస్తోంది సంగీతం; ముందుకు వస్తున్న ప్రమాదం గురించి.

"ఏయ్. వెనక్కి చూసుకో. అడొచ్చేత్తున్నాడు" అన్నాడొక ప్రేక్షకుడు ఆ ఉత్కంఠ భరించలేక.

❀ ❀ ❀ ❀

ఛీ కులటా పో అన్నాడు హీరో. అని తోసేశాడు. హీరోయిను నేలమీద కూలిపోయింది. రక్తం, కన్నీళ్ళు... ప్రేక్షకుడికి జాలికలిగిందో లేదో హీరోయిను మొహం చూస్తే... ఎందుకైనా మంచిదని యమ్మెస్ రామారావు సిఫార్సు చేశాడు నేపథ్యం లోంచి "తల్లీ! అపోహల పాలైతివా! ఇంతేనా అంతేనా" అంటూ.

❀ ❀ ❀ ❀

నేపథ్య సంగీతమనగా నేమి అంటూ పాఠాలు చెప్పాలని పై వాక్యాలు బయల్దేరిరాలేదు. కాని సినిమాలో నేపథ్య సంగీతాన్ని ఎంత అద్భుతంగా వినియోగించుకోవచ్చునో, నటీనటులుగాని దర్శకుడుగాని అసమర్థులైతే ఆ లోపాన్ని ఎంతచక్కగా కమ్మకు రావచ్చునో, ఎలా దుర్వినియోగించేసుకోవచ్చునో ఇవి స్థూలంగా సూచిస్తాయి. సినిమాలో నేపథ్య సంగీతానికి ఎంతైనా ప్రాధాన్యం ఉంది. కథ వాతావరణం, సన్నివేశంలో తత్వం ప్రేక్షకుడి హృదయానికి హత్తుకొనేలా చేయడానికి, ఆయా ఘట్టాలపై చక్కని వ్యాఖ్యానం చేయడానికి ఇంత గొప్ప సాధనం ఇదే.

సినిమాలు, డైలాగులు తొడుక్కు తిరగడం ఆరంభించడానికి పూర్వమే సంగీతం మాట్లాడడం ఆరంభించింది.

మూకీల కాలంలో, మనవేపు ఒక గెరాజుత్తు పెద్దమనిషీ ఒక జులపాలాయనా హాలులో కూర్చునే వారు, హార్మోనియం తబలా పట్టుకుని, తెరమీద గుర్రాలూ రైళ్ళు పరుగెత్తడం, కొట్టుకోవడం వగైరా సందడి జరిగినపుడు వీరు మహోత్సాహంతో వాటికి సంగీతం సమకూర్చేవారు. తెనాలిలో ఒకచోటమటుకు ఈ 'ఆర్కెస్ట్రా'ను తెర వెనుక కూర్చోపెట్టి సంగీతం వినిపించారు.

పోనుపోను టాకీలు వచ్చి సౌండ్ ట్రాక్ ఏర్పడింది ఈనాటికి, ఇరవైనుంచి అరవై వాద్యాలతో ఆర్కెస్ట్రా పెట్టి రికార్డు చేయడం, మాటలు వచ్చినపుడు వాటి ధ్వని తగ్గించి, కావలసినపుడు పెంచి హంగు చేయడం వగైరా సదుపాయాలు వచ్చాయి. చిత్రం సజీవమైన ప్రేక్షక హృదయాలలో స్పందించడానికి సంగీతం ఎంత ముఖ్యమో అందరూ గ్రహించారు. కాని చాలావరకు ఆ ప్రాముఖ్యానికి తగిన శ్రద్ధాసక్తులను చూపడంలేదు.

శ్రద్ధాసక్తులంటే, అవసరమున్నా లేకున్నా అరవై వాద్యాలు పెట్టి చాలా డబ్బు ఖర్చు చేయడమని అర్థం కాదు. అవసరానికి తగిన సదుపాయాలు చేసి హంగులు సమకూర్చడం నిర్మాతపని. వాటిని సృజనాత్మక ప్రతిభతో ఉపయోగించు కోవడం సంగీత రచయిత వంతు. కాని ఈనాడు తెలుగు సినిమాలో సంగీత రచయితలు తగ్గిపోవాలని ప్రయత్నిస్తున్నారు. కొందరు సంగీత దర్శకులు అంటే ఈనాటి అర్థం కద్రపెత్తనం చేసేవారు అనే చెప్పుకోవాలి. చాలామంది సంగీత సంపాదకులుగా కాలం గడుపుతున్నారు. అంటే ఎక్కడెక్కడి నుంచి రికార్డులూ సంపాదించుకొచ్చి రీ రికార్డు చేయించడం.

ఏ బలవత్తర కారణాలవల్లనో ఈనాడు చాలామంది ఈ స్థితికి వచ్చారు. బహుశా వీటికి అలవాటుపడి. ఆవరించిన పరిస్థితులను చూచి తిట్టుకుంటూ ఊరుకొంటున్నారు. 15 వాద్యాలకన్నా ఎవరు ఇవ్వరు అన్నదొక నినాదం. అయితే ఆ పనిపట్ల శ్రద్ధాసక్తులుంచి పనిచేస్తే ఆ పదిహేనుతోనే ఆ మాటకొస్తే అంతకన్న తక్కువ వాటితోనే అద్భుతాలు చేయవచ్చు చేసేవారు చేస్తూనే ఉన్నారు. సంగీత

దర్శకుడికి కావలసినవి రెండు వాద్యాలు. వయొలిన్, వీణ, సితార్, వేణువు, హామండ్ ఆర్గన్ వగైరాలలో ఏదో ఒకటి. రెండవది నిశ్శబ్దం. ఈ రెండిటి సమ్మేళనంతోను ప్రేక్షకుడి హృదయవీణను పలికించవచ్చు.

ఒక్క వాద్యంలో పదిరకాల నాదాలను సృష్టించి ఒక పూర్తి చిత్రానికి- అద్భుతభయానక రసప్రధానమైన దానికి- నేపథ్య సంగీతం సమకూర్చినవారిలో డిమిత్రి టియోంకిన్‌ను చెప్పుకోవచ్చు. 'బర్డ్‌మాన్' అనే చిత్రంలో ఒక్క జీతర్ వాద్యంతో ఆయన గుండె ఝల్లుమనిపించె సంగీతం వినిపించాడు. వాద్యం ఒక్కటి కావడమే కాక, సంగీతం కూడా ఒక్క ఆవృత్తంతో సరిపెట్టి దానికే స్థాయిమార్చి కళలుమార్చి ప్రయోగించాడు. టియోంకిన్ సంగీతం 'హైనూన్' చిత్రంలో అకాడమీ అవార్డు కూడా అందుకొంది.

'జెనివీవ్' అనే బ్రిటిష్ కామెడీలో, ప్రసిద్ధ విద్వాంసుడు లారీ అడ్లర్ ఆహ్లాదకరమైన చిత్రకథ పొడుగునా ఆహ్లాదకరమైన క్రోమోనికావాద్యం ఒక్కదానితో ఎన్న రానన్ని పోకడలు పోయాడు.



లారీ అడ్లర్




లైమ్ లైట్ పోస్టర్

చాప్లిన్ తన చిత్రాలన్నిటికీ తానే సంగీతం సమకూర్చుకుంటాడు. సంగీత రచన దర్శకత్వం కూడా ఆయనదే. 'లైమ్‌లైట్' చిత్రంలో ముఖ్య వృత్తాన్ని ఉద్ఘోషించే

లైమ్‌లైట్ పోస్టర్

వృత్తం చాప్లిన్ పేరులాగే చిరకాల శ్రోతల హృదయాలలో మసలుతూ ఉంటుంది. "ఇటర్నల్లీ" అనే పేరుతో రికార్డుగా విడుదల అయిన ఆ సంగీతం, రికార్డులలో

రికార్డులు బద్దలు కొట్టేసింది. దేశీయ స్థాయిని సితార్ విద్వాంసుడు రవిశంకర్ 'పథేర్ పాంచాలీ' చిత్రంలో పథదేవత విశ్వగీతిని వేణువాదంలో పూరించి విశ్వజనీనంగా


పథేర్ పాంచాలి

వినిపించాడు. అందులో ఉపయోగించిన మరొక్క వాద్యం సితార్. అలాగే 'అపరాజిత'లోకూడా కొద్ది వాద్యాలతో గొప్ప సంగీతం వినిపించి కథ హృదయానికి గాఢంగా హత్తుకునేలా చేశారు.


కల్పన

'కల్పన' చిత్రంలో విష్ణుదాస్‌షిరాలీ కూడా సంగీతాన్ని సమ్మోహనాస్త్రంగా ప్రయోగించారు. షిరాలీ ఇపుడు ప్రభుత్వ ఫిలింస్ డివిజన్‌లో సంగీత దర్శకుడుగా ఉంటున్నారు. కొన్ని కొన్ని డాక్యుమెంటరీలలోను, వార్తా చిత్రాలలోను ఈయన వినిపించిన వరసలు ఆ చిత్రాలకే ప్రాణం అనిపించేలా ఉన్నాయి. వీరందరికీ శబ్దంపైనా నిశ్శబ్దంపైనా కూడా విశేషమైన పటుత్వం ఉంది.

ఇటీవలి తెలుగు చిత్రాలలో శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం చిత్రం బ్రహ్మలోకం సన్నివేశానికి పెండ్యాల కూర్చిన వీణానాదం (వాద్యగాడు చిట్టిబాబు) ఏ ఇతర శిల్పాలకు సాధ్యంకాని పుష్టిని చేకూర్చింది.

కొద్ది వాక్యాలలో గొప్పభావం చెప్పడం మహాకవులకే సాధ్యమైనట్లే ఇదీ కొద్దిమందికే సాధ్యపడవచ్చు. ఒకరు పది వాద్యాలలో చెప్పగలిగితే మరొకరు పాతిక కావాలనుకోవచ్చు. ఆయా సన్నివేశాలూ, సందర్భాలూ చూస్తే పెద్ద వాద్య సమ్మేళనం అవసర మనిపించవచ్చు.

పెద్ద పెద్ద వాద్యబృందాలను ఉపయోగించడం ఉత్తరాదిన ఎక్కువ. 'హార్మొనైజేషన్' పాశ్చాత్యుల విద్య. బొంబాయివారు ఆ శిల్పాన్ని సాధించి రకరకాల ప్రయోగాలు చేశారు. మద్రాసులో సగటున ఒక రీ-రికార్డింగుకు 20 వాద్యాలు ఉంటే, బొంబాయిలో 60 ఉంటాయి.

అరవై వాద్యాల ఆర్కెస్ట్రా ఉండగానే సరికాదు. రికార్డు దాన్ని ప్రయోగించడం బాగా తెలిసి ఉండాలి. ప్రతివాద్యంమీద పటుత్వం ఉండాలి. యతులు ప్రతులూ తెలిసి ఉండాలి. అన్నిటి కన్న ముఖ్యం వాటిపట్ల శ్రద్ధ ఉండాలి. అందుకు తీరిక ఉండాలి. ఇవన్నీ మ్యూజిక్ డైరెక్టర్లకు తెలియవనా యాకరువు పెట్టడం అనుకునే వారు పొరబడి లేచాక శ్రద్ధగా మన సినిమాలు చూస్తే ప్రయోగాలూ సంగీతేతర ధ్వనులూ పుష్కలంగా దొరుకుతాయి. ఈ లక్షణాలు, శక్తులూ కలిగి సమర్థంగా పనిచేసి గొప్ప సంగీతం వినిపించి మార్గదర్శకులనిపించుకొన్న సంగీత దర్శకులు నౌషద్ అలీ, రాజేశ్వరరావు. సి. రామచంద్ర.

పెద్ద ఆర్కెస్ట్రాలను ఎక్కువగా ఉపయోగించేవారిలో నౌషాద్ ముఖ్యుడు. మేలా చిత్రంలో ముఖ్య వృత్తాన్ని ఉద్ఘోషించే అవృతం "ధర్తీకొ ఆకాష్ పుకారే... ఆజా ఆజా ప్రేమద్వారె... ఆనాహీ హోగా"లో స్వరకల్పన, అందులో దిగంత విశ్రాంతమైన ప్రేమ భూనభాలు మారుమ్రోగేలా శాశ్వతంగా ప్రతిధ్వనించేలా పలికించిన వాద్యప్రయోగశిల్పం చిరస్మరణీయమైనవి. తరువాత ఆ పద్ధతిని చాలామంది అనుసరించి మంచి ఫలితాలు సాధించారు. మొత్తంమీద పాశ్చాత్యుల సింఫనీకి మనస్థాయికి అందుబాటైనంతలో గొప్ప అనువాదాన్ని, హుందాగా ఉండేలా చేసిన ఘనత నౌషదాలీకే దక్కుతుంది.

❀ ❀ ❀ ❀

పాశ్చాత్య దేశాలలో వాద్యసమ్మేళనాలకున్న గౌరవం ఇటువేపు లేదు. అక్కడ సంగీత రచయితలు వేరు; వారి కృతులను ఆర్కెస్ట్రా మీద కండక్ట్ చేసేవారు వేరుగా

వుంటారు. సినిమాలలో కూడా సంగీతం ఒకరు సమకూర్చితే, దాన్ని ప్రయోగించే కార్యం మరొకరు నిర్వహిస్తారు. గేయాలు ఒకరు వ్రాస్తే. నేపథ్య సంగీతం మరొకరు రచిస్తారు. పాశ్చాత్యులలో సినిమాలకు కూడా పనిచేసి వాటికీ తమకూ కూడా గౌరవ ప్రతిష్టలు ఆర్జించుకొన్న విద్వాంసులలో ఎన్న తగ్గవారు జార్జిజర్షన్ (ఫన్నీ ఫేస్ పాతది), జెరో మ్ కెర్న్ (షో బోట్) విక్టర్ యంగ్ (శామ్సన్ అండ్ డిలైలా) ఆరాన్ కోప్‌లాండ్ (హీరెస్) రంగస్థలం మీద, తరువాత తెరమీద సంగీత నాటకాలుగా ప్రసిద్ధికెక్కిన పోర్గీ అండ్ జెస్ అమెరికన్ ఇన్ పారిస్ కథలకు ముఖ్యసంగీత వృత్తాలు రచించింది జెర్షన్. పాటలుకూడా వ్రాసిన సంగీత రచయితల జంట రాడర్స్, హామర్స్ స్టీవ్. ఓక్ల హామా, కింగ్ ఎండ్ ఐ, కారెసెల్ వీరి రచనలు. ఇవి చలన చిత్రాలుగా కూడా వచ్చాయి. సినిమా వాగ్గేయకారులలో ప్రసిద్ధికెక్కిన మరొకవ్యక్తి ఇర్వింగ్ బెర్లిన్ ఈస్టర్ పరేడ్. బ్రిటిష్ ఫిలిం సంగీత రచయితలలో మూయర్ మాక్‌సన్ ప్రముఖుడు.


ఇర్వింగ్ బెర్లిన్


జెరోమ్ కెర్న్

దేశీయస్థాయికి దిగివస్తే, మన చిత్రాలలో సంగీత రచన కింద షడ్జమంలో ఉందని విమర్శించుకునే సమయంలో మనకి అనుకూల వాతావరణం, అవసరమైన సదుపాయాలూ, దోహదాలూ కూడా చాలా తక్కువస్థాయిలో ఉన్నాయని గుర్తుంచుకోవాలి. మన సంగీత దర్శకులలో చాలామందికి గొప్ప గొప్ప ఆశయాలు ఉన్నాయి. శ్రద్ధా వుంది; శక్తీ ఉంది; ఉత్సాహమూ ఉంది. కాని అవి ఖరీదైన ఆశయాలు కావడంవల్ల, డబ్బు పెట్టేవారు పెట్టే కట్టుదిట్టాలు ఎక్కువ. చాలామంది నిర్మాతలకు ఈ నేపథ్యసంగీతం అనేది నిష్కారణంగా డబ్బు మింగేస్తున్న దండుగపని అని భావం ఉన్నట్లు తోస్తుంది. అది లేకపోతే ఇబ్బందేనని గుర్తిస్తారు కాని బాగా ఉండడం అవసరమన్నది గుర్తించరు. చిత్రం నిర్మాణం పూర్తిఅయిన వెనుక వచ్చే

ఆఖరుఘట్టం కాబట్టి, అప్పుడు డబ్బూ, వ్యవధీ కూడ తక్కువ కాబట్టి ఏదో హడావుడిగా ఐదారు చప్పుళ్లతో వెయ్యి రూపాయలు దాటకుండా రెండు మూడురోజులలో లాగి అవతల పారెయ్యండి అంటారు: రికార్డింగు సమయంలో సంగీత దర్శకుడు కథ తత్వాన్ని బట్టి సన్నివేశాన్ని బట్టి అవసరమనుకునే సంగీతం ఆలోచించడానికి తీరిక ఉండదు. ఆలోచించినా రికార్డు చేయించే సావకాశమూ ఉండదు; ఉన్న సందర్భాలలో ప్రొడ్యూసరుకు డిస్ట్రిబ్యూటరుకూ కూడా సంగీతంమీద కొన్ని అభిప్రాయాలుంటాయి ఆ నల్ల మెట్టు నొక్కండి అక్కడినించి ప్రారంభించండి అని చెప్పే సాహసులూ, చెప్పి నెగ్గే "హీరో"లూ కూడా ఉన్నారు.

కొంతమంది ఇన్ని బాజాలెందుకు అంటారు ఒక నిర్మాత రీ-రికార్డింగు అయ్యాక వాద్యగాళ్ళకు డబ్బు ఇచ్చేవేళ ఒక మాండలిన్ అతణ్ణి ఆపి, "నువ్వు టింగు టింగుమని రెండుసార్లు మీటావో లేదో... దీనికీ అందరితో పాటు సమంగా పుచ్చుకుంటానంటే యెలా. ఓ పాతిక తక్కువ జేసుకోవాలి" అని బేరం పెట్టాడు.

నౌషదలీ ఒకసారి ఒక ఘట్టానికి దాని స్వభావాన్ని బట్టి ఒక విధమైన సంగీతం కూర్చి రికార్డు చేశాడు. తరవాత సెన్సారువారు ఆ సీను తీసివేశారు. నిర్మాత అదెందుకు దండుగ పోవాలని ఆలోచించి కాస్త ఖాళీగా ఉన్న ఇంకో దృశ్యంమీద ఆ సంగీతాన్ని ఇమిడ్చేశాడు.

నౌషాద్, తరువాత ఆ చిత్రం చూసినప్పుడు అక్కడ ఇటు తన సంగీతమూ, అటూ ఆ చిత్రంలో ఆ ఘట్టమూ కూడా జాయింటుగా ఖూనీ అయిపోయాయని బాధపడ్డాడు. ఆ బాధను వ్యాఖ్యానించడానికి అరవై వయొలిన్‌ల ఆర్కెస్ట్రా కూడా చాలదు అని విషయ పరిజ్ఞానంగల దర్శకుడొకాయన అన్నారు.

*(ఆంధ్ర వారపత్రిక - 1960)*



# మంచి స్క్రిప్టు అంటే...!?

మంచి స్క్రిప్టుకు వుండవసిన లక్షణాలేమిటి. అసలు మంచి అంటే ఏమిటి అని అడుగుతున్నారా?

రాసేవాడికి అన్నీ మంచివే. నిర్మాతలకి యిచ్చేటప్పుడు అన్నీ బెస్టే. దాంట్లో అనుకున్నది ఎంతవరకు చెప్పగలిగాం... ఏది జనం మెచ్చుకున్నారు... అన్నది అసలు ప్రశ్న. నూటికి ఎనభైమంది మెచ్చుకుంటేనే అది మంచి సినిమా అవుతుంది. ఇక్కడ పేర్లర్ సినిమా, ఆర్ట్ ఫిలిం అన్న సంబంధం ఏమీ లేదు. సినిమాకి రాయడమన్నా తియ్యడమన్నా అందరికీ నచ్చే స్థాయిలో... అందరికీ అర్థమయ్యే రీతిలో వుంటేనే మంచి స్క్రిప్టు అవుతుంది.

అయితే కొన్ని కథాంశాలు రైటర్‌ని ఎక్కువగా ఇన్‌స్పైర్ చేస్తాయి. కొన్నిటికి అంతకన్న స్కోప్ వుండదు కాబట్టి, అంతే రాయడానికి వీలవుతుంది. కొన్ని కొన్ని కొత్త పాయింట్లు రచయిత మనసులో వుండేవి బయటకు తీసుకువచ్చి చెప్పిస్తూ వుంటాయి.

ఇక నా చిత్రాలకు వస్తే 'సాక్షి' ఒక మైలురాయనే చెప్పాలి. పూర్తి ఔట్‌డోర్‌లో తీసే ప్రయోగం మొదటిసారిగా మేం చేశాం. స్టూడియోలో కాకుండా సహజత్వం వుట్టిపడేలా నిజ జీవితంలోలా వుండాలని. కానీ మేకప్ ఏ మాత్రం ఉపయోగించకుండా వుండలేకపోయాం. అప్పటికి మేం కొత్త. ఫ్రెష్‌గా వచ్చారు బాపు. అంతకు మునుపు దర్శకత్వం వహించిన అనుభవం లేదు. అసిస్టెంట్ డైరక్టర్‌గానూ పనిచెయ్యలేదు.

స్టూడియోలో 40 లెన్స్, 70 లెన్స్, లేక 25 లెన్స్ ఉపయోగించడమా అన్నది పాయింట్ కాదసలు... కథ చెప్పడం, చెప్పడానికి కావలసిన అభిరుచి, చెప్పే విధానం, కామన్‌సెన్స్ యివి మూడూ కావాలి. కామన్‌సెన్స్, మంచి అభిరుచి అంటేనే మంచి స్క్రిప్టుని ఎన్నిక చేసుకోవడం అన్నమాట. ఏదో నాకు ఛాన్సొచ్చింది కదా... ఏదో ఒకటి తీసేస్తానంటే కుదరదు. మేం 'సాక్షి' తీసినప్పుడు పాతదంతా పనికి రాదనికాదు. ఏదో కొత్తదనం తేవాలన్న ఉద్దేశంతో అప్పుడది చేశాం. అది మంచి ప్రయత్నమే. ఇప్పటికీ ఆ స్క్రిప్టు చాలా బావుందని టెక్నీషియన్స్ అందరూ మెచ్చుకుంటూ వుంటారు.



అలాగే 'బుద్ధిమంతుడు' కూడా, కొత్తరకం కథ చెప్దాం అనుకున్నాం. ఆ మేరకు అది పండింది. అయితే నేను రాసేటప్పుడు 'యార్డ్‌స్టిక్స్' అనే కొలబద్దలు పెట్టుకోను. పాత సినిమాలో హిట్ అయినవి పెట్టుకుని, యిన్ని రీళ్ళకి యివి వుండాలి అనేవి లేకుండా ఈ కథని ఎలా చెప్తే బాగుంటుంది. అనుకుని అలాగే రాస్తున్నాను. దానికి రూల్స్, గ్రామర్ లేవు.

నా నమ్మకం - సినిమాకనే కాదు, కథ రాయడానికీ, నవల రాయడానికీ, దేనికీ - మంచి రచనకి గ్రామర్ అవసరంలేదు. ఆ మంచి రచనని గ్రామర్ అనుసరిస్తుంది. అయితే కొందరు కొన్ని నియమాలు పాటిస్తూ - యిది యిన్ని పేజీలుండాలి.... యిలా వెళ్ళాలి అనే పద్ధతిలో వుంటారు. దానికి లోబడి వారు రచనలు చేస్తున్నారు. కొంతమంది ఆ ధ్యాస లేకుండా, అది ఎలా రాయాలనుకున్నారో అలా చెప్పేస్తూ వుంటారు. ఒక్కొక్కప్పుడు అది కొత్త గ్రామర్‌ని సృష్టిస్తుంది. నేనేదీ కొలబద్దలు పెట్టుకు రాయను. 'ఇది ఇలా రాయాలీ' అనుకుంటే అలాగే రాశాను. అది రైటో, తప్పో అన్నది ఆలోచించలేదు. తప్పయినవి ఫెయిలవుతుంటాయి.

అయితే సినిమా విజువల్ మీడియం అని నేను మొదట్నుంచి అంటున్నాను. 'బొమ్మ ముందు... శబ్దం తర్వాత' అని. అందుకే నా స్క్రిప్టులో డైలాగు ఎక్కడ మాట అవసరమో అక్కడే వస్తుందన్నమాట. నేను మొదట్నుంచి అలాగే నేర్చుకున్నాను, పెద్దవాళ్ళనీ, పాత క్లాసిక్స్‌ని చూసి. అదే నాటకం వుందనుకోండి విజువల్‌కన్న 'ఆడియో'... శబ్దానికి ప్రాధాన్యం హెచ్చు. కారణం సినిమాలోలా దూరంగా వున్నవారికి రంగస్థలం మీద నటులు సరిగ్గా కనిపించరు అంచేత సంభాషణలు ఎక్కువగా వుండాలి. అదే సినిమాలో, ఒక విజువల్‌తో వందమాటలు పలికించవచ్చు. 'ఒక బొమ్మ వంద మాటల పెట్టు' అంటారు చూడండి. అది జ్ఞాపకం పెట్టుకుని రాస్తాను. విజువల్‌గా, అందంగా ఎలా చెప్పడం అన్నది ఊహించి చూసినదానికి అప్పుడు మాటలు రాయడం అన్నమాట.

'ముత్యాల ముగ్గు'లో కూడా ఎక్కువ మాట్లాడే పాత్ర రావుగోపాలరావు వేసిన కాంట్రాక్టర్ పాత్రదే. హీరోగానీ, హీరోయిన్‌గానీ ఎక్కువ మాట్లాడరు. సెటైర్ చెయ్యడం కోసం, మాటే దాని ఊపిరి కాబట్టి కాంట్రాక్టరు పాత్ర ఎక్కువ మాట్లాడుతుంది. కానీ ఆ పాత్ర పరిచయం కూడా విజువల్‌తోనే ప్రారంభమవుతుంది - 'ఆకాశంలో మర్డర్ జరిగినట్టుంది' అంటూ.

అలాగే 'వంశవృక్షం'లో విరామం దగ్గర ఒకడైలాగ్ వుంది. 'అమ్మరాలేదేం' అనడుగుతాడు ఆ కుర్రవాడు (వంశీకృష్ణ). 'చీకటి పడింది కదమ్మా, దారి తప్పి వుంటుంది' అంటాడాయన (సోమయాజులు). సరిగ్గా అప్పుడే చీకటి పడింది. ఆ అమ్మాయి (జ్యోతి) బుర్రకీ చీకటిపడింది. పెళ్ళి చేసుకున్నా లేచిపోయింది. ఎంతమందో దాన్నర్థం చేసుకుని మెచ్చుకున్నారు. విడిగా ఆ మాటకు అర్థం లేదు కానీ ఆ సందర్భంలో సరిగ్గా అది అతుక్కుంది, విజువల్స్ వల్ల.



మూకీ సినిమాల కాలంలో చార్లీ చాప్లిన్ సినిమా కాలంలో టాకీలు లేవు. విజువల్ మూవ్‌మెంట్స్‌తోనే శబ్దం లేకుండా చెప్పాల్సి వచ్చింది. అంచేత దృశ్యపరంగా ఎంత బాగా చెప్పవచ్చును అన్నది అప్పుడే కనిపెట్టారు. ఇవాళ మనం ఉన్నవే సరిగ్గా ఉపయోగించుకోవడంలేదు. ఎక్కువగా డైలాగ్స్ మీద ఆధారపడిపోయాం, కారణం – టాకీ అడ్వాంటేజ్ వుంది కాబట్టి. ఇప్పుడు కూడా నేను నాటితరం పెద్దవాళ్ళని దృష్టిలో పెట్టుకుని, విజువల్‌ని దృష్టిలో పెట్టుకునే రాస్తాను. ఒక్క చూపులో ఎంతటి భావాన్నైనా చూపెట్టవచ్చు.... తనలోని బాధ యిది అని! అందుకు బూరెలు మూకుడు, మండే పొయ్యి.... దాని మీద డైలాగులు... యివన్నీ అక్కర్లేదు.

ఇక – సినిమాకు ఫిక్స్‌డ్ ఫార్ములా అంటులేదు. సినీమాలో అశ్లీల పదజాలం గుప్పించి, హాస్యం అనిపించి అది విజయవంతమైతే అదే ఫార్ములాతో సినిమాలు వచ్చినా, 3,4 సినిమాల తర్వాత యిక జనానికి విసుగెత్తుతుంది. అందుకే ఫిక్స్‌డ్ ఫార్ములా అనేది లేదు, అనవసరం అంటాను. అసలు డబ్బు చేసుకోడంలో దేనికీ ఫార్ములా అంటూ లేదు. వ్యవసాయంలోనూ అంతే. ఒకడు పసుపువేసి సొమ్ములు గడిస్తే మరుసటి సంవత్సరం అందరూ పసుపే వేస్తారు. కొన్ని వేల ఎకరాలు మొత్తం పసుపుతో నిండిపోయి 'గ్లట్' వస్తుంది. ఎవరికీ అమ్ముడవదు. మొత్తం పోతుంది. ఫార్ములాని నమ్మితే అంతే.

ఒక థీమ్ తీసుకున్నప్పుడు, దాన్ని ఎలా తియ్యాలి అనుకుని, ఇవాళ్టి పరిస్థితులకు అనుగుణంగా కథాంశాన్ని మలచుకుని, దాని మీద కృషి చేస్తే మంచి స్క్రిప్టు తయారవుతుంది. రామాయణాన్ని తియ్యాల్సి వచ్చినా యిప్పటి పరిస్థితులకు తగ్గట్టుగా వుండేలా తీసుకురావడమే సబ్జెక్ట్‌లో వుండే స్పార్క్. దాన్ని యివాళ తీసినప్పుడు, యివాళ్టి వాళ్ళు చూసినప్పుడు, దాంట్లో వారి జీవితం ప్రతిబింబించాలి.

అందులోనూ రామాయణం, భారతం కాలానికి అతీతమైన సబ్జెక్టులు. అవి ఏ కాలానికైనా వర్తిస్తాయి. మనుషులు ప్రవర్తనా అవీ – ఒక మనిషి ఒక పరిస్థితిలో ఎలా ప్రవర్తిస్తాడు – సుఖం వస్తే ఏమవుతాడు... ఒళ్ళు పొగరెక్కితే ఎలా వుంటాడు... చాలా నిస్పృహ కలిగితే ఏమవుతాడు – యివన్నీ భారతంలో వున్నాయి. మనిషి ప్రవర్తన ఎన్ని రకాలుగా వుంటుందో. మనిషి మెదడు ఎన్నిరకాలుగా ఆలోచించగలదో, ఎన్ని రకాల తప్పులు చెయ్యగలదో – ఎన్ని రకాల ఒప్పులు చెయ్యగలడో....

అసలు ఆరంభదశలో రైటర్‌కి ప్రోత్సాహం ఎంతైనా అవసరం. నా తొలి చిత్రం 'దాగుడు మూతలు' అయినా విడుదలైన తొలి చిత్రం 'రక్తసంబంధం' ఇది తమిళం 'పాశమలర్' నుంచి రీమేక్ చిత్రం. దానికి సంభాషణలు రాసే అవకాశం నాకు వచ్చినప్పుడు 'కామెడీలు రాసేవాడు యితనేం రాస్తాడు' అన్నారు కొందరు. కానీ డూండీ గారూ, దర్శకులు వి. మధుసూదనరావుగారూ నన్నెంతో ఉత్సాహపరచి రాయించారు. లేకుంటే నేను అప్పుడే యింటికి వెళ్ళిపోయివుండే వాడిని. నేను బాగా రాయకపోయినా, బాగుందని వాళ్ళు నటించి, రాయించారు. నేను నమ్మలేదనుకోండి.... 'పత్రికల్లోంచి వచ్చినవాడు. బాగా రాస్తాడు. ఫ్రెష్‌టాలెంట్' అని వాళ్ళనుకున్నారు. ఆ నమ్మకం నాకు లేదు కానీ వారికి నామీద నమ్మకం వుంది. ఓ పదిసార్లు, యిరవైసార్లు రాయగా ఒక దారి కనిపించింది. అయితే ఆ చిత్రం ఎంత హిట్టయినా, నాది అని చెప్పుకోలేను. కె.పి. కొట్టార్కరగారి స్క్రిప్టు నేను తెలుగులో రాశాను. నాది అని చెప్పుకోవాలనే వుంటుంది. అంత గొప్ప కథ అది.

రీమేక్స్ కాకుండా చెప్పాలంటే – సాక్షి, అందాలరాముడు, బుద్ధిమంతుడు, ముత్యాల ముగ్గు. అలాగే 'వంశవృక్షం' నవల కన్నడంలో తీశారు, అది మేం తెలుగులో తీసినప్పుడు దాన్ని పూర్తిగా నేను స్వంతం చేసుకున్నాను. నవలా రచయిత ఎస్. ఎల్. భైరప్పగారు – దాన్ని చిత్రంగా తీస్తామని ఎందరోవెళ్ళి అడిగినా యివ్వనన్నారు, సినిమా తీస్తే నవలని పాడుచేస్తారని. నేను వెళ్ళి అడిగినప్పుడు ఆ మాటే అని 'అసలు నా నవల నీకేం అర్థమైంది?' అనడిగారు. నాకు ఏం అర్థమైందీ అంటే – 'నాకు ఆ నవల మీద గౌరవం వుంది. ఇన్ని లక్షలు ఖర్చు పెడుతున్నాం. దీనికి మించిన ఋజువు ఏం కావాలి. మిగతా వివరాలు మీరు నాకు నవల యిచ్చాక మాట్లాడతాను' అన్నాను. ఆ సినిమా ప్రారంభించేముందు యిరవైసార్లు చదివి, మైళ్ళ కొద్దీ నడిచి, ఆలోచించి, ఒంటపట్టించుకున్నాక 'ఆ కథ నాది' అనిపించాక, అప్పుడు రాయడం మొదలుపెట్టాను. ఆ కథలో లేనివి కొన్ని అందులోంచి రావాల్సినవి నాకు స్ఫురించాయి. నేను కొన్ని మార్పులు చేశాను. విజువల్ అప్పీల్ వచ్చేలాగా తీసుకువచ్చాను. అందులో మొదటి వాక్యం.... "వాళ్ళబ్బాయి నదిలో పడి చచ్చిపోయాడు. ఆయన దీనంగా గోడకి జారగిలబడి కూర్చున్నాడు" – ఆ ఒక్క వాక్యానికి నేను వంశీకృష్ణ పాట పెట్టి, నావలో గోదావరి దాటుతుండడం, ఇంతలో సాయం కోసం వెళితే కొడుకుని పంపించి ఈ లాంచిలో వెళ్ళిపోయాడు. నావ పక్కనే వస్తుంటే, ఈ దేవుడికి పూజ చేసి దీపం పెడుతూంటే

ఆయనింట దీపం ఆరిపోతుంది. ఆ ఒక్క వాక్యాన్నీ - 'చచ్చిపోయాడు' - అన్నదాన్ని యింతగా పెంచాం. దాన్ని భైరప్పగారు చూసి మెచ్చుకున్నారు. ఆ ఒక్క వాక్యాన్ని నది దాటడం, యివతలి గట్టు, అవతలి గట్టు అని పెట్టి 'ఐరనీ ఆఫ్ ఫేట్' - దేవుడికి పూజ చేస్తుంటే, అక్కడ కొడుకు చచ్చిపోవడం, మనవడు పడివుండడం.... 'నేనెందుకు బ్రతకాలి.... ఎందుకు బ్రతకాలి' అని అనుకుంటూండగా ఆ పిల్లాడు వుంటాడు. 'వీడికోసం బ్రతకాలి' అనుకోవడం - ఇదీ 'వంశవృక్షం'కి పునాది. అలా నేను స్వంతం చేసుకుని రీమేక్ అయినప్పటికీ బాగా సంతృప్తి ననుభవిస్తూ రాశాను. ఆ నవల చదువుతున్నప్పుడు ఎంజాయ్ చేశాను. పుస్తకంలో కొన్ని భాగాలు అండర్‌లైన్ చేసుకుని బాపుగారితో చర్చించి స్క్రిప్టు రాశాను. ఐదారు వందల పేజీల నవల అది. దాన్ని తెరమీద రెండు గంటల్లో చెప్పాలి. అందుకే అందుకు అవసరమైన పాత్రలనే తీసుకొని వాటికే ప్రాముఖ్యం యిచ్చాం. అంత మాత్రాన వదిలేసినవి చెడ్డవని కాదు. నవలంటే కళ్ళు మూసుకుంటే బొమ్మలు కనిపిస్తాయి. కానీ సినిమాకి అలా కాదు కదా! రెండు గంటల్లో పూర్తి కథ చెప్పాలి. అందుకని కొన్ని పాత్రలని తగ్గించాల్సి వచ్చింది.

సినిమా షూటింగ్ ప్రారంభానికి ముందే నేను స్క్రిప్టు రాస్తాను. షూటింగ్‌కి వెళ్ళాక స్క్రిప్టు మార్చే అవసరమే అసలు రాదు. అయితే ఒక 'స్కూల్ ఆఫ్ థాట్' వుంది. అక్కడికక్కడ లొకేషన్‌లో స్క్రిప్టు రాయడం. కొంతమంది 'ఎక్స్‌ట్రాడినరీ జీనియస్'లు వుంటారు. వారికి లొకేషన్‌లో నటీనటులతో మాట్లాడుతుంటేగానీ ఇన్స్‌పిరేషన్ రాదు. అటువంటి వాళ్ళు అప్పటికప్పుడు రాస్తారు. అది హిట్ అయితే అలాగే రాయాలి అనేవాళ్ళు వున్నారు. కానీ అది వేళాకోళంగా కనిపిస్తుంది నాకు. విధి లేక అయితే తప్పదు. నేనంటే ఒక పనిచెయ్యను. ప్రొడక్షన్, బిజినెస్ చూస్తాను.... రాస్తాను కాబట్టి నేను రాయడంలో కాస్త ఆలశ్యం జరగవచ్చు తప్పితే - అదీ ఏడెనిమిది సంవత్సరాలుగా.... యివన్నీ కూడా స్క్రిప్టు మొత్తం పూర్తయిన తర్వాతనే చూస్తున్నాను.

కొందరు ఆ స్పాట్‌లో అప్పటికప్పుడే కేరక్టర్లనీ, సంభాషణలనీ మార్చేసి, కావలసిన 13వేల అడుగులకీ 70 వేల అడుగులు తీసేసి అందులోంచి కావలసినది తీసుకుంటూ వుంటారు. అలాంటి చిత్రాల్లో ఆర్ట్ మృగ్యం అని నా నమ్మకం. అలాంటి సినిమా హిట్ అయినా నాకు సంతోషం కలుగదు. వాళ్ళ డబ్బుతో వాళ్ళు ప్రయోగాలు చేసుకుంటే పర్వాలేదు, యూరోప్‌లోని ఇంప్రూవైజేషన్ నిర్మాణకారుల్లా....! కానీ ప్రొడ్యూసర్ చేత మూడు నాలుగు సినిమాలకయ్యే డబ్బు ఖర్చుపెట్టిస్తారు. అన్ని వేల అడుగులుతీశాక అందులోంచి ఏరతారు... అందులోంచి మంచివి పెడతారు. చిత్రం చూస్తుంటే జంపింగ్‌లూ అవీ కనిపిస్తూ వుంటాయి. అది పద్ధతికాదు. ఇది నేను చెప్పాలి అని అనుకుంటే ముందు నాకు కావలసింది నేను చెప్పడం తెలుసుకోవాలి. తెలుసుకున్నాక సినిమా తియ్యాలి. అంతేకానీ 'నాకు తోచిందంతా తీస్తాను' అంటే యిది చాలా ఖరీదైన మీడియం.

అయితే ప్రేక్షకుల అభిరుచులు కూడా తమాషాగా వుంటాయి. 'అందాల రాముడు' చాలామంచి కామెడీగా విభిన్న పంథాలో స్క్రిప్టు తయారుచేసుకుని, ఓ ఏభైవేలు పెట్టి ప్రత్యేకంగా లాంచీ తయాచేయించి, రెండు వందల ఏభైమందితో గోదావరి మీద ఎంతో సరదాగా అందరం ఎంజాయ్ చేస్తూ తీశాం. కానీ తీరా విడుదలయ్యాక అప్పుడు, 'బోట్‌లో చుట్టేశార్రా' అన్నారు, కానీ అదే సినిమా యివాళ మళ్ళీ విడుదలైన ప్రతిచోటా – ప్రతిసారీ బాగా ఆడుతోంది. అంచేత 'మంచి స్క్రిప్టు ఏదీ' అని రచయితని అడిగితే చెప్పడం కష్టమే. ముందుగా చెప్పినట్లు రాసేవాడికి అన్నీ బెస్టే. అందరికీ నచ్చేస్థాయిలో, అందరికీ అర్థమయ్యే రీతిలో వుంటేనే అది మంచి స్క్రిప్టు అవుతుంది. బుద్ధిమంతుడు, ముత్యాలముగ్గు చిత్రాలు వెంటనే అర్థమయితే 'అందాలరాముడు' లాంటి చిత్రం విషయంలో ఆ అర్థం చేసుకోవడమన్నది పదేళ్ళ ఆలశ్యం కావచ్చు అంతే.

***(విజయచిత్ర 1982)***



# హాల్లో నవ్వినంత మాత్రాన మంచి కామెడీ అని చెప్పలేం....

హాస్యం సంభాషణలు అట్టేలేకుండా చెయ్యాలి. విజువల్ కామెడీ బాగుంటుంది. అటువంటి కామెడీ చెయ్యడం చాలా కష్టం.

చార్లీ చాప్లిన్, బస్టర్ కీటన్, జెర్రీలూయిస్ వంటి వారిది ఎక్కువగా విజువల్ కామెడీ, మనదంతా ఎక్కువగా డైలాగ్స్ మీద ఆధారపడిన కామెడీ. ఆ విధంగా నేను రాసిన వాటిల్లో రావుగోపాలరావుగారి మీద వచ్చిందంతా 'భక్తకన్నప్ప'లో కానివ్వండి, 'ముత్యాలముగ్గు'లో కానివ్వండి - అంతా డైలాగ్ ఓరియంటెడ్ కామెడీ. ఇందుకు భిన్నంగా 'బంగారు పిచ్చుక'లోనిది సిట్యుయేషనల్ కామెడీ. అయితే మన ప్రేక్షకులు ఎటువంటి కామెడీని రిసీవ్ చేసుకుంటారు అన్నది చెప్పడం కష్టమే. 'అందాల రాముడు'కి హాల్‌కి వెళ్ళి చూస్తే 'ఇది సిల్వర్ జూబిలీ' పిక్చర్ అనుకునేంతగా నవ్వారు. కాని అది ఏవరేజ్ అయిందప్పుడు. అదే 'ముత్యాలముగ్గు' సినిమాకి ఎవరూ పైకి నవ్వలేదు. కానీ అది అత్యధిక ప్రజాదరణ పొందిన హాస్యం అయింది. హాల్లో నవ్వినంత మాత్రాన మంచి కామెడీ అని చెప్పలేం. బిగ్గరగా నవ్వకపోయినంత మాత్రాన అది జోక్ కాదనీ చెప్పలేం. కాకపోతే లోలోపల నవ్వుకుని, బయటకు వచ్చిన తర్వాత చెప్పుకుని ఎంజాయ్ చేస్తారు. 'ముత్యాల ముగ్గు' డైలాగ్స్ ఆంధ్రప్రదేశ్‌లో మొదటిసారిగా రికార్డులు పదివేలు అమ్మాయి.



బంగారు పిచుక తయారీలో బాపు, సాక్షి రంగారావు

ఒక హాస్య సంఘటన బాగా రూపొందించాం అని ఎప్పుడు అనిపిస్తుందంటే దాన్ని శ్రోత విని, మనసులో పెట్టుకుని దాన్ని 'రిపీట్' చేస్తే అది ఆ హాస్యాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్ళినట్లు.

ముత్యాల ముగ్గులో "కాలు తీస్తేయింత, బుర్ర పగలగొడితే యింత, కాలేజీ సీటుకింత, మర్డర్‌కింత, నాలుగింటి కాంబినేషన్ అయితే యింత" అని రాశాను. ఆ సినిమా విడుదలైన రెండోవారమో, మూడోవారమో రాజమండ్రి వెళ్ళాను. ఓ బండి అతను - 'బ్రెడ్డు - జామూ - కలిపి అయితే యింత, జామ్ లేకుండా బ్రెడ్ అయితే యింత, చికెన్ అయితే యింత, చికెన్‌లో బోన్ లేకపోతే యింత' అని బండిలో లౌడ్‌స్పీకరు పెట్టి జోక్‌ని రీప్రొడ్యూస్ చేశాడు - అతని అవసరానికి తగ్గట్టుగా. జనం నవ్వుకుంటున్నారు అది విని. అలా చాలా జోక్స్ ఉన్నాయి. ఇప్పుడు 'అమ్యామ్యా' అనే పదం వుందనుకోండి.... 'బుద్ధిమంతుడు'లో. నిజానికి అది నాది కాదు. అల్లురామలింగయ్యగారిది. నా ఎక్కవుంట్‌లో పడిపోయింది. నాకు పేరొచ్చేసింది. ఆయన యిప్పటికీ అంటూంటారు. - 'మీదే కదటండీ' అని. 'మీరొప్పుకున్నారు కదా' అంటుంటాను. ఇవాళ్టికీ 'అమ్యామ్యా' అనేది నిలబడిపోయింది. ఒకమాట మూడక్షరాలైంది. తర్వాత అదే విధంగా ఇంకో పదం కాయిన్ చేశా. 'పేపర్‌వెయిట్' అని, కానీ దానికింత గుర్తింపురాలేదు.



నామటుకు నాకు హాస్యం అనేది విజువల్‌గా.... దృశ్యపరంగా ఉంటేనే బాగుండుననిపిస్తుంది. కామెడీలో డైలాగ్ అనేది వేరే డిపార్ట్‌మెంట్. ఇప్పుడు ఎక్కువ మాట్లాడే విలన్‌తో పొలిటికల్ సెటైర్ చెయ్యాలన్నప్పుడు డైలాగ్స్ తప్పవనుకోండి. అయితే ఇవాళ విజువల్ కామెడీ ఎవరూ ప్రయత్నించడంలేదు. ఈ తరం వాళ్ళు అసలు అటువంటి ప్రయత్నం చెయ్యడంలేదు. అంతా డైలాగ్ మీదే.... పొలిటికల్ సెటైర్... సోషల్ సెటైర్... లేకపోతే అశ్లీల పదాలు వెయ్యడం.... అంతే తప్ప, విజువల్‌గా మూవ్‌మెంట్‌లో, ఒక చూపులో కామెడీని కాలిక్యులేట్ చెయ్యడం పోయింది. నేను డైలాగ్ రైటర్ అయినప్పటికీ మొదట మనసులో బొమ్మ గీసుకుని దాని కెంత కావాలో అంతే డైలాగులు రాస్తాను. సీన్ డైలాగ్ ఓరియంటెడ్ అయితే తప్ప విజువల్‌కే ప్రాధాన్యత యిస్తాను. 'బొమ్మ మొదట, శబ్దం తర్వాత' అని నా ఉద్దేశం.

'మనవూరి పాండవులు'లోని ఓ సన్నివేశం విజువల్‌కి ప్రాధాన్యతగలది. ఇది జనాన్ని బాగా ఆకట్టుకుంది. అల్లురామలింగయ్య బాగా తాగేసి, భోజనానికి కూర్చుంటాడు. వెనక నుంచి ఓ చెయ్యి నెయ్యి వడ్డిస్తుంది. ఇంతలో మూడు చేతులు

వస్తాయి. ఈ సన్నివేశం హిందీ (హమ్‌పాంచ్)లో కూడా బాగా ప్రజాదరణ పొందింది. నవ్వు తెప్పించింది. ఇలాంటివి ఎక్కువగా చూడాలని వుంది. అయితే వీటికి టైము వుండాలి. ఇవాళ అర కాల్‌షీటు, పావుకాల్ షీట్లతో పనిచేస్తుంటే యిలాంటివి రావు. మొత్తం సన్నివేశం విజువలైజ్ చేసుకుని ఆ పాత్రకు కావలసినంత డైలాగ్ (మినిమమ్) మాత్రమే రాసి, పాత్రల కదలికల్లో కామెడీ పలికిస్తే చిరస్థాయిగా వుండే స్థాయిలో చార్లీ చాప్లిన్ వంటి కామెడీ మనకీ వస్తుంది. అలాంటి హాస్య సన్నివేశాలే నాకు యిష్టం.

*(విజయచిత్ర, 1987)*



శీర్షికా రమణీయం

# చిత్రరేఖలు

ఆర్యా,

"బాక్సాఫీసుకూ, బహుమతు (అవార్డులకు) కలయిక అసంభవము" అని వాదించే వారితో ప్రతివాదించే వారిలో నేను కొందర్ని. కాని ఇప్పుడు ఈ విషయాలలో ఇదమిత్థంగా చెప్పేందుకు వీల్లేకుండా ఉంది. దెబ్బతిన్న చిత్రానికే బహుమతి వస్తుందన్న కొండ గుర్తులు చెరిగిపోతున్నాయి. రంగులు కూర్చడం కష్టంగా ఉంది.

మొదట దుమ్మెత్తిపోసిన చిత్రానికి బహుమతి వచ్చేసరికి, 'అరెరే ఇది పసిగడితే, దీన్ని ముందే మెచ్చుకున్న ఘనత మనకే దక్కించుకునే వాళ్ళంస్మీ' అని కొందరు కళాభిమానులు వాపోయి నాలిక్కరుచుకుంటున్నారు. మొత్తం మీద అందరికీ ప్రాణం ఖంగారుగా ఉంది. ఏది కళాఖండమో ఏటేటా ఏప్రిల్ నెలాఖరుదాకా పసిగట్టలేకపోతున్నారు.

అందువల్ల ఇటుపైన నిర్మాతలు కాస్త ముందస్తుగానే 'ఇది బహుమతినందు కొనగల కళాఖండమూ, (బాక్సాఫీసు విజయానికి అపశకునమే అనుకోండి) అని క్లూ ఇచ్చి సాయపడాలి. ఉత్తరాదిన అప్పుడే కొందరు అలా చేస్తున్నారు; నామటుకు నేను అలాగే చేస్తాను.

వచ్చే యేడాది అవార్డు విన్నర్
సి. హెచ్: కామేశ్వరరావు,
(విశాఖపట్నం)

❀ ❀ ❀ ❀

ఆర్యా,

ముడిఫిలిం కట్‌కట ధర్మమా అని, 1957 జూన్ తరవాత వచ్చిన చిత్రాలనే డబ్ చేయాలని శాసనం వేసి చిత్రాల దిగుమతికి ఒక విధంగా పరిమితిపెట్టారు. ఇక, స్ట్రెయిట్‌గా తీసి, దేశాన్ని మరమ్మతుచేసి, సంఘాన్ని అరంగుళం ఉద్ధరించే చిత్రాలకు ఇరుగుపొరుగు భాషా చిత్రాల కథలను తీసుకునేటపుడు కూడా ఫలానా తారీఖు తరవాత వచ్చిన కథలు కాపీ చేస్తేనే కోటా యిస్తాము. అని భయం చెబితే, కొంత కాలానికైనా తెలుగులో ఒరిజనల్ కథలు పుడతాయేమోనని కొందరు దుష్టులు ప్రచారం చేస్తున్నారట. టమిల్‌లో హిట్టయిన పిచ్చర్‌ల స్టోరీల సంగతి వీళ్ళకేం తెలుసు?

–కాపీ రైటర్.

## దొరలవాటు

ఆర్యా,

హాలీవుడ్ కంటే మనవాళ్లు ఒక విషయంలో బాగా ముందుకు పోయినట్లు అనుమానంగా ఉంది. నటుడికి, నటికి ఎంత వయస్సు ఉంటే అంత వయస్సే ఉన్న కారెక్టరు ఇచ్చి యాక్ట్ చేయించటం వాళ్ళ మామూలు. మన సినిమాల్లో ఈ దొరలవాటు లేదు. మన నటీనటులందరూ కారెక్ట రాకర్లు కనక పాతికేళ్ళ వాడిచేత ముసలివేషాలు వేయించటం, వయస్సు మళ్ళినట్లు కనబడే స్త్రీ స్టార్లచేత పెళ్లీడు వేషాలు వేయించటం ఆనవాయితీగా ఉంటోంది. మన నిర్మాతలు హాలీవుడ్‌ను అనుకరిస్తారని విమర్శకులు ఈ రాస్తారుగాని ఈ ఒరిజినాలిటీని ఎవరూ పేర్కొనరేం?

– 'సర్వపాత్రధారి'

## కొత్తచొక్కా

ఆర్యా,

చాలా కాలం నుండి ఒకేలా ఉంటున్న నా మే(ని)కప్పులో కొప్పులో ఇటీవల కొందరు కొన్ని సవరణలు చేసి లాల్చీ గట్రా తొడగటంలో, గిట్టనివాళ్ళు నన్ను చూసి తెగ అసూయ పడిపోతున్నారట. నారదుడికి చొక్కాయేమిటని విమర్శకవులు వెక్కిరిస్తున్నారట. నాకుమాత్రం సరదాలుండవా? నేను చొక్కా తొడుక్కోరాదని రూలు పాసైందా? ఇంతకీ, పిక్చర్లలో కొత్తదనం కావాలి మొర్రో అని వీళ్ళే గోల పెడతారుగదా. ఇలా ఓ పెదనించి ఇలాటి మార్పులు చేస్తే హేళన చెయ్యడం తగునా?

– సినీనారదుడు.

## జరిగిన కథ

మొన్న మా వూళ్ళో పెద్ద దగా జరిగిపోయింది. వెంటనే పంపేసి బాగా శాస్తి చేశామనుకోండి. కొత్త పిక్చరొచ్చింది. పేరూ అదీ చూసి ద్రౌపది కథ అనుకున్నాం. దానికి వెనిస్ ఫెస్టివల్లోనూ, ఇంకా ఎక్కడపెడితే అక్కడా అడ్డమైన ఎవార్డులూ వచ్చాయని విని గొప్పదనుకునీ బెంగాలీ 'నాగేశ్వరరావు', బెంగాలీ 'రామారావు' 'రేలంగి' ఎలా వుంటారో, బెంగాలీ మూజిక్కు, రాకెండ్రోలూ ఎలా ఉంటాయోగదానీ టిక్కెట్లుకొని చూద్దుంగదా, నా రంగా ఏం చెప్పమన్నారు. ఒకటే బోరు పిచ్చరు. పెద్ద ఫ్లాపులెండి, ద్రౌపదీలేదు, భీముడు, దుర్యోధనుడూలేదు, డాన్సులు, శాంగ్సులూ అంతకన్న సరేసరి. స్టోరీలో ప్రొగ్రెసులేదు. చాలా దిగులుగా జిడ్డుగా ఉంది. మరి దీన్ని పాంచాలి ఎందుకన్నారో!?

–బెంగారావు

ఆర్యా,

ముఖస్తుతి అనేది ఎలాటివారికేనా కాస్త ఇబ్బందే. అహంకారం లేనివారికి మరీను! అందువల్ల అటువంటి సందర్భాలలో ఎవరేనా మొహంమీద చెడపొగిడేస్తే అటువంటివారు, "నేను మీరన్నంత గొప్పవాణ్ణి/దాన్ని కాను" అంటారు వినమ్రత అభినయించి. అయితే ఇది అన్నిటికీ బాగుంటుందా అని సందేహం. ఆ మధ్య ఒక పురాణ చిత్రంలో ఒక మహాపతివ్రతను పట్టుకుని ఆవిడ భర్త, దేవతలు మెచ్చేసుకునేసరికి, ఆ వేషం వేసిన తార, పాతివ్రత్య మహాత్మ్యంలో ఒక చిటికెడు మోడస్ట (వినమ్రత) మిళాయిస్తే బావుంటుందన్న తాత్పర్యంతో కాబోలు "ఆ. పోదురూ... మీరంతా ఏదో నామీద అభిమానంతో అలా అంటున్నారుగాని, నేను మీరనుకున్నంత పతివ్రతను కానులెండి" అన్న భావానికి సవిలాసంగా అభినయంపట్టింది!

ఇదేమన్నా "సెన్సార" పక్షంగా వుందా అని మా ఆవిడ అంటోంది.

– సెన్సారం.

## అద్దంలో అబద్ధం

ఆర్యా,

జీవితం నిజంలా, స్తవం వాస్తవంలా, మంచివాళ్ళు చెడ్డవాళ్ళలా, చెడ్డవాళ్లు మంచివాళ్ళలా, హిట్ పిక్చరు కళాఖండంలా, కాపీ సరుకు ఒరిజినల్ సరుకులా, కృత్రిమత సహజత్వంలా, తెలుపు నలుపులా కనిపించే అబద్ధ బద్ధమైన ఈ జగతిలో- ముఖ్యంగా సినీ జగతి గతిలో అబద్ధాలకు నిజంలా కనిపించే దుర్గుణం ఉందని ఈ మధ్యనే పసిగట్టినట్టు ఒక సినీజనుడు ప్రచారం మొదలెట్టాడు. ఒక కథ మీద, పాటమీద, ఊహామీద, నిజానికి అబద్ధపు రంగులు పూసి ఒకటో రకం నిజంలా మేకప్ చెయ్యడంలో, పెద్దపెద్ద మేకప్ ఆర్టిస్టులుకూడా ఎందుకూ పనికిరారనిపింపచేసే కళాకారులు ఉన్నారనీ వారివల్ల అబద్ధం నిజంలా కనిపించడమే కాక, దాని ఫలితంగా నిజం అబద్ధంలా కనిపిస్తోందనీ సదరు ఆసామీ నిజం చెబుతున్నాడు. దీనివల్ల హిట్టవుతుందని చుట్టూ ఉన్నవాళ్లు చెప్పినవన్నీ బజారునపడి పాప్యులర్ బదులు ఫ్లాప్యులర్ హిట్‌లు అవుతున్నాయని ఆయన నమ్ముతున్నాడట. అందువల్ల ఇటుపై ప్రతివాడూ చేతికందిన ప్రతి అబద్ధాన్నీ, (చూట్టానికి నిజాలలాగే ఉంటాయిట) అద్దం ముందు పెట్టి చూసుకోవాలనిన్నీ తన్మూలంగా ఆ యొక్క అబద్ధం తాలూకు బొమ్మ తిరగబడి బొరుసు కనిపిస్తుందనీ, అదే సిసలైన మేకప్‌లేని నిజమని గ్రహించవలెననిన్నీ ఆయన పనిగట్టుకు అద్దె సైకిలెక్కి తిరిగి మరీ ప్రచారం చేస్తున్నాడు. ఈయన కనిబెట్టానంటూన్న ఈ సిద్ధాంతం అమలులో ఈ క్రింది విధంగా ఉంటుందిట.

ఉదా: పిక్చరు చాలా యక్సలంటుగా ఉందిసార్. (అద్దంలో తర్జుమా: బొత్తిగా ఏడిచి ముక్కు చీదుకున్నట్టుంది)..... ముఖ్యంగా ట్రీటుమెంటు ఉంది చూశారూ (అద్దంలో అనువాదం: ట్రీటుమెంటు అంటూ ఒకటి ఉండేడిసిందా అని.).... సార్! మిరిచ్చిన ఎక్స్‌ప్రెషన్, ముఖ్యంగా ఆ పోట్లాట సీనులో – హాలివుడ్ స్టాండర్డుని దాటిపోతుంది. (అద్దం చెప్పే నిజం: మహచెత్తగా ఉంది.) ఇదీ వరస.

ఊహ మంచిదేగాని, ఇలా ఆ పెద్దమనిషి కిటుకులు బయటపెట్టి ఏం బాపుకుంటాడుట. తను తిన్నట్టా, మరోడిని తిన్పిచ్చినట్టా. ఇంతకీ అభిప్రాయం అడిగేవాళ్ల గురించి ఏం చెప్పడేం అంట. నిన్ను బట్టేగదా నేను వాగేది. నీకేమో అబద్ధాలే కావాలాయె. ఎలా ఉంది గురూ అని నువ్వు అనే డైలాగు, "భేషుగ్గా ఉందనవోయ్ చెవలాయీ" అంటూ సలహా చెబుతూండెనాయె. అసలు నువ్వడిగినపుడే "బాగుంది కదూ?" అంటూ టెన్నిస్ బంతిని నాకేసి కొడతావు. అది ఠంచన్‌గా నాకుతగిలి నీదగ్గిరికొస్తే గోడదా తప్పు? ఆ?

– యస్ మన్

పి. ఎస్: ఈ గోడ గోడును తప్పక ప్రింటుకొట్టించి తప్పక సినిమాల దుస్థితి విషయంలో పరవంచకులంపైగల అపనిందనుబాపి, ఆత్మవంచకులకు కొంచెం పబ్లిసిటీ ఇప్పించగలరని ప్రార్థన.

ద్రోహదం



ఆర్యా,

సినిమాల వల్ల సంగీతానికి చాలా ద్రోహం జరిగిందని నానమ్మకం. హండ్రెడ్‌యార్డ్స్ డాష్‌లో పరిగెట్టే మనిషి, హైజంప్ చేస్తున్న మనిషి చక్కని ప్రేమగీతం పాడడం లోగడ సాధ్యం కాని పనుల్లో ఒకటిగా ఉండేది. అలాంటిది ఇప్పుడే సినిమాలో చూసినా హీరో కాలుకాలిన పిల్లకంటే ఎత్తుగా ఎగిరిపడుతూనూ, హీరోయిను అత్యద్భుతమైన వేగంతో డాన్సు చేస్తూనూ, తాళం తప్పకుండా, కూర్చుని పాడుతున్నంత హాయిగా పాడటం గర్వించదగిన విషయం. ఒకప్పుడు తెలుగు దేవదాసులో బాగా తాగిన మనిషి 'జగమేమాయా' అని లయ తప్పకుండా కుండబద్దలు కొట్టినట్టు పాడితే జనం 'ఆహా ఏమి అతని సామర్థ్యము డైరెక్టరెంత మేధావంతుడు' అని గుండెలు బాదుకున్నారు. కాని ఇప్పటి సినిమాలలో మరింత క్లిష్టమైన పద్ధతిలో అనగా పరుగెత్తుతూ, డాన్సు చేస్తూ, గంతులు వేస్తూ పాటలు పాడటం చూస్తే మన చలనచిత్రకళ నూత్నశిఖరాలందుకుందని అనిపించకమానదు.

ఇట్లు

–ప్లేబాకింగ్ కింగ్.

ఆర్యా,

తమిళ, హిందీ చిత్రములను తెలుగులోకి 'డబ్' చేసినప్పుడు ఆ తెలుగు తర్జుమా, తర్జుమా తెలుగులాగా ఉంటోందని, భాష అన్యాయంగా, అస్వాభావికంగా ఉంటోందని కొందరు బాధపడుతున్నట్లు నాకు కర్ణాకర్ణిగా తెలిసింది. ఇది కేవలం తెలివితక్కువ. అసలు ప్రపంచలన చిత్రములు రెండు రకములు. ఒక రకం మామూలు 'మూవీస్'. రెండోరకము అధర చలన చిత్రములు లేక 'లిప్ మూవీస్.' వీటిలో అధరచలనమే (లిప్ మూవ్‌మెంట్) ముఖ్యం. హిందీ, తమిళ నటుల పెదాల కదలికకు తగిన పదాలు తెలుగులో పడ్డాయా లేదా అనేది ప్రధానం. ప్రేక్షకులు ఎంతసేపూ పెదవుల కదలిక చూస్తారుగానీ, భాష ఎలా రోదించినా వారికి అనవసరం. ఎక్కడైనా పెదాలు, పదాలూ కలవకపోతే చటుక్కున్న చిరాకుపుట్టి లేచిపోతారు. ఆ సినిమా 'ఫ్లాప్' అవుతుంది. ప్రజాభిరుచిని బట్టే రచయితలు అట్టి తెలుగువాడుతున్నారు. కనుక అదే సిసలైన ప్రజల తెలుగు.

– 'లిప్ సింపథైజర్'.

ఆర్యా,

మన సంస్కృతినీ, కళనూ సినిమాలు పెంచి పోషించటంలేదని విశ్వసించి నిశ్వసించే వారితో నేను ఏకీభవించను. మన ప్రాచీన కావ్యాలూ, నవీన చిత్రాలూ చాలా చదివి చూశాను. కావ్యాల్లో హీరోయిన్లు విప్రలంభంలో ఉన్నప్పుడల్లా చంద్రోపాలంభం చేయటం బాక్సాఫీసూత్రం. ఈ సూత్రాన్నే మన సినిమాలూ అనుసరిస్తున్నాయి. తెలుగులో ఏ జానపద, సాంఘిక, పౌరాణిక చిత్రం చూసినా చంద్రుడిమీద ఒకటో, రెండో పాటలు పాడని హీరోయిను కనిపించదు. ఇది మన ప్రాచీన సంస్కృతిని పోషించడం కాక మరేమిటో?

చలనచిత్రం ఫోటోజెనిక్, పాటోజెనిక్ అని ఏనాడో మన సినిమా వారు గుర్తించారు. ప్రేమ రావటం భయం, చంద్రుడి పై హిట్టో, విట్టో, తిట్టో విసుర్తూ హీరోయిను పాటపాడుతుంది. సినిమా తీయటానికి ధనం ముఖ్యమనీ, కథాకథనం ముఖ్యమనీ కొందరంటారు గాని నాకు నమ్మకం లేదు. బృందావన చందమామా, ఆన్‌ద చందమామా మొదలైన తెలుగు సంస్కృత పదాలు వేయించి పాటలు ముందు రాసుకుని వాటి చుట్టూ కథ అల్లి సినిమా తీస్తే ఎందుకు బాగాపోవు? 'చందమామా' పాటలు ఎక్కువ ఉన్న సినీమాకు – అమెరికాలో ఆస్కారు బహుమతులిచ్చినట్లు – ఇండియాలో కేస్కారు (మన కేంద్ర సమాచారమంత్రి) బహుమతులివ్వాలని నా విజ్ఞప్తి

– మ్యూజిక్కీ
(కాబోయే మ్యూజిక్ డైరెక్టరు)

అయ్యా,



చలనచిత్రములలో బీదవాడి ఇంటిసెట్టింగు కూడా జమీందారు భవనంలా పెద్ద సినిమా సెట్టింగులా అధునాతంగా ఉన్నదని ప్రజలు హేళనచేస్తున్నట్లు కనిపిస్తున్నది. ప్రజలు పాపము పగలల్లా అష్టకష్టాలు పడతారు. పూర్ ఇళ్లలో వుంటారు. అందువల్ల అందమైన పెద్ద పెద్ద సెట్టింగులకై మొహంవాచి ఉంటారు. కథలో పేదవాడి పాత్ర గదా అని పూరిగుడిసె కడితే వాళ్ల కలలు కల్లలయిపోవూ? ఈ సంగతి తెలుసుకోకుండా ప్రజలు ఆశలు గ్రహించకుండా ప్రజలు సినిమా సెట్‌లని తిట్టడం బాగులేదు.

ఇవన్నీ ఎలా ఉన్నా అసలు ప్రజలు గొర్రెలమందల వంటివారు. ప్రజాభిప్రాయం అంటే ప్రజలేమనుకుంటున్నారు అన్నది కాదు; ప్రజలేమను కుంటున్నారో అన్న విషయమై ప్రజలేమనుకుంటున్నారో అదే ప్రజాభిప్రాయం. గ్రహించమని ప్రజలకు హెచ్చరిక.

– ఒక సెట్ జన్.

ఆర్యా,



క్రితంవారం లేఖరాసిన 'మ్యూజిక్కీ' గారితో ఏకీభవించేవారిలో నేను ఇద్దర్ని (అసలు శాల్తీయే కూడా నా పార్టీయే కాబట్టి) దేశవాళీ చిత్రాలలో చందమామా డూయెట్ సాంగ్సు, సీన్సు ఉండకూడదని కొందరు దుష్టులు చేస్తున్న దుష్ప్రచారం నాకు గాభరా కలిగించింది. పబ్లిసిటీ లేకపోతే నేను పడేబాధ, నేనులేకపోతే ఆగిపోయిన కథని కదిపేలోగా ఏం చేయాలో తోచక ప్రొడ్యూసరు డైరెక్టర్లు పడే బాధ వీళ్ళకేం తెలుసు? నా మేనల్లుళ్లూ, మేనకోడళ్లూ కూడా అచ్చు పౌర్ణమినాటి నాలాగే గుండ్రంగా నున్నగా ఉన్నారన్న వైనాన్ని, వేరే ఉపమానాలు చెప్పకుండా చూపించిందుకి నేను లేకపోతే ఎలా వల్లనౌతుందీ? ప్రేమఘట్టాలతో, నేను పాటకీ, ఆటకీ అడ్డుపడకపోతే, వాళ్లు కొత్తగా ఏం డైలాగులు మాట్లాడుకోగలరుటా? ఒకళ్లనొకళ్లు తరుముకుని, పరుగెత్తడానికి (కష్టమే అనుకోండి) వెన్నెల కన్న ఎండ మెరుగా?

అసలు అన్నిటికన్న ముఖ్యమైనది నేనూ నామీద పాటా లేకపోతే, ఈనాటి సినిమా కథలు పూర్తిగా మార్చుకోవలసి వస్తుంది కదా? మనవాళ్ళు కావలిస్తే సూర్యుణ్ణి తెచ్చేనా స్టూడియోలో కట్టిపడయొచ్చుగాని, కొత్తరకం కథలు ఎక్కణ్ణించి తెస్తారూ? –

ఇట్లు

– స్టూడియో చంద్రుడు

ఆర్యా,

నిజం నిజం అని జనం గొడవ పెడతారుగాని బోడినిజం ఎవడిక్కావాలి? నిజం చెప్పడం ఎవడిచేతగాదుట! ఆ మాటకొస్తే ఒహదు చెప్పిందికి, అసలు తెలీనివాడెవడూ అంట! చెప్పడం అంటూ వస్తే నన్నే చెప్పాలి, అందులోనే ఎంతో కష్టం ఉంది. అందుకనే కావలసిన వాళ్లు ఈ ఆర్టిష్టుల్ని కావాలని బుక్ చేసుకుంటున్నారు. నువ్వు మోసపోతున్నావు అని మళ్ళీ హెచ్చరికలెందుకూ? నాకూ, వాళ్ళకీ తెలీదనా?

ఇట్లు

– అబద్ధం

ఆర్యా,

కాపీరైటరుగారి మాటే రైటు. అసలు కాపీరైటు అన్న మాటలోనే కాపీ చాలా రైటైన పని అనిన్నీ, కాపీ ఒక రైటు (హక్కు) అనిన్నీ, తాత్పర్యాలు దాంకుని ఉన్నాయి అని. పెద్దల క్రిటీకా తాత్పర్యాలు ఘోషిస్తున్నాయి. అందువల్లనే ఇరుగు పొరుగుల కథలూ, పాటలూ కాపీ కొట్టడం జరుగుతోంది.



కాగా సాటివారి గుణదోషాలలో గుణాల్ని పరిగ్రహించమన్నారు గాబట్టి, డబ్బు గణించే గుణముందని ఋజువైన వాటినే గ్రహించడం గొప్ప విషయం. అందులో స్వారస్యం అందరికి ఏం తెలుసు?

– కాపీరైటింగేల్!

ఆర్యా,

విదేశీ చిత్రాలలో హాలివుడ్ బ్రిటిషు చిత్రాలు దేశంలో విడుదల కావడంవల్ల దేశీయ పరిశ్రమకు వచ్చిపడిన అరిష్టం అందరికీ తెలిసినదే. ఏ సీను, ఏ పాట, ఏ కథ ఎందులోదో ప్రతివాడూ పసిగట్టి, మన పిక్చర్లను తిట్టిపోస్తున్నాడు. జరిగిందేదో జరిగింది. ఇటుపై ఇటలీ జపాన్ చిత్రాల ఫెస్టివల్సు ముమ్మరంగా జరిగేలావున్నాయి కాబట్టి మాదొక విజ్ఞప్తి. ఈ ఉత్సవాలకు పెద్ద పబ్లిసిటీ గట్రా ఇచ్చి అదేపనిగా అందరికీ చూపించెయ్యడం ఏమంత మంచి

పనిగాదు. కొందరు రచయితలకూ, దర్శక నిర్మాతలకూ మాత్రమే ప్రవేశం ఇస్తూ టూకీగా బొంబాయిలో తెమిల్చెయ్యాలి. మళ్ళా మద్రాసు, బెంగుళూరు అనడం న్యాయం కాదు. మద్రాసు వాళ్లు ఎలాగా ఏ కథ అయినా బొంబాయి ఫిలిం శంఖంలోంచి వచ్చి తీర్థం అయేదాకా ఆగేవాళ్ళే కాబట్టి ఆ ప్రొడ్యూసర్లు ఆనక హిందీ ఫిలిములు చూశాకనే 'ముందడుగు' వేస్తారు. అందువల్ల ఈ యూరప్ దేశాల చలన చిత్రోత్సవాలనైనా ఫిలింవాళ్ళకే పరిమితం చేయగోరుచున్నాను.

– కొందరు కథార్థులు.

## ఆంక్షా కాంక్ష



ఆర్యా,

సిలోన్ రేడియోలో ఇంగ్లీషు, అమెరికన్, స్పానిష్ రికార్డుల ప్రసారం తక్షణం రద్దుచేయించ గోరుచున్నాను. శ్రోతలు అవి కూడా మేమిచ్చిన ట్యూన్‌లే అని ఆరోపిస్తూ ఫాన్‌లెటర్లు గుప్పిస్తున్నారు.

– బాంబే మ్యూజిక్ డైరెక్టర్

ఆర్యా,

సిలోన్ రేడియోలో బొంబాయి ఫిలిం మ్యూజిక్ రికార్డులు పెట్టడం తక్షణం ఆపించగోరుతున్నాము. శ్రోతలు అవి కూడా మేమిచ్చిన ట్యూన్‌లే అని ఆరోపిస్తూ ఫాన్‌లెటర్లు గుప్పిస్తున్నారు.

సౌతిండియన్ ప్రొడ్యూస్టార్, మరియు
హిట్‌రికార్డర్.

❀ ❀ ❀ ❀

ఆర్యా,

ఉత్తమ గ్రంథాలు అనబడే బెస్ట్ సెల్లర్ పుస్తకాలలో కథతో సినిమా తీసినపుడల్లా గిట్టనివాళ్ళంతా డైరెక్టర్ల మీదికి ఒంటికాలు మీద లేచిపోయి తిట్టిపోస్తున్నారు. ఇది చాలా అక్రమం. అందులోనూ ఫలానా ఉత్తమగ్రంథం రాసినాయన బతికేవుండి ఫిల్ముకు కథ రాస్తే ఇలా చేసివుండడు అని చెప్పిందికి వీళ్ళెవరు? వీళ్ల మాటే రైటనడానికి దాఖలా ఏమిటి?

మొత్తం మీద ఇలాటి తగాదాలు రాకుండా చెయ్యడానికి ఒక మార్గం వుంది. ఇక నుండి క్లాసిక్కు గ్రంథాలు రాసే వాళ్లందరూ – రాసే శరత్‌బాబు వాల్మీకిల (బెస్ ఫిలిం రైటర్లు) లా చిన్న చిన్న వేనా రాయాలి; లేదా లావుపాటి బుక్కులు రాస్తే దాని చివర ఓ పది పేజీలలో మున్ముందు ఫిలిం తియ్యడానికి పనికొచ్చేలా కథని టూకీగా

రాయాలి. అప్పుడు ఈ పేచీలు వుండవు. ముమ్ముందు మాబోటి ప్రొడ్యుసర్ డైరెక్టర్ రైటర్‌కి శ్రమా, సిగరెట్ల ఖర్చూ, చివాట్లూ తగ్గుతాయి.

- కాబోయే ఫిలిం డైరెక్టరు

ఆర్యా,

సత్యము వక్కాణించుటకియ్యది (మేను సత్యంబులాడువారముగాము) సంపాదక లేఖగాదు; తెరవేలుపులకు వినతి.

మాకు నేటి పౌరాణిక సంచలన చిత్రంబుల వైఖరి రుచియించకున్నది. వృషభధ్వయ శకటారోహణముగాని పావలాయను నాణెములనొసంగి టిక్కెట్టనంబడు చలనచిత్ర సభాప్రవేశసాధనముఁ గ్రయించుటగాని ఎరుంగని వారమౌటంజేసి మీ చిత్రములపై నిట్టివిమర్శంజేయుటకు మా కధికారము (అవసరముగూడ) లేనిమాట నిక్క మేయైననూ సోదర పురాణపురుషుల, పురాణపు ఋషుల, పతివ్రతలపట్ల మరికొంత గౌరవము మన్నన చూపపడగలదని దురాశపడుచున్నాము. తెరవేలుపులను పేరుబడయుటంజేసి, ఇతర వేలుపులపట్ల గూడ స్నేహ సౌహార్ధముల బ్రదర్శించి వారిని అవమానించకుండుట వాంఛనీయముగాదా.

ఇట్లు

కొందరు పురాణపురుషులు

***(ఆంధ్ర వారపత్రిక - 1959)***



# బొమ్మ - బొరుసు

### బొమ్మ

మద్రాసులో నవంబరు 18 నుండి 25 వరకూ పశ్చిమజర్మనీ చలన చిత్రోత్సవాలు జరిగాయి. "ఈ చిత్రాలనుండి మనం నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది" అన్నారు ఒక సినీమనీషి.

### బొరుసు

"ఔనౌను. బాగ్రౌండు మ్యూజిక్ బిట్లు చాలా మంచివి ఉన్నాయి. మనకి చాలా పనికొస్తాయి" అన్నాడొక సంగీత సంపాదకుడు; 'మ్యూజికీవిటి కథల్లో ఎల్ హకీము పదహారణాల తెలుగు కథలా ఉంది. ఒక్క ఫ్రేం మార్చకుండా తెలుగులో డైరెక్టుగా తీసేసుకోవచ్చు, "అన్నాడొక దర్శకుడూ, నిర్మాత.

### బొమ్మ

"జర్మన్ తారలు ఏకకాలంలో రెండు పిక్చర్లకుమించి నటించరుట. అందువల్ల వారు వేస్తున్న వేషం మీద, ఆ యొక్క కథ మీదా ఏకాగ్రత చెడదు" అన్నారు ఒకాయన మన తారలకేసి కోరగా చూసి.

### బొరుసు

"మై డియర్ వెంకటేశం! మే కె నోట్! మెకేనోట్ ఎట్వన్స్! రేపు మనం జర్మనీ వెళ్ళినపుడు ఆ పాయింటుమీద లెక్చరు దంచి వాళ్ళు మనవాళ్ల దగ్గర నేర్చుకోవలసింది యంతైనా ఉందని చెప్పొచ్చు. ఇండియన్ స్టార్స్ పదేసి పిక్చర్లలో ఉన్నా కాన్సెంట్రేషన్‌లో వీళ్ళ తరవాతే యవరైనా. ఏ రోజున షూటింగుకొచ్చినా పదకొండింటికొచ్చి పన్నెండున్నరకల్లా వెళిపోతారు. బుర్రని ఏమాత్రం శ్రమపెట్టరుగదా" అన్నారు గిరీశం.

### బొమ్మ

భారతీయ చిత్రాలను వాణిజ్య స్థాయిన యూరప్‌లో ప్రదర్శించడానికిగాను రాంక్ ఫిలిం కంపెనీద్వారా ఏర్పాట్లు జరుగుతున్నట్లు కేంద్రప్రభుత్వ ప్రతినిధి ఒకరు గత వారం వెల్లడించారు.

బోరుసు

వార్నింగులేకుండా ఇలాటిపన్లు చెయ్యడం సబబుకాదు. ఇంకా నయం అమెరికాతో కూడా ఇలాటి ఎగ్రిమెంటు రాసుకోలేదు. వాళ్ల కథలూ, వాళ్ల సీనులూ, వాళ్ల పాటలూ గట్రా వాళ్లకే పట్టిగెళ్ళి అమ్మజూపితే ఏం బావుంటుంది. వెంటనే లీగల్ ఎడ్వయిజర్లను కూడా వేసుకోవాలి ఎందుకయినా మంచిది అన్నాడు బొంబాయి సినిమాలంటే ఆపేక్ష ఉన్న ఒక పెద్దమనిషి.

బొమ్మ

హాలీవుడ్ చిత్రాలు అమెరికన్‌ల నిజజీవితాన్ని ప్రతిబింబిస్తున్నాయని అనుకోవడం పొరబాటు అని అమెరికన్ ప్రతినిధి ఒకరు హెచ్చరించారు.

బోరుసు

'ఈ ముక్క మా విమర్శకులకు కాస్త గట్టిగా చెబితే మంచిది.

వాళ్లస్తమానం బొంబాయి పిక్చరు అమెరికన్ ధోరణిలో ఉండి ఆ జీవితాన్నే చూపిస్తున్నాయంటున్నారు. ఆ పని హాలీవుడ్ చిత్రాలకే చాతకానపుడు అందులో శకలాలుమటుకే తీసుకునే మాకుమటుకు చేతనవుతుందా' అన్నాడు ఒక బొంబాయి సినీవాలా

బొమ్మ

సమకాలిక భారతీయ జీవితాన్ని ఇక్కడి నిజమైన సమస్యలను చూపిస్తూ మీరు చిత్రాలు తీస్తే అవి యూరప్‌లో తప్పకుండా ప్రజల ఆదరణ పొందుతాయి. వ్యాపారరీత్యా ఘనవిజయం సాధిస్తాయి అన్నారు బ్రిటన్ నించి వచ్చిన ఒక ప్రతినిధి.

బోరుసు

ఆయన చెప్పినపని చేస్తే మన పిక్చర్లు ఇంగ్లాండులో హిట్‌లవుతే కావచ్చుగాని ఇండియాలో పనికిరావు. మనవాళ్ళ కిలాటివి నచ్చవు. అన్నాడొక బాక్సాఫీసు సూత్రాధారిటీ.

బొమ్మ

మన తారలు ఎంతసేపూ కార్లలో తిరుగుతూ జనానికి భయపడుతూ ఉంటారు. వాళ్లు జనంలో కలిసిపోయి తిరిగి కష్టసుఖాలు చూడకుండా సామాన్యుల జీవితాలను ఎలా తెలుసుకుంటారు. సామాన్యుడిలా ఎలా సహజంగా నటిస్తారు? అన్నారు బల్ రాజ్ సాహ్ని.

## బోరుసు

మనతారలు కష్టపడి అంతపనీ చేస్తేమటుకు ఏమి లాభం? మన చిత్రాలలో కథలు "సామాన్యమైనవి" కావే! అవన్నీ అసహజంగా ఉండగా వీళ్ల నటనమటుకు సహజమైతే ఏంబాంవుంటుంది గనకా. ముందర కథ గెలిచి రచ్చకెక్కడం మంచిది అన్నాడొక ఫిలిం విమర్శకుడు.

*(ఆంధ్ర - వారపత్రిక 1960)*

వ్యంగ్య రమణీయం

# చేప నవ్విన కారణం



హీరోయిన్ జలక్రీడల సెట్‌మీద షూటింగ్‌కి రంగం సిద్ధమైంది.

స్టుడియో చేపలు దిగులుగా ఈదుతున్నాయి. చిన్న వేషం వెయ్యాల్సిన ఒక నటుడు మటుకు రాలేదు. పెద్దలకు కోపం, చిన్నలకీ, గైరు హాజరైన సోదరనటుడి భవిష్యత్తు గురించిన భయం ఎక్కువవుతున్నాయి. అంతలో అతగాడు రానేవచ్చాడు. ప్రొడ్యూసరు డైరెక్టరుగారు మొహం ఓ మోస్తరుగా వాచేలా చివాట్లేసి, ఆలస్యానికి సంజాయిషీ అడిగారు.

"దాన్సిగదరగ శకునంసార్, ఎన్నిసార్లు బయల్దేరినా అపశకునం ఎదురయిందిగదా. బయల్దేరడం, ఆగిపోవడం. బయల్దేరడం, ఆగిపోవడం ప్రాణందీసిందిగాదూ సార్" అన్నాడతను నవ్వుతూ.

దర్శక నిర్మాత 'హుఁ' అన్నారు విసుగ్గా, అని నవ్వారు. నవ్వి, 'వరి సూపర్ స్టిషన్' అన్నారు. అని, 'మూఢనమ్మకం' అని ఆ భావాన్ని తెలుగులో విడుదలచేశారు. చేసి ఛీఛీ అని విసుక్కున్నారు. –కుని, మన జనం అంతే. మనజాతే అంత. పిరికిపందలు. మూఢ నమ్మకాలు అందరికీని. అనెడ్యుకేటెడ్ బ్రూట్సు. ఈ పిచ్చరులో ఇలాటివాళ్ళని దూదేకినట్టు ఏకిపారేస్తాను. అన్నారు తమ పూర్వాశ్రమ స్మరణోత్సాహంతో.

ఎవరో కిచకిచ నవ్వారు.

ఎవరది అని గర్జించాడు, దర్శక నిర్మాత. సెట్ అంతా ఊపిరి బిగబట్టి నిశ్శబ్దంగా తలవంచుకుంది.

అందరి మొహాలు పరీక్షగా చూశారు దర్శక నిర్మాత. హీరోయిను కాదు నవ్వింది. ఆవిడ చిరాగ్గా ఉంది. ఆవిడ చెలికత్తెలూ కారు. మొహాలు తెలుస్తూనే ఉన్నాయి. మొగాళ్ళకి ఈయన సెట్‌మీద నవ్వే సాహసం ఉండదని అందరికీ తెలుసు.

ఎవరది అని మళ్ళీ గర్జించబోయాడు. అంతలోనే కిచకిచమని మళ్ళీ నవ్వు వినబడింది.

ఈసారి అంతా నవ్వు వినబడ్డవేపు చూశారు. అది స్టుడియో కొలను. అక్కడ ఎవరూలేరు. ఇంకో క్షణం ఆగి మళ్ళీ వినబడింది నవ్వు.

'చేప నవ్వింది' అంది హీరోయిను హఠాత్తుగా.

ఎవరూ నమ్మలేదు.

'చేపకూడా నవ్వివోయింది' అంది హీరోయిను హేళనగా - దర్శకుడిని చూచి.

'ఎందుకు నవ్వింది?' అన్నాడాయన కోపంగా.

'నాకేం తెలుసు. కనుక్కోండి' అంది నటి కసిగా.

'చేపా ఎందుకు నవ్వావు?' అన్నాడు దర్శకుడు.

చేప జవాబివ్వలేదు - బహుశా తెలుగుభాష తెలిసి ఉండదు - పై పెచ్చు ఖాతరు లేనట్టు ఓరగాచూసి సొగసుగా తోకతిప్పి ఒకసారి తుళ్ళిపడి పక్కున నవ్వింది.

డైరెక్టరుగారు ఉక్రోషం పట్టలేక 'ఎవర్రా అక్కడ. ఆర్టు డైరెక్టర్నిలా పిలవండి' అన్నాడు.

❀ ❀ ❀ ❀

ఆ పోకిరిచే పని తెచ్చి, కొలనులో వేసింది తనేనని, అది రబ్బరు చేప అనీ, నవ్వడమే కాక, ఏడవడం కూడా దానికి చేతకాదనీ, కారణం, ప్రాణంలేదనీ విన్నవించుకున్నాడు ఆర్టు డైరెక్టరు. అతను చిన్నవాడు కొత్తవాడు.

"అదేం కుదరదు. చేప నవ్వింది. ఎందుకు నవ్విందో ఈ కాల్‌షీట్ పూర్తి అయేలోగా చెప్పకపోతివా, అంతే నువ్వు పనిమానుకోవచ్చు వెళ్ళు... యస్ రెడీ ఫర్‌ది నెక్స్ట్ షాట్' అన్నాడు దర్శకుడు అదే ఆ నాటికి తొలిషాట్ అని మర్చిపోయి.

ఆర్టు డైరెక్టరుకి ఏం పాలుపోలేదు. చేపవేపు దీనంగా చూశాడు. లాభంలేదు. ఇంటికి వెళ్ళి తలకట్టుకు పడుకున్నాడు.

దీపాలుపెట్టే వేళైంది. రాత్రి తొమ్మిదికి కాల్‌షీటు పూర్తి అవుతుంది. ఈలోగా

చేప నవ్విన కారణం చెప్పకపోతే ఆర్టు డైరెక్టరు ఉద్యోగం పోతుంది. కొత్తవాడికి మొదటి ఉద్యోగంపోతే – వాళ్ళలా స్టార్ వాల్యూ పెరగదు. పై పెచ్చు అభాండాలుపడి ఇతర కంపెనీలలో కూడా పుట్టగతులుండవు. ఎలాగ?

ఆర్టు డైరెక్టరు బెంగతో పడుకుని సుబ్బరంగా నిద్రపోయాడు. అతని స్నేహితుడైన ఒక కామెరా అసిస్టెంటు అతని గదికి వచ్చి ఆశ్చర్యపోయాడు. అక్కడ షూటింగ్ ఉంటే ఇలా తలకట్టుకు పడుకున్నావేం అని అడిగాడు.

'ఆర్చేవాడివా తీర్చేవాడివా బ్రదర్ అన్నట్టు చూచాడు ఆర్టు డైరెక్టరు. బలవంతాన చివరికి జరిగిన సమస్య చెప్పాడు.

'ఒస్ ఇంతేగదా నే చెప్పినట్టు చేయి' అన్నాడు నేస్తం.

"నువ్వు తక్షణం స్టుడియోకి బయల్దేరి వెళ్ళు" అన్నాడు ఆర్టు డైరెక్టరు నేస్తం. వెళ్ళి ఏం చెయాలో గూడా చెప్పాడు. ఆ ప్రకారం ఆర్టు డైరక్టరు స్టుడియోకి వెళ్ళి తనను బర్తరఫ్ చేస్తానన్న దర్శకుడికి నమస్కరించి, "స్వామీ! మీరు నిర్ణయించిన గడువు చాలదు. మరొకగంట దయచేయించండి" అని మనవి చేసుకున్నాడు. సరేనన్నాడు దర్శకుడు.

ఆ పిక్చరు కాల్ షీటు 9 గంటలకు ముగియగానే, డైరెక్టరుగారు, ఆ సెట్ మీది నటులూ, మిత్రులూ ఆదరాబాదరా ఆ స్టుడియోలోనే ఉన్న మరొక సెట్ దగ్గరకు వెళ్ళారు. అక్కడ ఈ డైరెక్టరుగారూ ఇంకో పెద్ద మనిషీ కలిసి జమిలిగా తీస్తున్న కొత్తచిత్రానికి ప్రారంభోత్సవం. ఈయనకన్న పెద్దవాళ్ళెవరు దొరుకుతారని ఆయనే కామెరా స్విచ్ ఆన్ చేయడానికి దయతో అంగీకరించారు. గంట క్రితమే పురోహితుడువచ్చి పూజాగీజా చప్పున మొదలెట్టి నలుగురూ వచ్చేసరికి మళ్ళీ ఆలస్యం కాకుండా ఆ బెడద తెమిల్చిపారేశాడు. 9–15కి శుభముహూర్తం. పెద్ద నటులు రచయిత, సంగీత దర్శకుడు, కామెరామెన్ కొబ్బరికాయలు – జాగ్రత్తగా సరిగా సగానికవి విరిగేలా బద్దలుకొట్టారు. ప్రొద్యూసరు డైరెక్టరు కొబ్బరికాయ అష్టవంకర్లుగా బద్ధలయేలా కొట్టారు. (కిందటి పిక్చరుకి ఆయన కొట్టిన కాయ అలాగే వంకరగా పగిలింది. అది అపశకునం అనీ పిక్చరు దెబ్బతిని కళాఖండం లేక ప్రెస్టీజీ పిచ్చరు అయి వూరుకుంటుందనీ అంతా భయపడ్డారు కాని, తీరా చూశాక అది పేద్ద హిట్టయికూచుంది! అందువల్ల ఈ సారీ కొబ్బరికాయ విధిగా వంకర టింకరగా పగలాలి! ప్రొద్యూసరు డైరెక్టరుగారు ఈ మహత్కార్యాన్ని జయప్రదంగా నెరవేర్చి గంభీరంగా నవ్వి ఫోటో తీయించుకున్నారు. వారికోరిక పైనే, ఒక కామెరామన్ (ఈ కథలో ఆర్టు డైరెక్టరుకు హితోపదేశం చేసిన అతనే) 16 ఎం. ఎం మీద ప్రారంభోత్సవాన్ని ఫిలిం తీస్తున్నాడు కూడా. అతను డైరెక్టరుగారి మొహాన్నీ, వంకరగా పగిలిన కొబ్బరికాయనీ (క్లోజప్‌లు తీసి ఆయనవంక భక్తితో, వినమ్రత ఉట్టిపడేలా చూశాడు.)

'ఇంకా ఆలస్యమేమిటి కామెరా స్విచ్ ఆన్ చెయ్యండి' అన్నారు పెద్దలు.

దర్శకుడుగారు కామెరా మీద చెయ్యివేసారు కానీ నొక్కటం లేదు. అటూ ఇటూ అదుర్దాగా చూస్తున్నారు. బెంగమొహం పెట్టి గుటకలు మింగుతున్నారు. ఉత్సవాన్ని సినిమాతీస్తున్న కామెరామన్ కూడా ఆగాడు. 'ఏమిటాలస్యం అంట అందరు పెద్దలూ వచ్చేశారే' అనుకుంటున్నారు. కొందరికి తెలుసు ఇందులోని కిటుకు. వాళ్ళు గంభీరంగా దిక్కులు చూస్తున్నారు.

భవిష్యత్తు నాశనమైపోయే ప్రమాదాలు అరగంట దూరంలో ఉన్న ఆర్టు డైరెక్టరు తనకి ఇంత ముప్పు తెచ్చిన రబ్బరు చేప చేతిలో పట్టుకొని నిమిషాలు లెక్కిస్తున్నాడు.

"రాజుగారు రాలేదు.... వారికోసం చూస్తున్నారు...." అన్నారొకరు నెమ్మదిగా.

"ఏ రాజుగారు? డిస్ట్రిబ్యూటరా?"

"కాదు అంతకన్న గొప్పవారు..."

అంతలో ఒక చిన్ననటుడు హడావుడిగా రొప్పుతూ వచ్చి దర్శకుడుగారికి నమస్కారం పెట్టాడు.

"క్షమించండి. ఆలస్యం అయిపోయింది సార్! దాన్సిగదరగ ఎన్నిసార్లు బయల్దేరినా అపశకునమే. కదలడం ఆగడం, కదలడం ఆగడం...." అన్నాడు.

పొద్దున్న మల్లె దర్శకుడుగారు నవ్వి మూఢనమ్మకంగాడు అని హేళన చెయ్యలేదు.

ఆయన కళ్ళు సెట్ గోడ వెనకవున్న చెత్తకుప్ప కేసి చూస్తున్నాయి... కిచకిచ శబ్దం అయింది. ఆయన ముఖంలో నూరువాట్ల బల్బు వెలిగింది.

చెత్తకుప్పలోంచి పెద్ద ఎలక వచ్చి ఆగి, రెండు కాళ్ళమీద నిలబడి అటూ యిటూ చూసింది.

దర్శకుడి నరాలు బాగా బిగించిన వీణతీగెల్లా వున్నాయి. "వచ్చేశారు సార్ రాజుగారు." అన్నాడు కామరామన్ రహస్యంగా.

ష్ అన్నాడు దర్శకుడు.

(మూషిక) రాజుగారు చరచర వచ్చి కామెరాశ్టాండ్ పక్కనించి దర్శకుడి పాదాల మీదుగా పరుగెత్తి వెళ్లిపోయాడు.

"యాస్ రెడీ" అన్నాడు దర్శకుడు.

అనడం అని కామెరా స్విచ్ మీద చూపుడు వేలు ఉంచడం, ఉంచి నొక్కడం, నొక్కి స్టార్ట్! అనడం, అనగానే కామెరాలో మాగజైన్ గిర్రున తిరగడం క్షణాలమీద జరిగిపోయాయి.

చేప ఫెళ్ళున నవ్వింది.

"నాకు తెలిసిందిలే భయపడకు. దానికి పిచ్చరులో లీడింగ్ చేప వేషం యియ్యి... సెంటిమెంటుని సూపర్‌స్టిషన్ అనుకుంటుంది. పెద్ద చేప వేషం

యివ్వు... నాలుగు క్లోజప్పులు తీస్తాను. వారం తిరిగేసరికి దారికొస్తుంది. ఇంకెప్పటికి నవ్వదు. ఫో. నీపని నువ్వు చేసుకో" అన్నాడు శాంతంగా.

❀ ❀ ❀ ❀

బూజుపట్టిన మూఢనమ్మకాలతో వెనకబడిపోతున్న భారతజాతి దుర్లక్షణాలను ఖండించి, దాన్ని మేల్కొలిపి, అభ్యుదయ పథంలో తీసుకువెళ్ళే మహోజ్వల చిత్రం ఆరంభమైంది.

*(ఆంధ్ర వారపత్రిక - 1958)*

❄ ❄ ❄

# అనగనగా మూడు పిక్చర్లు



అనగనగా ఒక ఫిలిం డిస్ట్రిబ్యూటరు. ఆయనకి ముచ్చటగా ముగ్గురు ప్రొడ్యూసర్లు. ఆ ముగ్గురూ దేశంమీద వేటకెళ్ళి డబ్బు తెచ్చి, అది దొరికిందన్న హడావుడిలో మూడు చిత్రాలు తీశారు. మూడో వాడికి కథ దొరక్క మరొకళ్ళ రెడిమేడ్ కథని చెక్కేసి హడావుడిగా దాని మీద తన చిత్రం చెక్కించాడు. డబ్బు వత్తిడివల్ల డిస్ట్రిబ్యూటరుగారు ఆ మూటినీ ఒకసారే వదిలారు. అందులో రెండు పండాయి. లాభాలు తెచ్చాయి. మూడోది మూడోనాటికే బిక్కమొహం వేసుకు చక్కా వచ్చింది.

డిస్ట్రిబ్యూటరు పన్నులు కట్టడానికి పద్దులు చూచుకున్నప్పుడు, రావలసిన లాభంలో నష్టం కనిపించింది.

"నష్టం నష్టం! నువ్వెందుకు కనిపించావే పాడు మొహం నువ్వానూ" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మూడో పిక్చరు పండలేదు" అంది నష్టం.

"మూడో పిక్చరా! మూడో పిక్చరా! నువ్వెందుకు పండలేదే?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"...వారి పెద్ద పిచ్చరు అడ్డొచ్చిందిగా!" అంది మూడోపిచ్చరు.

"....వారి పెద్ద పిచ్చరూ!... వారి పెద్ద పిచ్చరూ! నువ్వెందుకు అడ్డొచ్చావే" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"... వారు నన్ను తోలుకువచ్చారుగా మరీ!" అంది '....' వారి పెద్ద పిచ్చరు.

".... వారూ!... వారూ మా మూడో పిచ్చరు డబ్బు మేస్తూంటే మీరెందుకు తోలుకొచ్చారూ" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మా ప్రొడ్యూసరు తొందరపెట్టారు" అన్నారు... వారు.

"ప్రొడ్యూసరూ ప్రొడ్యూసరూ ఎందుకు తొందరపెట్టావు?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

మీ ప్రొడ్యూసరు పిల్లకాయ మా కథ కొట్టేసి తొడుక్కుని అచ్చగా మా పేరులాటి పేరే పెట్టేసుకుని మా వేషంలో పరిగెట్టుకుని మా బీడులో డబ్బు మేసేస్తూ ఉంటే, తొందరపెట్టనా మరీ" అన్నాడు ప్రొడ్యూసరు.

*(ఆంధ్ర వారపత్రిక - 1958)*





# మూల కారణం ఎవ్వడు ?

డాష్ ఫిలింస్‌వారి ట్రాష్ పిక్చరు. బ్రహ్మాండమైన బాక్సాఫీస్ హిట్ కాబోయి మానేసి ఆర్థికంగా కళాఖండం అయి ఊరుకుంది. మూడో నాటికల్లా డబ్బాలు ఝామ్మని శరవేగంతో తిరిగి వచ్చేశాయి.

❀ ❀ ❀ ❀

నాలుగోరోజు ఉదయం సంతాపసభ అను పరీక్ష ఆరంభమైంది. పెట్టుబడిదారు, దర్శకుడు మొదలగువారు కూర్చున్నారు చర్చకి. వీరంతా తరువాత చిత్రంలో పనిచేయదలచుకున్నారు గాబట్టి మీటింగ్‌కి టంగున హాజరయ్యారు.

"మ్యూజిక్ అంత బాగా ఆనినట్టులేదు. చాలదనిపించిందిస్మండీ. ఇంకో రెండు మంచి పాటలుంటే బాగుండేది." అన్నాడు రచయిత; పాటలు బాగులేవన్న ఫిర్యాదుకి షోకైన భాష తొడిగి.
నిర్మాత దర్శకుడివేపు చూశాడు.

"అదేవిటండీ! చాలకపోవడమేవిటి. ట్యూన్స్ అన్నీ హిందీలో హిట్టయినవే. మ్యూజిక్ ఎక్సెలెంటుగా ఉంది. పుష్కలంగా ఉంది. అసలిది మ్యూజికల్ పిక్చరు అని అందరూ అంటే" అన్నాడు దర్శకుడు.



"ఎవరెవరన్నారు?" అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటి. అందరూను. మన రాజారాం, ఇంకా నేమో–"

"అసలదీకాక డైలాగులలో ఇంకొంచెం పస ఉంటే బాగా పట్టేదేమో. డైలాగు విసేసరికి ఊతపదాలుగా తగులుకోవాలి జనానికి" అన్నాడు మ్యూజిక్ డైరెక్టరు గంభీరంగా – రచయిత వీపుతిప్పి, నిర్మాత దర్శకుడివేపు చూశాడు.

"అదేం మాటండీ. అసలీ పిక్చరులో ఉన్నన్ని ఘాటుమాటలు గత పదేళ్ళలోనూ లేవని అంతా అంటేనే.... సెన్సారువాళ్ళు వాటి మూలాన పిక్చరంతా కట్ చేస్తారేమోనని కూడా భయపడ్డారంతానూ–" అన్నాడు దర్శకుడు కంగారుగా.

"ఎవరూ" అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటీ, అంతానూ.... మాట వరసకి మన రాజారాం...."

❀ ❀ ❀ ❀

"ఫోటోగ్రఫీ మొహమాటపడింది సార్. వారిక్కడున్నా ఈ మాటే అంటాను. నా సెట్స్‌ని సరిగా వాడనేలేదు. వాంప్‌కి మంచి సెక్సుర్ట్ బట్టలు వేశాను. అదంతా వేస్ట్." అన్నాడు ఆర్టు డైరెక్టరు వినయంగా ఆవలించి.

నిర్మాత దర్శకుడివేపు చూశాడు.

"వాడ్డుయుమీన్, ఫోటోగ్రఫీ అద్భుతంగా ఉంది. కలర్ తక్కువ తప్పితే, ఎర్నెస్టాలర్ వర్క్‌ని మించిపోయిందని అంతా అంటేనే. కళ్లు తిరిగిపోతున్నాయన్నారు" అన్నాడు దర్శకుడు.

"ఎవరన్నారూ" అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటిసార్. అందరూను.... రాజారామూ, ఇంకానేమో–"

❀ ❀ ❀ ❀

"ఇవన్నీ నాకు తెలీదుగాని బావా. కథ సరిగాలేదోయ్, చెత్తకథ. పొద్దికూడా" అన్నాడు ప్రొడక్షన్ మానేజరు.

ఈ సారి దర్శకుడు ధీమాగా, కొంచెం గర్వంగా కుర్చీలో వెనక్కువాలి, సిగరెట్టు దమ్ము ఘాటుగా లాగివదిలి, నిర్మాతవేపు చూశాడు.

కథ అడ్డంతిరిగి తన మీదకే ఒరగడంతో నిర్మాత కంగారుపడ్డాడు. "బాగుంది. కథకేం లోటు? కథ యక్సలంటు సరుకు. ఇట్టాటిది పదిహేనేళ్ళక్రితం వచ్చిందిట అంతే. మళ్ళీ రాలేదని అందరూ అన్నారు. ఇది ఫస్టుక్లాసు కథనీ, దీంతోటి పిచ్చరు హిట్టవుతుందనీ ప్రతివాడూ అనడమే. ఎవరన్నా కొట్టేగల్రు జాగ్రత్తని వార్నింగులు కూడా ఇచ్చారు గదా విన్నవాళ్ళంతా" అన్నాడు ఆయసపడుతూ.

"అలా అని ఎవరన్నారూ" అన్నాడు దర్శకుడు మాటలు కసిగా సాగదీసుకుంటూ.

"ఎవరేటి అందరూను. మన రాజారాం. ఇంకానేమో...."

❀ ❀ ❀ ❀

హఠాత్తుగా వాక్యం మధ్యలో ఆగిపోయాడు నిర్మాత. ఒక్కసారి చుట్టూరా చూశాడు.

"ఎవరు?.... ఎవరీ రాజారాం?" అని గావుకేక పెట్టాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"ఎవడంటూ, అన్నీ యక్సలంటూ యక్సలంటూ అంటూ పక్క తాళంవేసి అంతా చెండాలం చేయించి, పిక్చరు ఫ్లాపుచేయించి, డబ్బు నష్టం అయిపించి, మన్ని దెబ్బ తీయించిన ఈ రాజారాంగా డెవడూ అంట. మన కంపెనీలో ఏంచేస్తున్నాడు" అన్నాడు నిర్మాత ఆవేశంతో.

"రాజారాంగారు సిలుకుచొక్కాలు తొడుక్కు సిగరెట్టుకాలుస్తూ ఉంటారు. ఆయన మీకు పక్కతాళంవేస్తూ, అందుకు డబ్బు చెక్కేస్తూ, తన వాళ్ళకి ఛాన్సులు ఇప్పిస్తూ ఉంటాడు, పక్కతాళం అర్కెస్ట్రాకి చీఫ్" అన్నాడు రచయిత హేళనగా.

❀ ❀ ❀ ❀

సంతాపసభ ముగిసేసరికి ఈ చిత్రం ఇలా ధ్వంసం కావడానికి దర్శక రచయితలు, సంగీత ఛాయాగ్రహణ కళాదర్శకులు, కామెరా, ఎక్‌స్ట్రాలు, క్లాపర్‌బోయ్‌లు, అందరు వీరిలో ఏ ఒక్కరూ బాధ్యులు కారనీ ప్రొడ్యూసరు డైరక్టరు చుట్టూ గోడలు నిర్మించిన 'యస్'మన్ రాజారామే ఈ పతనానికి మూలకారకుడు అని తీర్మానించారు.

*(ఆంధ్ర వారపత్రిక 1958)*

❄ ❄ ❄

# దశాదేశాలు



సాంఘిక పౌరాణిక జానపద కథాలక్షణ లక్షితములై పౌరాంఘిక చిత్రములను పేరంబరుగుచు, రెండేసి మూడేసి హీరోళ్ళు పుష్కలంగా డాన్సులు, రెండర్థంబుల, కొండొకచో మెండర్థంబుల సంభాషణంబులతో నలరారుచు, బుష్కలంబుగా ధనమును, అటు బిమ్మట రుణమును గడించుకొన్న అనేక చిత్ర విచిత్రంబుల స్రష్టయగు దర్శకనిర్మాత యొకరుండు, దుర్లభుండగు వాడొకనాడొక చిత్రమున కౌట్‌డోర్ షూటింగేర్పరచుకొని, వర్షపాతముంజేసి యది గాన్సిలుగాగా జేయునది లేక నింటగూర్చుండె. ఇవ్వార్త యొక్కపరి గుప్పు మనగానే వర్ధమాన నిర్మాత లిరువురు, దర్శకులు మరిద్దరు, పంకాలు బన్నిద్దరు బరుగున నేతెంచిరి. నిర్మాతలకు ఈ దర్శకుల వారి నెట్లేని తమ చిత్రమునకు దర్శకత్వము వహింపజేయ సంకల్పమొదలి వెయ్యిన్నూట పదారులు బజానా కూడ కొనితెచ్చిరి. వారందరూ దర్శకులవారి సన్నిధిని పైకము నుంచి నమస్కరించి -

**"హేమా హేమీ! హే! మీ**

**ధీమా భీమా యదెంత! ధీయెంతదహో!**

**హే! మా స్వామీ! తామీ**

**హేమాంజలి దయనుగొనుదు హేరాళముగె.**

యని బరిపరి విధముల సంస్తుతించి-

**"స్వామిన్! ఈ చలచ్చిత్ర**

**సీమన్ శ్రీ లక్ష్మిమార్గ**

**మేమీ? మీవద్ద నెరుగ**

**మే మీడకు వస్తిమి**

**మీ మీడకు వస్తిమి.**

అల్లకల్లోలంగా పోటాపోటీగా ఉన్నటి ఈ చలనచిత్ర పరిశ్రమలో చిత్రము తీసి ధనమార్జించు అపాయములేని ఉపాయమెట్టిది? అందుకే ఏయే మార్గములను అనుసరంచవలెను? దానికేమైన నోములు వ్రతములూ ఉన్నవా అని యడిగిరి.

అంతట దర్శక నిర్మాత నవ్వి, ఈక్రింది దశాదేశములను ప్రవచించిరి.

## జాతిరీతుల కతితము

**వెర్రిబాగులవారు కొందరు**

**పేరు మీద యపోహతో**

సాంఘికము పౌరాణికమ్మని
చాలచాల శ్రమింతురు
మేటి చిత్రపు కథల వెప్పుడు
దేశకాలాతీతముల్
కాన తెలియుడు దీనినెల్లరు
కనక సాధక చిత్తులై.

## కథలు వ్రాయునేల?

కథల నెపుడు 'వ్రాయకు' నీ
స్వేచ్ఛను ఎడబాయకు.
మొదట వ్రాయనేల
పిదప మార్చనేల!

## 'ఖంగు'మనే సత్యం:

దేవుడనే వాడి కొఱకు దేవులాడబోకు.
మార్కెట్‌లో 'లేదం'టే 'ఉన్నా'దనబోకు
'ఓం'కారం 'నోం'కారం కావు మనకు ముఖ్యం
'గీం'కారం - రూపాయం గీ(ం) కారమే నిత్యం - అదే ఖంగుమనే సత్యం.

## ని...... ఓ...... ౭

నిడివి నేటి చిత్రాలకు బాక్సాఫీసు ఛత్రం
చదివి చదివి ఆర్గ్యుమెంట్లు చెడకు నువ్వు మాత్రం
పాపాపా దుదుదు గుగు యందున మనదే ముందడుగు
ఉడుగు శంక; కాపోతే నా సలహా అడుగు.

## అమావాస్యను ఆపకు

అయ్యవచ్చేదాకా అమావాస్యని ఆపకు
అనవసరంగా చిత్రానికి అలస్యాన్ని మేపకు
హీరోలో - రోయిన్‌లో వేళకు రాపోతే
'జీరో'తో లాంగ్‌షాట్ తీసెయ్ చేతైతే.



## మరుపు కార్డు:

మ్యూజిక్ డైరెక్షన్ అనేది తెలుగులో అచ్చుపప్పు
'మాజిక్' అని అనగనొప్పు; అదే మనకు నప్పు

సినీ వ్యాపార సరళీ స్వరాలలో
ఇమిదేవి సరాగాలు
హిందీలో హిట్ రికార్డు
మనకి తురుపు కార్డు.

## సెన్సారం:



అసాధ్యమైనంతవరకు సెక్స్‌ట్రార్డినరీగా తియ్యి
మెండుగా రెండర్థాల డైలాగులు తొయ్యి
సెన్సార్ బంధాలు అడ్డొస్తాయి వెయ్యి
అప్పీలుకేషన్ మీద గ్లిసరిన్ పొయ్యి
(కాదంటే సెన్సార్ పక్షంగానే కాలక్షేపం చెయ్యి).

## అవస - రాగాలు:

అనురాగాలను రాగాలు ఆశించతగని భోగాలు
అవే అందర్నీ మన కందుబాటులో ఉంచే అసలు రాగాలు;
అనురాగాలకు ప్రత్యామ్నాయాలైన అవ - సరాగాలు.

## ఇంగ్లీషు:

"ఇంగ్లీషు ప్రపంచ భాష
దాన్ని గౌరవించు హమేష
అనవసరంగా ఇంగ్లీషు వాడకు
చేతి కింగ్లీషు రాందే పని చెయ్యకు మాటాడకు.

## వేదు:

అవ్వాబువ్వా కావాలనడం
'రెంటికీ చెడే రేవడం'
ఉన్నదొక్కటే తారకమంత్రం
లేదు భయం తారకమగు తంత్రం.
లేదు సుమీ, ఉన్నా
చేదు సుమీ, దబ్బసలు
రాదు సుమీ కీర్తి ఉన్నా పనికి
రాదు సుమీ."

*సినీ జన పరిభాషలో 'ఇంగ్లీషు మాట్లాడడం, అంటే డబ్బు ఇచ్చిపుచ్చుకోవడం' అని సరదాగా చెబుతారు.

*(ఆంధ్ర వారపత్రిక 1958)*

❄ ❄ ❄

# హాస్య నటులు

"మీరు చూస్తేగాని నమ్మలేరు. అది చూట్టానికి అచ్చు సముద్రంలాగే ఉంది" అని రాశాడు ఒక పత్రికా విలేఖరి. సముద్రాన్ని తొలిసారి సినిమాలో చూసిన రోజున.

జనం విరగబడి చూడబోయారు. సినిమాలు పుట్టిన ఆ కొత్తరోజులో ఇవే చూపించేవారు. రైలు పరిగెత్తడం, సముద్రంలో జనం ఈతకొట్టడం, చిన్న పిల్లలు ఆడుకోవడం ఇలాంటివి. కొత్తవింత తీరిపోబోతూవున్న వేళ, కథాచిత్రాలు ఇంకా పూర్తిగా రూపుధరించనివేళ ఫ్రాంసులో కామెడీలు పుట్టాయి. అవి చిన్న చిన్నవి. కారూ కారూ తరుముకోవడం, సర్కస్‌లో విదూషకుల చేష్టలూ, లావుపాటివాడు పరుగెత్తిపడటం, సన్న ఈనెపుల్లలా ఉండేవాడు ఠీవిగా నడవడం, సైన్యంలో చేరిన ఒక వెర్రిబాగులవాడు చొక్కాలాగూ అపసవ్యంగా తొడుక్కోవడం, తిన్నగా నిలబడలేకపోవడం ఇలాంటివి. రెనీక్లేర్ వంటి దర్శకులు చిన్న చిన్న అందమైన హాస్య ప్రధానమైన కథలు కూడా కట్టి చిత్రాలు తీశారు. మాక్స్‌లిండర్, లియోన్‌పెరే చిన్న చిన్న హాస్యచిత్రాలు చాలా తీశారు. అవన్నీ దృశ్యప్రధానమైనవే. రిగాడిన్ అనే ఒక పాత్ర. బాగా ప్రసిద్ధికెక్కింది. రిగాడిన్ కథలన్నీ వాడివిల్ హాస్యసన్ని వేశాలలోంచి పుట్టి నాజూకుతనం సంపాదించుకున్నాయి. మాక్స్ స్వంత పేరుతోనే పాత్రను కల్పించాడు. అన్యదేశాలలో హాస్య చిత్రాలకు మాక్స్‌లిండర్ ఒక విధంగా మార్గదర్శి.

ఆ మార్గంలో వెళ్ళి గొప్ప ప్రమాణాలను అందుకొన్న అమెరికన్‌లలో మాక్ సెనెట్‌ను చెప్పుకోవాలి. సెనెట్ కీస్టోన్ స్టుడియోలో చేరి దర్శకుడుగా, నటుడుగా ఎన్నో చిత్రాలు తీశాడు. అప్పటికి బాగా వస్తున్న సీరియస్ చిత్రాలను వేళాకోళం చెయ్యడం దగ్గర నుంచి, వెకిలి మనుషుల వెర్రిచేష్టలను చూపించడందాకా అనేక అంశాలు ఆలోచించుకుని పదిమందిని వెంటపెట్టుకుని ఏదో ఓ



మాక్ స్వెయిన్

చోటుకిపోయి ఓ చిత్రం తీసేసేవాడు. ఒకళ మోహాన ఒకళ్ళు 'కస్టర్డ్ పై' ముద్ద విసిరికొట్టుకోవడం అనేది హాలుహాలంతా దద్దరిల్లిపోయేలా నవ్వించగల అయిడియా. కీస్టోన్ బృందంలో వ్యక్తులకు ప్రాధాన్యం ఉండేది కాదు.


ఫ్యాటీ ఆర్బకిల్

అయినా అందులో మాక్ స్వెయిన్, ఫాటీ అర్బకిల్, జాన్‌బన్నీ, హెరాల్డ్ లాయిడ్, బస్టర్ కీటన్ ప్రభృతులు ఉదయించారు. కార్టును రాపిడ్ మోషన్ పద్ధతిలో తీస్తే, అది చిత్రంగా, కారుకు కార్టూన్‌గా కనబడి నవ్వించేది. ఒక రైలులో ముందరపెట్టె కిటికీ లోంచి తొంగిచూస్తున్న వాడి టోపీ ఎగిరిపోతుంది. అతను చివరి పెట్టె దగ్గరికి పరిగెత్తి చేయి జాచేసరికి ఆ వేళకి ఆ టోపీ అక్కడికి వచ్చి అందుతుంది. పెళ్ళిళ్ళూ, ప్రేమసన్నివేశాలూ కూడా మాక్ సెనెట్ చేతిలో ఆహ్లాదకరమైన హాస్య సన్నివేశాలుగా రూపుధరించేవి. వీటిలో కొన్ని ఎబ్బెట్టుగానూ వికారంగానూ ఉండేవి. కొన్ని ఈ నాటికీ ఉత్తమం అనిపించేటంత గొప్పగానూ రూపొందాయి. అంతలో సంగీత చిత్రపోటి వచ్చింది. వెంటనే మాక్ సెనెట్ వీటిలో. 'బేథింగ్ బ్యూటీ'ల బృందాల్లో దాన్ని ప్రవేశపెట్టి పోటీ చిత్రాలను పీటీ చేశారు. కీస్టోన్ కాప్స్ (పోలీసుల) ఓఘాయిత్యాలు వీటన్నిటిలోను హుషారైనవి.


క్లిఫ్టన్ వెబ్


టాటి, మాక్ సెనెట్, లారెల్

ఈ గంద్రగోళంలో ఈ సముద్రంలో ఒక రోజున చాప్లిన్, అవతరించాడు.

కొద్దిరోజులలో కీస్టోన్ లోంచి చాప్లిన్ ఎత్తుగా పెరిగిపోయి విశ్వరూపం ధరించాడు. వ్యక్తిపేరుకి ప్రచారం ఇవ్వడానికి ఇష్టపడని వాళ్ళు కూడా చాప్లిన్ గడించిన ప్రజాభిమానం చూసి జోహార్లు చెప్పి అతని ఆజ్ఞను శిరసావహిస్తామన్నారు. చాప్లిన్‌తో హాస్యంలో కొత్తయుగం ఆరంభమైంది. హాస్యానికి గౌరవం, ఉన్నతమైన స్థాయి లభించాయి. డబ్బు కూడా లక్షలకొద్దీ వచ్చిపడింది.

క్రీస్తు పేరు, బుద్ధుడి పేరు ఎరగని మారుమూల ప్రాంతాల వాళ్ళు కూడా చాప్లిన్ అనగానే సంతోషపడి ఔనౌను అనేవారు.

సహజంగానే, హాస్య నటులనేవారికి క్రమంగా వ్యక్తిత్వం, వ్యక్తిగతమైన కీర్తి ఏర్పడసాగాయి. అయినా చాలా మంది చాప్లిన్ విజయాన్ని సాధించబోయి అతన్ని అనుకరించడం దగ్గర ఆగిపోయారు. ఓ హాస్యనటుడు, చార్లీ డ్రెస్‌ను, లాగూ, టోపీ, చేతికర్ర, మూతిమీద చిన్న మీసం ఏర్పాటు చేసుకునేవాడు.

బస్టర్ కీటన్ వంటి ప్రజ్ఞావంతులు కూడా ఈ పని చేశారు. జాక్ అనే ఒకతను, దరిమిలా పేరుకూడా కాపీకొట్టిన చార్లీ అనే మరో నటుడూ ఇలా అనుకరించి చాలా డబ్బు గడించారు.



మాక్స్ లిండర్

ఆ కంగారులో - తామిద్దరూ చాప్లిన్‌ను అనుకరిస్తున్నారని మరిచిపోయి, 'జాక్ నన్ను కాపీకొడుతున్నాడ' ని చార్లీ, 'చార్లీ నాకు పచ్చి కాపీ' అని జాక్ ఒకరిమీద ఒకరు దావాలు వేసుకుని కోర్టుకెక్కారు. ఇద్దరూ ఓడిపోయారు.

ఇలా అందరూ అనుకరించబోవడంవల్ల చాప్లిన్ ప్రతిష్ఠ మరింత పెరిగింది.

చాప్లిన్ అనుసరణయోగ్యుడు కావచ్చుగాని, అనుకరణసాధ్యుడు కాడనీ, అనన్య సామాన్య ప్రతిభాశాలి అనీ లోకానికి త్వరగా వెల్లడి అయింది.

❀ ❀ ❀ ❀

అదృష్టవశాత్తు, సినిమాలో శబ్దం రావడం ఆలస్యం అయింది కాబట్టి, సినిమా హాస్యం దృశ్యప్రధానమైనదిగా, నటన ద్వారా, సన్నివేశం ద్వారా అందించగలిగినదిగా ఆరంభమైంది. అందులో చాప్లిన్ ద్వారా పరమావధినే

అందుకుంది. చాప్లిన్ టాకీలు వచ్చినా సంభాషణలు వాడడానికి మొన్నమొన్నటివరకు ఇష్టపడలేదు. ఉత్తమమైన హాస్యం స్వతంత్రంగా సంభాషణల ప్రమేయం లేకుండా నిలుస్తుందని ఆయన ఋజువు చేశాడు. మాటని వాడినా, అవసరమైనపుడు, అవసరమైనంత మేరకు వాడితే అందగిస్తుంది. అయితే ఈ సరిహద్దులు ఈనాడు జరిగిపోయాయి. కేవలం సంభాషణమీదనే హాస్యాన్ని పోషించే పద్ధతికి ఈనాడు ప్రచారం ఎక్కువ ఉంది. సంభాషణలు హాస్యాన్ని కల్పించడానికి అనర్హమైనవని ఈ వాక్యాలు చెప్పడంలేదు. వాక్చాతుర్యంలో ఉత్తమహాస్యం సృష్టించిన వారూ ఎందరో ఉన్నారు. కాని, ఒక విధంగా కల్పించి పోషించవలసిన హాస్యాన్ని రెండో విధంలో అడ్డదారిన సాధించబోవడమే బాధాకరం. ప్రజ్ఞానిధులైన ఎందరో హాస్యనటులు ఈ విధంగా అపమార్గాన వెళ్ళినందువల్ల, వారు సృష్టించగలిగి ఉండే హాస్యం లభ్యం కాకుండా పోయిందని ఒక కళాకారుడు ఇటీవల అన్నాడు.



గ్రుచ్ మార్క్స్




ఈ రెండు విధాలా హాస్యాన్ని సృష్టించినవారిలో మార్క్స్‌బ్రదర్స్‌ను ముందు చెప్పుకు మరీ మాట్లాడాలి. గ్రూచో మార్క్స్ నోట మాటలు, చిక్కో ఇటాలియన్ ఇంగ్లీషూ, హార్పో మూగహావాలూ వేటికవే ప్రత్యేకత సంపాదించుకున్నాయి. తలా తోకా, కుడీ ఎడమా మిన్నూ మన్నూ మనకి తెలిసిన ప్రపంచానికి తలక్రిందులుగా ఉండే వీరి ప్రపంచం అద్భుతమైనది.

అల్లకల్లోలంగా కనిపించే ప్రపంచం నిజస్వరూపం, అందులో వస్తువుల గమనవిధానం మనకి అర్థం కానపుడు, అర్థమైనంత మేరకే మనకి కనిపించినంతవరకే "రాయి ఎగరదు. నీరు ప్రవహించును, .గోళీకాయమీద గుర్రం నిలబడలేదు, చెవిని గిల్లినచో నొప్పిపుట్టును" అని సిద్ధాంతాలు తయారుచేసుకొని, రాయీ, నీరూ, గుర్రం, చెవీ అవి చెప్పినట్లు విననపుడు సూత్రాలకు మినహాయింపులు రాసుకుని సర్దుకుంటాం. అలా సర్దుకొనకపోవడం, ఇదంతా

ఎగా, అబద్దం తలా తోకాలేనిదీ, అంటూ దేవతావస్త్రాల కథలో రాజుగారు పంచె కట్టుకోలేదని అరచిన పసిపిల్లాడిలా గావుకేక పెట్టడం మార్క్స్ బ్రదర్స్ పద్ధతి.

సిద్ధాంతాలన్నిటినీ చితగ్గొట్టి ఈ ప్రపంచంలో, కాదంటే మా ప్రపంచంలో కథా కమామీషూ ఇవీ అని చెప్పి చిత్తం వచ్చినట్టు అల్లరిచెయ్యటం వాళ్ళ జెండా. మన కంట్లో రెటినామీద మనం చూసేవాటి బొమ్మలన్నీ తిరగబడి పడతాయనీ వాటిని మనం మళ్ళీ తర్జుమా చేసుకుంటామని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. మార్క్స్ బ్రదర్స్ సినిమా జగతి ఈ సిద్ధాంతాన్ని చితగ్గొడుతుంది. అది అపసవ్యంగా ఉంటుందని తెలిసే, వార్నింగ్ ఉండికూడా దాన్ని మనం సవ్యంగా తర్జుమా చేసుకోలేము చూస్తున్న కాసేపూ. అదే మనని మింగేసి, గ్రూచో, చిక్కో హార్పోలుగా అనువదించేస్తుంది. గ్రూచో మాటలవేగం, హార్పో చిక్కోల చేష్టల వేగం సుడిగాలిలా వచ్చి మనని చుట్టుముట్టి విపరీతమైన వేగంతో ఎగరేసుకుపోతాయి. అందులో సాధ్యా సాధ్యాలులేవు. హార్పో జేబులోంచి మూడు కప్పుల వేడి కాఫీ దగ్గర్నించి ఏదిబడితే అది తీసిస్తాడు. అర్జెంటుగా ఎక్కడికేనా పోవాలంటే జేబులోంచి సైకిలుతీసి అందుమీద ఎక్కి వెళ్ళిపోతాడు. 'ఇఫ్ విషెస్ వర్ హార్సెస్' అన్న ఇంగ్లీషు సామెతని అక్షరాలా నిజం చేసి, మనలోని అన్ని కోరికలనూ గుర్రాలు చేసి సవారీ చేస్తారు వాళ్లు. మనం అసహజం అనుకున్నదానికి, అతి సహజమైన రూపకల్పన చేసి అది సహజమైనట్టు నటిస్తారు. నమ్మమంటారు. మనకి గ్రూచో మీసం, కళ్ళజోడు హార్పో విగ్గూ అన్నీ పచ్చి అబద్ధాలు అని తెలిసినా అంతకన్నా కఠోర సత్యాలు లేవంటారు.

మనం వాళ్ళని చూసి నవ్వబోతే వాళ్ళు మనని చూసి తెల్లబోతారు ఇందులో నవ్వేందుకేముందీ అని. ఈ విషయంలో అధి వాస్తవ వాదులకన్న అతివాస్తవికవాదులు వీళ్ళే ననిపిస్తుంది. గోళీకాయమీద నిలబడి గడ్డి మేస్తున్న గుర్రం బొమ్మ మనకి అర్థం కాకపోతే ఆశ్చర్యపడతాడు సర్రియలిస్టు. మనని చూసి జాలిపడతాడుకూడా. వాళ్ళలా పడిలేచినా మనం హర్షించలేము. కారణం వాళ్ళది పూర్తిగా వ్యక్తిగతమైన భావన 'వేపకాయంత వెర్రి' అనిపిస్తుంది అర్థంకానివాడికి. ఆ భావాన్ని వాళ్ళు మనలో కలిగించలేరు. అందుకే సర్రియలిస్టులు. అలా దీన్ని మనము హర్షించగలిగితే అది మార్క్స్ బ్రదర్స్ మార్క్ అవుతుంది.




❀ ❀ ❀ ❀

'డక్ సూప్' అనే చిత్రంలో మార్క్స్ బ్రదర్స్ ఇద్దరు ఒక్కలాగే వేషం వేసుకుని ఒక ద్వారం దగ్గర ఎదురుబొదురుగా తటస్థపడతారు. ద్వారబంధం నిలువుటద్దము ఎదురుగా ఉన్నది నా

ప్రతిబింబమేనా? వాడెవడు నేనెవడు. వాడు నిజమా? నేనబద్ధమా? నేను వాడి ప్రతిబింబాన్నా అని ఖంగారుపడి మనని ఖంగారు పెట్టేస్తారు ఆ యిద్దరు. రజ్జుసర్ప భ్రాంతికి ఇంకో స్థాయిలో ఇంతగొప్ప అనువాదం చేసిన కళాకారులు అరుదు. ఇది హాస్యనటుడికే సాధ్యం అవుతుంది. వాళ్ళలో మార్క్స్ బ్రదర్స్‌కే సాధ్యం అవుతుంది.

ఇంకో చిత్రంలో ఒక దుష్టుడిని, కోడి ఈకల డస్టర్ (దుమ్ముదులిపేది)ను పిస్తోలులా చూపించి ఆయ్ అని గద్దిస్తాడు హార్పో. ఎదుటివాడు కంగారులో అది పిస్తోలే అని భ్రమపడి చేతులు పైకెత్తేస్తాడు. మనమంతా ఈ ట్రిక్కు చూసి అర్జెంటుగా పగలబడి నవ్వేస్తాం కాని నవ్వు పూర్తి అయేలోగా ఆడస్టరే పిస్తోలై పేలుతుంది. ఈసారి ఏం చేసేటట్టు. దేన్ని చూసి నవ్వేటట్టూ? ఏది నిజం అనుకునేటట్టు?


చార్లీ చాప్లిన్

'ఎ నైట్ ఇన్ కాసబ్లాంకా' అనే చిత్రంలో కూడా తొణుకూ బెణుకూ లేని హార్పో మనని విభ్రాంతులను చేసే సన్నివేశం ఒకటి ఉంది. అతను సామాన్యుడి వేషంలో (ఎప్పుడూ అదే వేషం) యధాలాపంగా వచ్చి రాత్రిపూట ఓ పెద్ద భవనానికి ఆనుకుని విలాసంగా నిలబడతాడు. హార్పో నోరు లేనివాడు. (నిజంగా మాట్లాడినా చిత్రాలలో ఎన్నడూ ఒక మాటకూడా ఆడడు). ఓ అమెరికన్ పోలీసు అక్కడికి (కాసబ్లాంకా!) వచ్చి ఇతన్ని చూసి, 'ఎవర్నువ్వు'? ఏం చేస్తున్నావిక్కడ... బిల్డింగుని మోస్తున్నావా, అని గదమాయిస్తాడు.

'ఔనౌను' అన్నట్టుగా తలతాటిస్తాడు హార్పో - పత్తికాయలంత కళ్ళను మరింత పెద్దదిచేసి నవ్వి.

ఏడిశావు ఫో అని అతన్ని ఒక్కతోపు తోస్తాడు పోలీసు.

మరుక్షణంలో అంతపెద్దభవనమూ కుప్పకూలిపోతుంది.

'నే చెప్పలే?' అంటాయి హార్పో కళ్ళు అమాయకంగారుగా.

ఇది మార్క్స్ బ్రదర్స్ ప్రపంచం. ఇందులో మనకి అర్థమయే తలా తోకా వుండవు. కార్యకారణ సంబంధ సూత్రం తూ.చా. తప్పకుండా పనిచెయ్యదు. భూమి పదార్థాలను అకర్షించడం ఒక్కోసారి మరిచిపోతుంది. టెలిఫోన్ చాకలెట్ అయిపోతుంది. ఈలోగా క్షణం విరామం లేకుండా, మూడింట ఒకవంతు మనకి కొరుకుడు పడకుండా అపరిమిత వేగంతో గ్రూచో వాగుతూనే ఉంటాడు. చికో ఇంగ్లీష్ బాగారాని ఇటాలియన్‌లా మాటాడుతునే ఉంటాడు. హార్పో మూగభాషతో, ఈలలతో నానాగోలా చేస్తునే ఉంటాడు. డబ్బు, ఆడవాళ్ళు, ఆడవాళ్ళు, డబ్బు,

డబ్బు, ఆడవాళ్ళు, ఆడవాళ్ళు డబ్బు మనకి చాలా యిష్టమని, మనందరం ఎప్పుడో ఒకప్పుడు కళ్లుమూసుకు పాలుతాగేస్తు ఆ సంగతి పిల్లి చూడటంలేదని నమ్మేసి, ఏమీ ఎరగనట్టుగా పిల్లి కళ్ళు మూసుకు పాలుతాగినపుడు దాని మీద సామెతలు విసుర్తామనీ వాళ్ళు చెబుతూ నవ్విస్తూ కంగారు పెడుతూ.....

చార్లీ చాప్లిన్‌ను గనక మరో మార్క్స్ ఆకర్షించకపోతే, ఆయన ఈ సోదర మార్క్స్ ప్రపంచంలోకే వచ్చేవాడనీ, అలా రావాలని ఆయన ఒకప్పుడు అభిలషించాడనీ హెచ్చరిక గల ఒక విమర్శకుడు వ్రాశారు.

మార్క్స్ బ్రదర్స్ పైకివచ్చిన రోజుల్లోనే, డబ్ల్యు. సి. ఫీల్డ్స్ రెండోసారి పైకివచ్చి ప్రతిభను ఋజువుచేసుకు నిలబడ్డాడు. ఫీల్డ్స్ ధరించిన లావుమనిషి వఠి దగాకోరు. పైకి అమాయకంగా ఉంటాడు. తడుముకోకుండా అబద్ధాలు చెప్పేస్తాడు. తన మీద సమస్త చరాచర ప్రపంచమూ (ఆడవాళ్ళూ) పోలీసులూ పిల్లలూ సహా) కత్తికట్టి శాయశక్తులా తనదారికి అడ్డు వస్తుందని అతనికి అనుమానం. అతను పులిమీద, ఈగమీద, మనిషిమీదా, కాలికి అడ్డంవచ్చే రాయిమీదా కూడా పక్షపాతం లేకుండా చిరాకుపడతాడు. చిరాగ్గానే వాటిని మీటి పారెయ్యబోతాడు. అవి లొంగకపోతే, దెబ్బతీస్తే మొండిగా ఎదురుతిరుగుతాడు. శౌర్యంకన్న మొండితనం వల్లనే విజయం సాధిస్తాడు. ఈ ప్రాతిపదిక మీద ఫీల్డ్స్ అద్భుతమైన హాస్య సన్నివేశాలు సృష్టించాడు.

తరువాత, జంటలుగా వచ్చిన వారిలో స్టాన్‌లారెల్, ఆలివర్ హార్డీలు గొప్పగా చెప్పుకోవలసిన వాళ్ళు. హార్డీ చాలా గడుసువాడు. కనీసం లారెల్ కన్న గడుసుదనం, తెలివితేటలూ ఎక్కువ అని అనుమానం. లారెల్ అమాయకుడు, మేధకుడులా కనిపిస్తాడు. ఉండుండి, గడుసువాడి వె(ర్రితనం చూసి, తనే తెలివైనవాడని అతనికి గుర్తువస్తుంది.... ఈ యిద్దరూ కలసి జీవితం మీద సాగించిన సాహస యాత్రలన్నీ రెండు దశాబ్దాలనుంచీ దేశదేశాల ప్రేక్షకులకు భాష తెలిసినవారినీ తెలీనివారినీ కూడా ఎడతెరపి లేకుండా నవ్విస్తున్నాయి. వీరి దారిలోనే, ఇంతటి అందచందాలు సాధించలేకపోయినా, నాజూకైన మూర్ఖత్వాన్ని వస్తువుగా వాడుకుంటూ బడ్ అబాట్, లూ కాస్టెలోలు పైకి వచ్చారు. 'త్రీ స్టూజెస్' కామిడీలకు వీళ్ళది కొంచెం పై మెట్టు అనిపిస్తుంది. అయితే త్రీస్టూజెస్ కామిడీలలో కూడా కొన్ని చాలా మంచివి గొప్పవీ ఉన్నాయి. అలాగే వీరిలోనూ కొన్ని మంచివీ గొప్పవీ దొరక్కపోవు. లారెల్, హార్డీల జంటలో లారెల్ కేవలం హార్డీ ధగధగ మెరిసిపోడానికి తోడ్పడే మసిబొగ్గు కాదు. సిసలైన మాణిక్యం అతనే. 'వీడు మనని అర్థం చేసుకోడేం? మూర్ఖుడు' అన్నట్టు మనకేసి చూసి మూర్ఖుడిలా కనబడే లారెల్ శిల్పం, బడ్ ఎబాట్ పక్కన పెట్టి చూస్తే మరింతగా ప్రకాశిస్తుంది.

ఈ పద్ధతులలో జంటగట్టి హాస్యం చేయవచ్చినవారిలో ఇటీవలి కొత్త జోడా డీన్‌మార్టిన్, జెర్రీ లూయిస్ లది. ఇది ఆ మధ్య పుట్టి ఈ మధ్య ఆగిపోయింది.



డీన్‌మార్టిన్, జెర్రీ లెవిస్



బడ్ఎబట్, లుకే

ఇందులో మార్టిన్ కేవలం జెర్రీ ప్రక్కన ప్రొటిష్ మటుకే. అయితే ఇతను చాలా బాగా పాడుతాడు. లూయిస్ చాలాగట్టివాడు. కొత్తల్లో ఇతని హాస్యం ఓ మోస్తరుగా ఉన్నా, పోనుపోను మంచి పాకానపడి, ప్రశంసలందుకొంది. అమాయకత్వానికీ, ఆకతాయితనానికీ జెర్రీ లూయిస్ ఏజన్సీ తీసుకున్నాడు. ధైర్యంకన్న మొండితనం, అజ్ఞానం, వయసుతో శరీరంతోపాటు ఎదగని బుర్ర తన పాత్రకు లక్షణాలుగా ఏర్పాటు చేసుకుని చాలా చక్కని హాస్యాన్ని సృష్టించాడు. మరికొంత సమకాలిక జీవితాన్ని హేళనచేసే సంభాషణలపై తయారుచేసినది. కొత్త చిత్రాలలో కేవలం ప్రసిద్ధ నటులను (హంఫ్రీ బోగార్ట్, చార్లెస్ బోయర్, జేమ్స్ కాగ్నీ, బాబ్ హోప్ వగైరా వివిధ తరహాల వారిని) అనుకరించి ఆనందపరచాడు.

ఇతని చిత్రాలన్నిటిలోనూ హారర్ కామిక్స్‌ను దుయ్యబడుతూ తీసినది ఎన్నతగ్గది. హారర్ కామిక్స్ చదివిన పిల్లవాడికి ఎలాటి ఘోరమైన ఊహలు వస్తాయో ఊహించడానికి శ్రమపడనక్కరలేదు. జెర్రీ వాటన్నిటినీ పోగుచేసి భూతద్దంకింద పెట్టి ఇంకా ఘోరమైన అతి వాస్తవికమైన రూపాన్ని చిత్రించి హాస్యం చేశాడు. మనోహరంగా జెర్రీ చెప్పిన వాటిలో అమాయకుడి కథ ఒకటి మరపురానిది. ఇది చాప్లిన్ సామాన్యుడిలోంచి పుట్టినదే అయినా, స్వయంగా నిలబడగల బలం, ప్రకాశించగల కాంతి దీనికి సమకూరాయి. జెర్రీ, అతని జతగాడూ డబ్బు లేక అవస్థపడుతూ ఉంటారు. ఆకలిగా ఉంటుంది. జెర్రీకి తోచక ఉత్తుత్తి పియానో వాయిస్తాడు. అది అతనికి వినబడుతుంది. మార్టిన్‌కు ఇదంతా వెర్రివేషంగా తోచి విసుక్కుంటాడు. ఇంకో నిముషం తరవాత భోంచేదాం రమ్మంటాడు జెర్రీ. కాళీ బల్లదగ్గిర కూర్చుని, నాప్‌కిన్ అవీ శ్రద్ధగా వేసుకుని తినడం మొదలుపెడతాడు. మార్టిన్‌కి ఏమీ కొరుకుడుబడదు. కాని జెర్రీమటుకు, తింటూ, పంటిసందున ఇరుక్కున్న నలుసుల్ని పంటిపుల్లతో తీసుకుంటూ తిని

ఆయాసపడతాడు. అతను నిజంగా తిన్నాడో లేదో దేవుడికెరుక. మనకిమటుకు జాలివేస్తుంది. దేవుడినీ, వాణ్ణి నమ్మమన్న వాడి సలహానూ నమ్మి నిజంగానే నీటిమీద నడచి వెళ్ళిపోగలిగిన పాలమనిషిలాగా ఇతనూ, తన పగటికలను నమ్మి, దాన్నే తినేస్తూ తృప్తిపడుతూ ఉండడం చూస్తే నవ్వొస్తుంది. భయం వేస్తుంది జాలీ కలుగుతుంది....

జంటలు కట్టకుండా ఒక్కొక్కరుగానే వచ్చిన హాస్యనటులు చాలామంది ఉన్నారు. వీరిలో శ్లాప్‌స్టిక్ హాస్యం చేయడం దగ్గర నుండి, రాజకీయస్థాయిలో ఒక దేశాన్ని, ఒక వ్యవస్థనీ హేళన చేసే వ్యంగ్య చిత్రాలలో ముఖ్యపాత్రలను ధరించడంవరకూ అనేక తరహాల, ఛాయల హాస్యం చేసినవారున్నారు. ఒక దశలో హాస్యనటులూ, నటనా ఉచ్ఛస్థాయికి వచ్చిన స్థితిలో, కథావస్తువుకు కొరత వచ్చింది. "ఇంక దేనిమీద హాస్యం చేయడం? ఇపుడు దేన్ని పట్టుకు వేళాకోళం చేయడం?" అన్న ప్రశ్న ఎదురైంది. వ్యంగ్య చిత్రాలవల్ల ఒక ముప్పుకూడా వచ్చింది. ఏ దేశపు రాజునో పట్టుకు హేళన చేస్తే వాళ్ళూ, వారి మిత్రదేశాలవారూ నొచ్చుకునే పరిస్థితి, ప్రభుత్వం సర్ది చెప్పలేక ఇరకాటంలో పడే దుస్థితి వచ్చిపడ్డాయి. అప్పట్లో అవసరంకొద్దీ కొందరు నిర్మాతలు ఓ పథకం వేశారు. ఏదో ఒక చిన్న ద్వీపాన్ని కొనేసి దానికి 'విలనోవా రాజ్యం' అని పేరు పెట్టి అందులో రాజునీ మంత్రినీ ప్రజలనీ పట్టుకునీ వేళాకోళం చేస్తే మళ్ళీ కథావస్తువు దొరుకుతుందనుకున్నారు.

❀ ❀ ❀ ❀

ఈ విధంగా పాతవాళ్ళలో చాలామంది ఇలా అవస్థపడుతూ ఉండగా 'సాంసారిక హాస్యం' మీద ఎవరికో కన్నుపడింది. అంతలో యుద్ధం వచ్చింది. కొత్త రచయితలూ నటులూ వచ్చారు. అప్పుడు కొత్త మార్గాలు దొరికాయి అయితే అప్పటికి టాకీలు వచ్చి స్థిరపడడం కూడా జరిగినందువల్లనూ హాస్య సృష్టికి, సన్నివేశాల, కథలతోపాటు సంభాషణలు చాలా తోడ్పడ్డంతోనూ హాస్య చిత్రాలపద్ధతిలో మార్పు వచ్చింది. సన్నివేశాలలో హాస్యం కన్న సంభాషణల హాస్యానికి ప్రాముఖ్యం లభించింది.

ఒకసారి దీన్ని ఒకసారి దాన్నీ, ఒక్కొక్కసారి రెండిటినీ కూడా సమర్థంగా వాడుకుని హుషారైన హాస్యం చేయగలిగిన నటులు చాలామంది వచ్చారు. సర్కస్‌లో క్లౌన్‌గా జీవనం ఆరంభించిన రెడ్ స్కెలిటన్, శ్పానిష్ ప్రేమికుడు కాసనోవా చొరవను వస్తువుగా తీసుకొని వివిధ జీవన వ్యాపారాలలో రకరకాల సన్నివేశాలలో తగని చొరవ ప్రవేశపెట్టి రమ్యమైన హాస్యం చేసిన బాబ్‌హోప్, బహుముఖ ప్రజ్ఞాశాలి. డానీకేయీ, జోయీ బ్రౌన్, టామ్‌ఎవెల్స్, డోనాల్డ్ సిండెన్, సాకాల్, మొదలగువారున్నారు.

పుష్టిగల హాస్య వస్తువు లేక మూడు చిత్రాలతో మూలపడిపోయినా మూడింటితోనూ స్మరణీయుడనిపించుకొన్న క్లిఫ్టన్ వెబ్ ఎన్నతగ్గవాడు. మర్యాదలను కట్టుబాట్లనూ తూ.చా. తప్పకుండా కట్టుదిట్టంగా పాటించాలనే తత్వంగల బెల్వియర్. సాఫిస్రీవెబ్ అద్భుతంగా నటించాడు. మంచివాడిని పిరికివాడిగా, మర్యాదస్థుడిని చొరవ పాలు తక్కువైన మేదకుడుగా పరిగణించి, ఉల్లిపాయలు పురాణంలో మటుకే తినరన్న యుక్తోక్తిని నిజంగా మన్నించి ఆచరించే సమాజంలో, సిద్ధాంతాల మడి కట్టుకుని ఎత్తెత్తి అడుగులు వేసే మనిషి ఎబ్బెట్టుగానే కనిపిస్తాడు. కాని అతన్ని చూసి తలకిందులుగా నడుస్తున్నాడని నవ్వుతున్నంతసేపూ తలక్రిందులుగా ఉన్నది మనమేనన్న సంగతి గుర్తుకురాదు.


లారెల్ హార్డీ

మంచి హాస్యానికి రోజులు, మంచి హాస్యం సృష్టించాలని తాపత్రయపడేవారు తగ్గడంతో తప్పుకున్నాయి. ప్రత్యేక హాస్యచిత్రాల స్థాయీ దెబ్బతింది. పూర్వం హాస్యనటులకు హాస్యాన్ని సృష్టించేవారు, వస్తువును ఎన్నికచేసి పెట్టేవారూ, చమత్కారాలూ, వెటకారాలూ, గమ్మత్తులూ తయారుచేసి పెట్టేవారూ చాలామంది ఉండేవారు. చాప్లిన్‌కు చాప్లినే రాసుకున్నా, మార్క్స్ బ్రదర్స్ దగ్గర నుండి జెర్రీలూయీస్ దాకా అందరికీ గాగ్ రైటర్స్ ఉండేవాళ్ళు. మార్క్స్ బ్రదర్స్ నటన అంత గొప్ప స్థాయిలో, అంతకుమించిన స్థాయిలో వేగంతో రచనలు చేసినవారిలో ఎస్.జె. పెరిల్‌మన్, రాబర్ట్ బెంచ్‌లీ వంటి దిగ్గంతులు ఉండేవాళ్ళు.

ఇపుడూ హాలీవుడ్‌లోను, బ్రిటన్‌లోనూ కూడా కొందరు ఉన్నారుగాని ఉన్నవారు అద్భుతమైన హాస్యాన్ని పొట్టచెక్కలయేలా నవ్వించేదాన్ని సృష్టించలేకపోతున్నారు. ఈనాడు హాస్యం అంతా సంభాషణమీదనే నడుస్తోంది. ఒక వ్యక్తిత్వాన్ని విశ్వజనీన దృష్టితో చూచి చూపించి నవ్వించే శిల్పం, సమాజంలో అవగుణాలకు రకరకాల సన్నివేశపుటద్దాలలో పెట్టి పొడుగ్గాను పొట్టిగాను లావుగానూ సన్నంగానూ అందంగానూ వికారంగానూ తెలివిగానూ వెకిలిగానూ చూపించి వెక్కిరించి నవ్వించి ఏడిపించే చాకచాక్యం కొరవడింది. అంతా హడావుడి మీద వ్యాపార ప్రధానంగా సాగిపోతుంది.

ప్రత్యేక హాస్యచిత్రాల తరువాత చెప్పుకోతగ్గవి హాస్యరస ప్రధానమయిన కథా చిత్రాలు. మధ్యతరగతి వాళ్ళ సంసారాలూ, వాళ్ళ ఆశలూ అడియాసలూ,

వాళ్ళు ఓ కారు కొనుక్కోగలగడం, కొనుక్కోలేకపోవడం పిల్లకి పెళ్ళిచెయ్యడం, మనవణ్ణి ఎత్తడం వగైరా చిన్న చిన్న అంశాలతో వచ్చిన నవలలను తీసుకొని చాలా చిత్రాలు తీశారు. వీటిలో మనం హాస్యనటులని మామూలుగా అనుకోని వాళ్ళంతా వేషాలు వేసి అద్భుతంగా నటించారు.

క్రమంగా ఈనాడు నిత్యజీతంలోని హాస్యాన్ని ఆవిష్కరించే శిల్పం బాగా వ్యాప్తంలోకి వచ్చింది. చిత్రంలో కథ పొడుగునా అందంగా దీన్ని సర్దుకుంటూ పోయే పద్ధతిని సర్వత్రా అనుసరించడం సాగించారు.

మన దేశంలో సినిమా హాస్యం కథ అక్షరాలా ఈవిధంగానే సాగిందని చెప్పలేము. పైన చెప్పిన వాటిలో దాదాపు అనేక పద్ధతులు కాస్త అటూ ఇటూగా వచ్చాయి. కాని, కథలో కలవకపోయినా ముఖ్య ఘట్టాల మధ్య వినోదం కోసం హాస్యం పెట్టే పద్ధతి చాలా చప్పునే ఆరంభమై స్థిరపడి పెరిగిపోయింది. వ్యక్తి శక్తికి నిదర్శనంగా సృష్టించబడ్డ హాస్యం - చాప్లిన్, కీటన్, మార్క్స్ బ్రదర్స్, హోప్, కేయీ ప్రభృతుల పద్ధతులలో (అనుకరణ అని కాదు) రాలేదు. ఎవరూ ఆ విధమైన ప్రయత్నం చేయడానికి ఆస్కారం లేకపోయింది. మన సినిమాలో హాస్యానికి ఆరంభంలో కొంత ప్రాముఖ్యం ఉండి, క్రమేపీ తగ్గి ఇపుడు బాగా పుంజుకుంది. అయినా, హాస్యనటుడి మీద, అతని పాత్రమీద ఆధారపడి చిత్రాలు తీయడం అనేది జరగలేదు. ఒకటీ అరా మినహాయింపులున్నా, మొత్తం మీద ఏదో ఒక్క రసాన్ని నమ్ముకు సినిమా తీయడం లాభసాటి కాదని నిర్మాతలు నమ్మినందువల్ల హాస్యం, హాస్యనటులూ సినిమాలో ఒక భాగంగానే ఉంటూ వచ్చారు. కథలో అతికినా అతక్కపోయినా ఆ భాగాలను అక్కడక్కడ వేసవిదారిమీద చలవపందిళ్ళ మల్లె ఏర్పాటుచేస్తూ వచ్చారు.

టాకీలు కాలు నిలదొక్కుకుని, తరవాత పౌరాణి కాళ్ళ మీద ముందుకు సాగి, సాంఘికాలు దారినపడేవేళకు హిందీ చిత్రసీమలో సమర్థులైన హాస్యనటులు తయారయ్యారు. అయితే మన దేశంలో చిత్రాల స్వరూప స్వభావాలను బట్టి ఫ్రాన్స్, అమెరికాలో ప్రత్యేక హాస్యచిత్రాలూ, వాటిలోంచి చాప్లిన్‌లూ మాక్‌సెటిలూ పుష్కలంగా పుట్టుకురావడం జరుగలేదు. ఒక ఇమిటేషన్ 'చార్లీ'మటుకు వచ్చాడు. కట్టూ ఫ్రెంచికట్టూ వగైరాలన్నీ ఏర్పాటుచేసుకుని ఉన్నత స్థాయిలో చాలా సరదా అయిన హాస్యం చేశాడు, సర్వత్రా ఆదరణ సంపాదించాడు. భారతీయ చాప్లిన్ అని అభిమానులంతా అతన్ని పిలుచుకునేవారు. హాస్యానికి జడ్డి మొహంగాని లావుపాటి శరీరంగాని ఉండడం లాభసాటి అన్న సూత్రం ప్రకారం వచ్చి, మొదట్లో ఆ హంగు మీదనే ఆధారపడినా క్రమంగా మంచి హాస్యం చేసినవారిలో దుర్గామోటా, దీక్షిత్, గోప్ ఎన్నతగ్గవారు. వీళ్ళలో మొదటి ఇద్దరిదీ చాలవరకూ దేశీయమైన హాస్యం. గోప్‌ది, అమెరికన్ హాస్యనటులు జంటలలో కాస్టైలోని కొంతవరకు అనుకరించి కల్పించుకొన్న హాస్యం అనిపిస్తుంది. బోసినోరు ప్రత్యేకాకర్షణగా నూరుచిత్రాలలో నటించి అలంకరించాడు బుధూ అద్వానీ. లావుగా ఉండడం వంటి హంగు

లేకుండానే మంచివాడి, అమాయకుడి పాత్రల ద్వారా హాయిగొలిపే హాస్యాన్ని సృష్టించినవాడు వి. హెచ్. దేశాయి. కేసరి పద్ధతి హెరాల్డ్ లాయడ్‌కు సమానాంతరంగా ఉండేది. ఈ విధంగా వీరందరికి ఒక సీమ గురువుపేరు చెప్పడంవల్ల ఈ వాక్యకారుడిలో దేశభక్తి, అభిమానం ఉవ్వెత్తున ఉప్పొంగి పోవటం లేదని అపోహపడటం తగదు. పైన చెప్పిన వారంతా ఎంతో కొంత సృజనాత్మక ప్రతిభను చూపి మంచి హాస్యాన్ని కల్పించినా, మన పరిశ్రమ స్వరూప స్వభావాలను బట్టి, పరిస్థితి గతులనుబట్టి, వారు పరిమితావధులలోనే పనిచేయవలసి వచ్చింది. హాస్యనటులు కాకపోయినా, ఆ తరహాలో అందర్ని నవ్వించి సంతోష పెట్టిన వారిలో అశోక్‌కుమార్, మోతీలాల్‌లను చెప్పుకోవాలి.

ఈనాడు బొంబాయి సినీహాస్యం చాలా ఖరీదైనదైపోయింది. జానీవాకర్ ఫీల్డులోకి వస్తూనే పెద్ద విప్లవం తెచ్చాడు – రుసుములోనూ బాక్సాఫీసు పలుకుబడిలోను హాస్యంమటుకు గుండెబాదుకు మరీ చెప్పుకోతగినది రాలేదు. హాస్యనటుడికి స్టార్ వాల్యూ పెరిగినకొద్దీ అతనికి హాస్యాన్ని సృష్టించిపెట్టే భారం అన్యులమీద (రచయిత, దర్శకుడు), ఎక్కువ కాసాగింది. చప్పని మాటలని,


జానీ వాకర్

నవ్వురాని చేష్టల్నీ వెకిలిగా రెండో అర్థం వచ్చే విధంగా చెప్పిచేయడం హాస్యంగా చెప్పేపరిస్థితి ఏర్పడింది. నాటికీ నేటికి కూడా హాస్యం, సినిమాలో అక్కడక్కడ మజిలీలాగా ఉంటూ వచ్చింది. కథా, హాస్యం తీర్థం ప్రసాదం కలిసిన రీతే కలుస్తున్నాయి. ఇది అఖిలభారత లక్షణం. పోతే జానీవాకర్‌కు పూర్వం నుండీ ఉంటూ, ఇపుడూ ఎదుగూ బొదుగూ లేకుండా ఉన్న వారిలో ఆగా, ఓంప్రకాష్, భగవాన్ మొదలగువారు కనిపిస్తారు. చూసిన కాసేపూ మందహాసాలూ, మహా అయితే హాసాలూ వచ్చినా తరవాత ఇంటి దగ్గిర చెప్పుకు పొట్టచెక్కలయ్యేలా నవ్వుకుందికి మిగిలే సదుపాయం చేయలేదు. రాధాకిషన్ మొండివాళ్ళనీ. బండవాళ్ళనీ మధ్యతరగతి సంసారులను అనుసరించడం ప్రాతిపదికగా వ్యవహారం చేస్తాడు. చెవులు హోరెత్తిపోయేలా ఒళ్ళు గగుర్పొడిచే కంఠస్వరంతో తారస్థాయిలో అరవడం ఈయన శిల్పం. ఇదే హాస్యానికి తారాస్థాయి అన్న నమ్మకంతో ఆయన అక్కడే స్థిరపడిపోయాడు. జానీవాకర్ కూడా అంతే. ఈనాడు అతను మామూలు పాత్రలు ధరించి మామూలుగానే ఆడి పాడి అవతలకిపోయి అతనీ వేషం

వెయ్యడమే జోక్ కాబోలు అని ప్రేక్షకులు అనుకుని నవ్వుకునే ఏర్పాటు చేస్తున్నాడు. అందుకే, చాలమంది ప్రేక్షకులు కొన్ని సినిమాలు చూశాక ఇళ్ళకుపోతూ, ఇందులో జానీవాకర్ 'సుద్దదండుగ' అనీ రేలంగి ఎందుకు వేసినట్టూ అనీ అనుకుంటూ ఉంటారు.



ఆగా తదితరులు... చార్లీ

క్రిందటితరం బొంబాయి చిత్రాలలో సర్వజన మనోహరుడు అశోక్‌కుమార్ అయితే (ఝూలా, బంధన్, నయాసన్సార్ ఈ తరంలో ఆ విధమైన స్థానాన్ని అతని తమ్ముడు కిషోర్‌కుమార్ సంపాదించుకున్నాడు. కిషోర్ కొంతవరకూ దానీ కేయీకి దేశవాళీ తర్జుమా అనవచ్చు. మిగతాదంతా కిషోర్ అనే చెప్పుకోవాలి. కోతి చేష్టలూ కుర్రతనపు పోకడలూ ఉత్సాహం అంతా కిషోర్ కుమార్ కథలలో వెదచల్లుతాడు. ఈనాడు అతనికి విశిష్టమైన స్థానం ఉంది. అతను చాలా బాగా పాడతాడు. ఆడతాడు.



వి.హెచ్. దేశాయ్

మొత్తం మీద మనదేశంలో వివిధ ప్రాంతాలలో చలనచిత్రాల హాస్యాన్ని చూస్తే నాగరికమైన నాజూకైన హాస్యాన్ని బెంగాల్ సృష్టించినదని చెప్పుకోవాలి. మహారాష్ట్రులు కూడా కొన్ని మంచి హాస్య చిత్రాలు తీశారు. అన్ని ప్రాంతాల హాస్య చిత్రాలనూ మనమంతా చూడడం తటస్థపడకపోయినా, ఉన్నంతలో మనకు పరిమితమైనవానిలో తారతమ్యాలు స్థూలంగా అంచనావేస్తే, ఉత్తరాదివారి హాస్యంకన్న దక్షిణాదివారిదే మెరుగనీ, తెలుగు తమిళ

చిత్రాలలో తెలుగువారిదే పై చెయ్యి అనీ చెప్పుకోవడం ఆత్మస్తుతీ పరనిందా కాజాలదు.

జీవిత స్థితిగతులు ఆలంబనంగా హాస్యాన్ని స్వయంగా కల్పించి పిల్లలను పెద్దలను చదువుకున్న వారిని, కున్నామనుకున్న వారిని కూడా సమానంగా నవ్వించి సంతోష పెట్టగలిగినవాడు కీ.శే. ఎన్. ఎస్. కృష్ణన్. పదిహేనేళ్ళవాడు కృష్ణన్ మధురంల జంటలేని తమిళచిత్రం ఉండేది కాదు. ప్రతి మూడో రీలుకీ వారు కనబడి (కథ మాట దేవుడెరుగు) నాయికా నాయకుల



బుధు అద్వాన్, యాకూబ్

కథకు సమానాంతరంగా తమ కథను నడిపించుకునేవారు. ఈ విధంగా హాస్యం కోసం ఎక్కువ కృషిచేసి, దానికి నగీషీలు పెట్టడంలో, ఎప్పటికప్పుడు గమ్మత్తులు ఛలోక్తులు కల్పించుకోవటంలో ఇంత శ్రద్ధపట్టీ పనిచేసినవారు దేశం మొత్తం మీదనే అరుదు. కృష్ణన్‌కు, అమెరికా హాస్యనటుల మల్లె జోక్‌లు అవీ తయారుచేసిపెట్టేందుకు 'గాగ్ రైటర్స్' కూడా ఉండేవారు.

కృష్ణన్ ఖైదునుంచి తిరిగి వచ్చాక నల్ల తంబి అదే చిత్రం తీశాడు. అందులో జైలుకెళ్ళొచ్చినవాడికి పిల్లనెవరిస్తారమ్మా అంటూ కొడుకు తల్లినడుగుతున్నట్టు తన మీద తనకే ఒక జోక్ వేశాడు. కృష్ణన్ పైకి తీసుకొచ్చిన హాస్యనటుడే తంగవేలు. ఇతడు కొన్నాళ్ళు ముసలి ముతకా వేషాలూ అవీ వేసేవాడు. తంగవేలుకి గంటకు వందమైళ్ళ వేగంతో ప్రవచించగల వాగ్బలం ఉంది. తంగవేలు తొలి నాళ్ళలో



గోప్

చేసినంత హాస్యం, విసిరినన్ని ఛలోక్తులతో ఉచ్చత దశకు వచ్చాక కనబడటం లేదు. అవకాశాలు కూడా తగ్గిపోయాయి. పాతకాలపు వారిలో సారంగపాణి చెప్పుకోతగ్గవాడు. సారంగపాణి కొత్తవి ఏమీ చేయకపోయినా, ఏమి చేసినా అది కొత్త రకంగా ఉంటుంది. మాటలాడడంలో యాస అతని సొత్తు.

కృష్ణన్ సమకాలికుడు పులిమూటై రామమూర్తి ఆ కాలంలో హాస్యంచేసి దరిమిలా మానేశాడు. టామ్ ఎవెల్ పోలికలుగల టి. ఆర్. రామచంద్రన్


భగవాన్


ఎన్.ఎస్.కృష్ణన్


టి.ఆర్. రామచంద్రన్

మామూలు వేషాలూ కూడా సరదాగానే వేస్తూ ఉంటాడు. 'జీవితం' చిత్రంలో ఇతడు హీరోగా వేశాడు. పక్కయింటి అమ్మాయి తమిళ చిత్రంలో ఇపుడు ముఖ్యపాత్ర నిర్వహిస్తున్నాడు. ఈనాడు ఉచ్చస్థాయిలో ఉన్న తంగవేలు తరవాత, చంద్రబాబు, రాజగోపాల్, కరుణానిధి, టి. ఎస్. బాలయ్యలను చెప్పుకోవాలి. వీరు చిత్రానికి పాతికముప్పై వేల నుండి డెబ్భైవేల వరకూ తీసుకుంటారుట. రంగానికి వచ్చిన కొత్తల్లో ఇన్ని వేలకీ ఇంత నటన అనుకున్న అన్ని వేలూ పుచ్చుకునే స్థానం గడించాక, అంత బ్రహ్మాండంగా ఉందా? అని అనుకుంటున్నారు. వీళ్ళందరికీ చాలవరకు, తమిళనాటి కార్మికుడు, రిక్షావాడు, పాలవాడు హాస్యానికి ప్రాతిపదికలు, మధ్యతరగతివారి


వైజయంతిమాలతో టి.ఆర్. రామచంద్రన్

జీవితంలో స్వారస్యాన్ని చూప ప్రయత్నించినవారు తక్కువ. 'యాసబాస' చాలా సుళువైన మార్గం కాబట్టి చాలమంది తరచుగా ఆ మార్గాన్నే అనుసరించారు. దొరైరాజ్ మటుకు కొంత సృజనాత్మక ప్రతిభకలవాడు. ఇతను దర్శకత్వం వహించిన చిత్రం తెలుగు ప్రతి – 'ఇల్లాలి అదృష్టమే ఇంటికి భాగ్యం' చూచే ఉంటారు. ఆ కథ స్థాయి, కల్పనా శిల్పం, చిత్రణ చాలా అందంగా, దేశీయ చిత్ర కథలలో అరుదనిపించేలా కుదిరాయి. లోకం పోకడ ఎరుగని ముగ్ధగా సావిత్రి అందులో చేసిన నటనలో హాస్యం లేకపోయినా, దాని ఫలితంగా చుట్టూరావున్న

జనాభా అంతా (దుష్టులు సహా) కార్టూన్‌లమల్లె తయారై ఆహ్లాదం కలిగించారు. అందులో సావిత్రి అన్నగారి వేషాన్ని దొరైరాజ్ నిర్వహించాడు. ఒకటి మటుకు చెప్పుకోవాలి. హాస్యం కోసం కృష్ణన్‌లా మధనపడి పనిచేసేవారు (ప్రతిసారీ అతను గొప్ప హాస్యం సృష్టించి ఉండకపోవచ్చు), దాని ప్రయోగముమీద శ్రద్ధపెట్టి పనిచేసేవారూ రోజుకు మూడు కాల్‌షీట్‌లు పనిచేయవలసి ఉన్న ఈ రోజున లేరు. ఆ సంప్రదాయం అతనితోనే అయిపోయింది.



నల్లతంబిలో భానుమతి, ఎన్.ఎస్.కృష్ణన్

మొత్తం మీద తమిళ చిత్రాలలో తొలినుండి హాస్యానికి ఉన్న ప్రాముఖ్యం, నేటికి ఉన్న విస్తృతీ తెలుగు చిత్రరంగంలో ఉన్నట్లు తోచదు.

రేలంగి శకం ఆరంభమైన తరువాతనే తెలుగు సినిమా హాస్యం పరిమాణం పెరిగింది. అయితే అంతకుముందు హాస్యకల్పనలో ఉన్న ప్రమాణం ఇపుడు తగ్గిందా అని కూడా అనిపిస్తుంది. దానికి స్టార్‌సిస్టం కొంతవరకు కారణం. రేలంగి ప్రజ్ఞావంతుడని పేరు వచ్చిన తరవాత, పేరుమటుకు వాడుకునే ధోరణి ప్రబలింది. ఒక రేలంగి అనే కాదు. అందరి విషయమూ ఇంతే. తెలుగు హాస్యనటులలో - ఎవరికీ తీసిపోని ప్రజ్ఞావంతులు అనేకులున్నారు. వారిలో కొందరు కొన్ని ప్రత్యేక విద్యలలో ప్రజ్ఞకలవారు. తెలుగు సంప్రదాయంలో పుట్టిపెరిగి, దాని తత్వాన్ని వంటబట్టించుకుని అందులో స్వారస్యాన్ని అందంగా చెప్పగలవాడు. అయినా వారిలో చాలామందికి అటువంటి అవకాశాలేవీ లభించటమే లేదు.



తంగవేలు

తెలుగులో నాటికీ నేటికీ కూడా గొప్ప హాస్య చిత్రాలు అని చెప్పుకోతగ్గవి ఆనాడే తయారయ్యాయి. పదిహేనేళ్ళవాడు డైరెక్టర్ జగన్నాథ్ రెండు స్వచ్ఛమయిన కామిడీలు తీశాడు. 'భలేపెళ్ళి', 'తారుమారూ'ను ఈ రెంటిలోనూ కథ కమామిషే కాక శిల్పం కూడా 1959 నాటికీ పాతబడనిదే! నేటికీ అనుకరణ యోగ్యమనదగ్గదిగా ఉందంటే ఆశ్చర్యపడితే పడ్డారు కాని ఆ ముక్క నిజం! భలేపెళ్ళి

మోలియర్ నాటకానికి అనుకరణ. అందులో డాక్టర్ శివరామకృష్ణయ్య (మొన్నటి చక్రపాణిలో బావగారు) హీరో వల్లభరాయడు వేషం వేశారు. ఇంటికెవరొచ్చిన జలగలవైద్యం కోసమే వస్తారని త్రికరణశుద్ధిగా నమ్మి, అందరికీ ఆ వైద్యం చేసి వదలిపెట్టే జలగల డాక్టరు వేషాన్ని, కొన్నాళ్ళ క్రితం ముసలి తండ్రి వేషాలు వేస్తూ వచ్చిన రంగస్వామి అయ్యంగారు నిర్వహించారు. సురభి కంపెనీకి చెందిన శాంత (సురభి బాలసరస్వతి పినతల్లి) నాగలక్ష్మీబాయి, జయంతి గంగన్న పంతులు కూడా పాల్గొన్నారు.

'తారుమారు' అతి విచిత్రమైన కథ. అయితే ఫెయిరీటేల్ లాటిది థార్న్ స్మిత్ వ్రాసిన టర్న్ ఎబౌట్ అనే నవలను పట్టుకుని కొడవటిగంటి కుటుంబరావుగారు దీనికి సినిమా పాటలు, మాటలు వ్రాశారు.

పాటలు ఆ కాలంలో బాక్సాఫీసు సూత్రాలలో చేరలేదు. అందులో ఒకే ఒక పాట పెట్టారు. ఒక మొగుడూ పెళ్లాం వశీకరణ విద్య తెలిసిన ఒక బైరాగి దగ్గర చెరో తావీదు తెచ్చుకుంటారు గుట్టుగా. ఆయన్ని లోబరుచుకోడానికి ఆవిడా, ఆవిడని అకట్టి ఉంచుకోడానికి ఆయన. ఒక హుషారైన ముహూర్తాన తావీదులు తారుమారై పోవడంతో అలుమగలిద్దరు కూడా తారుమారైపోతారు. శాల్తీలు మామూలుగా ఉన్నా బుద్ధులు మారిపోతాయన్న మాట. పొద్దున్నే లేస్తూనే, అలవాటైన వాడిలా అతను వంట పనులు చూసుకుంటాడు – ఆవిడా పందుంపుల్ల పట్టుకు వీధరుగుమీద మగరాయుడిలా నిల్చుని వచ్చేపోయే వాళ్ళని హడలగొడుతుంది మొగ కబుర్లతో. కంఠస్వరాలు కూడా మారిపోతాయి – ఇటీవల మాయాబజార్‌లో ఘటోత్కచుడు, శశిరేఖల కంఠాలలా, ఆమె కంఠం, మాటతీరూ భర్త తరహాలోనూ, అతనిది ఆమె తీరులోనూ వస్తాయి. దాదాపు రెండు రీళ్ళు ఇలా ట్రాక్ మార్చి పొట్టచెక్కలయేలా నవ్వించారు. ఇందులో ఆలుమగల పాత్రలను కీ.శే. డి. హేమలత, (మంత్రదండం) వేమూరి పరబ్రహ్మశాస్త్రి నిర్వహించారు. పరబ్రహ్మశాస్త్రి నటన స్థాయీ, సౌలభ్యం ఈనాటికీ అగ్రశ్రేణివనిపించాయి; నాలుగేళ్ళ క్రిందటి చిత్రం చూసినపుడు! ఇందులో కొడవటిగంటి కుటుంబరావుకూడా ఒక వేషం వేశాడు దర్శకుడు జగన్నాథ్ ఈ రెండిటినీ కామేడీ చిత్రాలుగా తీసి కలిపి విడుదల చేశారు.


రేలంగి

ఇంత అద్భుతమైన శిల్పం చేతుల్లో ఉండి గొప్ప గొప్ప కామెడీల స్థాయిలో చిత్రాలు తీయగలిగిన జగన్నాథ్ అనేక కారణాలవల్ల ఈ ఉద్యమాన్ని సాగించలేదు. పదహారేళ్ళ క్రితం ఈయన తీసిన తమిళచిత్రం 'వైరమాల' సర్వుల ప్రశంసలు బాక్సాఫీసు జోహార్లు కూడా అందుకున్నది.

'తారుమారు'లో నటుడు వేమూరి పరబ్రహ్మశాస్త్రి రెండు మూడు చిత్రాలలోనే నటించారు. ఆయన అకాలమృత్యువుకు గురికావడంతో తెలుగు సినిమా, ఒక మంచి నటుడిని కోల్పోయింది.

ఆ ప్రాంతాలలోనే వచ్చిన ఇతర హాస్య చిత్రాలు 'బోండాంపెళ్లి', 'బారిస్టర్ పార్వతీశం' (తొలి హాస్య చిత్రాలు అనవచ్చు). చదువుకున్న భార్య, ధరిమేనా వచ్చిన కొన్ని సాంఘిక చిత్రాలూ మెచ్చతగ్గ హాస్యాన్నీ హాస్యనటులనూ పరిచయం చేశాయి.

చేతికి పదేసివేళ్ళున్నట్లైతే తెలుగులో హాస్య చిత్రాలను వేళ్ళమీద లెక్కపెట్టెయ్యొచ్చునని, ఒక హాస్యప్రియుడి అచంచల విశ్వాసం. ఈ కోవకుచెందే వాటిలో పైన చెప్పిన మూడూ, పక్కింటి అమ్మాయి, చక్రపాణి, వద్దంటే డబ్బు, వరుడుకావాలి, అప్పుచేసి పప్పుకూడూ, అత్తా ఒకింటి కోడలే, పెళ్ళిసందడి, కొంత ఉద్వేగం కూడా మేళవించుకొని సర్వజనరంజకంగా రూపొందిన పెళ్ళి చేసి చూడు, మిస్సమ్మ, వ్యంగ్య ప్రధానాలైన పెద్దమనుషులూ, అంతా మనవాళ్ళే, సార్వకాలిక సర్వజన మనోహరమైన కథావస్తువును, పాత్రను నిలుపుకున్న సత్యమే జయం, ఆహ్లాదకరమైన అతిశయోక్తిలాంటి 'గృహప్రవేశం' స్థూలంగా చెప్పుకోవచ్చు.

'గృహలక్ష్మి' చిత్రంలో 'భారీ' హాస్యం చేసిన పెదబొండాం చినబొండాం ఆ రోజుల్లో పిల్లలకీ పెద్దలకీ కూడా పేరు చెబితే చాలు నవ్వొచ్చేటంత పేరు తెచ్చుకున్నారు. రెండేళ్ళ తరవాత, బొండామే ముఖ్యపాత్రగా 'బొండాం పెళ్ళి' చిత్రం వచ్చింది. లావు తగ్గడంకోసం అని ఒంటికి బాగా ఆముదం పట్టించి గచ్చుమీద దేకి దేకి అరిగిపోవాలని చూపిన బొండాం చుట్టూరా బొండాంలాటి కథను అల్లారు.

హాలివుడ్‌లో కొన్నాళ్ళు ఉండివచ్చిన తొలి తెలుగు దర్శకుడు రఘుపతి ప్రకాష్, దీంతోపాటు, కిందటి తరంలో ఆంధ్ర దేశాన్ని ఉర్రూతలూగించిన మొక్కపాటి వారి నవల ఆధారంగా 'బారిస్టర్ పార్వతీశం' చిత్రం తీసి జమిలిగా విడుదల చేశారు. పార్వతీశం వేషాన్ని లంక సత్యం అద్భుతంగా నటించాడు. అంగవైకల్యంగాని, సమృద్ధిగాని లేకుండా, దేవుడు నిష్పక్షపాతంగా తయారుచేసిన మామూలు మనుషల్లాగే ఉండే లంక సత్యం,


సి.ఎస్.ఆర్

పాత్రనుబట్టి హాస్యానిక్కావలసిన అవలక్షణాలు ఏర్పాటు చేసుకుని హాయిగా నడిపాడు. ఇతనే రెండేళ్ళ తరవాత బాలనాగమ్మలో పులిని చంపానని అనుకున్న చాకలి వేషం హుషారుగా నటించాడు.

గుడ్డలు తీసుకుపోయి ఇంట్లో పడేసుకుని, అవి ఉతక్కుండా పడుకునే చాకలిని ఉతికేయాలని, సృష్ట్యాదినుండీ (ఈ 'ఏర్పాటు' ఏర్పాటయినప్పటినుండీ) దేశదేశాల వారికి ఉండే ఉత్సాహం అంతా లంక సత్యం నటన చూసిన తెలుగు ప్రేక్షకులద్వారా తీరిపోయి వుండాలి.


నల్ల రామ్మూర్తి

దుఃఖానికి సమానాంతరంగా హాస్యాన్ని పోషించి మెప్పులందుకున్న నటుడు ఏలేశ్వరపు కుటుంబశాస్త్రిగారు 'హరిశ్చంద్ర'లో నక్షత్రకుడు పాత్రను నిర్వహించాడు. ఆయన, తరువాత ఏ కారణంవల్లనో చిత్రాలలో నటించలేదు. సాంఘిక చిత్రంలో ఒకటి రెండు హాస్య సన్నివేశాలతో అందరి మనసులలోను చిరముద్ర వేసి, తలచుకున్నపుడల్లా సంతోషం కలిగించే నటులు కొందరు కొన్నాళ్ళు కొనసాగించి ఇంకో మార్గం అనుసరించడమో, సినిమానుండి విరమించుకోవడమో చేశారు. వందేమాతరంలో రాజాబహదూర్ వేషం వేసిన కృష్ణమూర్తిగారు ఈ కోవలోవాడు. ఈయన ఇంకా చాలా చిత్రాలలో వేస్తాడని అప్పట్లో అంతా ఆశించారు. ఆ చిత్రంలోనే అల్లుడు వేషం వేసిన సుబ్బారావు ముచ్చట్లు రెండేళ్ళపాటు ఇంటింటా వినిపించేవి. మధురమీదకెక్కి అతను తాండవ మాడడం, ఆ ముచ్చట్లూ అవీ సామెతలయేటంత స్థాయిని అందుకున్నాయి. 'వందేమాతరం - అల్లుడులాగ - ' అనేవారు సందర్భం వచ్చినప్పుడు జనం. 'సుమంగళి'లో


వంగర

కోమటివేషం వేసిన రామ్మూర్తి, రైతుబిడ్డ, మాలపల్లి చిత్రాలలో బి. ఎన్. ఆర్. (సంగీత దర్శకుడు భీమవరపు నరసింహారావుగారే. ఇటీవల ఈయన 'దొంగలున్నారు జాగ్రత్త' అనే చిత్రం దర్శకత్వం నిర్వహించారు కూడా) తలుచుకొన్నపుడల్లా సంతోషం

కలిగిస్తారు. ఆంధ్రదేశంలో నేటికీ సామెతల్లో బతికి ఉన్న మరో పేరు సింగరాజు లింగరాజు. లోభత్వానికి చక్కని హాస్యప్రధానమైన రూపకల్పనచేసి కట్టిన ఈ పాత్రను ప్రసిద్ధ రచయిత కీ.శే. బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు నిర్వహించారు. ఒక్కసారే ఇలాటి హాస్యపాత్రను ధరించినా, ఎంత సమర్థంగా చేశారూ అని ఇప్పటికీ అనిపిస్తుంది. కేవలం సంభాషణల మీదనే కాక,


బి.ఎన్.ఆర్.

పాత్రగుణావగుణ కల్పనలో కూడా సున్నితమైన హాస్యం పొందుపరచిన పాత్ర ఇది. ఈనాడు హాస్యనటులు ధరించే పాత్రలను తీర్చిదిద్దటంలో ఒకనాటి శ్రద్ధాభక్తులు లోపించాయనీ, హాస్య సంభాషణల మీదా, నటుడి పేరుమీదా ఆధారపడి, పాత్రకు పెట్టదగ్గ చిలవలూ, పలవలూ నిర్లక్ష్యం చేస్తున్నారనీ పాతరోజులు తలుచుకున్నపుడు అనిపిస్తుంది. తెలుగు సినిమా హాస్యనటులలో పెద్ద పేరు తెచ్చుకొని దేశాన్ని ఊపేసినవారిద్దరు - శివరావు, రేలంగి.

సన్నగా, పొట్టిగా చక్కటి విట్టులా ఉండే శివరావు, 1940-50ల మధ్య దాదాపు యాభై చిత్రాలపాటు ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలించాడు. మంగలిశాస్త్రి అనే చిన్న వేషంతో పైకి తన్నుకొచ్చిన శివరావు, కేవలం అదృష్టంవల్లనే పైకొచ్చినవాడు కాదు. అంతకు పూర్వం కాకినాడ నాటక సంఘాలలో తిరిగి నాటకాలలో ఆడి పాడి పేరు అనుభవం సంపాదించుకున్నాడు. రంగస్థలంపై నుండి సినిమాకు రాబోయి రాలేకపోయినవారిలో కుంపట్ల సుబ్బారావు ఒకరు. రాగలిగి నిలబడి పైకొచ్చిన వారిలో శివరావు ఒకరు. ఈయన బహుముఖ ప్రజ్ఞాశాలి. బాగా (హాస్య చిత్రాలకి సరిపడా) పాడేవాడు. ముఖ్యంగా సినిమాకు సంబంధించిన ఫోటోగ్రఫీ, సినిమా పొజెక్షను, వ్యాపారంలో డిస్ట్రిబ్యూషను, ఎగ్జిబిషను, దరిమిలా నిర్మాణం, దర్శకత్వం


శివరావు

వగైరాలన్నిటిలోనూ (చివరి రెండు మినహా) అనుభవం గడించాడు. శివరావు ఉచ్చదశ కొచ్చేవరకు, ఆయన సంభాషణలలో రెండర్థాలమాటలు మెండుగా ఉండడం మామూలు అయిపోయింది. ఆయన నోటిమాట నానుడి అయేది కొన్ని నెలలపాటు. పోనుపోను శివరావు కూడా ఒక దశలో వీటికి దోహదం చేయడం

జరిగింది.... ఏది ఏమైనా జానపద పథంలో, జానపదులను సంతోషపెట్టగలిగే హాస్యాన్ని శివరావు సమృద్ధిగా సృష్టించాడు. శివరావు, కనకం పేరు మోగిన జంట. అంజలి, నాగేశ్వరరావు, శివరావు విధిగా ప్రతికథలోనూ ఉండే పాత్రలు... శివరావు 'పరమానందయ్య శిష్యులు' అనే చిత్రం ఒకటి నిర్మించాడు.

కాకినాడ యంగ్ మన్స్ హాపీ క్లబ్ నుంచే బయల్దేరి, జీవితంలో అన్ని విధాల అనుభవాలూ చవిచూచి, నిజజీవితంలోనే కష్టాలను చూసి నవ్వగలగడం నేర్చుకొన్న రేలంగి, గుణసుందరి కథలో పేరు తెచ్చుకున్నాడు. ఈ దశకం ఆరంభంలో పాతాళభైరవితో ఉచ్చస్థితి నందుకొన్నాడు. జానపద కథలో పాత్ర వేసినా, పౌరాణికంలో వేషంకట్టినా, సాంఘికంలో తిరిగినా, ఏ పాత్రనైనా సున్నితమైన మృదువైన హాస్యంతో నిలిపి సమకాలిక జీవితానికి, ఈనాటి మనుషులకూ దగ్గరగా తీసుకువచ్చి చూపడం రేలంగి శిల్పానికి ప్రాతిపదిక అనిపిస్తుంది. ఇలా అతనిని పరిచయం చేసుకున్న ప్రతి ప్రేక్షకుడూ అతనికి స్నేహితుడయ్యాడు. ఈ స్నేహం దేశమంతా వ్యాపించింది. మొత్తం నూరు పై చిలుకు చిత్రాలలో నటించాడు రేలంగి. ఆయనకీ. ఒక ఘట్టంలో చెరుపుచేసే 'బాక్సాఫీసు' హాస్యం తటస్థపడిందిగాని, శ్రమపడి నయానా భయానా, తనవరకు అదిరాకుండా చూసుకుని తప్పించుకున్నాడు. రేలంగి సాధారణంగా ముక్కుకు సూటిగాపోయే మాంఛివాడి పాత్రలే వేస్తాడు. మనకి చిరాకు, కోపం, అసహ్యం కలిగించే గుణాలు ఇందులో ఉండవు. పై పెచ్చు కులాసాగా ఉన్నంతసేపూ ఉండి, చివర్ని ధర్మము జయించుటకు దుష్టులు దండనపొందుటకు పనికొచ్చే మహత్కార్యం సొంతంగానో, ఎవరితోనో కలిసో చేసేస్తాడు. ఇది ప్రేక్షకుల అభిమానాన్ని సంపాదించిపెట్టే మాట నిజమైతే కావచ్చుగాని, రానురాను అది బాలానందం మార్కు రేడియో నాటకాలలో మంచిబాలుడు రామూ, మోహన్, లలితా మాటాడుకునే డైలాగులన్నీ కలిపినట్టు నేల బారుగా చప్పగా తయారవుతోంది. జీవితం పక్కన నిలబడి, అందులో కష్టసుఖాలమీద వ్యాఖ్యానిస్తూ నవ్వించే వాడికుండవలసిన నిశితదృష్టి, ధైర్యం, స్ఫూర్తి ఈ పాత్రలలో లోపిస్తున్నాయి. పెద్ద మనుషులలో 'తిక్క శంకరయ్య' తీరుతెన్నులు వీటికి స్థూలంగా ప్రాతిపదిక అయితే కావచ్చుగాని, అందులో ఉన్న గొప్ప లక్షణాలు లేనపుడు ఇవి నిర్వీర్యాలు అయిపోతున్నాయి.

నిర్మాతలు తన పేరును దుర్వినియోగం చేసుకోకుండా, కథ అనే గదిలో తనను ఒక అందమైన తెరగానో, దీపపు సెమ్మెగానో, చిత్రపటంగానో వాడుకోడానికి అవకాశం ఇవ్వకుండా, చనువు అలుసుగా అనువాదం కాకుండా రేలంగి కట్టుదిట్టం చేస్తే, మరి నూరు, ఇంకో నూరు చిత్రాలలో కూడా ఎప్పటికప్పుడు స్వచ్ఛమైన హాస్యం కల్పించి సంతోషపెట్టగల ప్రజ్ఞ అతనిలో ఉందని అతనిని ఎరిగిన వారంతా నమ్ముతున్నారు. ఆ మధ్య ఒక సాటినటుడు అన్నట్టు ఒక హాస్యనటుడు నూరుచిత్రాలలో నటించి నిలబడగలిగాడంటే, అతగాడిలో వెయ్యి

చిత్రాలకు తట్టుకు నిలబడగల సత్తా ఉన్నదన్న సత్యం ఇపుడే ఋజువైందనీ, అరుదుగా సంభవించే ఇటువంటి గొప్ప సందర్భం అందరూ హర్షించవలసినదని అంగీకరించాలి.

❀ ❀ ❀ ❀

'ఆసినీ బండబడ' అంటూ నెల్లూరి పల్లెటూరి పెద్దమనిషిని విశాలాంధ్ర ప్రజానీకమంతటికీ అభిమానపాత్రుడినిచేసిన రమణారెడ్డి ప్రధానంగా ఆ ప్రాంతీయుల వేషభాషలకూ, వారి అమాయకత్వానికీ, మంచితనానికీ, గడుసుదనంలా కనబడే వెర్రిబాగుల తనానికీ మనోహరమైన రూపకల్పన చేసి ప్రసిద్ధుదయ్యాడు. ఈ అనుకరణలోనూ, చిన్న చిన్న హావభావాలను సొగసుగా ప్రదర్శించడంలోనూ అతను సున్నితమైన హాస్యాన్ని చూపించాడు. హాస్యంగా మాట్లాడడంలో, రచన చెయ్యడంలో చమత్కారాలకూ, ఛలోక్తులకూ ఉండే స్థానమే, హాస్యనటనలో రమణారెడ్డి హాస్యానిదీను. సినిమాలో చేరడానికి ముందు, ఇతను ఫన్ డాక్టర్ చంద్రశేఖరం ట్రూప్‌లో పర్యటిస్తూ అనుకరణాది విద్యలు ప్రదర్శించి మంచిపేరు తెచ్చుకున్నాడు.


రమణారెడ్డి

సినిమాలో చేరాక, అతనికి తెలిసిన విద్యలు ప్రదర్శించే అవకాశాలు పరిమితమై పోయి, ప్రజాదరణ పొందిన విద్యనే తిరిగి తిరిగి ప్రదర్శించవలసిన పరిస్థితి ఏర్పడింది. దాదాపు ఒకే రకం పాత్రను రమణారెడ్డిచేత వేయిస్తూ వచ్చారు నిర్మాతలు. రంగస్థలం మీద నిజమైన మాజిక్ చేయగల రమణారెడ్డి, సినీ రంగస్థలం మీద కూడా తనకి దొరికిన పాత్రలతోనే మాజిక్ చేసి, మాట దక్కించుకోవడమేకాక పేరుకూడా తెచ్చుకున్నాడు. మన సినిమాలో వర్తమాన పరిస్థితులు మారినపుడు రమణారెడ్డివంటి వారు తమలోని సృజనాత్మక ప్రతిభను ప్రయోగించి నిజమైన సత్తా చూపగల అవకాశం తప్పక రాగలదని అటువంటివారి సామర్థ్యాన్ని ఎరిగినవారూ, రమణారెడ్డి, ఇటీవలి చిత్రాలలో (ముఖ్యంగా ఇల్లరికం) చేసిన హాస్యం చేసి ఆనందించినవారూ నమ్ముతున్నారు.

కేవలం కథకుడు కట్టిపెట్టిన సన్నివేశాల మీద, సంభాషణల మీదా ఆధారపడకుండా సొంత ప్రజ్ఞ కొంతైనా చూపాలన్న పట్టుదల చిత్తశుద్ధి కలిగి వ్యవహరించిన వారిలో కీర్తిశేషుడు జోగారావు ఒకడు, – పాతాళభైరవి, చంద్రహారం చిత్రాలలో ఇతనికి మంచి పేరువచ్చింది. ప్రతిభావారి 'ఏదినిజం?'లో కూడా ఇతడు చాలా హాయిగా నటించాడు. హాస్యం అపహాస్యం కాగల ప్రమాదం

ఉన్నపుడు అంత పనికి వడిగట్టకపోవడం కూడా జోగారావు ప్రత్యేకతలలో ఒకటి. సినిమాకి రావడానికి ముందు హాస్యగాడుగా పేరు తెచ్చుకుని, వచ్చాక పేరు పెంచుకోడానికి తగు అవకాశాలు లేక కాలక్షేపంచేస్తున్న వారిలో నల్ల రామ్మూర్తి, బాలకృష్ణలను చెప్పుకోవాలి. ఒకే తరహా పాత్రలను విసుగెత్తేదాకా వేసి, కొత్తవి రాక ఉన్నచోటే ఉండిపోయినవారిలో చదలవాడ కుటుంబరావు, వంగర వెంకటసుబ్బయ్య, అల్లురామలింగయ్య, పెద్ద వేషంకాని చిన్న వేషం కాని రూపురేఖలు వేషలు భాషలు తీర్చకుండా నీ ఇష్టంవచ్చినట్లు చేసెయ్ అంటూ బేఖాతరుగా ఒప్పగించే వేషాలు వేసి ఎదగకుండా ఉండిపోతున్న వారిలో పేకేటి శివరాం ముఖ్యులు. సమర్థులైన దర్శకులు కఠినంగా చెబుతూ ఉంటే, బాగా నటించి రాణించగలవారిలో పద్మనాభాన్ని, సీతారాంను, రామకోటిని చెప్పుకోవాలి. పద్మనాభం హాస్యం చేయబోతూ ఆ పనిచేస్తున్నట్టు మనకి వార్నింగు ఇస్తాడు. ఒకపుడు ఇతనూ బాలక్రిష్ణ కలసి నటించినప్పుడు చాలామంది ఈ జంటమీద చాలా ఆశలు పెట్టుకున్నారు. అప్పట్లో పద్మనాభం చాలా చురుగ్గా, హుషారుగా, ఉండేవాడు. మితి తప్పకుండా ఉండేందుకు ప్రయత్నించి, సరిహద్దు దగ్గర అగేవాడు... సీతారాంకు కొంతకాలంగా హాస్య పాత్రలు లభించటమేలేదు. అతను వేశాడు కాబట్టి హాస్యం ఉందనుకోవలసి వస్తోంది. నిజానికి ఈ దుస్థితి, ఇటీవల దాదాపు అందరు హాస్య నటులకూ పట్టింది. వెనకటికో పండితుడు తెనాలిరామలింగడి కథలు విని, 'పాండురంగ మహాత్మ్యం'లో పొట్ట చెక్కలయేలా నవ్వించే విట్‌లు కుప్పతిప్పలుగా ఉన్నట్టు ప్రకటించి నానా హైరాణా పెట్టినట్టు, ఈ రోజున రేలంగి ఫలానా వేషం వేశాడు కాబట్టి, అతని ప్రతిమాటలో చేష్టలో హాస్యం ఉండితీరాలన్న అనుమానంతో నవ్వవలసిన స్థితిలో పడుతున్నారు కొందరు మంచివాళ్ళు. బెర్నార్డ్ షా నాటకం సినిమా తీసినపుడు పాస్కల్ పేరు వచ్చినా నవ్వేసిన సహృదయులకీ వీరికీ సంబంధం లేదనుకోండి. వీరు చాలా మంచివారు. ఎదటివాడిలో ప్రజ్ఞ ఉందని ఒకసారి తెలిసినపుడు, రెండోసారి అది కనబడకపోయినా అతడిని గౌరవించగల మంచిమనసు గలవారు.

ఇంత మంచి ప్రేక్షకుల సహనాన్ని, ప్రేమనూ మన సినిమా నిర్మాతలూ, రచయితలూ ఒకొక్కసారి హాస్యనటులూ దుర్వినియోగం చేసుకుంటున్నారనిపిస్తుంది. వాడికి పేరుందిగా అని డబ్బిచ్చే నిర్మాతలూ, వీడు డబ్బిస్తున్నాడుగా అనుకుని పేరుగల నటులూ, జాయింటుగా కుట్రచేసుకున్నట్టు ప్రేక్షకులను నిరుత్సాహపరుస్తున్నారు. అలాగే ఫలానా కమిడియన్ ఉన్నాడన్న భరోసాతో దర్శకుడూ రచయితా పాత్రకు రూపకల్పనగాని, సన్నివేశాల కల్పనగాని శ్రద్ధపట్టి ఆలోచించి చెయ్యరు. వాళ్ళేదో చేస్తున్నారని నటుడు ఏదో చేస్తాడు. చివరికి ఇది పరిపాటి అయి అలవాటు అయి, నటన అంటే రచయితా దర్శకుడూ గూడుపుఠాణీ చేసుకుని సెట్టుమీద గుట్టుగా తెచ్చిచ్చిదాన్ని ఎడం చేత్తో అందుకుని కుడి చేత్తో జనంమీదికి గిరాటేయడమే కాబోలు అనిపించే పరిస్థితి ఏర్పడింది. ఊతపదాలు

సప్లయిచేస్తే కారెక్టరైజేషన్ పూర్తి అయినట్లే అనుకునే దుస్థితి సంప్రాప్తమైంది. కథావస్తువు నటుడిలోంచి ప్రవహించాలనీ, ఆ ప్రయాణంలో వాటికి నటుడిలోని కళాంశ అబ్బుతుందనీ, వాటిపై అతని ముద్ర పడుతుందనీ వాటిలో అతని హృదయం స్పందిస్తుందనీ అనుకునేవారు దురాశాపరులూ, కష్టసుఖాలు తెలుసుకోకుండా వాగే క్రూరులూ అనుకోవలసిన స్థితి ప్రవర్తిల్లుతోంది.

మనకి ఈనాడు వున్న సినిమా హాస్యనటులు ప్రతివారికీ ప్రత్యేకమైన ప్రతిభా వ్యుత్పత్తులున్నాయి. ఏ ఒక్కరూ గాలివిసురుకి వచ్చిపడి డబ్బు పోగేసుకుంటున్నవారు కారు. మంచినటన ప్రదర్శించితే చాలా పేరు వస్తుంది కాబోలని భయపడి గజగజ వణికిపోయి ఆ జోలికి పోరాదనుకుంటున్నవారూ కారు.

బాక్సాఫీసు సూత్రాలు భయంకరమైన సాలెగూడులా మనుషుల చుట్టూ, వాళ్ళ మనసుల చుట్టూ అల్లుకుపోయి, ఏం చేయడానికీ అవకాశాలు అంతగా లేకుండా చేసే పరిస్థితులు చుట్టు ముట్టడంవల్ల చాలామంది మనం ఆశించినంతగా ఏమీ చేయడంలేదు.

నిజానికి సమకాలిక జీవితంమీద అందరికన్న గొప్పగా వ్యాఖ్యానించి మంచిచెడ్డలు చెప్పగల అర్హత అవకాశం మిగతావారి కన్న హాస్యనటులకు ఎక్కువ ఉంది. బాధ్యతకూడా ఎక్కువగా వారిపైనే ఉంటుంది.

ఎంతసేపూ, ఎవరిమటుకు వారు బాక్సాఫీసు సూత్రాలను తిట్టి పోసుకుంటూ కూర్చోవడం గొప్పకాదు. వివేకమూ కాదు. అందువల్ల హాస్యనటులుకూడా తమ బాధ్యతలను ఆలోచించుకొని, తమ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించి కాలరెత్తుకు నిలబడడానికి అనువైన పరిస్థితులకోసం కృషి చెయ్యాలి. అంటే సెట్టుమీద కవిరాసిన డైలాగును విసిరికొట్టి సొంతంగా చెప్పడం ఒకటే కాదు; డైలాగు రాసేముందు, ఆ మాట, దానికి మూలమైన కథావస్తువు దేనిలోంచి తీసుకుంటే బాగుంటుందో ఆలోచించడం వాంఛనీయం.

ప్రస్తుతం తెలుగు సినిమా హాస్యం దుర్భరమైన స్థితిలో చాలా దిగులుగా ఉందని ఈ వాక్యాలు మిమ్మల్ని అసింటా పిలిచి మీతో గుట్టుగా చెప్పినా నమ్మకండి. హాస్యం నిక్షేపంలా ఉంది. ఎటొచ్చి 'నిశ్చింతగా' ఉంది. ఇదే చిక్కు. ముఖ్యంగా ఇరుగు పొరుగు ప్రాంతాలలో దేశాలలో స్థితిగతులు ఎలా ఉన్నదీ మనతో పోల్చి చూసుకున్నపుడు ఈ ముక్క అనిపిస్తుంది.

ఆ గొడవ లేకపోతే మన హాస్యమంత మంచి వస్తువు మరోటి లేదనుకుని చప్పట్లు కొడితే, పక్కవారికి - నిద్రాభంగం అయితే తప్ప - ఏ మాత్రం అభ్యంతరం ఉండదు.

***(ఆంధ్ర వారపత్రిక - 1959)***

❋ ❋ ❋

సమీక్షా రమణీయం (తెలుగు)

# సువర్ణసుందరి



పెళ్లి, పెడాకులు, వారసులు, వారసత్వాలు వగైరాలకు సంబంధించిన న్యాయాన్యాయసూత్రాలను క్రోడీకరించడం అవసరం అని చాలామంది ఉద్ఘాటించేవారు పూర్వం. దరిమిలా హిందూకోడ్ బిల్లు రూపొంది పార్లమెంటు ఆమోదం పొంది స్థిరపడింది.

అలాగే భారతీయ చలనచిత్రాల బాక్సాఫీస్ సూత్రాలను కూడా క్రోడీకరించి పడేయడం మంచిదని చాలామందికి లోగడ అనిపించింది. సదరు కార్యక్రమం సమగ్రంగా నెరవేర్చినవారు ఇంతవరకూ లేరు. ఒకొక్కరు కొన్ని సూత్రాలను మాత్రమే సెల్యులాయిడ్ మీద భద్రపరచారు. హాలీవుడ్ తాలూకువీ, బొంబాయిలో దిగుమతి అయినవీ, అక్కడే ఉత్పత్తి అయినవీ, అక్కడ నుండి వివిధ ప్రాంతాలకు రవాణా అయినవీ, ఆయాప్రాంతాల 'సంస్కృతి'నీ బాక్సాఫీస్ హృదయాన్నీ మాత్రమే సూత్రించినవీ – ఇలా శతసహస్రాధిక సూత్రాలు చెల్లాచెదరుగా ఉన్నాయి. ముందు తరాలవారు ఓ పట్టాన వాటిని ఆకట్టుకు రావడానికి అందుబాటులో లేకుండా ఒక్కొక్క చిత్రంలో కొన్ని. కొన్నిటిలో మరికొన్ని, అన్నిటిలోనూ కొన్ని కొన్ని ఉంటున్నాయి. అన్నీ ఉన్నవి కొన్నైనా లేవు.

ఈ దృష్ట్యా అంజలీపిక్చర్స్‌వారి "సువర్ణసుందరి" చిత్రాన్ని బాక్సాఫీస్ సూత్రాల పెద్దబాలశిక్ష అనవచ్చు; అలా అని, ఈ చిత్రాన్ని చూడవచ్చు; ఈ

సూత్రాల కూర్పులో దర్శక నిర్మాతలు చూపిన నేర్పును మెచ్చుకోనూవచ్చు. ఎందుకంటే మూడున్నర మైళ్ళు పొడుగున ఈ చిత్రగాథలో నడుస్తున్నప్పుడు శ్రమ, విసుగు లేకుండా దారిలో బోలెడు మజిలీలున్నాయి. భారతీయ నృత్యాలు, బొంబాయిడాన్సులు, తెలుగు పాటలు, హిందీగీత్‌లు, హాస్యం, దేశవాళీ, రెడ్ ఇండియన్ కోయవాళ్ళు, కొట్లాటలు, అట్టల బండలూ, వెదురు బుట్టల కొండలూ, ఇ.వి. సరోజ వేషంలో పార్వతీదేవి, ఇంకా సురులు, అసురులు ఇత్యాదయః...

ఇవి కాక, కోడిగుడ్లూ గట్రా కురిపించే మాయా కమండలం, హాస్యరహస్యం అవగతం చేసుకున్నాననుకున్న దండం (మనకి నవ్వొచ్చేలా అందర్నీ కొడుతుంది), జెట్ విమానం చప్పుడుతో గంటకి దాదాపు రెండు మూడు మైళ్ళవేగాన ఆకాశాన ఎగిరే దర్భాసనం, లేక పట్టుకుచ్చుగల తివాచీలాటి చాపబాపతు శాల్తీ ఈ కథలో ప్రముఖ భూమికలు నిర్వహించాయి. (సదరు సామగ్రి శాండిల్య మహర్షి తాలూకుదని అభిశప్తుడగు నటుడొకడు చెప్పాడు. అతడు సగంవరకూ, "ఋషి-గడ్డం" ఉన్న మనిషి; మిగతా సగం రబ్బరు కొండచిలువాను, పెద్ద గుహలో ఉంటాడు. అగ్నిగుండం, పొగా అవీ చూట్టానికి బాగున్నాయి.)

ఇవేకాక, కథ కొంత అయేసరికి ఒహ నాగకన్నెవచ్చి, కథానాయకుడిని చూచి "నువ్వు పగటిపూట రాజసులోచనగా తర్జుమా అయిపోనూ" అని మరొక బాక్సాఫీస్ శాపము వరము ప్రసాదిస్తుంది.

ఇలాగే ఇంకా చాలా శాపాలున్నాయి. విశేషం ఏమిటంటే, వాటికి కథ అవసరాలు తెలుసు. అందుకే భార్య తాకిన మాత్రాన నాయకుడు శిలగా మారాలంటూ ఇంద్రుడిచ్చిన శాపం, చాలా తాపీగా - శాస్త్రోక్తంగా అమలు జరుగుతుంది. అది పూర్తి అయేలోగానే రక్షించమని నాయకీ, ఆమె కుమారుడూ శివపార్వతులను ప్రార్థిస్తూ పాటపాడుతారు. కాని కైలాసంలో వారిద్దరూ (రమణారావు, సరోజ) దాదాపు అదే పాటవరసకు, లయకు అనుగుణంగా నృత్యం చేస్తున్నారాయె; అందువల్ల ఇక్కడి పాటతోపాటే అక్కడి నృత్యం పూర్తికావాలి: అంతవరకూ దర్శనం ఇవ్వడం వీలుపడలేదు. వాళ్ళు దర్శనం ఇచ్చిన తరువాతకూడా ఇంకో చిత్రం ("సువర్ణ పుష్పం లేక బంగారు పూవు") నిర్మించడానికి కావలసినంత కథగల మహత్కార్యాన్ని ఆ చిన్నపిల్లాడికి ఒప్పగించి చక్కాపోతారు. ఆ పిల్లవాడు మాయా తివాచీ ఎక్కి దేవలోకం వెళ్తాడు. (కమండలం విరిగితే తనూ, దండమూ, పనిచేయరాదని తెలిసినా కష్టాల్లో ఉన్న కథ అవసరాన్ని బట్టి ఆ తివాచీ పనిచేసి స్వామిభక్తిని ప్రదర్శించింది. తివాచీల స్వామిభక్తి గణనీయముగదా!)

అతడు వచ్చేలోగా, ఏ భాషారానివాడు జర్మన్ శాస్త్రీయ గ్రంథాన్ని ఫ్రెంచి వ్యావహారిక భాషలోకి అనువదించేటంత వేగంతో కథానాయకుడు శిలగా తర్జుమా అవుతూ ఉంటాడు. సకాలంలో బంగారు పూవు వస్తుంది. కథ కంచికి వెళ్తుంది; ఐనా మనం ఇంటికి బయల్దేరకూడదు. ఆ తరువాత గ్రూపుఫోటో ఉంది. ప్రేక్షకుల సందేహాలు కొన్నిటిని ఆ ఘట్టంలోనే నివృత్తి చేశారు.

ఈ విధంగా కాలక్షేపానికి నిక్షేపం అనతగ్గ ఈ చిత్రంలో నటీనటవర్గం అంతా యథోచితంగా నటించారు. "సువర్ణసుందరి" పాత్రకు రూపకల్పన, చిత్రణ, నటన, బాగున్నాయి. దిష్టితగలకుండా కాబోలు - ఒక చోటమటుకు బొంబాయి వాళీ మోళీ తరహా నృత్యం చేయించి, దానికి, "గీతా రామ్" పద్ధతిలో "బొమ్మలు బొంమ్హాలూ" ఫక్కీ "సంస్కృతక" ఉచ్చారణతో పాటపాడించారు.

నాగేశ్వరరావు "భరించిన" జయంతుడి పాత్రకు, 'జానపద కథానాయకుడి చైతన్యం' ఉండవలసినంతగాలేదు. కొంతసేపు గుళ్ళో కూచుని స్వర్గలోకపు చిన్నదానికోసం బెంగపెట్టుకోవడం, ఆ తరవాత రాజసులోచన అయిపోవడం జరిగింది.



శాపఫలితంగా జ్ఞాపకశక్తి పోయినందువల్ల భార్యను వెదకే అవసరం తప్పిపోయింది. కాగా, నీలాపనింద నెత్తినవేసుకుని ఇల్లు వదలివచ్చిన రాకుమారుడుగా, అతనికి ఉండవలసిన విధ్యుక్తధర్మపాలనా పరిజ్ఞానం కూడా, దర్శక రచయితల శాపంవల్ల లేకుండా పోయింది. అందువల్ల ఎవరో వచ్చిచెప్తేనో, ఏదో జరిగితేనో తప్ప, ఉన్నచోటునుండి కదలడు. అలాగే కాలక్షేపం చేస్తాడు. ఈ విధంగా అసమగ్రంగా, అవధులు తక్కువగా తయారైన ఈ రకం పాత్రలు పోషించడానికి ప్రతిభ చూపనక్కరలేదు; ప్రభ చాలు, ఐనా, నటుడు నాగేశ్వరరావు, మూసపోసిన ఈ పాతవేషానికి ఐదు నిండు ప్రాణాలూ ప్రతిష్ఠించి, గొప్పగా ఒప్పించడానికి తన ప్రతిభనుకూడా వినియోగించి దానిని రాణింపచేశాడు. ఎన్నో కష్టాలు పడి పడి, భార్యబిడ్డలను కలుసుకొన్న క్షణంలోనే తిరిగి, తెలిసి తెలిసీ వారికి దూరం అయిపోతున్న వ్యక్తి ఆవేదనను, (చివర ఉన్న కొద్ది సన్నివేశాలలోనూ) హృదయాన్ని కదలించేలా వ్యక్తం చేశాడు. ఈ చిత్రం మొత్తం మీద ఆ అంశగల సన్నివేశాలు అవే.

*(ఆంధ్ర వారపత్రిక - 1957)*

ఈ సినిమా అఖండమైన విజయం సాధించడంతో హిందిలో పునర్నిర్మించారు. ఆదినారాయణరావు ట్యూన్స్ హిందీ ప్రేక్షకులను కూడా ఆకట్టుకున్నాయి. అంజలీ ప్రొడక్షన్స్‌వారు తెలుగు, తమిళ, హిందీ భాషల్లో అనేక సినిమాలు నిర్మించారు. దర్శకులు వేదాంతం రాఘవయ్య దీని తరువాత ఎన్.టి.ఆర్.తో అంజలీ వారికై 'స్వర్ణమంజరి', అక్కినేనితో లలితా శివజ్యోతి వారికై 'రహస్యం' భారీ జానపద చిత్రాలు తీయగా అవి 'సువర్ణసుందరి' స్థాయిలో విజయం సాధించలేకపోయాయి.

# జయభేరి



తెలుగు చలన చిత్రాల కథలో నాలుగు కాలాలు నిలుపబోయే కొత్త పేరు, శారదావారి 'జయభేరి'. ఈ దశాబ్దంలో వచ్చిన చిత్రాలలో ఇది అనేక విధాల ముఖ్యమైనది.

సంగీతం, సాహిత్యం, నటన, కథ, కథనం, ఛాయాగ్రహణం మొదలైన వివిధ శాఖలలోనూ ప్రశంశనీయమైన పరస్పర సమన్వయం గల కృషి ఫలితంగా సర్వాంగ సుందరరూపం ధరించిన ఈ చిత్రాన్ని సంగీతప్రియులు సంగీత చిత్రం అనవచ్చు. సాహిత్యాభిమానులు దీని ఘనత మల్లాదిశాస్త్రిగారిదీ ఆత్రేయదీ అనవచ్చు. చలనచిత్ర కళాభిమానులు పి. పుల్లయ్యగారు తీసిన ఉత్తమోత్తమ చిత్రం అని పొగడవచ్చు. నటన మీద గురిగలవారు ఇది పూర్తిగా నాగేశ్వరరావు చిత్రం అనవచ్చు; గుమ్మడినీ, ఐదు నిముషాలసేపు అతిథిగా కనిపించిన రంగారావునూ, అంజలీదేవినీ, శాంతకుమారినీ సగర్వంగా చూపించవచ్చు. టూకీగా చెప్పుకోవాలంటే, తెలుగు చలన చిత్రాలలో ఎన్నతగ్గ ప్రమాణాలన్నిటినీ ప్రతిబింబించే చిత్రం అని అంతా అంగీకరిస్తారు. దాదాపుగా 'పరిణతమైన' అన్న విశేషణానికి అర్హతగల చిత్రం.

ఇందులో సమకాలికమనతగ్గ సమస్య లేదు. కాని, దాని ఛాయలు లేకపోలేదు. దర్శక రచయితల చిత్రణవైఖరే ఇందుకొక నిదర్శనం. కులతత్వాలను,

మత దురభిమానాన్ని ఖండించబోవడంలో ఆయా పాత్రలను చిన్న సైజు భూతద్దం కింద పెట్టి చూపెట్టారు. బహుశా 'బాక్సాఫీసు భూత'ద్దం కావచ్చు... ఈ ఒక చిన్న అపశ్రుతి వినా మిగతా కథను కళాత్మకంగా శ్రద్ధాభక్తులతో చిత్రించారు. సన్నివేశాలను హృదయంగమంగా కట్టారు. సంగీతం ఎక్కువగా ఉన్న చిత్రంలో కథ అష్టకష్టాలూ పడడం పరిపాటి అయినా, 14 పాటలుగల ఈ చిత్రంలో కథా, సంగీతం అద్భుతంగా సహవాసం చేశాయి. వెలుగు నీడలలా ఒకదాని నొకటి మెచ్చుకుంటూ ఒకటినొకటి ప్రస్ఫుటం చేశాయి.

కథ ప్రధానంగా ఒకానొక సంగీత వరప్రసాది వ్యథ. కాశీనాథ్ అనే ఆ యువకుడు అన్నా వదినెల చాటున అపురూపంగా పెరుగుతూ శాస్త్రీయ సంగీతం అభ్యసిస్తూ ఉంటాడు. శాస్త్రీయ సంగీతాన్ని సామాన్య ప్రజలకు దగ్గరగా తీసుకువెళ్ళాలన్న స్వతంత్ర భావాలు గలవాడు అయినందువల్ల, గురువు విశ్వంభరుడు కల్యాణిరాగం సాధన చెయ్యండిబాబూ అంటే రాగప్రస్తారం ప్రేక్షకులకు అట్టే సయించదని సరాసరి కీర్తన మొదలుపెట్టిన ధైర్యశాలి. గుర్వాజ్ఞను కొద్దిగా దాటేస్తే వేశాడుగాని, అతనా పని చేసినందువల్ల, "మది శారదాదేవి మందిరమే" అనే మధురమైన ఉత్తేజకరమైన కీర్తనను విని మహదానందం పొందగలుగుతాము. ఘంటసాల, శ్రీనివాస్, సత్యం, పాణిగ్రాహి పాడిన ఆ పాట, అందులో స్వరకల్పన, ఘంటసాల విన్యాసాలూ, గాత్రధారులకు, తెరమీద పాత్రధారులూ దర్శకుడూ చేసిన రూపకల్పనా శోభించి, ప్రేక్షకులను జరుగబోయే కథకు ఆయత్తం చేస్తాయి.

మొత్తానికి శిష్యుడు కాశీనాథ్ తిన్నగా ఉండడు. ఊళ్లో బత్తైన వాళ్లు భాగోతం ఆడుతుంటే చూడబోయి 'నన్నోడించిన వాడేడీ' అంటూ అక్కడ జనాన్ని సవాలుచేస్తున్న చిన్నదాన్ని చూసి ఎదురు సవాలు చేసి పాడి ఓడిస్తాడు. కర్ణాటక బాణీలో ఆరంభమైనపాట క్రమంగా ఫిల్మీగీత్ స్థాయికివచ్చి పూర్తి అయేసరికి ప్రజానీకాన్ని ఆనందింప చేయడమే తన కర్తవ్యం అని నిర్ణయించుకొంటాడు.

బ్రాహ్మలపిల్లడు బత్తైనాళ్లతో కలిసిపోవడం కలవరం కలిగిస్తుంది. గురువుగారు, ఇంట్లో అన్నగారూ మండిపడతారు కాశీనాథ్‌మీద. కన్న తల్లిలా పెంచిన కమలమ్మ ఏడ్చి మొత్తుకుంటుంది, కూడనిపనులు చేయవద్దని. కానీ, కాశీ బత్తైన చిన్నది మంజులతకు ఇచ్చినమాట నిలబెట్టుకోవడానికి మళ్లీ చాటుగావెళ్లి రంగంమీద కెక్కడంతో పరిస్థితులు విషమించి అతడు ఇల్లు వదలిపోవడం జరుగుతుంది. కులం వాళ్లు వెలివేస్తారని, కాశీ అన్నగారు విశ్వనాథశాస్త్రి తమ్ముడిని పొమ్మంటాడు. ఇంక చలేమిటని కాశీ మంజులతతో మధురమైన యుగళగీతం ఒకటి పాడి (ఘంటసాల, సుశీల) ఆమెను దైవసాక్షిగా వివాహం చేసుకుంటాడు. భర్తకి తెలియకుండా వచ్చిన వదినెగారు దంపతులను దీవిస్తుంది.....

అక్కడితో కాశీనాథ్ జీవితంలో పతాక సన్నివేశం. అందులో నాగేశ్వరరావు నటన ఆరంభమై మోహనరాగ స్వరారోహణలా అతి వేగంతో తారస్థాయిని

అందుకుంటాయి. కాశీనాథ్, మంజులతా దేశాల వెంట తిరుగుతూ, 'జాను తెనుగె నేను, జాతి ఘనతే నేను' అని సగర్వంగా శ్రుతిమధురంగా చాటుతూ అఖండ ప్రజాభిమానాన్ని సంపాదిస్తారు. విజయనగర చక్రవర్తి విజయానంద గజపతి కాశీనాథ్‌ను నిండుసభలో గౌరవించి, కాశీ గురువుచేతనే సన్మానం చేయిస్తాడు. ఆ సభలో సంగీతరసరాజు కాశీచేత, రసికరాజు ఐన చక్రవర్తిని ఉద్దేశించి సంగీత దర్శకుడు పెండ్యాల, గాత్రధారి ఘంటసాలచే పాడించిన "రసికరాజ తగువారము కామా" అనేకీర్తన, రాజ సన్మానానికి అర్హమైన స్థాయిలో రసభరితంగా, ఆపాతమధురంగా, ఆలోచనామృతంగా భాసించిది. కాల్పనిక స్వర విన్యాసాలను అంత మధురంగా కట్టుదిట్టంచేసి ఆ క్షణంలోనే పాడినదిగా తోచేలా పాడించడం ప్రశంసనీయమైన సాధన. 'మధురమణి' స్వరగణిత శిల్పంలో మంద్రస్థాయిన రెండు స్వరాల మీద ఘంటసాల పోయిన పోకడలు మరపురానివి.



సంగీతరాజోచితమైన రాజ మర్యాదతో గిరిశృంగాన్ని అధిరోహించిన మధురగాయకుడు కాశీనాథ్ మదిరాలాలసుడై ఆ పైనుంచి జారిపడిపోతాడు. రాజనర్తకి అమృతం, మతాధిపతి (ముక్కామల) కూడబలుక్కు చేసిన కుట్రఫలితంగా ఖైదీగా చక్రవర్తి సముఖాన నిలుస్తాడు. చక్రవర్తి రసహృదయుడు; సరసహృదయుడు. నైతికంగా పతనం చెందినా కళాకారుడు ఎన్నటికీ పూజనీయుడేని, అతని కళావిభవం చెన్ను తరగదనీ చెప్పి కాశీని పంపివేస్తాడు. ఈ సంఘటనకు పూర్వం నర్తకి ఇంట్లో కాశీ తాగి మైమరచిన స్థితిలో పాడిన మధు మధురగీతి 'నీ దాన నన్నదిరా నిన్నేనమ్మిన చిన్నదిరా'ను చక్రవర్తి విని ఉంటే, అతన్ని అసలు దేశం వదలి వెళ్ళనిచ్చేవాడే కాదు. వాగ్గేయకారుడుగా కూడా తిరిగి సమ్మానించే వాడనిపిస్తుంది. కాశీకి ఇంత ఊహలు లేవు. 'మదిరోహ'లోనే ఉండి ఇల్లు గుల్లచేసి అన్నీ తెగనమ్మి, భార్యను సాధించి బాధించి అహిరిరాగంలో గాంధారంలా అందరి హృదయాలనూ - ప్రేక్షకులు సహా - విషాదభరితం చేసివేస్తాడు. అది భరించలేని గురువు విశ్వంభరుడు, "అమ్మా శారదా! నీ బిడ్డలు లక్ష్మీకటాక్షం కూడా పొంది సుఖించడం సహించలేవా?" అని తరతరాలుగా కళాకారులు పడిన దారిద్ర్యపు, క్షోభలన్నిటినీ సమీక్షించి ఒక గాథలో పలుకుతాడు సరస్వతి ఎదుట.

కాశీనాథ్ నైతికంగా పతనం చెందుతున్న కొద్దీ కళారాధకుడుగా తార స్థాయికి పెరుగుతూ ఉంటాడు... బహుశా అందువల్లనే 'పైనున్న' వాడికి వినపడవలసి ఉన్న చివరి పాటను ప్రసిద్ధ తమిళగాయకుడు సౌందరరాజన్ పాడి ఉండాలి. ఈ పాటలాగే ఈ సన్నివేశం, దీనికి దోహదంచేసిన పూర్వఘట్టాలూ కూడా ఉద్వేగభరితాలుగా రీవిగా కట్టుకువచ్చారు. పతితుడు కాశీనాథ్‌లో పరివర్తన తేవడానికై వదినగారు కమలమ్మ భర్త ఆజ్ఞను ధిక్కరించి ఇల్లువదలి వెళ్తుంది. బ్రాహ్మణ్యానికి భయపడిన విశ్వనాథుడు భార్యని కూడా వదులుకొంటాడు. చివరకు కాశీ భార్య మంజులతను బ్రాహ్మణ్యం కొట్టి గాయపరచడంతో అతనిలో పరివర్తన కలుగుతుంది. దురభిప్రాయం పొర చిరిగిపోతుంది. 'ఏది బ్రాహ్మణ్యం' అన్న ప్రశ్నకు సమాధానం తెలుస్తుంది. తను సభ్యుడైన బ్రాహ్మణ్యాన్ని ధిక్కరించి, తమ్ముడి కోసం, తన భార్యకోసం పరుగుపెడతాడు. ఆ వేళకు తాగి పడివున్న కాశీనాథ్‌మీద, పాతికేళ్ల పెంపకంలో తొలిసారిగా చెయి చేసుకుని అతన్ని మేల్కొల్పిన వదినగారు తనకింక పనిలేదని ఆత్మహత్యకు పాల్పడుతుంది.

తెలుగు సినిమాలో చాలా కాలంగా మనం చూచి ఉండని తరహాలో నిండైన మనుష్యుల మనసులను, హృదయ పరివర్తనాన్ని సమగ్రంగా సమర్ధంగా ఉదాత్తంగా చిత్రించే సన్నివేశాలను ఈ చిత్రంలో చివరి ఘట్టాలలో చూస్తాం. వీటిని ఇంత గొప్పగా చూపిన చలన చిత్రకారుడు పి. పుల్లయ్యగారు అభినందనీయులు. ప్రతి సన్నివేశంలో దృశ్యాల రూపకల్పన, శిల్పం ప్రత్యేకం చెప్పుకోతగ్గది. ఆయన తీసిన చిత్రాలలో, ఇతరులు తీసిన అనేక చిత్రాలలోను కూడా 'జయభేరి' అగ్రతాంబూలం అందుకొంటుంది. అదే శ్రేణిలో ఇందులో పాల్గొన్న కళాకారులు నాగేశ్వరరావు, అంజలీదేవి, గుమ్మడి, శాంతకుమారి సన్మానార్హులు అనిపించుకున్నారు. కాశీనాథ్‌గా నాగేశ్వరరావు, విశ్వనాథ్‌గా గుమ్మడి చిరస్మరణీయమైన నటన ప్రదర్శించారు. హాస్యాన్ని ఈ కథలో విడిగా చూడలేము. ఉన్నదాన్ని, కథలో నేర్పుగా అందంగా కలిపి కథకు అడ్డురాకుండా సర్దారు. రేలంగి, రమణారెడ్డి, నల్లరామ్మూర్తి, సురభికమల, సూర్యకాంతం అంతా ఆహ్లాదకరంగా ఉన్నారు. అందరికన్న మిన్నగా ఆహ్లాదాన్ని ఇచ్చిన నటుడు ఐదునిమిషాలసేపు చక్రవర్తిగా కనిపించిన అతిథి రంగారావు, నిర్మాతలూ, నటుడూ ఈ పాత్రకు 'అతిథి' ముద్రవేసినా, గొప్ప నటనతో కూడిన మంచి పాత్రల శ్రేణిలో నిలబడుతుంది.

సంగీత దర్శకుడుగా పెండ్యాల నాగేశ్వరరావు ఈ చిత్రంలో నిర్వహించిన పాత్ర ఎంత ప్రముఖమైనదో అంత విజయమూ సాధించింది. కర్ణాటక బాణీల దగ్గర నుండి ఉస్తాద్ కరీంఖాన్ తుమ్రీ ఛాయల దాకా, జావళీల దగ్గర నుండి సినీవాళీ జానపదాలదాకా, శ్రుతిమధురమైన నవరసస్వరాలన్నీ మనోహర హారాలుగా కూర్చి గొప్పగా చెప్పుకోదగ్గ ఫలితాలను సాధించారు. శాస్త్రిగారి జానుతెలుగు పలుకుబడులు, ఆరుద్ర అంత్యప్రాసక్రీడలు గల నృత్యనాటికా గేయాలు, శ్రీశ్రీ నందనారుగాథ ఇతివృత్తానికి శోభను కూర్చే రీతిన భాసించాయి.

నృత్య నాటికలలో రాధాకృష్ణ, మత్స్యగంధి పెళ్లి చాలా బాగున్నాయి. నృత్యాలలో చిత్రం ఆరంభంలో అంజలీదేవి చేసిన నృత్యం ఒకటి చైతన్యవంతంగా వుంది. అన్ని విధాలా సంతృప్తి కలిగించే ఈ చిత్రాన్ని ఉగాది కానుకగా రేపు విడుదల చేస్తున్నారు.

*(ఆంధ్ర - వారపత్రిక 1959)*



రమణ ఊహించినట్లే ఈ సినిమా తెలుగు సినీచరిత్రలోనే ఓ మైలురాయి అయిపోయింది. ముఖ్యంగా సంగీతపరంగా! వి.ఎస్. సుక్తాంకర్ రచనపై ఆధారపడి శాంతారాం తీసిన 'మత్‌వాలా శాయర్ రామ్‌జోషి'చే ప్రేరణ పొందిన ఈ సినిమా ప్రతి అంశమూ ప్రక్షకులను ఆకట్టుకుంది. తమిళ వెర్షన్ 'కలై వానన్ మాత్రం బాగా ఆడలేదు.

# ఇల్లరికం



సినీమాలుచూసే జనానికి ఏమేం కావాలని తీసేవారు అనుకొంటారో, అవన్నీ సమపాళ్లలో మిళాయించి అందులో కొత్త కథావస్తువువేసి తాతినేని ప్రకాశరావు తయారుచేసిన టెలుగూ కాక్‌టెయిల్ 'ఇల్లరికం'. ఇందులో చెడ్డవాణ్ణి పరిచయం చేసుకు మరీ చెడ్డపనులు చేసే దుష్టులు, మహామంచివాళ్లూ, చక్కని హాస్యం, పాతికమందికి జవాబు చెప్పగల 'మార్క్ ఆఫ్ జోరో' మార్కుహీరో, (నల్లసూటూ, కళ్లకి గంతలూ, పిస్తోలూ సహా) బొంబాయివాళీ డాన్సులు, ఊగ్ అండ్ దొర్ల్ డాన్సులూ మొదలైనవన్నీ ఉన్నాయి. వీటికి అలంబనమైన ముఖ్య వృత్తాంతం మటుకు కొత్తగా నిండుగా ఉంది. ఇది, అవీ కలసి పదిహేను రీళ్లపాటు సత్కాలక్షేపం చేయడానికి యోగ్యమైన వినోదప్రధాన చిత్రాన్ని రూపొందించాయి. కథాశివబ్రహ్మంగారి కథకు చలనచిత్ర కథాస్వరూపం ఏర్పరచడంలో దర్శకుడు ప్రకాశరావుగారు, నేపథ్యంలో కొంత కథ చెప్పడంవంటి ప్రక్రియలతో మెచ్చుతగ్గ శిల్పం ప్రదర్శించినా, పైన పేర్కొన్న హంగులు కొన్నిటికోసం కథని కొంత అల్లరిపెట్టడం జరిగింది. చిత్రం పొడుగునా చక్కని కామాలూ, సెమికోలన్‌లూ పెడుతూ తరువాతి ఘట్టం మీదకు మనని సుఖంగా జరుపుతూ ఉన్నా అక్కడక్కడ ప్రశ్నార్థకాల, ఆశ్చర్యార్థకాల గతుకులూ కొండొకచో డైలాగుల అతుకులూ

తటస్థపడతాయి. ఇవి, ఘట్టం ముగిసిన తరువాత తెరపడని అరనిమిషంలో రంగంపై నటులలా తెల్లబోతాయి.

ఇల్లరికాల ఎల్లరకాలనూ పోగేసి అల్లిన ఈ కథలో ముఖ్య పాత్రధారులు, రూపకల్పన ఉండతగినంత సమగ్రంగా నిర్దుష్టంగా లేకపోయినా సమర్థంగా నటించారు. మొదట జమీందారును చెప్పుకోవాలి. ఆయనకు బోలెడు డబ్బు, ఒక్క కూతురూను. చాలా మంచివాడు. కాలేజీ వార్షికోత్సవాలలో నాటకాల వేదికమీద పెళ్ళీడు కూతురుతో అపరిచిత యువకుడెవరో చనువుగా చొరవగా సరసాలు ఆడుతూ డాన్సు చేస్తున్నా చూస్తూ కాస్తంత నవ్వుతో కూర్చోగలిగినంత మంచివాడు. ఆయన కూతురు రాధ అందమైన పిల్ల. అందువల్లనే ఒక రోజు పరిచయంతోనే వేణు ఎలాగా హీరో అని గ్రహించి మర్నాడు అతడు పాటపాడేసరికి వంతపాడి, హృదయం పరటా యిచ్చిన అమ్మాయి. వేణు తెలివైన యువకుడు, బీదవాడు. తొందపడకుండా స్థిమితంగా ఆలోచించేవాడు. ఎన్ని అభాండాలు వచ్చినా నిలకడమీద నిజం తేలుతుంది గాబట్టి చివరి రీలులోగా చెప్పడం ఎందుకని ఆగిన ఆసామి. ఈ వేణుకు, రాధ మనసిచ్చింది. జమిందారిణికి ఇది సరిపడలేదు. తామున్న పై అంతస్తునించి ఈ పిల్లడి స్థాయికి దూకితే పరువుకు హోదాకు దెబ్బతగులుతుందని ఆవిడ అంటుంది. మనం దూకద్దు అతన్నే పైకిలాగుదాం అని నచ్చచెప్పి జమిందారుగారు పెళ్ళి కానిచ్చి అల్లుడిని ఇల్లరికం తెచ్చుకుంటాడు. జమున, నాగేశ్వరరావు తీరిక వేళలో నైట్‌గౌనులు తొడుక్కొని శ్రుతి మధురమైన యుగళగీతాలు పాడుతూ హాయిగా ఉంటారు. వేణు అత్తగారు, దుష్టుడు సీయస్సారూ, అతని కొడుకు "ఆర్. నాగేశ్వరరావు" కలసి ఇంటల్లుడిని అవమానించ చూస్తారు. అప్పుడు జమీందారుగారు పెళ్లినాడు అన్నమాట ప్రకారం అల్లుడికి ఫ్యాక్టరీపై అధికారం ఇచ్చి అతని హోదాను పెంచుతాడు. అదిచూసి దుష్టులు అతని మీద అభాండాలు వేస్తారు. ఈ స్థితిలోనే వేణు చెల్లెలు (గిరిజ) నేపథ్యంలోని కథలోంచి తెరమీదకు వచ్చి కనిపిస్తుంది. చచ్చిపోయిందనుకున్న చెల్లెలు, నాటకాలలో వేషాలు వేస్తున్నందుకు బాధపడి వేణు ఆమెను చివాట్లు వేయబోతాడు. తరవాత ఆమె కథను విని ఓదారుస్తాడు. వేణు భార్య, అర్జెంటుగా ఆవేళకు వచ్చి ఫోటోజెనిక్ కిటికీలోంచి, కథ సాగడానికి పనికివచ్చే ఒక్కడైలాగూ విని, ఒక షాటూ చూసి అన్నాచెల్లెళ్ళను ప్రియులని భావించి, అన్నా, చెల్లి లాటిమాట వినబడకుండా గబగబ వెళ్ళిపోయి మనసు విరగ్గొట్టేసుకుంటుంది. దాని పర్యవసానంగా, ఆస్తిని తన పేర రాయించుకుంటుంది. భర్తని అవమానించి క్షోభపెడుతుంది; తను పడుతుంది. అంతే తప్ప 'ఇది నిజమా?' అని పాడదు. అతనూ చెప్పడు.

ఈలోగా దుష్టులు ఫాక్టరీ మేనేజరుగిరీ సంపాదించి డబ్బు కాజేస్తూండడంతో హీరో వేణు, గుర్రం తక్కువ జోరోగా తయారై తనకి భాంగ్రా డ్యాన్సులు చెయ్యడం,

యుగళ గీతాలు పాడడం మటుకే కాక ద్వంద్వ యుద్ధాలుకూడా చేతనవునని నిరూపించడానికి పూనుకొంటాడు.

అది తెమిలేసరికి ఎక్కడెక్కడి దొంగలూ గ్రూపుఫోటో తీసేచోటుకు చేరుకుంటారు. మంచివాళ్ళంతా వారి నెత్తిన తలో సినిమాటిక్ డైలాగూ వేయడం, వాళ్లు తేలిగ్గా నాలికలు కరుచుకోవడం, మన చుట్టాలే కాబట్టి వాళ్లు ఎన్ని అఘాయిత్యాలు చేసినా పోలీసులదాకా పోనియొద్దని మంచి వాళ్లు తీర్పు యివ్వడంతో అందరికీ తృప్తీ, సంతోషం, కలిగే విధంగా కథ ముగిసింది. ఈలోగా తృప్తీ, సంతోషం కలిగించే ఇతర అంశాలలో జమీందారుగా గుమ్మడి, అల్లుడుగా నాగేశ్వరరావు, రాధగా జమున ప్రదర్శించిన నటన ముఖ్యమైనది. అందరినీ అలరించేవాటిలో రేలంగి చెప్పిన అల్లుడి కథ. అందులో ఆయనా, రమణారెడ్డి ప్రదర్శించిన నటన ప్రత్యేకించి చెప్పుకోవలసినవి. ఇందులో మనోహరమైన సన్నివేశాలు కొన్ని ఉన్నాయి. దర్శకుడు ముఖ్యవృత్తంలో ఉద్విగ్న సన్నివేశాలను ఎంత నిండుగా చిత్రించారో, ఈ భాగంలో వీటిని అంత హుషారుగా నడిపి మంచి పనివాడితనం చూపారు. ఆరుద్ర మాటలు వీటికి దీటై నిలచాయి. చలపతిరావుగారి పాటలు పాతబాటలలో సాగినా ఘంటసాలా, సత్యం సుశీల పాడగా వినడానికి హాయిగా ఉన్నాయి.

*(ఆంధ్ర - వారపత్రిక 1959)*

❄ ❄ ❄

ఈ సినిమా విజయవంతమై హిందీలో 'ననురాల్'గా పునర్నిర్మితమైంది. ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారు మరిన్ని విజయవంతమైన సినిమాలు తీసి పేరుప్రఖ్యాతులు తెచ్చుకున్నారు. వీరి తరువాతి సినిమా 'భార్యభర్తలు' వెండితెర నవలను రమణ వ్రాశారు. దర్శకులు తాతినేని ప్రకాశరావు తెలుగు, తమిళాలలోనే కాక హిందీలో కూడా అనేక సినిమాలు తీశారు. తెలుగుదేశం పార్టీ ఏర్పడ్డాక రాజకీయాలలో ప్రవేశించారు.

# పెళ్లిసందడి



హుషారుగా కబుర్లుచెబుతూ కుర్రకారు ప్రేమాయణంమీద మూడు మైళ్లు షికారు తీసుకెళ్ళే 'పెళ్లిసందడి' (రిపబ్లిక్ ప్రొడక్షన్స్) ఆంధ్రలో ఏప్రిల్ రెండునుండి సందడి చేస్తోంది.

ఇందులోని పాత్రలలో చిన్నవాళ్లూ, పెద్దవాళ్లూ, వాళ్లలా నటించిన నటులలో పెద్దవాళ్లూ, చిన్నవాళ్లూ, దర్శక నిర్మాతలూ. రచయితా యావన్మందీ కూడా ఈసారి బేఖాతరీగా విహరించి హాస్యంచేసి రంజింపచేయడానికి వడికట్టి, దాదాపు అంతపనీ చేశారు. ఎటొచ్చి కొందరు ఆ పని చెప్పకుండా చేసి నవ్వించగలిగారు; మిగతా వారంతా కాసుకోమని వార్నింగు ఇచ్చారు. ఇస్తే ఇచ్చారుగాని మొత్తంమీద వాళ్లూ బాగానే నవ్వించగలిగారు. అందరికన్న ఎక్కువ నవ్వించగలినది మాటలు.

సినీ అసందర్భాలన్నీ సమిష్టిగా ఒకచోట సందర్భపడ్డ ఈ చిత్రంలో గుర్నాథం అనే చిన్నవాడు తన పెళ్లిచూపులకు తన స్నేహితుని పంపి 'ప్రాక్సీ' ఇచ్చి రమ్మనడం ముఖ్య విషయం. సముద్రాల జూనియర్‌కు సంభవించిన అసంభవమనిపించే ఈ తొలి ఊహ చుట్టూ మరికొన్ని అసంభవాలను, అపోహలను పేర్చి ఆయనా, దర్శకుడు యోగానంద్, నిర్మాత సీతారాం వాటికి తగ్గ మాటలు కూర్చి కథను కట్టారు. అసందర్భ ప్పిల్లడు గుర్నాథం వాలకాన్నీ, అంతకో రీలు క్రితం బ్రహ్మాండమైన ఆస్తీ వేపకాయంత వెర్రి ఉన్న గుమ్మడినీ, అతని అన్నదమ్ముడు

రమణారెడ్డినీ వాళ్ళ అపోహాపోహల తీరుతెన్నులనూ చూసేసరికి, మనకీ ఈ కథలో సాధ్యాసాధ్యాల గురించిన బెంగలు పోతాయి.

డాన్సులూ రొమాన్సులూ అంటే ప్రాణం పెట్టే గుర్నాథం, ఒక డాన్సరుతో పెట్టుకున్న ఎంగేజిమెంటువల్ల తీరుబడిలేక గిలగిల్లాడుతూ ఉంటాడు. ఆ వేళకి అతని తండ్రి గంగాధరంగారు పొరుగూళ్ళో పెళ్లిసంబంధం చూసి పిల్లణ్ణి వెళ్ళి చూసి రమ్మంటాడు. అపుడు గుర్నాథం తన జర్నలిస్టు మిత్రుడు వాసును తన బదులు హాజరుకమ్మని పంపుతాడు. ఇలా 'ప్రాక్సీ' వెళ్లి మిత్రుడి తరఫున గైరుహాజరినామా పలకబోయినందుకు వాసుకుపడ్డ జరిమానా ప్రేమ కథలో జారిపడడం, అక్కడున్న ఇద్దరమ్మాయిలలోను పెద్ద చిన్నదాన్ని చూసి సరదాపడి డూయెట్ అందుకుంటాడు వాసు. ఆ పిల్ల రెండో చరణం అందుకోవడంతో ఒక జంట స్వయంవరణం పూర్తి అవుతుంది, అందువల్ల వాసు ఆ యింట్లో చిక్కడిపోతాడు. ఇటు, వాసువచ్చేదాకా ఇంటికెళ్ళకుండా అజ్ఞాతవాసంలో ఉండబోయిన గుర్నాథం, అక్కడ అలా ఉండలేక, ధైర్యంగా ఇవతల పడలేక అవస్థపడుతూ ఉంటాడు. అనూరాధగా అంజలీదేవి, నకిలీ పెళ్లికొడుకు వాసుగా నాగేశ్వరరావూ కనిపించడంతో, అసలు పెళ్లికొడుకు గుర్నాథానికి (చలం), రెండో చిన్నది ప్రియంవద (సరోజాదేవి) మటుకే దక్కుతుందని మనం ముందే పసిగట్టినా, కథ ఈ చిక్కులు విప్పుకొని అడంగి చేరేవరకు, చూచి ఆనందించతగ్గ హాస్య సన్నివేశాలు ఎన్నో ఉన్నాయి. జర్నలిస్టుగా అభినయించిన స్థూలబాల సరస్వతి, రమణారెడ్డి వివాహమాడుట వగైరాలు. ఈలోగా అనూరాధ జన్మవృత్తాంతం బయటపడడం కాస్తంత డ్రామా, మెలోడ్రామా, ఆ పైన ఆమె – కష్టదశలో పడే సినీ హీరోయిన్‌లందరూ తొక్కినదారిలోనే బయల్దేరి పూరూవాడా వదలి ఫోటోజెనిక్ అడవులలో తిరగడం, త్రాగుబోతులు ఆమెను చుట్టుముట్టడం, కొట్లాటలూ ఈలోగా హీరో వాసు కథ బయటపడడం వగైరా ఘట్టాలమీదుగా కథ జనరంజకంగా గమ్యస్థానం చేరుకొంటుంది, వెరసి మొత్తం నాలుగు పెళిళ్లూ ఫెళ్ళున జరుగుతాయి.

నటీనటులందరూ ఎంత కథోచితంగా నటించినా మొత్తం మీద హాస్య నటన స్థాయి గర్వకారణంగా లేదు. చిన్న నటులంతా తమ పాత్రలను సమర్థంగా నిర్వహించారు గాని ముఖ్యపాత్రధారుల హాస్యనటన, హాస్యనటనకు ఉండతగ్గ అవధులను దాటిపోయింది. ఇది హాస్యము సుమీ అన్న తరహాలో హాలీవుడ్ కమీడియన్‌లు కూడా ఈ మధ్యనే వదిలివేసిన హావభావాలతో మొదలై ముందుకు సాగి, హాస్య నటనమీద దర్శకునకు నటులకు గల చిన్నచూపును విశదంచేసింది. సి. ఎన్. ఆర్, రమణారెడ్డి, తొలిసారి హాస్యపాత్ర ధరించిన గుమ్మడి చెప్పుకోతగ్గ నటన ప్రదర్శించారు. హాస్యంపట్ల ప్రేక్షకుల పట్ల దర్శకులకు మరికొంచెం గురి, గౌరవం ఉంటే, నాగేశ్వరరావు, చలం, బాలసరస్వతి బాగా రాణించేవారని, గుమ్మడి హాస్యనటనలో తన అజ్ఞాత ప్రజ్ఞను మరింత ప్రస్ఫుటంగా చూపగలిగే వాడనీ

అనిపిస్తుంది. ఉన్నవారిలో అంజలీదేవి ధరించిన అనూరాధ అందంగా ఆహ్లాదకరంగా ఉంది. సరోజాదేవిని ధరించిన ప్రియంవద గురించి చెప్పుకొనకపోవడం మంచిది. హాస్యేతరనటుడు అయినా తాగుబోతుగా ఆర్. .నాగేశ్వరరావు ఒకడూ బాగా గుర్తుంటాడు.

సంగీత దర్శకుడు ఘంటసాల చాలమంచి పాటలు వినిపించారు. నిండుగా ఉత్సాహవంతంగా ఉన్నాయి. జాగిర్దార్ ఛాయాగ్రహణం విశేషించి ప్రశంసించవలసిన అంశాలలో ఒకటి. సరదాగా 'చాలా సేపు' కాలక్షేపం చెయ్యడానికి సకుటుంబంగా వెళ్లి చూడదగిన చిత్రం.

*(ఆంధ్ర - వారపత్రిక 1959)*



ఈ సినిమా బాగా ఆడింది. నిర్మాత సీతారం తరువాతి ప్రయత్నంగా 'బొబ్బిలియుద్ధం' అనే చారిత్రాత్మక చిత్రం తీసి తనే దర్శకత్వం వహించారు. జమునకు జోడీగా ముఖ్యపాత్ర ధరించారు. దర్శకుడు యోగానంద్ అనేక హాస్యచిత్రాలతో బాటు పౌరాణిక సినిమాలు కూడా తీశారు. హాస్యనటుడి పక్కన నటించిన బి. సరోజాదేవి తర్వాతి కాలంలో అగ్రశ్రేణి హీరోయిన్ అయింది.

# తోడికోడళ్ళు



శరత్‌చంద్ర చటర్జి పుస్తకాలు పాతిక వరకూ ఏకబిగిన చదివేసిన ఒక లాయరుగారిని అభిప్రాయం అడిగాడాయన మిత్రుడు–

"ఏముంది. బండెడు పాదధూళీ కుండెడు కన్నీళ్ళూ" అన్నాడు లాయరుగారు టూకిగా.

టూకీగా శరత్ కథ 'నిష్కృతి'ని తెనిగించి, తెరమీది కెక్కించడంలో, "తోడికోడళ్ళు'ర్ (అన్నపూర్ణా పిక్చర్స్) చిత్రనిర్మాత మధుసూదనరావు, దర్శకుడు అదుర్తి సుబ్బారావు, రచయిత ఆత్రేయ కలిసి, కథలో సారాన్ని మటుకు పరిగ్రహించి, బండెడు పాదధూళి మీదా కుండెడు కన్నీళ్ళూ గుమ్మరింపచేసి, ఇందులో బెంగాలీ ధూళి చెలరేగకుండా సర్దుబాటు చేసివేశారు. (అందువల్ల బెంగాలీ కథ గురించిన బెంగ అనవసరం.)

ఆపైన, పని తెలిసిన దర్శకుడూ, మితి తెలిసిన నటులూ కలిసి, ఒక మంచి తెలుగు చిత్రాన్ని తయారుచేశారు. ఇది ఎక్కడా విసుగెత్తకుండా కులాసాగా గంటకి గంటన్నర వేగంతో సాగిపోయి మూడు గంటల పొడుగు చిత్రం రెండు గంటల్లో పూర్తి అయినట్లనిపిస్తుంది.

మతి మరుపు కుటుంబరావుగారు అనే ప్లీడరొకాయన డబ్బూ గట్రా బాగా గడించాడు. అదే ప్రయోజకత్వం, అదే పరమార్థం సర్వస్వం అని నమ్మినవాడు ఎం.

ఎం. కుటుంబరావు. కక్కుర్తీ దురాశా లేకపోయినా మొత్తానికి డబ్బు మనిషి. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారు జబ్బు మనిషి. కృష్ణా రామా అనుకుంటూ, ఇంట్లో పిల్లల్ని ఆడిస్తూ కాలక్షేపం చేసేది. ఇల్లు చక్కబెట్టే భారం అంతా "మా యింటి మాలక్ష్మి" సుశీలకే ఒప్పగించారు దంపతులు. ఈ మాలక్ష్మి పదేళ్ళనాడు వారింట కాలుపెట్టాకనే, ఇంటిని సిరి వరించింది. అందుకని వారికి ఆమెమీద గురి. లాయరుగారి పినతండ్రి కొడుకు సత్యానికి ఆమె నిచ్చి పెళ్ళి చేశారు. సత్యం మంచి మనసువాడు. కొన్నాళ్ళవరకూ సిగరెట్లూ అవీ కాలుస్తూ "కారులో షికారు చేసే నారి" మీదా, ఆ 'పాలబుగ్గలచాన' కట్టిన "చీర నేసిన వారి" మీదా కూడా కలిపి కవిత్వం చెప్పే స్థితిలో ఉన్నా క్రమక్రమంగా, లోకంలో అన్యాయాలను చూస్తూ అడుగడుక్కీ ఆశ్చర్యపడుతూ బాధపడుతూ చివరకు కష్టజీవుల మధ్య నిలచి వారిని ఆదుకున్నంత మంచివాడు. ఐతే, అతడి ఈ యాత్రకి కారణం ఇచ్ఛాపూర్వకమైన సంకల్పం కాదు; వాళ్ళింటికి అనసూయ రావడం.

అనసూయ భర్త రమణయ్య, లాయరు కుటుంబరావుగారికి స్వయానా తమ్ముడు. పేకాటా, పెళ్ళాంమాటా యీ రమణయ్యకి జవదాటరానివి. వాళ్ళ ఒక్కగానొక్క బిడ్డడు అల్లరి ముద్దుగా పెరిగినవాడు. ఈ ఇస్తోకుపాడి పల్లెనుండి పట్నం వచ్చినప్పటి నుండీ సమిష్టి కుటుంబంలో కలతలు ఆరంభమయ్యాయి. అనసూయ దుర్గుణవతి. ఆవిడ ఇంట్లో సూటిపోటీ మాటలు, పితూరీలు మొదలెట్టుతుంది. తత్ఫలితంగా "డబ్బు గడించి ప్రయోజకుడు" కాలేకపోయిన సత్యం ఇల్లువదలి వెళ్ళవలసి వస్తుంది. అన్నగారి ఆజ్ఞ ప్రకారం, పల్లెకు వెళ్ళి అక్కడ బంజరుగా పడివున్న మెరక పొలాన్ని కష్టపడి సాగుచేస్తాడు. అక్కడ కష్టజీవులనూ ఆదుకొంటాడు.

పట్నంలో కుటుంబరావుకీ అన్నపూర్ణకీ కన్ను మరగేసి డబ్బు దొంగిలిస్తున్న అనసూయ కన్ను మరగేసి దుర్మార్గాన చెలరేగ సాగిన రమణయ్య, మిల్లు మానేజరు వైకుంఠాల అవసరాలు పట్నంలో ఇనప్పెట్టి దగ్గర్నించి చివరికి పల్లెలో పొలం మీదకి తిరుగుతాయి. ఆ వేళకి తగవు పెరిగి, దున్నేవాడిదే పొలం అన్న నినాదందాకా, దానిమీద నుంచి హైకోర్టు దాకా వెళ్తుంది కథ.

హైకోర్టువారు దీన్ని పరిష్కరించడం ఎందుకన్నట్టు లాయరు కుటుంబరావే, తన స్వతస్సిద్ధమైన బేఖాతరీ తరహాలో, మతిమరుపుతనంలో, సాగుచేసుకోండి పోండి అని వివాదాస్పద భూమిని మంజూరు చేసేస్తాడు. ఆ నినాదం; ఆ సమస్య అక్కడితో వదలివేశారు. దుష్టులెవరో శిష్టులెవరో తెలుసుకున్న కుటుంబరావు, శిష్టుల కష్టాలకీ, తన మతిమరుపుతనము, తన నిర్లక్ష్యం కారణమని గ్రహించి ఆ మంచివాళ్ళకి తన ఆస్తిని రాసిచ్చి నిష్కృతి చేసుకుంటాడు. మంచివాడైన సత్యం అతని భార్య సుశీల ముస్తాబై జటకా ఎక్కి ఝూంమని పట్నం వచ్చేస్తారు. జంకూగొంకూ లేకుండా (సిస్టర్ నో ఫియర్స్) దుర్మార్గపు పనులుచేసి, అందర్నీ అవస్థపెట్టిన విలన్ వైకుంఠం చివరికి, కంటనీరు పెట్టాల్సిన అవసరం కూడా లేకుండా టూకీగా తనకి తనే చెంపలేసుకొని దాసుడి తప్పులు దండంతో

సరిపెడతాడు.

ఇదీ కథ. ఇందులో హాస్యం, చక్కని నృత్యాలూ, మనసుకు హత్తుకునే సన్నివేశాలూ పొందుపరచి దీన్ని హుషారుగా నడిపారు.

ఈ హుషారుకి సగంబలం, కుటుంబరావుగా నటించిన రంగారావు సామర్థ్యం. చాలా రోజుల తరువాత, ఈ చిత్రంలో రంగారావుకు నటించడానికి, ప్రేక్షకులకు చూచి ఆనందించడానికి సజీవమైన ఆహ్లాదకరమైన భూమిక రూపొందింది. దీన్ని ఇంత చక్కగా తీర్చిదిద్దినందుకు దర్శక నిర్మాతలూ, నటుడూ గూడా అభినందనీయులు. ఆత్రేయ వ్రాసిన పాటలు, దీనికి అన్నివిధాలా తగిన స్థాయిలో చైతన్యంతో ఒప్పాయి. హుషారుగా సాగాయి. "ఇది" అనే పదం మీద ఆత్రేయ విన్యాసాలు మొదట్లో 'కొంత ఇది'గానే ఉన్నా దరిమిలా "కాస్త ఇది" అనిపించి పోను పోను 'మరీ ఇది'గా తయారయ్యాయి. పాటలన్నీ బాగున్నాయి. వాటి వరసలు విన్నవారికి నోటి కొచ్చేటంత తేలికగా, నేర్చుకోవాలనిపించేటంత అందంగా హాయిగా ఉన్నాయి. సుశీల, జిక్కీ, ఘంటసాల మొదలగువారు ఈ పాటలు పాడారు. సంగీత దర్శకుడు వేణు. ఇవికాక, ఇ.వి. సరోజ, చోప్రాల నృత్యం ఒకటి ప్రత్యేకం చెప్పుకోతగ్గది.

నటీనటులు అందరూ ప్రతిభావంతులే. సుశీలగా సావిత్రి, అన్నపూర్ణగా కన్నాంబ, అనసూయగా సూర్యకాంతం, మిల్లు మేనేజరుగా జగ్గయ్య, రమణయ్యగా స్టార్ వాల్యూకు రెట్టింపు ప్రతిభగల రేలంగి, వడ్డీ వ్యాపారస్థుడుగా చదలవాడ మొదలగువారంతా ఆయా పాత్రల అవధుల మేరకు చక్కగా నటించారు.

ఉన్నవారిలో, ప్రత్యేకం ప్రశంసించతగ్గ కృషి నాగేశ్వరరావుది. అతడు నటించిన సత్యం పాత్రకు సమగ్రమైన రూపకల్పన జరిగినట్లు కనబడదు. ఈ పాత్ర గుణగణాలకూ, లక్షణాలకూ, మాటలకూ, ప్రవర్తనతో అద్యంతం పొసగలేదు. దీన్ని భూసంస్కరణల సమస్యతో జోడించి, దానిని అయోమయంచేసి వదలివేయడంవల్లా, ఈ పాత్రకు ఆపాదించిన నిజాయితీ కొంత దెబ్బతిన్నట్టు కనబడుతుంది. ఈ లోపం కొట్టొచ్చినట్టు కనబడకుండా, నమ్మతగినంత చక్కగా నాగేశ్వరరావు ఈ భూమికను పోషించడానికి ప్రయత్నించి మంచి ఫలితాలు సాధించాడు. కొంత బాగా రూపొందించిన భూమిక ఉన్నపుడు, సమర్థుడైన నటుడు దానిని నిర్వహించినపుడు మాత్రమే ఎవరికైనా ఈ అంశాలు చర్చనీయాలు అవుతాయి. లేకపోతే రోజూ వినబడే నినాదాలలాగా వీటినీ పట్టించుకోకుండా వదలివేయవచ్చు.

ఎందుకైనా, నినాదించేముందు కాస్త నిదానించి మరీ అందుకు పూనుకోవడం వాంఛనీయం. *(ఆంధ్ర - వారపత్రిక 1957)*



బెంగాలీ నవల ఆధారంగా తయారయిన ఈ సినిమా తెలుగునాట విజయదుందుభి మ్రోగించింది. తమిళంలో కూడా తయారయింది. ఈ సినిమాలో 'కారులో షికారు కెళ్లే' పాట ఆత్రేయకు మంచిపేరు తెచ్చింది. తరువాత మనసుకవిగా పేరుబడ్డ ఆత్రేయ ఈ పాట ద్వారా అభ్యుదయ భావాలను కనబరచారు.

# 'చెంచులక్ష్మి'



వినోదకరం, ప్రమోదప్రదం అని చెప్పుకోతగ్గ జానపద - పౌరాణికం 'చెంచులక్ష్మి' (బి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్). పుష్టిగల కథ, రసవంతమైన సంభాషణలూ, మధుమధురమైన సంగీతం, దానికి తగ్గ సాహిత్యం, ఆహ్లాదకరమైన కథనశిల్పం చక్కని ఛాయా గ్రహణం - ఇవన్నీ ఈ చిత్రాన్ని సత్కాలక్షేపానికి యోగ్యంగా రూపొందించాయి. ఎటొచ్చి రాజేశ్వరరావుగారి సంగీతంలో 'శ్రుతకృతు'ల ఛాయలు, పడిఉండకపోతే, సదాశివబ్రహ్మంగారి హాస్యసంభాషణలలో ఆశ్లీలపదవిన్యాసాలు అంతగా ఉండిఉండకపోతే, దర్శకుడు బి. ఎ. సుబ్బారావుగారు ఉగ్రనారసింహుడి మీద మరికొంత గురి, గౌరవం చూపి ఉన్నట్లయితే, ప్రహ్లాద కథాంతంలో ఇంకొంచెం శ్రద్ధ చూపి ఉన్నట్లయితే, ఈ చిత్రం దాదాపు నిర్దుష్టం అనిపించుకోతగినంత నిండుగా, సంతృప్తికరంగా రూపు ధరించేది; రాజేశ్వరరావు చేసిన తీయని పాటలను సుశీల, ఘంటసాల ఎంతో హాయిగా పాడుతున్నపుడు, సదాశివబ్రహ్మంగారు తేలిక మాటలలో, బోలెడంత భావాన్ని పొదిగి, మనోహరమైన రీతిన సంభాషణలు వినిపించినప్పుడు, దర్శకుడు సుబ్బారావుగారు ప్రహ్లాదుడి కథను ప్రశంసనీయంగా నడిపి చెంచులక్ష్మి కథలోకి ప్రవేశించినపుడు, పై లోపాలు గుర్తుకొస్తాయి.

కథ వరహావతారంతో ప్రారంభమై నరసింహావతారం మీదుగా సాగి, చెంచులక్ష్మి గాథలోకి కరగిపోతుంది.

హరీ, సిరీ ఫెళ్లున పెళ్ళి చేసుకుంటూ ఉండగా, దుర్వాసుడు అలవాటు ప్రకారం కినిసి కన్యాదాత సముద్రుణ్ణి శపిస్తాడు మానవుడై పుట్టమని. సముద్రుడు సతీసమేతుడై, భూలోకం వచ్చేసి కోయరాజు వేషంలో తిరుగుతూ ఉంటాడు. ఈలోగా హరి, వరాహుడై హిరణ్యాక్షుణ్ణి వధిస్తాడు. అతని సోదరుడు హిరణ్యకశిపుడు స్వర్గం మీదకి దండెత్తి వస్తాడు. అంచేత, కాస్త అటూ ఇటూగా విష్ణువు, లక్ష్మి కూడా భూలోకానికి దిగి వచ్చేస్తారు. అజ్ఞాతవాసం ఆరంభించినవేళ పాండవులు శమీవృక్షంమీద ఆయుధాలు దాచుకొన్నట్టుగా, విష్ణువు, లక్ష్మీకళను, ఒక ఫలంలో నిలిపి మంత్రించి ఓ చెట్టున కట్టి, ఆమెను ఉచ్చదశలో ఉన్న హిరణ్యకశిపుడి ఇంట కాలక్షేపం చేయమని పంపిస్తాడు. ఆ తరవాత ఏడెనిమిది రేళ్ళపాటు శ్రీనివాసుడు శ్రీదేవిని మరచిపోయి, ప్రహ్లాదుడిని రక్షించే పనితో సతమతమవుతూ ఉంటాడు. ఈలోగా, నారదుడు, ఫలరూపంలో ఉన్న లక్ష్మీకళను అభిశప్తుడైన సముద్రుడికి (ప్రస్తుతం కోయరాజు) ఇచ్చి, అతని ఇంట లక్ష్మీదేవిని వెలయింపచేస్తాడు.

ఇది నాంది. మిగతాది నరసింహావతారం, చెంచులక్ష్మి ప్రణయం, మహలక్ష్మి, చెంచులక్ష్మి దేవిల సంవాదం. ఈ మూడిటిలోను ఒక నరసింహావతార ఘట్టంతప్ప మిగతావన్నీ దర్శకుడు చాల చక్కగా చిత్రించారు. నటులు రంగారావు, పుష్పవల్లి, నాగేశ్వరరావు, అంజలీదేవి, రేలంగి, బాల్జీ సమర్థంగా ఆయా పాత్రలను నిర్వహించారు. ప్రహ్లాదుడి కథలో, హిరణ్యకశిపుడి పుత్రవాత్సల్యాన్నీ, శత్రుద్వేషాన్నీ కూడా ఏక కాలంలో స్ఫురింపచేసే విధంగా రంగారావు నటించాడు. ప్రహ్లాదుడు తండ్రికి సమాధానం చెప్పి, అతణ్ణి విభ్రాంతుణ్ణి చేసిన సన్నివేశం, అక్కడ మాటలూ చాలా నిండుగా ఒప్పాయి. "మరి నువ్వెప్పుడూ హరిని మరచిపోవేం?" అంటాడు ప్రహ్లాదుడు. "కొంచెం ఎదిగితే, మీలాగే (భక్తి) భావాలను మనసులో దాచుకు మాట్లాడడం నేర్చుకుంటాడు" అంటుంది పతిపట్ల గారవానికీ, సుతుడిపట్ల గారానికీ మధ్య సతమతమవుతున్న లీలావతి ధ్వన్యాత్మకంగా భర్త హృదయంలోని భక్తితత్వాన్ని వ్యాఖ్యానిస్తూ.

నిండుతనం లోపించినది నరసింహావతారమే. "ముష్టి పరిమేయ వినుత తను తరస్నిగ్ధ మధ్యుడు" (పిడికిట ఇమిడే నడుము గలవాడు) అయిన నరసింహుడు గజేంద్రమధ్యుడుగా, పెద్ద బొజ్జతో పరిదీన వదనంతో దర్శనం ఇచ్చాడు. ఆ ఘట్టంలో సంగీతం గాని, ఇతర ఆర్భాటాలుగాని సముచితంగాలేవు. జపాన్‌లో భూకంపాలూ, అగ్నిపర్వత ప్రజ్వలనాలూ చూపించేకన్న, కె.వి.ఎస్. శర్మవంటి వాడిచేత పోతన్నగారు వ్రాసిన సింహగర్జన సదృశవచనాన్ని ఉన్న పళంగా చదివించేస్తే బీభత్సరసాన్ని బ్రహ్మాండంగా పోషించి ఉండేవారనిపించింది.

నరసింహుడు అడవులవెంట పడిపోతూ ఉండగా చెంచులక్ష్మి అతనికి ఎదురై ప్రసన్నుణ్ణి చేస్తుంది. అప్పుడు నరసింహుడు మనోహర రూపం ధరిస్తాడు. ఆమె ప్రేమను అర్థిస్తాడు. ప్రేమ అంటే ఏమిటంటుంది చెంచిత.

పూవూతావిలా, నెలా వెన్నెలలా, క్షీరం నీరంలా అని సామ్యాలు తెస్తాడు నరసింహుడు. ఎండకాస్తే పూవూతావీ, మబ్బు వేస్తే నెలా వెన్నెలా, హంస తలిస్తే క్షీరం నీరం వేరైపోవా అంటుంది చెంచి. నువ్వే చెప్పు అంటాడు విభ్రాంతుడైన ప్రియుడు.

"నువ్వూ నేనులా" అంటుంది చెంచులక్ష్మి నవ్వుతూ.

కూతురూ, ఎవరో అనామకుడూ కలిసి అడవిలో డ్యూయెట్లు పాడుతున్నారని విని కోయరాజు మండిపడి, దండించవస్తాడు.

అక్కడ నరసింహుడు, మామగారి ప్రశ్నలకు జవాబుగా, తన ఊరూ పేరూ, తల్లీ తండ్రీ, లేనివాడనని చెబుతాడు. మరి ఎట్లా పుట్టావు అంటాడు కోయరాజు.

"నే నసలు పుట్టనేలేదుగా" అని నిర్గుణ నిరాకార పరబ్రహ్మంచేత మనోహరంగా చెప్పించారు సదాశివబ్రహ్మంగారు.

విస్తుపోయిన కోయరాజుకు నారదుడు అతి చాకచక్యంగా నచ్చచెబుతాడు, ఈ సంబంధం చాలా మంచిదని. "ఊరూ తల్లీ తండ్రీ లేకపోతే నీ కోడలికి అత్తమామల బెడద ఉండదు. ఇక పేరా? నీ యిష్టం వచ్చినట్టు పిలవచ్చు. పేచీ ఉండదు. ఎలా పిలిచినా పలుకుతాడు" అంటాడు నారదుడు; దైవభక్తులు దేవుడికి పెట్టుకునే రకరకాల పేర్లు తలుచుకు నవ్వుకుంటూ.

మామగారి ఆఖరు సందేహం: "అన్నీ బాగానే ఉన్నాయి. మరి తను అసలు పుట్టనేలేదంటాడే. పిల్ల నెలా కట్టిపెట్టను?"

నారదుడి జవాబు: "పుట్టనివాడికి గిట్టడం గురించి బెంగలేదుగదా. అంచేత నీ కూతురు నిత్యసుమంగళి అవుతుంది."

వర్ణనకూ వ్యాఖ్యకూ చిక్కని, చక్కని ఈశ్వరతత్త్వాన్ని ఇంత చక్కని తేలిక మాటలలో బంధించి నిలుప యత్నించిన రచయిత ప్రశంసనీయుడు.

ఇంత అందంగాను, నిండుగానూ, తూలికలాంటి తేలికమాటలతోనూ ఒప్పినది, ఆరుద్ర వ్రాసిన "కరుణాలవాలా" అనే పాట. ఏడెనిమిది చరణాలున్న ఈ పాటకు రాజేశ్వరరావు – రాగమాలికలో వరసలు చేశారు. ఘంటసాల దాన్ని వీనుల విందుగా పాడారు. దర్శకుడు దానిని, నారద పాత్ర చేత (రేలంగి) చిత్రం పొడుగునా, అతడు విష్ణులీల చూసి ముగ్ధుడైనపుడల్లా ఒక్కొక్క చరణం చొప్పున పాడించి చిత్రించారు. చిత్రణ చాలా బాగున్న మరోపాట, అందరు ఎదురుచూచే "చెట్టు లెక్కగలవా" అనేది. రాజేశ్వరరావు ఈపాట పాతవరసకే అతి చక్కని చిలవలూ పలవలూ పెట్టి, గాయకులు ఘంటసాల సుశీలల చేత అంత చక్కగానూ పలికించారు.

లక్ష్మిగానూ, చెంచులక్ష్మిగానూ నటించిన అంజలీదేవి, విష్ణువుగానూ, నరసింహుడుగాను నటించిన నాగేశ్వరరావు అతి సమర్ధంగా తమ పాత్రలను నిర్వహించారు.

ఎక్కడా విసుగెత్తకుండా, హాయిగా నడచిన కథ, చక్కని సంగీతం గల ఈ చిత్రం చూడతగ్గది.

*(ఆంధ్ర - వారపత్రిక 1958)*



ఈ సినిమా అద్భుత విజయాన్ని చవిచూసింది. పాటలు ఈనాటికీ హిట్సే. దీని తర్వాత దర్శకనిర్మాత బి.ఏ. సుబ్బారావు తీసిన 'భీష్మ' (1962) వంటి సినిమాలు కూడా ప్రేక్షకాదరణ పొందాయి. 'మోహినీభస్మాసుర' వంటివి పెద్దగా ఆడలేదు.

# వీరపాండ్య 'కట్టబ్రహ్మన'



బ్రిటీషువారి సింహం, ఈస్టిండియా కంపెనీమల్లె ఫాన్సీ డ్రెస్సు వేసుకొచ్చి గర్జించడానికి గొంతు సవరించుకొని నాజూగ్గా దగ్గింది; పాంచాలియిన్ కురిచ్చి కోటబురుజు మీద నుంచి ఆంధ్రకేసరి ధాటీగా ప్రతిగర్జన చేసేసరికి తగ్గి తమాయించుకుంది.

జగవీరపాండ్య బిరుదాంకితుడు కట్టబొమ్మ కరుత్తయ్య, అతని తమ్ములు శివత్తయ్య (కుమారస్వామి), వూమదొరై (సుబ్బయ్య) వంటివారు ఉండగా తను తరుచుగా జూలు విరబోసుకుని గర్జిస్తూ తిరగడం ఏమంత తప్పనిసరి పనికాదని, అంతకోవాసి నాసిరకం జంతువుల పద్ధతుల్లో వ్యవహరించడం తప్పేమీ కాదనీ నిశ్చయించుకుంది. లొంగిన వాళ్ల నెత్తినెక్కి వంగనివాడి జుట్టు పట్టుకోడంలో సుళువు తెలుసుకుంది.

ఆ రోజున కుంఫిణీ వారి అగ్రహానికీ భయపడ్డ పాళయంగాళ్లూ, అనుగ్రహానికి కక్కుర్తిపడ్డవాళ్ళూ లొంగివచ్చారు. పిట్టపోరులో పిల్లి తగవు సామెతమీద గురిలేనివారు కూడ తెల్లదొరలతో లాలూచీ అయి సాటి నల్లదొరమీద పగబట్టారు. ఈ విధంగా అయినవాళ్ళు ద్రోహం, కానివాళ్ళు కుట్ర తలపెట్టినా వారిమధ్య కట్టబొమ్మ నాయకుడు పరిమిత సహాయశూరుడై నిలబడి పోరాడి,

మగసిరిగల మనిషనిపించుకున్నాడు. అతన్నీ అతని తరవాత అంతగానూ, అంతకన్న ధాటిగానూ ఆత్మగౌరవం పేరిటా, దేశ స్వాతంత్ర్యం పేరిటా బ్రిటిష్ బలాన్నీ వారి భారతీయ బలగాన్నీ ఎదిరించి తిప్పలుపెట్టిన వూమదొరనీకూడా, వారినెంతో ద్వేషించిన తెల్లదొరలే మెచ్చుకున్నారు. భారత స్వాతంత్ర్యసమరానికి ప్రారంభోత్సవం జరిపిన తొలివీరులలో కట్టబొమ్మ నాయకుడి పూర్వీకులు, రాయలసీమ వాసులనీ తిరునల్వేలికి పొట్టచేతబట్టుకు వలసపోయి, మగటిమి చూపి పాళెయంగార లైపోయారనీ, కాబట్టి వారు తెలుగువారేననీ తెలుగువారు అనగా కాదు తమిళులేనని తమిళులన్నారు అని వూరుకోక కరుత్తయ్య వీరగాథను నాటక ప్రదర్శనల ద్వారా బహుళ ప్రచారంలోకి తెచ్చి, జాతివెలుగులలో నిలిపి పూజించారు. తమిళనాడులో రెండు నాటకాలు బహుళ జనాదరణ పొందాయి. ఒకటి టి. కె. ఎస్. బ్రదర్స్ (భగవతి, షణ్ముఖం) వారిది. మరొకటి శివాజీగణేశన్ (రచయిత శక్తి కృష్ణస్వామి)ది. గణేశన్ నాటకం ఇటీవలే మద్రాసులో నూరవ ప్రదర్శనోత్సవం కూడా జరుపుకొంది.

ఈ నాటకాన్నే (దాదాపు యథాప్రకారం) పద్మినీ పిక్చర్సు పేరిట బి. ఆర్. (స్కూల్ మాస్టర్) పంతులు గేవాకలర్‌లో కంటికి నదరైన విధంగా సినీమా తీశారు. శివాజీ గణేశన్, జెమినీ గణేశన్, ఎస్. వరలక్ష్మి, పద్మిని, రాగిణి మొదలయినవారు నటించిన ఈ చిత్రాన్ని ఎ. సి. ఇ. వారు తెలుగులో విడుదల చేశారు. మాటలు డి.వి. నరసరాజు, పాటలు ఆరుద్ర, సముద్రాల జూనియర్, కొసరాజు వ్రాసారు.

కట్టబొమ్మ కరుత్తయ్య నాయకుడు ఖచ్చితంగా తమిళుడే ననడానికి కొండగుర్తుగా "కట్టబొమ్మన్" అన్నారు. తమిళ నాటకకర్తలు, అంతమాట అంటారా, అతను పచ్చి తెలుగువాడు అని నిరూపించేందుకు ఇప్పుడు అనువాదకులు ఆ పేరు బద్దలుకొట్టి, అసలు వారింటిపేరు కట్టావారనీ, మనిషి పేరు బ్రహ్మన్న అనీ తేల్చారు. ఆపైన, న కింద వత్తు తీసేసి ఆ చివర అక్షరాన్ని కూడా తేల్చి పల్నాటివీరుల్ని తలపుకు తెచ్చే బాక్సాఫీసు వర్ణక్రమం ఏర్పరిచారు. ఈ విధంగా కొంతకాలంనాటి వంశనామం కట్టబొమ్మ కట్టబ్రహ్మన అయినందువల్ల మరి కొంత కాలానికి, మలయాళీ దర్శకు లెవరయినా దీనిని మహారాష్ట్రంలోకి డబ్ చేసినపుడు, 'కెట్ట బ్రహ్మన'కి తమిళంలో అర్థం 'చెడ్డ బ్రాహ్మణుడు' అని పసిగట్టి, మహారాష్ట్రంలోకి 'ఖోటాబ్రహ్మణ' అని అనువదించుకొని నామకరణం చేసే అవకాశం వుందనీ, ఒక హిస్టరీ స్టూడెంటు దురాశపడుతున్నాడు.

ఆమధ్య తమిళులలోనే ఒక వర్గంలో చిన్న తగాయిదాలాటిది రేగింది. ఆంధ్రులు మావాడంటున్నారు. గాబట్టి కట్టబొమ్మనను వాళ్ళకే ఇచ్చేయాలనీ, అసలు నిజానికి అతని అనుయాయి పులితేవన్ అనే అతనే నిజంగా బ్రిటిష్‌వారి నెదిరించిన వీరుడనీ కట్టబొమ్మన నిష్కారణం పబ్లిసిటీ చెక్కేసి హిస్టరీ పుస్తకాల్లో అచ్చయి ఊరుకున్నాడనీ కూడా ఒక సవర్గకలహం.

   

ఇవన్నీ ఎలా ఉన్నా ఎ. సి. ఇ. వారి కట్టబ్రహ్మన చూడవలసిన చిత్రం. ఒక ఉత్తమ పురుషుడిని, వీరుడిని, ఉదారుడిని, దేశభక్తుడిని, గౌరవపురస్సరంగా నిలిపి అతని కథను నిండుగా చిత్రించారు. మన్ననచేయతగిన చారిత్రక చిత్రంగా రూపొందించారు. మెచ్చుకోతగ్గ అభిరుచితో అందమైన సన్నివేశాలు కల్పించి వాటిమధ్య కట్టబొమ్మన్‌ను ఠీవిగా నిలిపారు. శివాజీ గణేశన్ అతి సమర్థంగా పాత్రను పోషించాడు. కొన్ని చోట్లమటుకు అవసరమైనదానికన్న ఎక్కువ సమర్థంగా నటించడం జరిగింది. అలాగే అతనే సంభాషణలూను. వేషం కట్టినవాడు గణేశన్ కాబట్టి, కట్టబొమ్మ అనర్గళంగా ఉపన్యాసాలు విసరవలసివచ్చింది. అతని స్థాయి, ధాటినీ బట్టి, మిగతా పాత్రలు కూడా అవకాశం (అరుదుగానే) దొరికినపుడల్లా నోరు దాచుకోకుండా రీలూ అరరీలూ మాట్లాడేశాయి. అయితే మూగవాడైన వూమదొర ఐదారు గజాల పొడుగున మాటాడినపుడు మాట తెలిసినవాళ్ళు అపాటి మాటాడడం బేసబబు కాదు.



నటీనటులందరూ (హాస్యగాళ్ళు రాజగోపాల్, కరుణానిధి మినహా) కథకు న్యాయంచేసే విధంగా నటించారు.

సేనాని జెమినీ గణేశన్ యుద్ధానికి బయల్దేరే ఘట్టంలో, అక్కడి ఉద్వేగాన్ని ప్రేక్షకులు కూడా అనుభవించేటంత గొప్పగా నటించాడు. అతని భార్య (పద్మిని) కన్న పీడకలను వివరించే పాటతో చిత్రించిన ఈ సన్నివేశం ఈ చిత్రంలో గొప్ప ఘట్టాలలో ఒకటి. పాటా, వరసా కూడా బాగున్నాయి.

కట్టబొమ్మన్ భార్య జక్కమ్మగా మధు-- స్వరలక్ష్మి ఎస్. వరలక్ష్మి నటించింది. ఆమె పాట, రికార్డింగ్‌లోనో మరే సాంకేతిక కార్య4కమంలోనో జరిగి ఉండగల లోపంవల్ల ఆశించినంత మధురంగా భాసించలేదు.

ఈ చిత్రం మొత్తం మీద మొదటి నుంచి చివరివరకూ రాజఠీవితో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడచిపోయేవాడు శివాజీ గణేశనే! ఉరికంబానికి పోయే ఘట్టంలో నిర్వికారవదనంతో ఆయన నడచి వెళ్ళిన తీరు ఈ చిత్రానికే భూషణప్రాయం కానీ అంతకో రీలుముందు, బానర్‌మాన్ విచారణ జరుపుతున్నపుడు కట్టబొమ్మన్ అంతగా నోరు పారేసుకోవడం, (ఉమ్మివేయడం కూడా) పాత్రకు ఉచితం అనిపించదు. అంతగా ప్రబలవిరోధి, అతనికి మరణదండన విధించిన వాడూ అయిన తెల్లదొర బానర్‌మానే, కట్టబొమ్మన్ తొణుకూ బెణుకూ లేకుండా మాట తూలకుండా, ఒక్క చూపుతో దేశ

ద్రోహులందరినీ మాడ్చివేశాడనీ, చనిపోయే వేళ అతను ఒకే ఒక్క వాక్యం - "యుద్ధం చేస్తూ ప్రాణం కోల్పోయే అవకాశాన్ని వదలుకున్నందుకే బాధపడుతున్నాను" - అని చనిపోయాడనీ వ్రాశాడు.

ఈ కాస్త ఈ విధంగా కొద్దిగా అసంతృప్తి కలిగించినా, అనేక విధాల ఈ చిత్రం బాగుంది. తెనిగింపుకూడా ఆరంభంలో ఒకటి రెండు రీళ్ళు ఓ మోస్తరుగా ఉన్నాపోను పోను కథతోపాటు సమానంగా వుంజుకుంది. శివాజీగణేశన్ ఉత్సాహానికి ధీటైన స్థాయిలో డి. వి. నరసరాజుగారు సంభాషణలు వ్రాశారు.

*(ఆంధ్ర వారపత్రిక - 1959)*



తమిళ రంగస్థలం ద్వారా తెరకు వచ్చిన ఈ సినిమా సక్సెసయి, ఈ నాటికీ తమిళ చిత్రరంగంలో గొప్పగా చెప్పుకోబడుతోంది. శివాజీగణేశన్ మరెన్నో చారిత్రాత్మక పాత్రలు, చిరస్మరణీయమైన పాత్రలు ధరించి మన్ననలు పొందారు. దర్శకనిర్మాత బి.ఆర్. పంతులు తెలుగు, తమిళ, కన్నడ భాషలలో పలురకాలైన సినిమాలు తీసి ఖ్యాతి మూటగట్టుకున్నారు. చాలా సంవత్సరాల తర్వాత ఆయన కన్నడంలో తీసిన "శ్రీకృష్ణదేవరాయ" చారిత్రాత్మక సినిమా కూడా హిట్ అయింది.

# టీవీరమణీయం

## ఈటీవీ భాగవత కథలు

### టైటిల్ సాంగ్

శ్రీహరి చరితము
పరమ పవిత్రము
పాప లవిత్రము భాగవతం - శ్రీభాగవతం
పూలూపళ్లూ పాలూతేనే
అన్నీ తామై అలరే కథలివి
ఆలకించుటే అర్చనగా హరి
ఆదరించు ఈ సుమధుర కథలను
తనివార వినీ
మనసార కనీ
తరియించమనీ
శ్రీవ్యాసమునీ
తన తనయుడు శ్రీ
శుకముని ముఖమున
పలికించినదీ భాగవతం
శ్రీ భాగవతం
హరి చరితం
శ్రీహరి చరితం
రసభరితం
నవరస భరితం
భాగవతం శ్రీ భాగవతం
కథనం మధురం
శ్రవణం మధురం
గానం మధురం

ధ్యానం మధురం
శ్రీ భాగవతం - సర్వం మధురం
మధురం
మధురం
మధురం
మధురం

## కంసుని వద్ద రాజనర్తకి

భోజవంశ రాజహంస
భో! భో! యువరాజ కంస
భండన మండల వతంస
భామా జనగణ రిరంస -
కంసా!
హే కంసా!
నన్ను చూడరా రాజా
నిన్ను చూచునా
కన్ను చూసి - నను
మన్నన శాయర ఓ రాజా
రే రాజా -



## బలరామావతారం అవతరణ

మహావిష్ణు పార్షద ముఖ్యా
మహిమాన్విత హలధర శూరా!
సాహస్రక్ర ఫణమణి రంజిత
శత్రుంజయ జనరంజన రామా
        రామా! బలరామా!
దయసేయుము! దయసేయుము
దయసేయుము ధరణికిపుడు
సంకర్షణ! సంకర్షణ! శత్రుధర్షణా!
ఆదిశేషా! అనంతుడా! దిగిరా! దిగిరా
అనంతా హే అనంతా ఓ అనంతా
అనంతానంత నంతనంతానందమ్!

## యశోద కాన్పుసమయం
## నంద యశోదల జాతక చక్రాలు చూస్తుంటే

లలితశ్రీ నవతనూజా
        లాలి సురకల్ప భూజా
ఎనిమిదవ మాసముననూ
        పతిని సతి కూడీ కూడలేకా
ముదముతో వీడలెకా
        పవళించి మారుమాటాడలేకా!
తొమ్మిదవ మాసమునసూ
        తన సొగసు వాడవాడా
సమ్మతిగ చెలులు వేడా
        ముదముతో కొంగు
        దిగ వీడవీడా
వనజాక్షి వునికి జూసీ అలసటా
        సొలసెనని మదిని తలచీ
తలయంటి పోసి తుడిచీ
        జలశుద్ధి జేసిరా స్త్రీలు గలసీ
అమ్మరో రాగదమ్మ - భుజియించ
        ఏది నీకిష్టమమ్మా

సమ్మతిగ దెల్పవమ్మ - మాయమ్మ
కొమ్మరో వేగరమ్మ
వద్దనా గూడదమ్మా - యఱ్రగా
కాచినా పాలు సుమ్మ
సుదతి భుజియించలేకా
నొప్పులకు తాళలేకా
నొప్పులని చెప్పలేకా - చెప్పకను
చెలుల కనుగప్పలేకా!

## యశోద నిండు చూలాలు

అడవిలో సీతమ్మకాయె వేవిళ్ళు
పులిజున్ను మనసని పురుషుడికి జెప్పి
అఁ!
ఊఁ! (నవ్వులు)
పుట్టమీద బోనొగ్గి పులిని పడగొట్టి
దొన్నెలో ఆ పాలు పితికె రామన్న
ఏడు పిడకలు దెచ్చి దాయల్లు వేడి..........
(అంతా మాయ కమ్ముతుంది)

## వసుదేవుడు కృష్ణుని యశోద పక్కనుంచి స్త్రీశిశువును తీసుకుంటున్నపుడు

॥. విజయా వైష్ణవీ దుర్గా
నారాయణ సహోదరీ
ఈశాన చండీ భద్రా
మాయాదేవీ! నమోస్తుతే! .॥

## రేపల్లె వీధి నందసందనం

(గొల్లభామలుగా వచ్చిన అప్సరసలు వెన్న, పాలు, పళ్ళు,, పూలు పట్టుకొని నందుని ఇంటివైపు లయప్రకారం అడుగులు వేస్తూ వస్తున్నారు)

బృందం। అల్లరి చేయగ నల్లని దేవుడు
పల్లెకు వచ్చాదంట

రేపల్లెకు వచ్చాడంటా
మన పల్లెకు వచ్చాడంటా

రావే అక్కా రావే చెల్లీ
నందుని ఇంటికి వెళ్ళీ
అల్లరి చూసీ అల్లరి చేసీ
ఆడీ పాడీ సందడి చేసీ
తరించి పోదాము

## నంద యశోద రోహిణులు కృష్ణ రాములను ఆడిస్తున్నారు. రామకృష్ణులు తప్పటడుగులు వేస్తూ బుల్లి చేతులతో తారంగం తిప్పుతున్నారు

యశోద : తారంగం తారంగం
రోహిణి : తాండవ కృష్ణా తారంగం
వేణునాధా తారంగం
వెన్నముద్ద తారంగం

గోపికలు వచ్చారు.

గోపిక 1 చేత వెన్నముద్ద
2 చెంగల్వపూదండ
3 బంగారు మొలతాడు
4 పట్టు ధట్టి
5 సందెట తావేదు
6 సరిమువ్వ గజ్జెలు

అందరూ:- చిన్నికిట్నా! మాకు వెన్న పెట్వా?
గోపిక1 : పెట్వా? పెట్వా?

## నందసదనం పెరడు

(బాలకృష్ణుడు తప్పటడుగులు వేస్తూ తన నీడని తరుముతున్నాడు)

పాట: నీడచూసి ఇంకెవడో అనుకుని
వాడిని తరిమెదు బాలుడు
అందాలు చూడు బోలెడు

యశోద మొదలైన వారు నాలుగు వైపుల నుంచి చప్పట్లు కొడుతూ వచ్చారు.

యశోద : రోహిణీ! పూర్ణా! రండి రండి! చూడండి

నారదుడు : వడివడి పరుగిడు పదములు
బంగారు బాలునకు రథములు
గజ్జె ఘల్లుమను విధములు
ముని గణముల మనోరథములు

బాలుడు ఆగాడు....నీడా ఆగింది. బాలుడు గెంతాడు...నీడా గెంతిండి.

కృష్ణుడు : ఆఁయ్ వెక్కిలిత్తావా!?

తరిమాడు పాట : తప్పటడుగులే తప్పటడుగులై
బోర్లపడ్డాడు కన్నయ్య!

నీడ పొట్టిది అయింది:

పాట: నీడ పొట్టిదై చేతికందగా
'దొరికాడు దొంగ' అన్నాడు
నీడగాడి పని పడుతున్నాడు అంతలో

యశోద మొదలైనవారు చప్పట్లు కొడుతూ దగ్గర కొచ్చారు. వాళ్ళ పెద్దనీడలు కన్నయ్య నీడని మింగేశాయి

పాట: నీడలు నీడలు నీడలు
మరిచెట్టు పెను ఊడలు
పెద్దవాళ్ళ నీడలు పడగా
చిన్ననీడ మరుగాయె
–కనుమరుగాయె

బాలుడు చుట్టూ చూశాడు... తన నీడ లేదు!

కృష్ణుడు: పారిపోయె పారిపోయె
దొం–గాడు పారిపోయె
పటుకోవే అమ్మా
పటుకో నాన్నా!

## బాలకృష్ణుడు చేత్తో జుట్టును సాగదీసుకుంటూ

కృష్ణుడు: కొన్నిపాలు తాగితేనే
జడలు పెరుగునంటివి
ఎన్ని పాలు తాగినా
చూ–డన్న కన్నా చిన్నవే

ఎందుకమ్మ ఎందుకమ్మ
ఎందుకమ్మ చెప్పవే
చెప్పవే ఓ యశోదమ్మ
ఎందుకమ్మ చెప్పవే -
రొట్టె కాస్త పెట్టి చూడు
జుట్టు పెరిగీ పెరిగి పెరిగీ
జానెడు జడ మూరెడై -



మూరెడు జడ బారెడై
నాగుబాము తోకలాగా
కాళ్ళదాకా జారునే -
అమ్మా గోపెమ్మా
మాయమ్మ యశోదమ్మ.

యశోద కవ్వం చిలుకుతోంది. గుర్ గుర్
గుర్ గుర్
కృష్ణుడు అదే లయలో వస్తున్నాడు. గల్ ఘల్
గల్ ఘల్
యశోద వేగం పెంచితే తనూ పెంచుతున్నాడు.
యశోద : ఏవిటి దొరగారు మళ్ళీ వచ్చారు.
బాలుడు చిందువేశాడు: గల్‌గల్ గల్ గల్
గల్‌గల్ గల్ గల్

యశోద: వెన్న కావాలా?

కృష్ణుడు: అమ్మో వద్దు! బయ్యం

యశోద: వెన్నంటే భయమా!

పాట: కృష్ణుడు: గుఱ్ఱు గుఱ్ఱనే గుమ్మడూ
కుండలోపలా వున్నాడూ
వెన్నకోసం చెయ్యిపెడితే
కటుక్కుమని (కరకరమని) కొరికేస్తాడు
అన్నావు గదే గోపెమ్మా
అందుకే వెన్న వద్దమ్మా

యశోద: యింకేం కావాలిట?

కృష్ణుడు: పాలు! పాలు!

యశోద: ఇప్పుడే తాగావు జుట్టు పెరగలేదన్నావు!

కృష్ణుడు: ఇపుడు పెరుగుతుందిలే -

యశోద: ఎలా?

కృష్ణుడు: తువ్వాయిని వదిలాను. వాళ్ళమ్మ పాలు తాగింది - య్యిలా- (చేతులు బారజాపి) దాని తోక పెరిగింది.

యశోద: ఇప్పుడు కాదు రాత్రికి

కృష్ణుడు: రాత్రంటే?

యశోద: చీకటి పడుతుందిగా - అప్పుడు

కృష్ణుడు: (కళ్ళుమూసుకుని)
చీకటమ్మా రావే-రావే-
ఇదిగో చీకటిపడేసి పోయింది. పాలివ్వు.

## శ్రీకృష్ణుని జన్మదిన వేడుకలు - పూతన రాక

దివినుండి భువికి దిగి వచ్చినట్టి
శ్రీవైకుంఠమ్మదెవో! అల్లదెవో!
ధరనేల బోవు దొర కొలువు దీర
చూతాము రారె అదెవో! అల్లదెవో

నారాయణతే నమో నమో
నారద సన్నుత నమో నమో!
మురహర భవహర

ముకుంద మాధవ
గరుడ గమన
పంకజనాభా!
పరమ పురుష భవబంధ విమోచన
నాద ప్రియతే నమో నమో!

నీలమోహనుని
పాలవానలో
ఓలలాడించ
ఆలమందలవిగో - అవిగో

స్త్రీలు: నందరాణి యశోదమ్మ
నిన్నరాతిరి కన్నదంట
నల్ల చక్కని పిల్లవాడిని
చల్లగ పాలింప భూమిని

పూతన: రండూ రండూ రారండోయ్
రారాజును చూసి మురిసె
చాలా కోలాహలముగ కోలాటాలాడి పాడి
అంబరాన్ని చుంబించే
సంబరాలు జరుపంగను
రారండోయ్
ఊరందరూ రారండోయ్!

గోపయువకులు: వందారు వందారు
నందనందనా
వందారు మందార
భక్త చందనా

రోహిణి: పాలలోపల పరుచుకున్న వెన్నవు నువ్వేనా

యశోద: రూపాల లోపల వెలుగుతున్న దీపం నువ్వేనా

పూతన: కట్టెలోపల దాగి వున్న బొగ్గు నువ్వేనా?

అందరూ: ఛి ఛి

పూతన: మాది బొగ్గులేపారం మరి - మా బాసలింతే!
గుండె లోపల గూడు కట్టిన గువ్వ నువ్వేనా!
రెక్కలు జాచీ చుక్కలు చేరే గువ్వవు నువ్వేనా!
నా గువ్వవు నువ్వేనా

నా గువ్వవు నువ్వేనా!

గోపికలు: ॥చిరుత నవ్వుల వాడు....॥
కోలు కోలో సామి కోలో మాసామి
గోకులానికి మేలు మేలో
నందరాణికి కోలు కోలో
నందరాజుకి మేలు మేలో
బాలరాజుకి కోలు కోలో మాసామి
నీలచంద్రుడికి మేలు మేలో
చాలు చాలో సామి చాలో నాసామి
పాటలింకను చాలు చాలో
ఆటలాడగ రారె రారో

**పూతన వధ తరువాత కృష్ణునకు దిష్టి తీయడం**



శ్లోకం శ్రీకృష్ణస్తే శిరః పాతు వైకుంఠః
కంఠమే వహి శ్వేత ద్వీపపతిః
కర్ణే నాసికాం యజ్ఞ రూపధృక్
నృసింహో నేత్ర యుగ్మంచ...

స్త్రీలు: శిరసును గావుమా శ్రీకృష్ణ దేవ!
కంఠాన్ని కాపాడు వైకుంఠ దేవ!
నేత్రాల రక్షించు నరసింహస్వామి!
దేహాన్ని కాపాడు దశరథ పుత్రా
మోహినీ! వామనా! బాదరాయణుడా!
దిక్కులను గాచే దిక్పాలకులారా
ముక్కోటి దేవతలు ఒక్కరై రండి
మాబిడ్డ మీబిడ్డగా దలచి మీరు
మమ్ము గాపాడండి మహనీయులారా!

**రాసలీల ఆరంభం**

మధువులీను అధరాల చెంత
ఒక వెదురు వేణువై ఒదిగినదీ
ఒక స్వరము గానమై కదిలినదీ
కృష్ణమురళి శ్రీకృష్ణ మురళి
పిలిచినది కృష్ణ మురళి -
-పిలిచినది కృష్ణ మురళి

పరమాత్మునితో పొందును పొందగ
జగదభిరాముని వరముగా
శ్రుతులూ ఋషులూ నరవానరులూ
గోపికలై జనియించగా
వారల నెల్లర తరింపజేయగ
పిలిచినది కృష్ణమురళి - శ్రీకృష్ణముర



హాయి వెల్లువై పొంగినది
రేయి మాయలో మునిగినది
పిలిచినది కృష్ణ మురళి

*మునివెంట.....*

ఇనకుల సోమా రారమ్మంటూ
దినకరుడు ముందుకురక - బాలుడు
తాళలేడు నీ తాపము నంటూ
మేఘుడు ఛత్రము బట్ట
పిల్లగాలి పన్నీరు జల్లుతూ
మెల్లగ సేదలు దీర్చ
పూలబాటలను కొమ్మలు రెమ్మలు
వాలాయముగ పరచ
కోలాహలముగ పికములు శుకములు
మేళతాళాల నాద
ఏమీ సందడి ఏమీ సంబర మెవరికోసమిది అనీ
తనకేమో అనుకునీ - తన
వెనకే రాముని గనీ
ముంగురులు సిరుల
ముత్యాల సరుల చిరునగవు నగల హరినీలమణుల
తిలకించు కనులు తరియింప- మేను
పులకించ - వెలుగు వెదజల్లువాని
శోభిల్లు రాముని గని ముగ్ధదాయె ఆ రాణ్ముని
పుంసాం మోహనరూపాయ
పుణ్యశ్లోకాయ మంగళం
నీలమోహనా! బాలరాఘవా!
లీలా మానుష విగ్రహా!
నిన్నుచూడ నిన్నుచూడ
కన్నుల పండుగ రామా!
రాఘవ రామా! మోహన రామా!

బృందం:

దక్షాధ్వర విధ్వంసక శంభో - జయహో జయహో
త్రిపురాసుర సంహారక శంభో -జయహో జయహో
భస్మీకృత మకర ధ్వజ శంభో - జయహో జయహో
శుభదాయక అభయప్రద శంభో- జయహో జయహో

విశ్వామిత్రుడు

కౌసల్యా సుప్రజా రామా
పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యం దైవమాహ్నికం!

శివధనుర్భంగం

ఆ గమనం సామజవరగమనం
ఆ చలనం మేరువు యుగ చలనం
ఆ నయనం దానవ సంచయనం
ఆ వదనం సీతా హృన్మథనం
ఆ రాగం హిందోళం
ఆ యోగం కళ్యాణం



విల్లు చేత బట్టి
అల్లె తాడు కట్టి

విల్లు ఒళ్లు విరుగు మేర
నారిని సారించీ
కళ్లార్పక చూసే
సీతా వధూటి గాంచీ
భూమీ నభమూ అదరగ
భృగురాముని తపము చెదర
హరతాండవ పదఘట్టన
సదృశ ఫెళార్భటులతో
ఫెళ్లున
ఫెళ్ పెళ్లున
అవలీలగ చెరిసగముగ హరువిల్లును విరచీ
అవనీసుత కనుచూపుల హరివిల్లును పరచీ
అలవోకగ చిరునవ్వే రామా కళ్యాణ రామా– సీతారామా
నిన్నుచూడ నిన్నుచూడ
కన్నుల పండుగ రామా!

గుహుడు

కోలుకోలో సామి
కోలు కోదండ సామి రావయ్యా
కోలు కోలో సామి
కోలో సీతా రామయ్యా
కోలుకోలో సామి కోలో కోదండ సామి
కోలు కోలో సామి రామయ్యా
కోలో సీతా రామయ్యా!

నరుడు దేవుడయ్యాడంటే నమ్మలేదయ్యా
నే నమ్మలేదయ్యా
నాదరికి నడచి వచ్చాడంటే నమ్మ లేనయ్యా
నే నమ్మలేనయ్యా

తాటకిని కొట్టినాడు ఓహోయ్ హోయ్!
మారీసుని గూల్చినాడు హొయ్ హొయ్ హొయ్!
పరశురామునీ పొగరు దించినాడు బలెబలెబలె

అయన్నీ సరే గానీ - అసలు గొప్ప ఏరే వుంది
కన్నతండ్రి సెప్పాడని కన్న తండ్రి సెప్పాడని కిరీటమే కిందబెట్టి
నోటికాడ కూడు తీసి - హవ్వ! నోటికాడ కూడుతీసి
సవతి బిడ్డ సేతబెట్టి
అడవుల బడి ఇడుమల బడి
హాయిగ నవ్వేసినాడు రామయ్యా!
ఇప్పుడు
నరుడు దేవుడయ్యాడంటే నమ్ముతానయ్యా నే నమ్ముతానయ్యా!

ఆగు ఆగు దేవరా - ఆగు ఆగు
దూకుడొద్దు దూకుడొద్దు రామయతండ్రీ
దుమ్ముకాళ్ళు పెట్టమాక రామయ తండ్రీ
నీ కాలి దుమ్ము తగలగానె పడుసుపిల్ల మొలిసెనంట!
నానావ మీద కాలుపెడితె ఏమొస్తాదొ తంట
సెప్పింది ఇనమంటా! కాళ్ళు కడగనీయమంట!
రామయ్యతండ్రీ - రామయ్య తండ్రీ
నావనెక్కినావనీ కేవా సామీ! భలే
నావనెక్కి నావనీ కేవా సామీ!
సాటోడికి సొమ్ములివ్వ సబబు కాదులే
నీకు నాకు సాటేంటని నవ్వేస్తావా!
నీ తిరకాసేంట్రా అంటా నిలదీస్తావా!
ఇనకుల రామా!
ఇద్దరమూ నావికులమె
లెస్సనుకొ
ఇది లెస్సనుకొ
హై లెస్సనుకొ
ఇనుకో మరి ఇనుకో
ఇనకుల రామా!
గంగపాయ దాటించే కేవరి నేనూ -
సముద్రాన్ని దాటించే దేవర నువ్వూ
బతుకు సముద్రాన్ని దాటించే దేవర నువ్వూ దేవర నువ్వు
నారేవుకి నువ్వొచ్చి కేవివ్వద్దూ
నీ రేవుకి నేనొస్తే కేవడగద్దూ
ఇంకేవడగద్దూ॥

## శబరి

నీవేనా! ఇది నిజమేనా! కలగనియేనా!

తనువెల్ల కనులుగా
క్షణమొక్క యుగముగా
తనివార నినుజూడ
తపియించు దాననూ
ఈ దీననూ!
నను పాలింపగ నడచీ వచ్చిన రామా
నా రామా!
అల వైకుంఠము నచటే విడచీ
ఇల వైకుంఠము అయోధ్య గడచీ
అడవుల వెంబడి నడచీ నడచీ
నను పాలింపగ నడచీ వచ్చిన రామా!
శ్రీరామా!
ఎంతా పుణ్యము చేసే నా చూపూ
కనులార తిలకించ నీ రూపూ
ఎన్నీ తపములు చేసే నా మాటా
రామయ్య నిలవంగ నా ముంగిటా
ఎన్నీ నోములు శబరి నోచంగా
శ్రీగంగ పుట్టిల్లు కడుగంగా
నేడు కడుగంగా

స్వామీ! ఇవి తెచ్చినదీ నేనే!
కానీ యిచ్చినది మీ యమ్మ కౌసల్య సుమా!

అల్లారు ముద్దుబిడ్డా - రామయ్య
ఆకలెరిగాదరించూ -
అనుచు కౌసల్యామాతా - రామయ్య
ఆకాశ దేవతను వేడంగా
ఆకాశదేవతపుడూ - రామయ్య
పుడమితల్లికి చెప్పగా
అడవిలో చెట్లు పట్లూ - రామయ్య
పండ్లు ఫలములు తేనెలూ

శబరి చెంగున వుంచగా - అంతటా
బంగారు నాతండ్రికీ - రామయ్యా
అందించు భాగ్యమబ్బెను శబరికీ! రామయ్యా

ఏది చేదో
ఏది కాదో
ఎరుక లేదీ శబరికీ
ఎంగిలనకా అందుకో
నా ఇంగితము నీవెరుగవా!
బేలతనమేలరా నీల వర్ణుడా
నీలాలు నీకంట నే చూడలేనూ
దక్షిణానికి సాగు దశరథుని కొడుకా
సుగ్రీవు జతకట్టు శుభము చేబట్టూ

## వానరులు

బాలభానుని చూసి
పండు అను భ్రమతోడ
పట్టబోయిన ఓ
బాలాంజనేయా! మేలుకో!
వాలినే కూల్చు బల
శాలివైనా నీదు
శక్తి మరచిన ధీర
శూరాంజనేయా మేలుకో
లంక కొక అంగలో
లంఘించు శక్తిగల
శక్త్యాంజనేయా - మేలుకో

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం
ప్రభాదివ్య కాయం ప్రకీర్తి ప్రదాయం
భజే వాయుపుత్రం భజే వాలగాత్రం
భజే రుద్రరూపం భజే సూర్యమిత్రం
భజేహం!
భజేహం!
భజేహం!
భగవంతునకే సాయము చేసిన

హనుమంతునకిదె మంగళం
సీతారాముల కలిపిన వారధి
సామీరికి శుభ మంగళం
అంధకారమున ఆశాదీపము
సుందరకాండకు మంగళం
జయ మంగళం
శుభ మంగళం!

## రాముని కథ మధురం

శుకముని:

భవతారకమగు భాగవతంబున
రాముని కథ అతి మధురం
రూప సుందరుడు
నామ సుందరుడు
భావ సుందరుడు
సత్య సుందరుడు
రాముని కథ అతి మధురం
ఆ లంకలో నున్న వనము సుందరము
ఆ వనములో సీత మనము సుందరము
ఆ వనములో హనుమ రణము సుందరము
చీకటిని పూచేటి వెలుగు సుందరము
దుఃఖాన చిగురించు నగవు సుందరము
సుందరకాండము సర్వమూ సుందరము

చేజాచి అర్థించి – కాలితో మర్దించు
ఘటికుడగు వటువునకు ఘన మంగళం
అసుర గురువును పిలిచి అశ్వమేధము పూర్తి
చేయించు శ్రీపతికి శుభమంగళం
అన్న యింద్రుని పిలిచి స్వర్గ పదవిని గూర్చు
ఉపేంద్రునకు నిత్య శుభమంగళం
అతివగా పూజించి అమ్మగా దీవించ
చిరునవ్వు శ్రీహరికి జయ మంగళం

జయ మంగళం శుభమంగళం
జయ మంగళం నిత్య శుభ మంగళం.

## కార్తవీర్యుడి జలక్రీడ

గలగల పారెడు నది - యిది -
కిలకిల నవ్వించు నది - ఈ
వలపుల కౌగిలి మ-నది- చలి
గిలగిలగిల నలిగి- నది
గలగలా కిలకిలా
వలపుల గిలగిలా



# రచయిత గురించి



"ఈ భూప్రపంచంలో ఎదుటివాడిలో కృతజ్ఞత ఆశించే కన్నా ఆంధ్రరాజకీయ నాయకుల్లో ఐకమత్యాన్ని ఆశించు... ఆంధ్రుల్లో కార్యశూరత్వాన్ని ఆశించు" అంటూ ఓ కథలో సెటైర్ కొరడాతో తెలుగువాడిని చమడాలొలిచిన వ్యక్తి ముళ్లపూడి వెంకట్రావ్... అతడే తర్వాత్తర్వాత ముళ్లపూడి వెంకటరమణగా మారిన వ్యక్తి. నవ్వడం నవ్వించడం పోయి నవ్వుల పాలైన తెలుగువాడి బతుకుల్లో హాస్యం పన్నీటి జల్లు చిలకరించడం - 1945 లో మొదలెట్టినా - 1950 నుండి దీక్షతో ఆరంభించిన వ్యక్తి ముళ్లపూడి.

తెలుగు సాహిత్యంలోని నక్షత్రకుడి పాత్రను కౌంటర్ చేసే అప్పారావు పాత్రను సృష్టించి, తెలుగువాడు ఆజన్మాంతం తనకు ఋణపడేలా చేసుకున్న వ్యక్తి - ముళ్లపూడి వెంకట "ఋ"మణ.

నిరాశా, నిస్పృహలు, అడ్డంకులు, అవమానాలు, అదలింపులు, బెదిరింపులు, అసూయలూ, అణచివేతల మధ్య తెలుగువాడి జీవన సంఘర్షణ సాగుతుండడం గమనించి హాస్యాన్ని ఊతకర్రగా అందించాడు. వ్యంగ్యం ద్వారా తెలుగువాడి చూపుకు నైశిత్యాన్ని - హాస్యం ద్వారా తెలుగు "వాడి పలుకు" కు నైర్మల్యాన్ని ప్రసాదించాడు. గాంభీర్యం, గడుసుదనం, వాదన, వేదన కలగలిపి, రస హృదయం, సరస హృదయం రంగరించి, జీవన సాగర మధనంలోంచి పుట్టిన అద్భుత గుళికల్లాంటి ఉపమానాలను జతచేసి తన రచనలన్నింటా మానవత్వం జెండా ఎగరేసిన వ్యక్తి ముళ్లపూడి. 1931 జూన్ 28న తూర్పు గోదావరి జిల్లాలో పుట్టిన వీరికి 1945లో బాపుగారితో స్నేహం కలిసింది. పదాలతో చిత్రరచన చేసేవారికి, పదాలకు బొమ్మ కట్టే వారి సాన్నిహిత్యం లభించినట్లైంది. ముళ్లపూడి వారు రచయితగా ఉన్నా, స్క్రిప్టురైటర్‌గా ఉన్నా, పత్రికా రచయితగా పని చేసినా అన్నింటా రమణీయ ముద్రను పసిగట్టగలం. వీరి రచనలకు ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలెన్నో పురస్కారాలందించాయి. ఆయన సృష్టించిన పాత్రలే వారిని ఎవర్‌గ్రీన్ రచయితగా నిలబెడుతున్నాయి. తెలుగువాళ్ళకు గిరీశం ఎలా తెలుసో -బుడుగూ అంతే. నవ్వుతో బాటు రెండు కన్నీటి బొట్లు కూడా రాల్పించేదే నిజమైన హాస్యం. ఆ "హాస్యం ముళ్లపూడి వాడి, వేడి, తాకిడికి ఈడేరిందన్న" మాట అక్షర సత్యం.